సాయి పాపినేని

# ఆంధ్రనగరి

*Song of the Black River*

Publishers:

Arts and Letters

# 1-2-365/25/C, Near Indira Park Cross Roads

Domalguda, Hyderabad.

Tel: 040-27635654, 9492922764

E-mail: artsandlettershyderabad@gmail.com

Distributors:

Visalaandhra Publishing House

Vignana Bhavan, 4-1-435, Bank Street,

Hyderabad-500 001. A.P. India

Tel: 9490794073 TeleFax: 040-24735905

E-mail: Visalaandhraph@yahoo.com

***ANDHRANAGARI***

| | | |
|---|---|---|
| *Song of the Black River* | : | **by *SAI PAPINENI*** |
| No. of Copies | : | 2000 |
| First Edition | : | June, 2013 |

| | | |
|---|---|---|
| Publication No. | : | 07 |
| ISBN | : | 978-81-927679-0-1 |
| Cover Illustration | : | **Roney Devassia**<br>kaalikkaadan.blogspot.com |
| Published by | : | **Arts & Letters**<br># 1-2-365/25/C<br>Near Indira Park Cross Road<br>Domalguda<br>Hyderabad - 500 029 |
| Distributed by | : | **Visalaandhra Publishing House**<br>Vignana Bhavan<br>4-1-435, Bank Street<br>Hyderabad - 500 001 |
| Price | : | US $ 9.99/-<br>₹ 290/- |
| Printed at | : | **Kala Jyothi Process Pvt. Ltd.**<br>1-1-60/5, R.T.C. Cross Roads<br>Musheerabad, Hyderabad - 500 020<br>Ph : 040-27645536 |

# ముందుమాట

**ఆం**ధ్రదేశంలో పుట్టి పెరిగిన నాకు ప్రపంచంలో సగానికి పైగా ప్రజలకి నాగరికతని నేర్పిన మన చరిత్ర గురించి ఏ మాత్రమూ అవగాహన లేదు. యాదృచ్ఛికంగా అమరావతి వెళ్ళడం, అదీ పాతిక సంవత్సరాల కిందట, అప్పుడు నా స్నేహితుల వల్ల నాలో తలెత్తిన జిజ్ఞాస... చెదురుమదురుగా దొరికిన పుస్తకాల ద్వారా, వృత్తిరీత్యా ఊళ్ళు తిరుగుతూ అప్పుడప్పుడూ చూసిన ప్రదేశాల వల్లా మరికొంచెం పెరిగింది. ఇంకా లోతుగా తెలుసుకోవాలంటే సమయం కావాలి, అదీ ఖర్చుతో కూడుకొన్న పని. దానికి నా అర్ధాంగి పద్మజ సహకారం లేకుంటే అసాధ్యమే. నేను రాసిన ఈ నాలుగు ముక్కలకీ నాకంటే ఎక్కువ ఆమెదే బాధ్యత.

ఈ పాతికేళ్ళూ ఆంధ్రప్రదేశ్‌కి దూరంగా ఉన్న నాకు, తెలుగులో రాయగలనో లేదో అనే చిన్న అనుమానం. రాసిన మొదటి నాలుగు పేజీలూ చదివి ఫరవాలేదురా అని భుజం తట్టిన నా పెద్ది నాయని కృష్ణకుమారి ప్రోత్సాహంతో, పదో క్లాసులో నా గురువు గారు, వావిలాల రామ్మూర్తిగారిని ఒకసారి తలుచుకొని బరిలోకి దిగాను. కథ మధ్యలో ఎన్నో సందేహాలు. వాటి గురించి పరిశోధించటానికే నాలుగేళ్ళు పట్టింది. డెక్కన్ కాలేజీ, కర్నాటకా, నాగార్జునా యూనివర్సిటీలకి చెందిన అధ్యాపకులూ, స్కాలర్లూ నాకెంతో సహకారం అందించారు. ముఖ్యంగా స్నేహితుడు, డెక్కన్ ఆర్కియాలజీ ప్రాజెక్ట్ డైరెక్టర్ రవి కోరిషెట్టర్.

ఇంకా లోతుగా వెతకాలనే కోరిక ఉన్నా, అదొక మహాసముద్రం, ఇక రాసేదెప్పుడు? తెలిసినంత వరకే చాలనుకొని కథ పూర్తి చేసాను. కానీ పరిశోధించిన విషయాలూ, వివరాలూ మీతో పంచుకోవాలంటే కథ మాత్రం చెబితే సరిపోదనిపించింది. సందర్భోచితంగా వాటిని కథ మధ్యలో ఫ్యాక్ట్ ఫైల్స్ రూపేణా జోడించాను. ఇది ఇంటర్నెట్ యుగానికి చెందిన నూతన ప్రయోగం. మీకు నచ్చుతుందనే ఆశిస్తాను.

మొదటి రాతప్రతిని చదివి తమ ప్రోత్సాహాన్నీ, సలహాలనీ ఇచ్చి సహకరించిన శ్రీ చెన్నూరు ఆంజనేయ రెడ్డి, శ్రీ సంబటూరు వీరనారాయణ రెడ్డి గార్లకి ఎల్లప్పుడూ కృతజ్ఞుడిని. ఆంధ్రప్రదేశ్‌లో బౌద్ధ సంస్కృతిని గురించి ప్రజలని జాగృతులని చేయడంలో వీరి సేవలు అందరికీ తెలిసినవే. ఇక ఓపికగా ప్రతిని ఒకటికి నాలుగుసార్లు చదివి, భూతద్దంతో వెతికి తప్పులూ, పొల్లులూ దిద్దిన నా వదినె, నాయని జయశ్రీ సహాయానికి ఎంత థాంక్స్ చెప్పినా చాలదు. ముఖ్యంగా ఈ పుస్తకానికి ఒక రూపం రావటానికి శ్రీ కేతు విశ్వనాథరెడ్డిగారిచ్చిన సహకారం అనన్యం. ఒక రచయితగా, సంపాదకునిగా, ఆచార్యునిగా వారి అపారమైన అనుభవాన్ని, పరిజ్ఞానాన్ని పంచి, ప్రతిని ప్రచురణ వరకూ వేలు పట్టుకొని నడిపించిన మాస్టారికి నేనూ, నా పుస్తకమూ ఎల్లప్పుడూ ఋణపడి ఉంటాము.

ఈ కథ కల్పితమే, కానీ వీలైనంత వరకూ విషయాలు యదార్థానికి దగ్గరగా ఉండేట్లు రాయడం జరిగింది. ఏవైనా తప్పులు దొర్లి ఉంటే, ఆ బాధ్యత పూర్తిగా నాదే.

భవదీయుడు

**సాయి**

1

## అమరావతి బస్టాండు, క్రీ.శ. 1987

ఎర్రబస్సు మార్కెట్ దగ్గర ఆగింది, గుంటూరు హరిహరమహల్ జంక్షన్ నుంచి చెయ్యి ఎత్తినప్పుడల్లా ఆగుతూ అక్కడకి గంటన్నర ప్రయాణం.'గుడిదాకా పోతుందా గురూ?' కండక్టర్‌ని అడిగాడు రమేష్.

'ఎందుకులేరా? లెట్స్ గెట్‌డౌన్ అండ్ హేవ్ సమ్ కాఫీ. వీ కెన్ గో ఆరామ్‌సే లేటర్'.... అంటూ జవాబు కోసం ఎదురుచూడకుండా బస్సు దిగాను.

'కాస్త పైకెళితే గుడి వచ్చేస్తుంది కదా, ఇక్కడెందుకు టైమ్ వేస్టు?' అంటూ వెనకాలే దిగాడు రమేష్.

'ఇక బస్సులో నా వల్లకాదు. ఐనా ఏదో ఏన్షియెంట్ మాన్యుమెంట్ చూపిస్తానని, ఇప్పుడు గుళ్ళూ గోపురాలూ అంటావేం?' అన్నాను విసుగ్గా.

'గుడి బాగుంటుందిరా, సప్తపది సినిమాలో చూడలా? అదే, ఎలాగూ ఇంత దూరం వచ్చాం కదా...' అని బ్రతిమిలాడుతున్న రమేష్ ముఖం చూసి,

'సరేలే, ముందు ఆ ఉపేంద్ర ఎక్కడున్నాడో కనుక్కో', అని ఎదురుగా ఉన్న కాఫీ హోటల్లోకి దారితీసాను.

ఉపేంద్ర నాగార్జునా యూనివర్సిటీలో ఆర్కియాలజీ ప్రొఫెసర్. ప్రస్తుతానికి అమరావతి దగ్గర ఏదో ప్రాజెక్ట్ పనిలో ఉన్నాడు.

'ఉపేంద్ర అయితే అన్నీ బాగా ఎక్స్‌ప్లెయిన్ చేస్తాడు. వెనక్కి వచ్చేటప్పుడు వాడి కార్‌లో

**సోమరాజు రమేష్**

నాకు హిస్టరీ అంటే ఆసక్తి కలగడానికి కారణం నా స్నేహితుడు సోమరాజు రమేష్. ఎంబియే గోల్డ్ మెడల్, అనేక పట్టాలు పుచ్చుకొన్న నిజమైన విద్యావంతుడు. తన జ్ఞానాన్ని పదుగురితో పంచుకొనేందుకు, ప్రైవేటు కంపెనీలోనే కాక స్టేట్‌బ్యాంకు మ్యానేజరు పదవిని కూడా విడిచి పెట్టి, విద్యాదానమే ఆశయంగా విజయవాడలో, శారదా కాలేజిలో ఉపాధ్యాయుడిగా కొనసాగి తాను నమ్మిన సిద్ధాంతాల కోసం చివరకు ప్రాణాన్ని కూడా పణంగా పెట్టిన అమరజీవి. కృష్ణమ్మ చల్లని ఒడిలో తనువు చాలించిన నా స్నేహితుడికి ఈ కథ అంకితం.

**సాయి**

రావచ్చు' అని నన్ను కన్విన్స్‌చేసి తీసుకెళ్ళాడు. హిస్టరీ అంటే ఎటువంటి ఇంట్రెస్టూ లేని నేను రమేష్ వత్తిడి వల్లనే ఆ ఊరికి వెళ్ళడం జరిగింది.



> **ప్రొ. ఉపీందర్ సింగ్**
>
> ఢిల్లీ విశ్వవిద్యాలయంలో చరిత్ర విభాగంలో ఆచార్యులు. సెంట్ స్టీఫెన్స్ కాలేజి, ఆ పిమ్మట ఢిల్లీలో M.A., M.Phil పట్టాలు గ్రహించి, మాంట్రియల్‌లోని మెక్ గిల్ విశ్వవిద్యా లయంలో Ph.D పట్టాపుచ్చుకొన్నారు. ఆవిడ డా॥ మన్మోహన్ సింగ్ గారి కుమార్తె. బహుముఖ ప్రజ్ఞాశాలి. ప్రాచీన, మధ్యయుగ శిలాశాసనాలూ; సాంఘిక, ఆర్థిక చరిత్ర; ధార్మిక సంస్థల అభివృద్ధి; పురాతత్వ శాస్త్ర చరిత్ర; ప్రాచీన కట్టడాల పునరుద్ధరణ మొదలగు అనేక విషయాలపై ఆవిడ రచించిన పరిశీల నాత్మక గ్రంథాలూ, వ్యాసాలూ దేశ విదేశాల్లో ప్రచురిత మయ్యాయి.
>
> అమరావతి స్తూపం కనుగొన్నప్పటినుంచీ, వివిధ పురాతత్వవేత్తల, పురాతన వాస్తు సంగ్రహకుల, ప్రభుత్వ అధికారుల చేతులలో పడి ఏవిధంగా నామమాత్రంగా మిగిలిందో వివరించే అద్భుతమైన పరిశీలనాత్మక వ్యాసం. – The Dismembering of the Amaravati Stupa (2001). అదే వ్యాసం 2004 లో The Discovery of Ancient India అనే పుస్తకంలో ఒక అధ్యాయంగా పునః ప్రచురిత మయింది. అదే ఈ కథకి మౌలికమూ, ప్రోత్సాహమూ.
>
> 2009లో 'నభూతో నభవిష్యతి' అనే విధంగా పాఠ్యపుస్తక శైలిలో పియర్సన్ సంస్థచే ప్రచురింప బడిన A History of Ancient and Early Medieval India, భారతీయ చరిత్రలో అభిరుచి కలిగిన ప్రతి ఒక్కరూ తప్పక చదవవలసిన పుస్తకం.

'మ్యూజియంకి ఎటుపోవాలి?'

'ఎంతో దూరం లేదు. ఆ రోడ్లో నేరుగా ఇక్కడినించి నాలుగడగులు. అదిగో ఆ స్తూపం కనిపిస్తుంది కదా, అదే', అని జవాబిచ్చాడు కాఫీ హోటల్ యజమాని.

మ్యూజియం గేటు వద్దే ఎదురొచ్చిన ఉపేంద్రతో, 'చాలా రోజులైంది ఎలా ఉన్నావ్?' అన్నాను భుజం చరుస్తూ.

'ఏముండడంలే, పాటి దిబ్బలమీద రాళ్ళూ రప్పలూ ఏరుకునే ఉద్యోగం!'

'సరేలే, మంచి పుస్తకాలు రాసావట? రమేష్ చెప్తున్నాడు.'

'ఏవో నాలుగు పబ్లిష్ అయ్యాయి. కానీ ఈ కాలంలో అవి చదివేవాడు ఎవడు? మెడిసినో, ఇంజనీరింగో అంటూ ఎగబడటమే తప్ప చరిత్ర గురించి ఇంట్రెస్ట్ ఎవరికుంది?'

'నిజమే, మనదేశంలో ఉన్నన్ని హిస్టారికల్ మాన్యుమెంట్స్ ఇంకే దేశంలో ఉండవు. వేరే దేశాల్లోనైతే ఇంత చిన్నదాన్నయినా పెద్ద విశేషంలా మార్కెట్ చేస్తారు. ఉదాహరణకి.. ఈ స్తూపమే చూడు రెండువేల సంవత్సరాల పైన చరిత్ర ఉంది. కానీ గుంటూరులో ఉండేవాళ్ళకే తెలియదు', అంటూ ఎగతాళిగా నావైపు చూసాడు రమేష్.

'అంటే ఈ ఊరు రెండువేల ఏళ్ళ కిందటిదా?' అన్నాను చుట్టూ ఉన్న ఇళ్ళని చూస్తూ.

'హహహ్, అంత లేదు, ఈ ఊరు రెండు వందల ఏళ్ళ క్రితం ఎస్టాబ్లిష్ చేసారు, 1790 లో అనుకుంటా. అంతవరకూ ఈ స్తూపం ఉన్నట్లు కూడా ఎవరికీ తెలీదు. అప్పట్లో ఈ ఊరిని చింతపల్లి జమిందారు... మన హరిహర మహల్ సినిమాహాలు ఓనర్ రంగబాబు తెలుసు కదా, వాళ్ళ పూర్వీకుడు, బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ సాయంతో ప్రారంభించాడట. ఆ సమయంలోనే ఈ స్తూపపు శిధిలాలని మొట్టమొదటిసారిగా గుర్తించారు', అన్నాడు, ఉపేంద్ర.

'వెరీ ఇంటరెస్టింగ్!' అని ఉపేంద్ర వంక చూసాను. ఆ కాలంలో ఏమయ్యిందో తెలుసు కోవాలని నాలో కలిగిన జిజ్ఞాసని చెప్పకుండానే గ్రహించాడేమో...



**అమరావతి పట్టణం**

గుంటూరికి 35 కిమీ దూరం. కృష్ణానది కుడి ఒడ్డున ఉంది. (16º34'N – 80º17'E) గుంటూరు నుండి రోడ్డు మార్గం బాగానే ఉంటుంది. విజయవాడ నుండి తాడేపల్లి, ఉండవల్లి మీదుగా కృష్ణ ఒడ్డున మరొక రోడ్డు ఉంది కానీ అది ఎవరో పూర్వపు శాతవాహన చక్రవర్తి ఒకడు కొండని తొలిచి నిర్మించాడట! ఆ తరవాత మన ప్రభుత్వం మాత్రం రిపేర్లు చేబట్టిన ఆనవాళ్ళు లేవు.

గుంటూరు మీదుగా ప్రయాణమే ఉత్తమం.

సందర్శన వేళలు

చైత్యం: ఉ॥8 గం. – సా॥5 గం వరకు.

మ్యూజియం: ఉ॥10 గం. – సా॥5 గం వరకు.

(శుక్రవారం శెలవు)



# 2

## లక్ష్మీపురం దివాణం, క్రీ.శ. 1797

**చిం**తపల్లి జమిందారు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు గారు నరసరావుపేట పడక కుర్చీమీద బూరుగుదూది తలగడపై తలవాల్చి, ఒక కాలు మడిచిపెట్టి కూర్చొని ఉన్నాడు. 'ఆ కోటయ్యగాణ్ణి బండి కట్టమంటే ఎంతసేపురా? లమ్డీకొడుకు ఎక్కడ చచ్చాడో? పంతులూ నువ్వు పోయిచూడు. అసలే బ్రాడీ దొరకి ముక్కుమీద కోపం, చెప్పిన సమయానికి రాకపోతే మండిపడతాడు. ఉదయాన్నే ఏడింటికి మనం గుంటూరు కలెక్టర్ కచ్చేరిలో ఉండాలి', అన్నాడు చిరాకుగా.

'ఇక్కడే కదా, నాయుడూ, అయినా నీకు బద్ధకం బలిసిందిగానీ నడిచిపోతే కాళ్ళేమన్నా అరిగిపోతాయా? ఈ డొంకలో బండిలో పోతే, నా పూసాలు కదిలిపోతాయ్. నువ్వు పో. పిలిచినప్పుడల్లా ఎగేసుకుపోను నాకు పనిలేదనుకున్నావా?' అంటూ ఎదురు పలికాడు, సోమయ్య పంతులు, ఆరువేలనాటి నియోగి బ్రాహ్మడు, ఎన్నోయేళ్ళగా సంస్థానంలో గుమాస్తాగా పనిచేయడమేగాక రాజావారికి బాల్య మిత్రుడు.

'రాబాక, ఇక్కడెందుకు? ఇవాళ్టినించీ ఇంటికిపో, ముసలి నాయాలా! రేపట్నించీ నీ కొడుకుని పంపియ్యి. వాడికైతే కాస్త ఇంగ్లీషు ముక్కలు కూడా వచ్చు', అన్నాడు తెచ్చిపెట్టుకొన్న కోపంతో.

'ఆహ్! బోడి బడాయి. ఒక్కరోజు వాణ్ణి లెక్కలు రాయమను, చుక్కలు కనిపిస్తాయ్. అయినా నేను పోతే ఇక్కడ నీ బొక్కలు పూడ్చేదెవ్వరు', అని చేతులు ఆడిస్తూ, 'అసలే కరువు రోజులు, నెల రోజులు నేను లేకపోతే, నీ దివాణం దివాళాదీసి, నెత్తిన చెంగేసుకుపోతావు', అన్నాడు ఏ మాత్రమూ బెదురు లేకుండా. రాజావారి అరుపులు, ఉత్తుత్తి తాటాకు చప్పుళ్ళే అన్న విషయం సోమయ్య పంతులుకి బాగా తెలుసు.

'నిజమేరా. ఆరేళ్ళుగా పంటలు లేవు. ఈయేడు వానలు పడకపోతే నువ్వు జెప్పినట్లు మనం కూడా దేశాలుపట్టి పోవాల్సిందే. దానికి తోడు ఈ వడ్డోళ్ళూ, నైజామోళ్ళతో ఊరంతా నిండిపోయింది', అన్నాడు జమిందారు, అంతలోనే చల్లబడిపోతూ.

ఏం చేస్తారులే నాయుడూ ఇటు పలనాడు దాటితే కరువు మరీ దారుణంగా ఉంది. పొట్టలు చేతబట్టుకొని ఇంకా వస్తూనే ఉన్నారు. నిన్నటికి నిన్న, నల్లగొండ నించి ఇరవైమంది, బొత్తిగా ఎముకలగూళ్ళు. చూస్తే నాకే కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి', కరువు మాట వింటూనే పంతులు ముఖంలో విషాదపు ఛాయలు పొడజూపాయి.

‘అందుకేరా, కలెక్టరుకాడికి పోయేది. ఆయన పుణ్యం కట్టుకుంటేనే వీళ్ళకి నాలుగు వేళ్ళు నోట్లోకి పోయేది’, అని తన ఉద్దేశ్యాన్ని వెలిబుచ్చాడు.

‘సరే పద’, అని తలాడించి, ‘నేనూ కూడా వస్తాలే. బ్రాడీ దొరకి ఒక దణ్ణం పెట్టొచ్చు. చిన్నవాడైనా మహానుభావుడు’, అని బయటికి కదిలాడు, పంతులు.



రాజావారి దివాణంనించి కలెక్టరాఫీసు సరిగ్గా అరమైలు దూరం. గత రెండేళ్ళుగా కుంఫిణీ గిడ్డంగులకి పెద్ద ఆఫీసరు జేమ్స్ బ్రాడీ దొర. కలెక్టరు ఆఫీసులో మిద్దెమీద కలెక్టరుదొర కచ్చేరీ అయితే, మెట్లకింద బ్రాడీదొర ఆఫీసు. జనానికి మాత్రం ‘మెట్లకింద కలెకటరుదొర’గా తెలుసు. ఏ ఆపద వచ్చినా ముందుగా వాళ్ళు పరిగెత్తేది ఆ దొరవద్దకే.

రెండెడ్ల గూడుబండి, కరువుకాలంలో కూడా దిట్టంగా బలిసిన ఒంగోలు గిత్తలు. కరువుకి కొన్ని లక్షల గొడ్లు నాశనమయినా, రాజావారి కోడెగిత్తలకి మాత్రం దాణాకేమీ ఇబ్బంది లేదు–చింతపల్లిలో వెయ్యి పశువులతో పెద్దపాక, కృష్ణ నీళ్ళు, లంకల్లో పచ్చిక. అయితే సత్తెనపల్లి వైపు మాత్రం మాగాణి పొలాలు కూడా బీడుపడ్డాయి. దాంతో ఇళ్ళూ ఊళ్ళూ పాడుబెట్టి జనమంతా కృష్ణమ్మ ఒడ్డునజేరారు. వంద గడపల చింతపల్లిలో ఇప్పటికే వెయ్యికి పైగా కుటుంబాలు వలసవచ్చాయి. ఇక అచ్చంపేటయితే సరేసరి.

‘ఇక పలనాడయితే మరీ అన్యాయంరా పంతులూ, నాగులేటికింద చెరువుల్లో నీళ్ళు చూసి నాలుగేళ్ళయింది. తాగేందుకే నీళ్ళు లేవు. ఏదైనా కాస్త గింజలు పండితే మన లంకల్లోనే’ అంటున్న రాజావారితో ముందు కూర్చున్న సోమయ్య పంతులు, ‘ఇప్పటివరకూ కుంఫిణీ పుణ్యమా అని వందరూపాయల కరువుభత్యం ముట్టింది. అది కూడా ఈ నెలతో ఆఖరే. ఇవాళయినా పెద్దదొరని అడిగి చూడండి’, అని విషయం గుర్తుచేసాడు.

‘ఏమని అడుగుతాం? జమీందారీ శిస్తు మాఫీచెయ్యమని సిరస్తదారుకి ఎంత మొరబెట్టుకున్నా ససేమిరా అంటాడు. అవి కాస్త మాఫీ చేస్తేనన్నా కొంచెం వెసులుబాటు అవుతుంది... అదీ దేవుడి దయవల్ల ఈ ఏడు వానలు పడితేనే...’, అన్నాడు తల పైకెత్తి, మబ్బులు లేని ఆకాశం వంక చూస్తూ.

‘ఆహ్! ఏం దేవుడులే, నాయుడూ? వాడికే గతిలేదు. మొన్న జమాబందీకి చింతపల్లి పోతే, ఈ ఏడాది శివరాత్రి తిరణాళ్ళకి కాసులులేవు. దేహీ అంటూ అమరేశ్వరం నుంచి పూజార్లు వచ్చారు. సంక్రాంతిలోగా నీవు ఒకసారి పోయి చూసొస్తే బాగుంటదేమో?’

‘ఒరే పంతులూ, అమరేశ్వరం అంటే గుర్తొచ్చింది’, అంటున్న జమిందారు మాటలలో ఏదో కొత్త ఉత్సాహం తొంగి చూసింది. ‘పోయిన నెల పెదమద్దూరు మల్లారెడ్డి వచ్చాడు. దిగువ అగ్రహారం భూములు తప్ప మిగిలినవన్నీ బీడువారిపోయాయి, సాగునీటికి ఏదైనా ఉపాయం చేస్తే, రెండువేల ఎకరాల మాగాణి అవుతుందని సిరస్తదారుకి అర్జీ పెట్టాడట’.

‘ఆహా! భూమి ఉంటే సరిపోయిందా? మనుషుల్ని ఎక్కడనుంచి తెస్తాడు?’ అన్నాడు పంతులు, మూతివిరుస్తూ.

‘జనాలకేం తక్కువరా? మన చింతపల్లిలోనే వెయ్యిమంది పనిలేకుండా పడి ఉన్నారు. అదిగాక గుంటూరు గిడ్డంగుల కింద నాలుగు వేలకి పైచిలుకు నైజామోళ్ళు, ఆ బ్రాడీ దొర పుణ్యాన గుడిసెలేసుకొని ఇక్కడే ఉన్నారు... ఇంటికి రెండెకరాలు పడేస్తే?’

‘ఒయమ్మో, పెద్ద ఆలోచనే!

‘సరే ఈ ఏడు వానలు పడ్డాయే అనుకో, కానీ పంటలు దిగేసరికి ఇంకా పదినెలలు పడుతుంది. అందాకా వాళ్ళు ఏం తిని బతికేట్లు? ఇంటికి పది రూపాయలన్నా అవుతుంది. వెయ్యి ఇళ్ళకి పదివేలు అంటే నాలుగేళ్ళ జమీందారీ శిస్తుకి సమానం. నీవేమన్నా జార్జిరాజువా? కాస్త నేలమీద కాళ్ళుబెట్టవయ్యా’.

‘అదికాదు పంతులూ, గవర్నరు బకింగ్హామ్ దొరగారి కాలవ కింది రైతువారీ భూములకోసం అంతా ఎగబడి పోయారా? బెజవాడకి పైన సాగుచేసే రైతే లేడు. కృష్ణ ఒడ్డున రెండువేల మాగాణి, ఇటు గుంటూరికి ఇరవై మైళ్ళు. అటు బెజవాడ ఇరవై మైళ్ళు. రెండేళ్ళు పంట చేతికొస్తే చాలు... కాస్త బుర్రపెట్టి చూడు’, అన్నాడు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు, ఒక నిశ్చయానికి వస్తూ.



రండి నాయిడూ గారూ... మీరు వస్తూ ఉన్నారూ అని ర్యామ్ దొరగారికి చెప్పితిమి. వారూ మీ కోసాం వెయిట్ చేస్తూ ఉంటారు’ అంటూ ఎదురువచ్చి తన కచ్చేరీలోకి తీసుకెళ్ళాడు జేమ్స్ బ్రాడి, గ్యారిసన్ స్టోర్ కీపర్ అండ్ ఇంపోర్ట్ వేర్‌హౌస్‌కీపర్. ‘ఏమండీ పంతుల్గాగారూ, బాగున్నారా?’ అని సోమయ్య పంతుల్ని ప్రత్యేకంగా పలకరిస్తూ.

‘మీ దయవల్ల దొరగారూ. ఆ రోజు మీరు దయచేసిన వడ్లు రాజావారి బండ్లలో చింతపల్లికి జేరాయి. మీ పేరుచెప్పుకొని ఏదో ఒక ముద్ద గతుకుతున్నారు’, అని చేతులెత్తి నమస్కరించాడు.

‘ఏదో మా చేతయిందీ, చేసాం’, అని అంతలోనే తగ్గు స్వరంలో, ‘ఇలా ఇన్నా ఎక్కువ దినములు జరగదు, పంతుల్గాగారూ... పెద్ద ఫౌజు వస్తుందీ. మైసూరులో యుద్ధము కదా. మన స్టోరులో ధాన్యం వాళ్ళకే చాలదు. ఉన్న ధాన్యం అంతా ఫౌజు కొరకు రిక్విజిషన్ చేయాలి అని గవర్నర్ ఆర్డర్స్’, అన్నాడు.

‘మీరు అలా అంటే ఎలా దొరగారూ, వెయ్యికి పైగా కుటుంబాలు, ఈ ఏడు పంట శూన్యం. వానలు పడినా, వచ్చే దసరాకి గానీ ధాన్యం చేతికిరాదు. అంటే పది నెలలు. మీరు లేదంటే ఇక పస్తులు తప్ప గత్యంతరం లేదు. సమస్య మీకు తెలియనిది కాదు’.

‘తెలిసినా నేను చేయగలిగింది ఏమీ లేదు పంతుల్గాగారూ’, అని నిట్టూర్చి, ‘అందుకనే, అట్కిన్సన్ వారితో మాట్లాడితిని, వారు మిలటరీకి మస్టర్ మాస్టర్. ఇప్పుడు పెద్ద ఫౌజుకి వారే ఇన్‌ఛార్జ్... మగవాళ్ళు ఫౌజులో చేరితే, కుటుంబాలకి భత్యం ఇచ్చేటట్లు చేయవచ్చు. రేషన్లు మన స్టోర్ నుంచే

తీసుకోవచ్చు. మీకూ కొంత బర్డన్ తగ్గుతుందీ', అని సలహా ఇచ్చాడు.

'ఎంత మంది కావాలో?' అడిగాడు, పంతులు ఆత్రంగా.

'వెయ్యిమంది కూలీలు కావాలి. ఇక్కడ గుంటూరులోనే సగంమందిని రిక్రూట్ చేస్తారు. మీ ఊరునుంచి ఒక నూరుమందిని పంపించండీ. నేను వారికి చెప్పి చూస్తాను.'

'వెంటనే ఊరికి కబురు చేస్తాను. ఆ దొరగారిని ఎక్కడ కలవాలో మీరు సెలవిస్తే...'

'నల్లపాడు డొంక రోడ్‌లో రిక్రూట్మెంట్ క్యాంప్. అక్కడ ఎడ్వర్డ్ ఆట్కిన్సన్ దొరని కలిసి చింతపల్లి రాజాగారి మనుషులం అని చెప్పిన చాలు, రెస్ట్ ఈజ్ ఇన్ గాడ్స్ హ్యాండ్స్.'

✦ ✦ ✦

### జేమ్స్ బ్రాడీ

1789 లో ఈస్ట్ఇండియా కంపెనీలో చేరి ఇండియా వచ్చాడు. ఒక సంవత్సరం రైటరుగా మద్రాసులో పనిచేసి, 1790 నుండి పబ్లిక్ & రెవెన్యు విభాగాలలో అండర్ సెక్రెటరీగా బాధ్యత నిర్వహించి మూడేళ్ళ తరవాత మిలటరీ బోర్డుకి కార్యనిర్వాహక అధికారిగా పదవీ బాధ్యతలు స్వీకరించాడు. 1796లో గ్యారిసన్ స్టోర్‌కీపరుగా గుంటూరు వచ్చాడు.

1792 నుండి ఆరేళ్ళు భారతదేశంలో కనీవినీ ఎరుగని విధంగా కరువు రక్కసి విలయ తాండవం చేసింది. బాధితులు కోకొల్లలు. స్టోర్‌కీపరుగా ఎందరినో ఆదుకుని సహాయ పడ్డాడట. గ్యారిసన్ స్టోర్సు గుంటూరులో లక్ష్మీపురానికి దక్షిణంగా తాలూకా ఆఫీసును ఆనుకొని ఉండేవి. ఇప్పటికీ ఆ ప్రదేశాన్ని బ్రాడీపేట అనే పిలుస్తారు.

1801 తరవాత అతడేమయ్యాడో ఎవరికి తెలియదు.

జార్జ్ ఆండ్రూ ర్యామ్, గుంటూరు జిల్లాకి కలెక్టరు. గత నాలుగేళ్ళగా క్షణం తీరికలేని ఉద్యోగం. దానికి తోడు ఆయన వచ్చినప్పటి నుండీ కరువు భూతం. పెద్ద జిల్లా అనేగానీ ఏ విషయంలో చూసినా లోకువే. కరువు సహాయానికి ఇండియాలో కోటీ యాభై లక్షలు అందితే అందులో జిల్లాకి లక్ష రూపాయలు కూడా ముట్టలేదు. మద్రాసు ప్రెసిడెన్సీకి అందిన నలభై లక్షలలో సగానికి పైగా బెజవాడ కాలువపైనే ఖర్చయ్యింది. కొత్తగా సాగుదలకి వచ్చిన రైతువారీ డెల్టా భూములకి రైతులు వలస పోవడంతో జమీందారీ శిస్తు వసూళ్ళు నిలిచిపోయాయి. కరువు వాతబడ్డ ప్రాంతాలైన, పలనాడూ, వినుకొండ ఫిర్కాలలో సంక్షేమానికి నిధులు లేవు. దానితో బాధితులు ఊళ్ళు వదలి పట్టణాలైన గుంటూరూ, బెజవాడలకి వలస వచ్చారు. అప్పటి గవర్నరు లార్డ్ హోబార్ట్, ఎర్ల్ ఆఫ్ బకింగ్హామ్‌షైర్ ఆధ్వర్యంలో మసూలిపటాం బందరును మద్రాసుకి నీటికాలువ ద్వారా కలిపే పథకం ద్వారా ఎంతోమందికి కరువు ఉపాధి కలుగచేయడం సాధ్యం అయింది. అందులో కృష్ణా పడమటి డెల్టా గుంటూరు జిల్లాలో ఉండటం వల్ల కాలవకింద కొన్ని లక్షల హెక్టేర్ల భూమి మాగాణి అయింది. అయితే దానిని సాగుచేసేది కొత్త రైతులు. సాగుభూమి రికార్డులు పూర్తిచేసి రైతువారీ శిస్తులు వసూలు చేయడానికి ఇంకా కనీసం రెండు సంవత్సరాలు పట్టవచ్చు. అప్పటిదాకా ర్యామ్ దొరకు గుంటూరు నివాసం తప్పదు.

ఉదయం నుంచీ సాయంకాలం వరకూ జమీందారీ పేష్కష్‌లతోనే సమయం గడిచిపోతుంది.

కానీ ఈ మీటింగ్ చాలా ముఖ్యమైనది....

చింతపల్లి జమిందారు భూములు గుంటూరు పట్టణంలో సర్కారీ జమీనుకి ఆనుకొని ఉన్నాయి. ఇంత కరువులో కూడా లక్ష్మీపురం బావులలో తాగడానికి అనువైన మంచి నీరు ధారాళంగా పడ్తుంది. గవర్నర్ జెనరల్ లార్డ్ వెలెస్లీ వారి ఉత్తర్వుల ప్రకారం మైసూరు యుద్ధానికి ముందే గుంటూరులో కంటోన్మెంటు ఏర్పాటు జరగాల్సి ఉంది. లక్ష్మీపురం దానికి అనుకూలమైనదని మిలటరీ అసిస్టెంటు ఎడ్వర్డ్ హార్గ్రేవ్ అభిప్రాయం.

అనువైన సమయానికి జమిందారు రాజా వెంకటాద్రి నాయుడు ఈ ప్రస్తావన తెచ్చాడు...

'అంటే... మీరు అమరేశ్వరంలో కొత్త సెటిల్మెంట్ ప్రారంభించాలనుకొనే ఉద్దేశ్యం మంచిదే. కాలువ కింద భూములు కావు కనుక, ఆ ప్రాంతంలో మీకు జమీందారీ కూడా ఖాయం చేయవచ్చు. కానీ ఇది చాలా ఖర్చుతో కూడుకొన్న విషయం. రేపే మిస్టర్ హార్గ్రేవ్ మీతో అమరేశ్వరం వస్తారు. వారిచ్చే సిఫారసు ప్రకారం తాత్కాలికంగా ఆర్థిక సహాయానికి సౌకర్యం చేయవచ్చు', అని తీర్మానించాడు.



# 3

నూట ఇరవై అడుగుల ఎత్తు గుట్ట.

దాన్ని స్థానికులు దీపాలదిన్నె అని పిలుస్తారు. పల్లవ చక్రవర్తి త్రిలోచనుడి సింహాసనం ఆ గుట్టపైనే ఉండేదని వాళ్ళ నమ్మకం!

'నీవు తలుచుకున్న ముహూర్తబలమో ఏమో నాయుడూ, కలెక్టరుదొర నీమీద కనకవర్షం కురిపించాడు. నాలుగు ఊళ్ళకు ఒకటే జమీందారీ! అమరేశ్వరం, పెద్దమద్దూరు, ధరణికోట, వైకుంతాపురం; పదివేల ఎకరాల మాగాణీ అవుతుంది. అదీగాక, పదహారేళ్ళు శిస్తు రాయితీ, పైగా లక్ష్మీపురం భూమికి కుంఫిణీ నుండి నెలకి వెయ్యి రూపాయల బాడుగ. నాలుగేళ్ళలో లక్షాధికారివైపోతావ్' అని పక్కనే ఉన్న మల్లారెడ్డితో, 'ఏమంటావ్ రెడ్డీ?' అన్నాడు సోమయ్య పంతులు.

'నేను చెప్పేదేముంది పంతులు గారూ, నాయనగారిది మహారాజుల అంశ. చూడండి, ఆయన నిలుచున్న స్థలంలో పూర్వకాలం ముక్కంటి మారాజు దర్బారు ఉండేదట. ఇప్పటికీ తవ్వితే పాలరాళ్ళ శిల్పాలు దొరుకుతాయి.'

'పై నుంచి చూస్తే జమీ అంతా కనిపిస్తుంది పంతులూ', రాజావారి ఉత్సాహానికి అంతులేదు. 'అమరేశ్వరం గుళ్ళో అర్చన చేయించి పోదాం. పెద్ద పూజారికి శివరాత్రి తిరునాళ్ళకి వంద రూపాయలు మంజూరు చేసామని చెప్పు', అని మల్లారెడ్డితో, 'ఇంతకూ ఇన్ని దేవాలయాలు ఉన్నాయి కదా ఈ గుట్టకింద ఏదైనా గుడి ఉందంటావా రెడ్డీ?'

'ఏమో నాయనగారూ, పూజారిగార్ని అడిగితే ఏవో జైనుల శిల్పాలు అక్కడక్కడా దొరుకుతాయి అంటాడు. శిల్పాల మాట అలా ఉంచితే, బోలెడు ఇటుక రాళ్ళూ, స్తంభాలూ దొరకవచ్చు. రేపు ఇళ్ళు కట్టేందుకు పనికొస్తాయేమో? మనవాళ్ళు వచ్చాక తవ్వించమన్నారా?'

'ఊహూ, ఇప్పట్లో ఏమీ వద్దు. నదికి దగ్గరే కాబట్టి, ఈ గుట్టపైన నీళ్ళ కుంట తవ్విస్తే ఊరంతటికీ నీటి ఇబ్బంది ఉండదు', ఏదో ఆలోచిస్తూ.

'అంతపైకి నీళ్ళు ఎట్లా ఎక్కేట్లు? మంత్రం వేస్తావా ఏం?' అన్నాడు పంతులు తన మాటలలోని వ్యంగ్యాన్ని ఏమాత్రమూ కప్పిబుచ్చకుండా.

గిండీ ఆఫీసర్స్ మెస్సులో అంతా హడావిడిగా ఉంది. కొత్త గవర్నర్ లార్డ్ వెలెస్లీ వస్తున్నారు. అది మద్రాస్ ఇంజనీరింగ్ కోర్ వార్షిక దినం. బోయ్ తెచ్చిన యూనిఫార్మ్ కోటు వేసుకునే ముందు ఛాతీమీది లాంఛనపు పిప్స్ మరోసారి పరీక్షించాడు, కల్నల్ మెకెంజీ.

ఆరడుగుల పొడవు, ఎర్రని రెజిమెంట్ యూనిఫార్మ్, మోకాళ్ళ వరకూ అద్దాల్లా మెరిసే నల్లబూట్లు, తెల్లని స్టాకింగ్సూ చేతి గ్లవ్సుతో ముఖం మాత్రమే బయటకి కనిపిస్తుంది. ఫ్రీక్వెంట్ సర్వే బాధ్యతల మూలంగా ఎండనపడి ప్రయాణాలు చేయడం వల్ల, తెల్లని అతని చర్మం రాగిరంగులో మెరుస్తుంది. ఇండియా ఫౌజులో ముఖం రంగును బట్టి సీనియారిటీని గుర్తించవచ్చు!

ఎర్ర తివాచీపై కాలుమోపిన మరుక్షణం ఎదురువచ్చి సల్యూట్ చేసి 'ఆహ్, కల్నల్ మెకెంజీ, గుడ్ ఈవెనింగ్ అండ్ వెల్కమ్' అంటూ లోనికి దారిచూపిన క్యాప్టెన్ గుడ్వర్త్, 'మీ కోసమే ఎదురుచూస్తున్నాను. కమాండెంట్ మీకు ఒక ప్రత్యేకమైన బాధ్యతని ఇచ్చారు'.

'ఆహెమ్! ఏమిటో అది, ఇంతకు ముందులాగా ఇండియన్ లేడీస్‌ని ఎస్కార్ట్ చేయాలేమో?' అన్నాడు తనదయిన స్కాట్లాండ్ యాసలో.

'హహహ్, అంతకన్నా కష్టమైనదే. చూడండి ఆ చివర కనిపిస్తున్నారే వాళ్ళని ఎన్టర్టెయిన్ చేయాలట మీరు.'

'సివిలియన్స్ లాగా ఉన్నారే!'

'ఆహ్, వాళ్ళని త్రీ మస్కెటీర్స్ అంటారు. వినలేదా?' అన్నాడు గుడ్వర్త్ కాస్త రహస్యంగా.

'ఆహా, వినకేం? మిలటరీ రహస్య విభాగంలో కొత్తగా వచ్చిన సివిల్ ఆఫీసర్లు. కానీ ఆ పొడుగ్గా ఉన్నాడే, అతను మిస్టర్ మెకాలెన్ అనుకుంటా, మా కౌంటీ వాడే, మరి మూడవ మస్కెటీర్ ఎక్కడో?' అన్నాడు, భృకుటి ముడివేసి.

'ఆ! మూడవ వాడు, హార్గ్రేవ్ ఇప్పుడు గుంటూరు సర్కారులో ఉన్నాడు', అన్నాడు తలవూపుతూ.

అంతలో బయట బ్యాగ్‌పైపర్ల మోత ఒక్కసారిగా ఊపందుకుంది. తోడుగా బ్రాస్ బ్యాండ్. 'గాడ్ సేవ్ ద కింగ్' అంటూ ఆలాపన మొదలవగానే అందరూ తమ తమ స్థానాల్లో లేచి అటెన్షన్లో నిలబడ్డారు. ముగ్గురు సివిలియన్లు మాత్రం తాపీగా నిలుచుని నిర్లక్ష్యంగా తమలో తామే ఏదో ముచ్చటించు కుంటున్నారు.

జాతీయ గీతాలాపన ముగిసిన వెంటనే, 'ఇక నేను కమాండెంట్ వద్దకి వెళ్ళాలి. లార్డ్ బకింగ్హామ్

### మెకెంజీ ప్రతులు

కల్నల్ కాలిన్ మెకంజీ. 18వ శతాబ్దపు చివరలో మద్రాస్ ఇన్ఫాంట్రీలో ఆఫీసరుగా ఇండియాకి వచ్చి ముప్పై సంవత్సరాలలో కనీవినీ ఎరుగని విధంగా, ప్రాచీన రాత ప్రతులూ, పురాతన వస్తువులూ, శాసనాల నకళ్ళూ, వాస్తుచిత్రాలూ, నాణాలూ, జానపద సాంప్రదాయక గాథలూ; అనేకం సేకరించి పదిలపర్చిన గొప్పతనం అతడికే దక్కుతుంది. సర్వేయర్ జనరల్‌గా పదవీ బాధ్యతలకు తన స్వంత జిజ్ఞాసను అనుసంధానం చేస్తూ, దక్షిణ భారతదేశంలో మూలమూలలా పర్యటించి అతడు వెలికితీసిన జ్ఞాన సంపద అమూల్యం. ఆయన మరణానంతరం, ఆ సంకలనాన్ని హెచ్ హెచ్ విల్సన్ క్రమబద్ధంచేసి మద్రాసు లోని ఓరియెంటల్ లైబ్రరీకి చేర్చారు. ఆ సంకలనంలో అధికభాగం లండనులోని బ్రిటిష్ లైబ్రరీలో ఓరియెంట్ & ఇండియా ఆఫీసు విభాగంలో ఉన్నాయి. అమరావతిలో ఆయన సేకరించిన విషయాలూ, డ్రాయింగ్స్ చూడాలంటే బ్రిటిష్ లైబ్రరీ షెల్ఫ్ రిఫరెన్స్ 'WD 1061 OIOC లో India Antiqua Illustrata– An Essay to Illustrate the Ancient Sculptures, Inscriptions, and Religions of India'లో దొరుకుతాయి.

గారి సతీమణి లేడీ మార్గెరెట్టా మరణం కారణంగా ఈరోజు స్త్రీలు లేరు, డాన్సూ లేదు. అందుకే మీకు లేడీస్‌ని ఎస్కార్టు చేసే పని తప్పింది', అని చిరునవ్వు నవ్వుతూ, 'పదండి మీకు మస్కెటీర్లని పరిచయం చేస్తాను', అని వారివైపు దారితీసాడు, గుడ్వర్త్.

'ఉహ్! వాళ్ళ వరస చూస్తే, వీళ్ళకన్నా ఆడవాళ్ళే నయమనిపిస్తుంది. ఎంత నిర్లక్ష్యంగా నిలుచున్నారో చూడు, క్యాప్టెన్.'

'మరి అంతే, రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని స్థాపిస్తున్న ఈస్ట్ ఇండియా కంపెనీ ఆఫీసర్లు వాళ్ళు. ప్రపంచాన్ని జయించడమే వారి ఉద్దేశ్యం. వాళ్ళేది శాసిస్తే అది చేయాల్సిన సిపాయిలం మాత్రమే మనం, అంతే! పదండి.'



ఆంగస్ మెకాలెన్ మిగిలిన వారందరికీ సీనియర్, జేమ్స్ ఫుల్లర్టన్, విలియం మేన్వేరింగ్... ఆ సంవత్సరమే ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజీలో ట్రైనింగ్ పూర్తిచేసి 'మిలటరీ రహస్య రాజకీయ విభాగం'లో చేరారు. పరిచయాలు పూర్తయిన వెంటనే మెకెంజీని వాళ్ళతో వదిలి అక్కడ నుండి నిష్క్రమించాడు, క్యాప్టెన్ గుడ్వర్త్.

అంబోయ్నా స్టోర్స్ నుండి ప్రత్యేకంగా రప్పించిన రోటర్ డ్యామ్ జిన్నుతో ఆనందిస్తున్న జూనియర్లను చూస్తూ, కెల్టిక్ భాషలో వారితో ఎగతాళిగా 'అది తాగితే తలలో జీబూతాలు చేర్తాయి. నాగరికుల పానీయం ఒక్క మా స్కాట్లాండు వాసులకే తెలుసు. 'ఉస్కబాహ్' అంటే ప్రాణజలం', అని తనతో తెచ్చిన మాల్ట్ విస్కీ సీసాను బయటకు తీసాడు మెకాలెన్.

'అరే, ఇది మా ఆర్క్నీ నించి వచ్చిన అసలు సిసలైన హైల్యాండ్ మాల్ట్' అన్నాడు మెకెంజీ, సీసా మూతిని ముక్కువద్ద పెట్టి ఆస్వాదిస్తూ.

'అందుకే మీకొరకే ప్రత్యేకంగా తెప్పించాను. ఒక్క గుక్క దిగితేచాలు స్వదేశం కళ్ళముందు మెదుల్తుంది.'

'థాంక్యూ, ఇంత దయకు నేనెలా పాత్రుడినయ్యానో?' అన్నాడు మెకెంజీ, తన ఆశ్చర్యాన్ని దాచకుండా.

'ఇది మా కుటుంబానికి చెందిన డిస్టిల్లరీలో తయారయింది. కల్నల్, మిమ్మల్ని ఎప్పటినించో కలవాలని నా కోరిక. ఫోర్ట్ కాలేజీలో మీరు సమీకరించిన రాతపత్రుల సంకలనం చూసినప్పటినుండీ', అన్నాడు మెకాలెన్ నింపాదిగా.

'అహ్, అదేముంది, ఏదో ఉబుసుపోకకి సేకరించినవి. అది కూడా నా అసిస్టెంట్ల చొరవ వల్ల మాత్రమే.'

'ఎంతయినా మీ ప్రోత్సాహం లేకుండా సాధ్యంకాదు. పైగా...' అని కాసేపు ఆగి, గ్లాసులోని ద్రవాన్ని తీక్షణంగా చూస్తూ, 'ఇంతవరకూ ఈ నేటివ్ రాజుల వద్ద దొరికిన నిధి నిక్షేపాలు పైపైన కనిపించేవి మాత్రమే. కాస్త లోతుగా వెదికితే ఈ దేశంలో అపారమైన ధనరాసులు దొరకవచ్చు.

అవి సంశోధించడానికి మీ సంకలనాలు ఎంతగానో దోహదపడతాయి, ఏమంటారు?' అని తలెత్తి, మెకెంజీ వైపు చూసాడు.

'నా రిసెర్చ్ ఉద్దేశ్యం అదికాదు, మిస్టర్ ఆంగస్', కొంచెం కటువుగా అని, వెంటనే తమాయించుకొని, 'చూడండి... స్వతహాగా గణితశాస్త్రంలో నాకున్న జిజ్ఞాస కారణంగా ఏదో కొన్ని రాతప్రతులు సేకరించడం మొదలు పెట్టాను. నానుంచి ప్రతిఫలం ఆశించి ఎన్నెన్నో అమూల్యమైన నేటివ్ రికార్డ్సు, గ్రంథాలూ నా వద్దకు తేవడం మొదలు పెట్టారు. అందులో నా అసిస్టెంట్లు, కావలి బ్రాహ్మణ సోదరుల కన్ట్రిబ్యూషన్ ఎంతో ఉంది'.

'క్షమించండి, నేనన్న ఉద్దేశ్యం అదికాదు... మీరు సేకరించిన ప్రతులు ఈ అజ్ఞానులైన హిందువుల ఊహకి అందేవి కాదు. అవి లండన్ నగరానికి చేరితే, నాగరికుల జ్ఞాన సముపార్జనకు దోహదపడగలవు. ఇక్కడే ఉంటే వాటిని పట్టించుకొనే వాడే ఉండడు.'

'నిజమే, ఎప్పటికైనా కాలేజీలో ఉన్న నా సంకలనాన్ని లండన్‌లోని బ్రిటిష్ లైబ్రరీకి పంపించాలనే నా లక్ష్యం.'

'ఎంతో సరియైన ఆలోచన. అదే విధంగా నా ఉద్దేశ్యాన్ని కూడా వివరిస్తాను. ప్రాచీన ప్రతులూ గ్రంథాలే కాక ఈ దేశపు వాస్తు, శిల్ప సంపద కూడా అపూర్వమైనది. వాటిలో మంచివి సేకరించి స్వదేశానికి పంపిస్తే అందరికీ అందుబాటులో ఉంటాయని నా ఉద్దేశ్యం', అన్నాడు మెకాలెన్.

'అద్వితీయమైన ఆలోచన. కానీ అది చాలా ఖర్చుతో కూడుకొన్న పని?' మన వల్ల కాదనే భావంతో చేతులు పైకెత్తాడు, మెకెంజీ.

'ఆ విషయం నాకు వదిలేయండి. నాకు తెలిసిన ఆఫీసర్లు ఎందరో ఉన్నారు. ఏదో... ఒకటో రెండో వారి ప్రైవేట్ కలెక్షన్లకి వదిలితే చాలు, మన ప్రయత్నానికి ఆర్థికంగా సహాయపడగలరు.'

'ఇక్కడ నిరుపయోగంగా పడి ఉండడం కంటే అదే మంచిది', అని తలవూపి, 'ఏదైనా నా దృష్టికి వస్తే మీకు తెలియజేస్తాను.'

'ఇంకో విషయం. మన యువ ఆఫీసర్లు మీతో ఒక విషయం చెప్తారు... ఏమిటది మిస్టర్ జేమ్స్?' అని ఫుల్లర్టన్ వంక చూసాడు.

'ప్లీజ్ ఎక్స్‌క్యూజ్ మీ కల్నల్. మా స్నేహితుడు ఎడ్వర్డ్ హార్గ్రేవ్ నుండి నిన్న ఒక ప్రైవేట్ డిస్పాచ్ వచ్చింది. అతనిప్పుడు గుంటూరు సర్కారులో ఉన్నాడు'. అంటూ ఫుల్లర్టన్ అసలు విషయాన్ని వివరించాడు.

'కానీ నాకిప్పుడప్పుడే అటువైపు వెళ్ళే ఉద్దేశ్యం లేదే?'

'అదే ఆ విషయానికే వస్తున్నాను. నిజాం అసఫ్ ఝా ఏ క్షణానైన్నా కంపెనీ ప్రొటెక్టరేట్ డొమినియన్ ఒడంబడికకు అంగీకరించవచ్చు. దానికొరకు లార్డ్ వెలెస్లీ ఇంకొన్ని రోజులలో హైదరాబాదుకి బయలుదేరనున్నారు. వారితో నాలుగు రెజిమెంట్ల మద్రాస్ ఇన్ఫాంట్రీ, ఒక

ఇంజనీరింగ్ దళం హైదరాబాదుకి వెళ్ళవలసి ఉంది. మీరు కనుక వారితో వస్తే మనం ఇబ్రహీంపట్నాం వద్ద ఆ టోప్‌ను సందర్శించవచ్చు.'

'ఎవరు వెళ్ళేదీ నా చేతులలో లేదు. అది కమాండెంట్ నిర్ణయం.'

'అది మాకు వదిలేయండి, అధికారిక సూచన వచ్చినప్పుడు మీరు మీ అసిస్టెంట్లతో వస్తే చాలు', అని అదేదో చాలా చిన్న విషయంలా తేల్చివేసాడు, మెకాలెన్.



అమరేశ్వర స్వామి ఆలయంలో వారసత్వంగా సంక్రమించిన అర్చక వృత్తిపై ఇన్నేళ్ళు కాలం వెళ్ళదీసిన శంకరశాస్త్రి జీవితం ఇప్పుడీ చరమ కాలంలో రాజావారి పుణ్యమా అని ఒక్కసారిగా మారిపోయింది.

అరవై యేళ్ళ వయోవృద్ధుడు.

ఎప్పుడూ ఊహించని విధంగా గత ఆరు నెలల్లో ఊరు తీరే మారిపోయింది. గడపలు పదిరెట్లు పెరిగాయి. అదిగాక రోజుకి నాలుగు గృహప్రవేశాలూ, హోమాలతో తీరికేలేదు.

దేవుడి దయవల్ల ఈయేడు వానలు విస్తృతంగా పడ్డాయి. కృష్ణమ్మ ఎంతో కాలం తరువాత నిండుగా ప్రవహిస్తుంది.

'మీ పుణ్యమా అని శరన్నవరాత్రి ఉత్సవాలు దివ్యంగా జరిగాయి, పంతులుగారూ. రాజావారి దివాణానికి ఉదయాన్నే ప్రసాదాలు పంపించాను... ఇంకో విషయం, నా షడ్రకుడు కుటుంబంతో సహా అమరావతికి మకాం మార్చాడు. రాజావారు సెలవిచ్చినట్లు, తమరు పెద్దమనసు చేసుకొని ఆ కోనేరు పక్క స్థలం ఇప్పిస్తే...' అంటూ మాట నాన్చాడు.

'దానికేముంది అయ్యవారూ, అలాగే కానిద్దాం... చూడండి... వీరు మద్రాసు పట్టణం నుంచి వచ్చారు, కావలి బొర్రయ్యగారని, మీ గోత్రమే. ఇంగ్లిషు కాలేజీలో పెద్ద నౌకరీ. ముందుగా అర్చన కానిస్తే తరువాత మీతో ఏదో మాట్లాడాలట', అని పక్కనే ఉన్న వ్యక్తిని పరిచయం చేసాడు, సోమయ్య పంతులు.

అర్చనానంతరం, మంటపంలో కూర్చొని...

'ఆ లింగం చూసారుకదా నిలువెత్తు ఉంటుంది. స్వయంభూలింగం. పూర్వం చాళుక్య మహారాజు భీముని హయాంలో రోజుకి ఒక అంగుళం చొప్పున పెరుగుతున్న లింగాన్ని చూసి ఆదిశంకరుడే స్వయంగా ఈశ్వరుణ్ణి ప్రార్థించాడట. ఆ విధంగా పెరిగితే కొన్నేళ్ళ తరువాత అంతెత్తు ఆలయం నిర్మించడం అసాధ్యం కదా! అప్పుడు స్వామివారు వారి కలలో కనిపించి తన తలపై ఇనుప మేకు దిగకొడితే అలా పెరగడం ఆగిపోతుందని సెలవిచ్చారట. ఇప్పటికీ లింగం పైన మేకు దిగిన రంధ్రం కనిపిస్తుంది. అంతేకాదు ఆ గాయంవల్ల కారిన రక్తం చారలు ఇంకా లింగంపైన కనిపిస్తాయి. మీరు గనుక రేపు మడిగట్టుకు వస్తే గర్భగుడిలోనికి తీసుకువెళ్ళి చూపిస్తాను, సరేనా?'

## అమరేశ్వరాలయం

క్రీ.శ. 10వ శతాబ్దంలో తూర్పు చాళుక్య రాజు భీముని కాలంలో కట్టబడిన శైవ దేవాలయం. అంతకు పూర్వమే ధాన్య కటకంలో అనేక ఆలయాలు ఉన్న విషయం హ్యూయెన్‌త్సాంగ్ రచనలద్వారా తెలుస్తుంది. ఈ ఊరి స్థలపురాణం ప్రకారం, దేవాలయ నిర్మాణాన్ని ఆదిశంకరాచార్యులే స్వయంగా పర్యవేక్షించారట. శంకరాచార్యుని కాలాన్ని నిర్ణయించడంలో అనేక భేదాభి ప్రాయాలు ఉన్నాయి.

అమరేశ్వరుని లింగం, అంతకు పూర్వం, బౌద్ధ స్తూపంలోని స్తంభం అయివుండవచ్చు అని కొందరి అభిప్రాయం. నిరూపించడం కష్టమే. అయితే... కొన్ని వాస్తు సంబంధిత విషయాలు మాత్రం ఈ అభిప్రాయాన్ని బల పరుస్తాయి.

అమరావతి స్తూపంలోని ఆయక స్తంభాలకు వాడిన పాలరాయీ, అమరేశ్వరుని లింగపు రాయీ, ఒకేలాంటివి. స్తంభాలపై ఇనుప మేకుతో మరొక శిల్పాన్ని నిలిపే పద్ధతి, స్తూప నిర్మాణంలో కనిపిస్తుంది. అమరేశ్వరుని లింగపు తలపై ఇనుప మేకు దిగిన గుర్తులు ఉన్నాయని స్థలపురాణం చెబుతుంది. బౌద్ధ స్తూపాలని సింధూరంతో అలికే ఆనవాయితీ ఉంది. తవ్వకాలలో దొరికిన రాళ్ళపై సింధూరపు ఆనవాళ్ళు కనిపిస్తాయి. వాటికీ స్వామివారి లింగంపై రక్తపు గుర్తులని చెప్పబడే మరకలకీ, చాలా పోలిక ఉంది.

'అయ్యో, రేపు వీలవదండీ, పెద్దదొరగారు వస్తున్నారు. ఇక్కడేదో గుట్టమీద శిల్పాలు దొరికాయట!' అన్నాడు, కావలి బొర్రయ్య పంతులు.

'అవునవును దీపాలదిన్నె... అయినా ఏం శిల్పాలులేండి. ఏవరో జైనులవి. పూర్వం వాళ్ళ ఆలయం ఉండిందేమో' అని చప్పరించాడు శంకరశాస్త్రి. అంతలోనే, 'కానీ మంచి పాలరాయి, పంతులుగారూ, కాల్చి పొడిచేస్తే మంచి సున్నం అవుతుంది. రాజావారి మనుషులు కొన్ని మోసుకొచ్చి ఇక్కడ గుళ్ళోనే పడేసారు. చూస్తారా? ఒకటి మాత్రం నాగదేవుడు సుమీ. ఆ వేపచెట్టు కింద ప్రతిష్ఠ చేసాం. మిగిలినవి అక్కడే పడివున్నాయి.'



వైజయంతి మహల్, అమరావతిలో రాజావారి కొత్త దేవిడీ.

'ఇంతమంది దొరలు వస్తున్నారు, పోతున్నారు, ఆ దీపాలదిన్నె కింద ఏమైనా నిధినిక్షేపాలు ఉన్నాయంటావా, పంతులూ?'

'ఆహ్, అదేంలేదు నాయుడూ, ఆ శిల్పాలకోసం వచ్చారు. మనం గుళ్ళో పడేసిన వాటిలో ఎనిమిది మాత్రం బండ్లమీద హార్గ్రేవ్ దొరకి గుంటూరు పంపించారు. అక్కడ నుంచి మద్రాసు కాలేజీకి పంపిస్తారట. మా వాడు చెప్పాడు.'

'కాస్త తెలివిపెట్టి ఆలోచించరా, వట్టి రాళ్ళ కోసమైతే అంతమంది ఎందుకు వస్తారు?'

'ఒకసారి తవ్వి చూస్తే పోలా? ఎలాగూ నీళ్ళ కుంట ఆలోచన ఉండనే ఉంది.'

ఇంత పెద్ద గుట్ట మనుషులు కట్టడం సాధ్యమంటావా, పంతులూ? ఏ దేవతలో కట్టారేమో! అయినా మునసబు మల్లారెడ్డిని పిలిపించు. నమ్మకమైన మనుషుల్ని పెట్టి పని మొదలుపెట్టమని చెప్పు. ఏమీ దొరకకపోతే ఆ రాళ్ళు సున్నానికైనా పనికొస్తాయి.'



4

## అమరావతి బస్టాండు, క్రీ.శ. 1987

'అంటే ఆ జమిందారుకి నిధియేమన్నా దొరికిందా?' అడిగాను. ఊరికే వచ్చే సొమ్మంటే ఎవరికుండదు ఆశ? 'అవునురా ఉప్పీ? ఇంత కాలం నుంచీ తవ్వకాలూ పాడుబడ్డ శిధిలాలూ అని తిరుగుతున్నావు కదా? నీకు ఏమైనా నిధి నిక్షేపాలు దొరికాయా?'

'మన తలరాతకి అంత భాగ్యమా? ఒకవేళ ఏదైనా దొరికినా, అది ప్రభుత్వపు సొత్తు. పేపర్లో ఫోటో, నాలుగురోజుల ఆర్భాటం... అంతే మనకి మిగిలేది', అన్నాడు ఉపేంద్ర.

'వీడి ఆత్రం చూస్తే ఇప్పుడే ఒక గడ్డపలుగు తీసుకొని ఊరిమీద పడేట్లున్నాడు', అని బిగ్గరగా నవ్వుతూ, 'అసలు విషయానికి రా... ఇంతకీ ఆ రాజాగారు ఏంచేసారో చెప్పు', అన్నాడు రమేష్.

'ఏంచేసాడో, ఏమో... స్తూపం మధ్యలో ఇరవై అడుగుల లోతు గుంట మాత్రం మిగిలింది. నిధి దొరికిన ఆధారలయితే లేవు కానీ, ఆ కొద్ది రోజుల్లోనే ఆ జమిందారు సంపాదించిన సిరిసంపదలమీద చాలా కథలు ప్రచారంలో ఉన్నాయి.' అన్నాడు ఉపేంద్ర నిర్లిప్తంగా.

'మచ్చుకి ఒకటి చెప్పరా, ఎలాగయినా హిస్టారియన్‌వి, కథలు బాగా చెబుతావు', అన్నాను.

'ఉన్నాయిలే... తలా తోకా లేని కథలూ, పుకార్లూ. ఐతే... గజెట్ రికార్డులలో మాత్రం ఆ రాజావారు చేసిన తీర్థయాత్రల వివరాలు ఉన్నాయి. ముప్పై ఏనుగులూ, వెయ్యిమంది పరివారంతో కాశీ నుంచి రామేశ్వరం వరకూ గల అన్ని క్షేత్రాలూ దర్శించాడట. ఒక్కొక్క యాత్రకూ అయిన ఖర్చు ఆ కాలంలోనే లక్షల రూపాయలలో ఉంటుంది', అన్నాడు ఉపేంద్ర.

'అంటే కచ్చితంగా ఏదో నిధి దొరికే ఉంటుంది', అన్నాను.

'చెప్పలేం, అయినా అతడు అంత సంపాదించడానికి ఇంకో కారణం ఉంది. ఈస్టిండియా కంపెనీకి కట్టవలసిన శిస్తులు ఎల్లప్పుడూ ఠంఛనుగా కట్టేవాడట. అందువలన ఉత్తరపు సర్కారులలో అతడి జమీందారీ గ్రామాలు కూడా చాలా పెంచుకుంటూ పోయాడు. దానికి తోడు, పిండారీలనీ, దారిదోపిడిగాళ్ళనీ అణచడంలో ఎప్పుడూ ముందుండే వాడట. ఒకసారి వందలకొలదీ చెంచు జాతి వాళ్ళని అమరావతికి విందుకని పిలిచి మందుపెట్టి చంపేసాడట. ఆ పాపం నివృత్తి చేసుకోడానికి తీర్థయాత్రలు చేసేవాడని ఒక అభిప్రాయం'.

'అదీ నిధికోసమే అయుంటుంది. లంకెబిందెల కోసం నరబలి ఇవ్వడం ఇప్పటికీ అప్పుడప్పుడు వింటూనే ఉంటాం', అన్నాను.

'వీడి వాలకం చూస్తే ఏదో ఒక నిధి దొరికేవరకూ, ఈ ఊరు వదిలేట్లు లేదు', అని నా వీపు చరుస్తూ, 'అయినా స్తూపాల కింద నిధులు దొరికిన సందర్భాలు ఏమైనా ఉన్నాయా?' అడిగాడు రమేష్.

'యూవార్ రైట్. స్తూపాలంటే బుద్ధునివో లేక ఎవరైనా ప్రముఖ బౌద్ధ ఆచార్యుడి అవశేషాల పైనో కట్టిన సమాధులే. ఏదో మొక్కుబడిగా ఒకటి రెండు పూసలూ, రేకులూ తప్ప వేరే పెద్ద నిధులు దొరికిన తార్కాణాలు ఎక్కడా లేవు.'

'స్తూపాలంటే, సమాధులా?' అని నోరెళ్ళబెట్టాను.

'ఎందుకురా ఆశ్చర్యం? ఈజిప్టులో పిరమిడ్లు సమాధులే. మన తాజ్ మహల్ కూడా సమాధే. ముఖ్యమైన వ్యక్తులూ, మహారాజులూ, దేశాధినేతలను గుర్తు పెట్టుకోడానికి పెద్ద పెద్ద సమాధులూ, స్మారక చిహ్నాలూ కట్టడం ఎప్పటినుంచో వస్తున్న ఆనవాయితీ', అని నా సందేహానికి సమాధానం ఇచ్చి, ఉపేంద్రతో, 'ఇంతకీ ఈ స్తూపం కింద అవశేషాలు ఎవరివో?' అన్నాడు రమేష్.

'అవి గౌతమ బుద్ధుడివే అనేందుకు కొన్ని తార్కాణాలు ఉన్నాయి...', ఎలా మొదలుపెట్టాలా అనేమో కాసేపు ఆలోచించి, 'బుద్ధుని మహాపరినిర్వాణం, అంటే ఆ మహాత్ముని మరణం తరవాత, అతడి అవశేషాలను, అప్పటి మగధ రాజు, అజాతశత్రువు కొన్ని కలశాలలో భద్రపరచి, అప్పటి ఇండియాలో ఉన్న ముఖ్యమైన జనవాసాలన్నింటికీ పంపించాడట. ఆంధ్ర జనపథం, అప్పటికే ఉండి ఉండాలి. అంతే కాకుండా, చైనాలోనూ, శ్రీలంకలోనూ దొరికిన బౌద్ధ గ్రంథాలలో ఈ స్తూపం ప్రసక్తి ఉంది. అశోకుని కాలానికే, ఇక్కడ ఒక స్తూపం ఉండి ఉంటుందని పురాతత్వవేత్తల మెజారిటీ అభిప్రాయం'.

'అంటే ఆ కాలానికే ఆంధ్ర దేశం ఉందా?'

'ఎందుకురా నీకు అనుమానం? ఐతరేయ బ్రాహ్మణంలోనే ఆంధ్రుల ప్రస్తావన ఉంది. నర్మదానదికి దక్షిణాన అనేక ఆంధ్ర తెగలు ఉండేవని మహాభారతంలో చెప్పారు. గ్రీకు రాయబారిగా క్రీస్తుకి మూడొందల సంవత్సరాల పూర్వం ఇండియాకి వచ్చిన మెగస్తనీసు ఆంధ్రులకి లక్షలాదిగా సైన్యం ఉందని రాసాడు. అంటే, అశోకునికి ముందే ఆంధ్ర రాజ్యాలు ఉన్నట్లే కదా? అయితే... ఆ ఆంధ్ర జాతులని అన్నింటినీ సమైక్యం చేసి సామ్రాజ్యం స్థాపించింది మాత్రం శ్రీముఖ శాతవాహనుడని, మన పురాణాలలోని రాజుల పట్టికలు చెబుతాయి. అతడు అశోకుడికి సమకాలీనుడు...', అంటూ చెప్పడం మొదలెట్టాడు, ఉపేంద్ర.





కథలో ప్రస్తావించబడిన
ప్రదేశాల భౌగోళిక పటం
క్రీపూ. 260
తక్షశిల
శిబిపుర
మధుర
శ్రావస్తి
కాశి
వైశాలి
పాటలీపుత్రం
కౌశాంబి
గయ
రాజగృహ
చంప
విదిశ
చంద్రకేతు
ఉజ్జయిని
కోసల
భరుకచ్ఛం
తామ్రలిప్తి
మహా
కాంతారం
మహిష్మతి
భోజకటకం
నాసిక
కటకం
తోసలి
శూర్పారక
ములక
అశ్మక
ప్రతిష్టానం
పోదన్యం
యవనఘుడ
చక్రతీర్థం
అశిక
మహేంద్ర
కళింగం
కళింగనగరం
అశికనగరం
బావరికొండ
కనకగిరి
దక్షిణారామం
పిష్టపురం
ఆంధ్ర జనపదాలు
(శాతపుత్ర)
ధాన్యకటకం
విజయేంద్రం
శ్రీకాకుళం
(ధనదపురి, కుదురెవటం, మహాలంక)
సువర్ణగిరి
ఉదయారామం
బ్రహ్మగిరి
ముసిరి
పాండ్య
నగరాలు
బౌద్ధారామాలు
స్కంధావారాలు



# 5

## ధాన్యకటకం, క్రీ.పూ. 261

**ఆ**ది వారం,

పౌర్ణమి ఇంకా రెండు రోజులుంది.

అతడు బయల్దేరి సరిగ్గా పదిరోజులయ్యింది. ప్రతి పది కోసులకి ఒక గుర్రాన్ని మారుస్తూ ఆఘమేఘాల మీద ప్రయాణించాడు, ఆ రౌతు, పున్నమిలోగా కాకుళం చేరాలి. ఇరుగట్లూ ఒరుసుకొని ప్రవహిస్తుంది, కృష్ణమ్మ. కొండవాలున చిన్న రేవు. ఈ శ్రావణ భాద్రపదాల్లో యేరుదాటాలంటే ఒక్క ధాన్యకటకం వద్దనే సాధ్యం. రొప్పుతున్న ఆ గుర్రంపై నుంచే అవతల గట్టుకి దృష్టి సారించాడు. కనీసం ఇరవైకి పైగా నావలు లంగరేసి ఉన్నాయి.

బల్లకట్టు రేవుకి మెల్లగా తన గుర్రాన్ని నడిపించాడు.

అది ఒక పారశీకాశ్వం.

దానిపై ఆజానుబాహువుడైన అశ్వికుడు.

వీధికి ఇరువైపులా అంగళ్ళు, వాటిని నడిపే వణిక్ స్త్రీలు. వారి ముందు రకరకాలుగా తీర్చిన సామాగ్రులు.

అందరి దృష్టి ఆ రౌతుపైనే...

'ఆహా, ఆ అందం, ఠీవి, అశ్వచాలనంలో వడి! ఏ దేశపు వీరుడో?'

'ప్రయాణపు బడలిక ముఖంపైన ప్రస్ఫుటంగా కనిపిస్తుంది'

'వచ్చిన దిశ చూస్తే తూర్పు రహదారి; చాలా దూరం నుంచే వచ్చినట్లు ఉన్నాడు'

'కళింగమో? ఓఢ్రమో?'

రహదారి బల్లకట్టు, దాని ముందు సుంకకట్ట. అతని రాకతో అప్పటి దాకా తారాస్థాయిలో జరుగుతున్న లావాదేవీలు ఒక్కక్షణంలో సద్దుమణిగాయి. జనం పక్కకి జరగడంతో దారి తనంతట తానే తెరుచుకుంది. శుల్కాధ్యక్షుడు నమస్కరిస్తూ ముందుకు వచ్చి, 'ఏ ఊరు స్వామీ తమది? నామధేయం?' బదులుగా ఆ ఆగంతకుడు తన కుడిచేతి వేలిపైనున్న ముద్రికను చూపించాడు.

అంతే...

చూసిన మరుక్షణమే, చేతులు మోడుస్తూ తన మోకాళ్ళమీద కుంగి, ఆ శుల్కాధ్యక్షుడు, 'మహాప్రభో, ఈ సేవకుడు మీకు ఏ విధంగా తోడ్పడగలడో, ఆజ్ఞాపించండి', అన్నాడు.

'అంత మహత్కార్యం ఏమీ లేదయ్యా, కళింగం నుండి వస్తున్నాను. రేపటిలోగా రాజ దర్శనార్థం కాకుళానికి వెళ్ళాలి. కాస్త త్వరగా బల్లకట్టు ఏర్పాటు చేస్తే, వెంటనే బయల్దేరగలను. ఎలాగూ వెన్నెల రాత్రులు, ఆ శాక్యముని దయవల్ల మబ్బులు లేవు. రాత్రి కూడ ప్రయాణించవచ్చు. పైన కటకంలో ఒక సైంధవం మారిస్తే సరి, రేపటికి రాజధానిలో ఉంటాను' అంటున్న అతడి మాటలలో ఎంతో మృదుత్వం.

'ఆర్యా, మీకా అవసరం లేదు. ఆంధ్రస్వామి శ్రీ శాతవాహనులు ఇప్పుడు రాజధాని శ్రీకాకుళంలో లేరు. ఇక్కడే కటకంలోనే ఉన్నారు. రేపటి వరకూ మీరిక్కడే విశ్రాంతి తీసుకొని పొద్దున్నే అవతలి తట్టుకి పోవచ్చు', అని మహారాజు కొరకు శ్రీకాకుళం వెళ్ళవలసిన అవసరం లేదని తెలిపాడు, ఆ కరకటకాధ్యక్షుడు, మల్లప్ప.

'హమ్మయ్య!' అని ఒక్కసారి ఒళ్ళు విరిచి హాయిగా నిట్టూర్పు విడిచాడు. 'మీ దయవల్ల కాస్త విడిదికి బస దొరికితే ధన్యుడినవుతాను'.

ఎంతమాట, ఎక్కడో దేనికి? ఈ అభాగ్యుని గృహం తమరు దయచేస్తే పావనమౌతుంది.'

మీకెందుకు అంత కష్టం? ఏ పూటకూళ్ళవ్వ వీడయినా మాకదే చాలు.'

'అయ్యయ్యో, అలా అంటారేం స్వామీ? మీ అంతటివారు ఈ ఊరికి దయచేయడమే మా అదృష్టం. ఈ విషయం ఇప్పుడే మా రాజకునికి తెల్పి కటకానికి వర్తమానం పంపిస్తాను. మహామాత్రులకు మీ రాక వార్త అందజేసి, ప్రభువులు, ఆంధ్రవల్లభులు ఏ జాముకు తమకి అనుజ్ఞ ఇస్తారో, ఆ సమయానికి తమ ప్రస్థానానికి నావ సిద్ధం చేయించగలను. మీరు అసలే బడలికగొని ఉన్నారు. ఇక ఆ పనులన్ని మాకు వదిలిపెట్టి నిశ్చింతగా విశ్రమించండి', అంటూ ఆ కరగ్రాహకుడు, అతని చేయందుకొని తన గృహానికి దారితీసాడు.



చల్లని మామిడి తోపు, ఆపై కొంచెం మెరకైనా పచ్చని గడ్డీ, పూలమొక్కలతో అందంగా తీర్చినట్లున్న విశాలమైన తోట. రంగవల్లులతో అలంకరించిన ప్రాంగణం. నాపరాళ్ళతో తాపడం చేసిన చదునైన బాట. దానిపై పొన్నుగర్ర శబ్దం, ఆ పక్కనే సాగుతున్న సెలయేటి గలగలకి తాళం వేస్తుందన్నట్లుగా, ఆ ఇద్దరూ ఇంటివైపు కదిలారు.

ఆకస్మాత్తుగా ముఖద్వారానికి అడ్డుగా ఉన్న తెర తొలిగి, ఆ చిన్నది వారి వైపు ఉరుకుతూ వచ్చింది. చేతిలోని ముద్దమందారాల గుత్తి, ఆమె ముఖానికి అడ్డుగా నిలిచింది.

'అమ్మా... నాన్నగారొచ్చారే'

ఎర్రని పరికిణీ, చిలుకాకుపచ్చ చీనిపట్టు రవికె, దాని ముడిని అలవోకగా దాచీదాగనట్లు చుట్టిన జలతారు ఓణీ– నాభి కింద దోపెట్టిన కొంగూ.

పరగున వచ్చే ఆ పిల్ల, తండ్రి వెనుకనున్న అతిథిని చూడలేదు. పరిచయం చేద్దామని తన తండ్రి పక్కకు తిరిగిన మరుక్షణం తండ్రి ఆలింగనాసక్తితో అతి వేగంగా చలిస్తున్న ఆమె చరణాలు అదుపు తప్పి ఆమెను ఆ యువకుని పరిష్వంగానికి చేర్చాయి. ఇరువక్షాల మధ్య నలిగిన ఆ మందారాల ఎరుపు, సిగ్గుతో కందిన ఆమె చెక్కిళ్ళ ఎరుపు ముందు ఓడిపోయింది.

అతను సుదూరమైన కళింగదేశపు వీరుడు, నాగసేనుడు. అతని చెల్లెలు చారువాకీదేవి, అప్పటి కళింగ రాజవంశ ప్రతినిధి, మధ్య కళింగపు మహారాజ్ఞి. మహానది నుండి గౌతమి దాకా విస్తరించిన తూర్పు తీర దేశంలో అతడిని మించిన వీరుడు లేడని ప్రతీతి.

మరి ఆమె, ఆంధ్ర రాజ్యమందలి ఒక సామాన్య రాజభృత్యుని కుమార్తె, నూతన యవ్వన శోభిత, అసామాన్య సౌందర్యరాశి… మల్లిక.

వారిరువురూ కలసిన ఆ ప్రదేశం, కృష్ణా నదీమతల్లి వడిలో వికసించిన అపూర్వ నాగరికతకు ఆలవాలమైన 'ఆంధ్రనగరి'. శ్రీపర్వతానికి తూర్పున వెలిసి, బౌద్ధమతానికి, ప్రాచీన భారతీయ సంస్కృతికీ కేంద్ర బిందువై, విశాల మహాసాగర తీరదేశాలకెల్లా నాగరికతను పంచిన 'అమర'సీమ.



# 6

**బు**ద్ధావతారానికి సుమారు రెండు వందల ఏళ్ళ తరవాత, అఖండంగా విస్తరించిన 'చంద్రస్వామి' మురానందనుని సామ్రాజ్యం, ఇప్పుడు ఒక క్రూర నిరంకుశుని పాలనలో క్షోభిస్తున్న కాలం...

అత్యంత శక్తివంతులయ్యుండీ, పూర్వ ఒడంబడికకు నిబద్ధులైన ఆంధ్ర ప్రభువులు కూడా, ఆ నిరంకుశ చండశాసనుని పేరు తలచినంతనే భయ కంపితులౌతున్న దౌర్భాగ్యపు సమయం.

అతని కఠోర కృత్యాలవల్ల ప్రవహించిన నెత్తురు పంపా, నర్మదా, పరుష్ణీ నదులను మలినపర్చడమే కాక ఇప్పుడు అతి పవిత్రమైన ఆ గంగమ్మనే కలచివేస్తుంది. రాజప్రతినిధిగా ఉన్నప్పుడే సువర్ణగిరీ, ఉజ్జయినీ, తక్షశిలలలో అతను నెరపిన హింసా భీభత్సాలు రౌరవాది నరకాల్నే మరిపింప జేసాయి. కాని... అతనిలో ఏమి చూసి ఆ మహామహుడు, రథగుప్తామాత్యుడు, అతనికి పవిత్రమైన పాటలీపుత్ర సింహాసనం కట్టబెట్టాడో, చింతింపనలవి కాకున్నది.

ఈ విధంగా రాజు ఆలోచనా తప్తుడై ఉండగా...

కంచుకి: 'క్షమించండి ప్రభూ, శ్రీశ్రీశ్రీ మహా శ్రమణక, తిష్యస్వామి ప్రాంగణంలో ప్రవేశించారు.'

'వెంటనే ఆ మహాశయుని ఆదరాహ్వానానికి సిద్ధం చేయించు', అంటూ ద్వారంవైపు కదిలాడు.

బుద్ధం శరణం గచ్ఛామి
ధమ్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

అంటూ త్రిరత్నాల్ని పఠిస్తున్న ఓ పదిమంది పరివ్రాజకులు ముందురాగా, ఆ పల్లకిని మోసే బోయీలు సునాయాసంగా దానిని ఆ ప్రాంగణం

**శాతవాహనులు**

రాప్సన్, విన్సెంట్ స్మిత్, బండార్కర్ మొదలైన ప్రముఖ చారిత్రకుల అభిప్రాయంలో మన పురాణాలలో చెప్పిన 'ఆంధ్ర' లేక 'ఆంధ్రభృత్య' వంశాలూ, దక్షిణదేశమంతా కనిపించే శాతవాహన రాజులూ ఒకటే. ఆంధ్రభృత్యులు అంటే ఆంధ్రులు కాదు, ఆంధ్రులకి సేవకులు అనే మరో అభిప్రాయం ఉంది. అదే నిజమైతే, దక్షిణాపథాన్నంతా పరిపాలించిన శాతవాహనుల కంటే గొప్పవాళ్ళయిన ఆంధ్ర రాజులు ఉన్నట్లే కదా? మరి వాళ్ళెవరో ఆనవాళ్ళు కాస్తయినా దొరకాలిగా?

సరే..... శాతవాహనులే ఆంధ్రభృత్యులు అనుకొందామంటే, వాళ్ళు ఎవరికి భృత్యులు? ఆంధ్రరాజ్యస్థాపకుడు, శ్రీముఖ శాతవాహనుడు. పురాణాల పట్టికలను బట్టి లెక్కలు పెడితే, క్రీ.పూ.230 లో సామ్రాజ్యం స్థాపించాడు. అప్పటికి అశోకుని మౌర్య సామ్రాజ్యం పతనదశలో ఉంది. అశోకుని శాసనాలు కర్నాటక, రాయలసీమలలోనే కాక ఆంధ్రదేశపు నడిబొడ్డయిన అమరావతిలో కూడా దొరికాయి. దీనిని బట్టి శాతవాహనులే ఆంధ్రభృత్యులనీ, ముందుగా మౌర్య చక్రవర్తులకి సామంతులై ఉండి, అశోకుని చరమకాలంలో స్వతంత్ర సామ్రాజ్యం స్థాపించి ఉంటారని గ్రహించవచ్చు.

మధ్య నిలిపారు. నిష్కళంకమైన వెలినూలి తెరల వెనుక ఆచార్యులు సుఖాసీనులై ఉన్నారు.

అఖండ దక్షిణాపథాధ్యక్షుడూ, ముప్పదియారు తెగల సమైక్య ఆంధ్ర ప్రజావల్లభుడూ అయిన మహాభోజుడు శ్రీ శాతవాహన ప్రభువు ఆయన ముందు ముకుళిత హస్తాలతో నిలిచి, 'బుద్ధ స్వరూపులైన ఆచార్యులకు ఈ ఆంధ్ర భృత్యుని నమస్కృతులు. పెరియకంచిక వర్షారామానికి తమరాక మాకు మొన్ననే తెలిసింది. వెంటనే తమ దర్శనాపేక్షతో శ్రీకాకుళం నుండి బయలుదేరాను. కాని మీవచ్చు సమయానికి ముందుగా రాలేకపోతిని, క్షంతవ్యుణ్ణి. ఈ నాలుగు రోజులూ ఈ శిష్యునికి తమ సేవా భాగ్యం ప్రసాదించమని అర్థిస్తున్నాను' అంటూ తలవంచి నిలిచాడు.

'ఆర్యపుత్రా, నీ సేవా తత్పరతా, శ్రమణుల కడ, మరి తథాగతుని యల్లి నీ భక్తీ, దక్షిణాపథగాములైన ఎల్లవరుకూ గొత్తైనదే', వారి మాటలలో పశ్చిమాంధ్రపు యాస ప్రస్ఫుటంగా కానవచ్చింది.

'అంతా తమ దయ, ఆ శాక్యముని అనుగ్రహమున్నూ. కానీ...'

'ఏనా సంశయం, శాలిపుత్రా? సంకోచమెందుకు?'

'అదేమీలేదు భంతే, వచ్చీరాగానే అనవసరమైన రాజ్యాంగవిషయాలతో తమని వేధింపనొప్పదు.'

'తప్పదు, కొన్ని సమయాలలో సంఘ రక్షణ దీక్షాబద్ధులమైన మాకే ఇది తప్పకున్నది. భిక్షు వృత్తీ, శ్రమణ దీక్షా కూడా కొన్నిమార్లు వెనుకబడ వలసిందే. మీతో చర్చింపవలసిన అవసరపడ్డ కార్యం ఒకటి ఉన్నది.'

'అయినచో, తమరి అనుమతితో ఉద్యానవనంలో కొంచెం అల్పాహారం ఏర్పాటు చేస్తాను. తమ పరివారం ఇచటనే మా ఆతిథ్యం గ్రహిస్తారు... పదండి'.

అది నందివర్ధనాల పొదలతో కూడిన చక్కటి సైకతోద్యానం. కాలి కింద మెత్తని ఇసుక, పక్కనే కృష్ణమ్మ, తూర్పు కొండపై నీలాకాశాన్ని తన పండు వెన్నెలతో వెల్ల వేస్తున్న నిండు చంద్రుడు ఆహ్లాదకరమైన వాతావరణం! ఆంధ్రప్రభువులు బస చేసిన ఆ విలాస మందిరం చుట్టూ నిలువెత్తు ప్రాకారాలు, ఒక్క ఉత్తరంవైపు తప్ప, ఆవైపు లోతుగా ప్రవహించే కృష్ణమ్మే కాపు. అవతల గట్టున చినకంచిక, వంద గడపల నిగమ గ్రామం.

వరద కాస్త తీవ్రంగానే ఉంది. అయినా బల్లకట్టు మాత్రం యధావిధిగా ఆవైపు నుండి బయలుదేరింది!

'సర్వకాలాలలో ధనార్జనే ధ్యేయమైన ఈ నిగమ శ్రేష్టులకు సముద్ర యానమే అడ్డం రాదు, ఇక ఈ కృష్ణమ్మ ఒక లెక్కా!' అంటూ ఆచార్యుల వంక చిరునవ్వు నవ్వి, 'ఎవరో వర్తక శిఖామణి, ఈ వరదలో కూడా నది దాటుతున్నాడు. ఏదో మహత్తరమైన సామాగ్రి అయ్యుంటుంది.'

అచంచల యోగ దీక్షతో తీక్షణమైన ఆచార్యుని నేత్రాలు ఒక్కసారి ఆ బల్లకట్టుపై ప్రసరించాయి. 'ఆ పతాకం ఏ వర్తకునిదో వలె లేదే... ఆహ్... అదు నిమ్మ అశ్వముఖ లాంఛనవే. తప్పక ఎవరో రాజోద్యోగి, ఏదో అవసరపడ్డ వర్తమానమై ఉంటుంది!'

‘ఏమై ఉండునో?’

‘వచ్చిన వాడు, ఇవ్వకబోడు’

‘అదీ నిజమే’, అని నవ్వుతూ ‘ఇక అసలు విషయం. ఆచార్యులేమో సెలవీయదల్చారు?’

‘హుమ్, మొదలుగా, మా దృష్టికి వచ్చిన కొన్ని విషయాలు తెలియచేస్తాను. అదుపైనే మా కార్యావసరం’.

‘మీ ఇష్టం. మీరెలా సెలవిచ్చినా సరే’.

‘నిమగె గొత్తు. ఈ వర్షం మేము ఉజ్జయినీ, సువర్ణగిరీ దర్శించి ఈడకి చేరుసరికి వర్షర్తువు రానే వచ్చె. స్వర్ణగిరిలో మాకందిన వర్తమానమే ఈ జాప్యానికి కారణం... నేను మీకు వివరించునది, ఒక బౌద్ధాచార్యుడు, సంఘ శ్రేయోభిలాషియైన ప్రభువుకు చేయు విన్నపమే గాని, ఒక మగధ సామంతునకు కాదు’, సూటిగా అతని కళ్ళలోకి చూస్తూ అన్నాడు.

‘ఆచార్యా, తథాగతుని సాక్షిగా, త్రిరత్నాల రక్షణ కంటే ఈ మీ శిష్యునికి వేరే సార్థక్యం లేదు. ఈ విషయంలో మీరెట్టి సంకోచమూ చెందవలసిన అవసరం లేదు’, అంటూ తలవంచాడు.

‘అయిననూ, ఎంతైనా తమరు ఆ మగధాధిపతికి సామంతులే గదా!’

‘మీరన్నది నిజమే, అటు సువిశాల భరత ఖండమును ఏకఛత్రం కింద పాలించిన ఆ చంద్రప్రభువుకు వచన బద్ధులమైన భృత్యులమే! ఆంధ్రులమే! సేవా తత్పరత మా నైజమే! ఇటు, బౌద్ధం ఆ తథాగతుడు మాకు దయచేసిన ఆస్తి. ఆ దేవుడు, ఈ ప్రాగ్తీరంలో వేసిన ఒక్కొక్క అంగ ఒక్కొక్క మహానగరమైనది. క్రూరమృగాలకు ఆలవాలమైన ఈ జాంగలం, భరతావనికే ధాన్యాగారం అయ్యింది. మేము దాని కాపరులం. బౌద్ధ ధర్మ రక్షణ మా విధి. ఇంతవరకూ, ఈ రెండు ధర్మములూ నిర్వహించడంలో మా ఆంధ్రులకు ఎటువంటి అవరోధమూ కనిపించలేదు. కానీ... మీ మాటలలో ఏదో నిగూఢమైన అర్థం గోచరిస్తుంది. ఈ సందిగ్ధం నుండి మీరే దారి చూపాలి.’

‘లెస్స లెస్స! దక్షిణాపథంలో అటు మగధ సామ్రాజ్యానికీ, ఇటు బౌద్ధానికి మీరు తప్ప వేరే

**ఆంధ్రులు ఎవరు?**

తెలుగు భాషను మాట్లాడే వాళ్ళే ఆంధ్రులంటే, ప్రాచీన బౌద్ధ, పౌరాణిక వాఙ్మయంలోని ఆధారాలు దానికి భిన్నంగా ఉన్నాయి. ఒకప్పుడు వీళ్ళు వింధ్య పర్వతాలకి దక్షిణంగా ఉన్న దేశమంతా ఉన్నారేమో అనిపించక తప్పదు. ఐతరేయ బ్రాహ్మణం, ఆంధ్రులు వింధ్య పర్వతాల వద్ద విదర్భకి దక్షిణంగా ఉంటారని చెబుతుంది. మహాభారతం ఆంధ్రులు పశ్చిమ కర్నాటకలోని బనవాసి ప్రాంతం వారని అంటుంది. సుత్తానిపతం ములక, అశ్మక రాష్ట్రాలు, ఆంధ్ర రాజ్యాలంటుంది. సెరివణ్ణ జాతకం, ఆంధ్ర రాజధాని చత్తీసుగఢ్ రాష్ట్రంలో తెలవాహానదిపై ఉందని అంటుంది.

ఇనుప యుగం నుండీ మహరాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల్లో దాదాపు ఒకేరకంగా ఉండే బృహత్శిలా (మెగాలిథిక్) అవశేషాలు దొరికాయి. ఇవి పురాణాలలో, ఇతిహాసాలలో కనిపించే నాగజాతి వాళ్లవేననీ, వీళ్ళనే ఆంధ్రులని అన్నారనీ కొందరు చరిత్రకారుల అభిప్రాయం.

ఏదియేమైనా, క్రీ.శ. 7వ శతాబ్దంలో రాయపూర్ వైపు నుండి దక్షిణానికి వచ్చిన హ్యూయెన్‌త్సాంగ్ మాత్రం, ఆంధ్రదేశం, శ్రీశైలానికి ఉత్తరంగా రెండువందల కిమీ. దూరంలో ఉందని రాసాడు. అంటే, ఇప్పటి తెలంగాణలోని కరీంనగర్, వరంగల్లు జిల్లాలే ఆంధ్రరాజ్యానికి నడిబొడ్డు అయింది.

శరణం లేదు. ఇంతవరకూ ఆవశ్యకత కలుగలేదు, నిజమే... కానీ ఇప్పుడు సమయం వచ్చింది కనుక చెప్పక తప్పదు', అంటూ కాస్త దగ్గరగా జరిగాడు. 'ఆ మహాత్ముడు నిజదేహం విడిచి నూరర వర్షములు అవుతున్నవి. మగధ రాజుల ధర్మ విచార రాహిత్యం రోజురోజుకీ పెరుగుతుంది. ఆ చంద్రప్రభువు అనాలోచితంగా చేసిన పని వల్ల, దక్షిణాపథంలో కుడా ఆ నిర్గ్రంధ జైనుల ప్రభావం పెరిగిపోయింది. ఇక ఆర్యావర్తం, ఒక కలగూరగంప– అజీవికులు, లోకాయతులు. వీరికి తోడు, మ్లేచ్ఛ యవనులు. మరి ఛాందస బ్రాహ్మణులు సరేసరి. ఈ పరిస్థితిలో ఆంధ్ర, కళింగాలే స్వచ్ఛమైన థేర ధర్మానికి ఆలవాలమై స్థిరంగా నిలిచాయి. ఇప్పుడీ అశోక సామ్రాట్టు ఏవైపు మొగ్గుతాడో ఎవరికి ఎరుక?'

'కానీ... ఆచార్యా, ఆ మగధ రాజుల అజేయమైన స్కంధావారాలు దక్షిణదేశంలో ఉన్నంతవరకూ, ఆ సామ్రాట్టుకి ఎదురు చెప్పటం ఆత్మహత్యా సదృశమే గదా? ఆనాడు ఉజ్జయినిలో ఏమైనది? ఆ పిమ్మట గాంధారంలో నేమైనది? ఆ చండాశోకుని...' ఆ పేరు ఉచ్చరించిన తడువే, ఒక్కమారు అన్నివైపులా కలయజూసాడు, సకలాంధ్ర జన విభుడు, సిరి సాతవాహనుడు.

ఉద్యానం నిర్మానుష్యమే. కానీ... సాంబ్రాణి పొగలు చిమ్ముతున్న ధూప పాత్రతో ఒక పరిచారకుడు మాత్రం అతని కంట పడ్డాడు. సాయంకాలం ముసిరే షట్పాదులను పారద్రోలేందుకు సాంబ్రాణీ, వేప పొగలు పెట్టడం ఉద్యానవనంలో పరిపాటే. అయితే, కౌటిల్య తంత్రమనే ఇటుకలతో కట్టబడిన మగధ సామ్రాజ్య సౌధంలో, గూఢచార బలం అతి పటిష్ఠమూ, అగోచరమూ... ఎవ్వరినీ నమ్మలేము.

'ఎవరక్కడ?' అనినదే తడవుగా దూరం నుంచి పరుగున వచ్చి వాలాడు, రక్షణ దళ నాయకుడు, కొడబలి దొర'.

'చిత్తం ప్రభూ?'

'ఆచార్యులు ఏకాంతం కోరుకొంటున్నారని మీకు తెలుసు. ఆ ధూపపాత్రతో... వాడెవ్వడు?' అని, అంతలోనే శాంతించి, 'అలా కాదు, అతనిని వెంటనే నిర్బంధించి, అతని పూర్తి వివరాలు మాకు తెలపండి'. వల్లెయని తలవూపి అక్కడినుండి పరుగెత్తాడు, కొడబలి.

ఇంత జరుగుతున్నా తన పని తాను చేసుకుపోతున్న ఆ పరిచారకుని భటులు చుట్టుముట్టారు.

'పాపం, ఏ పాపమెరుగని వాడే కావచ్చు.'

'నిజమే, కానీ ప్రమత్తత తగదు. ఏ పుట్టలో ఏ పామున్నదో?'

'అదే నా ఉద్దేశ్యం కూడా. అప్రమత్తతతో ఉండాల్సిన సమయం వచ్చింది. నిజమే, అమిత్రఘాతుని కాలంలో అనేకమంది మహాసామంతులు తమ తమ జాతులను జాగృతపరచి స్వతంత్రించ బూనినా, మీ ఆంధ్రుల బలం మగధ వెనుక స్థిరంగా నిలిచి సామ్రాజ్యాన్ని కాపాడింది. వారి వారసత్వం పెద్దరాణి బిడ్డ సుసీములకు దక్కవలసింది. కానీ, ఇప్పుడు... ఎక్కడ నుంచి వచ్చాడో, ఈ మన సామ్రాట్టు! ఏప్పుడో తామ్రలిప్తిలో ఒకసారి కలిసి వదిలేసిన వణిక్ స్త్రీ పుత్రుడు. ఏ రాక్షసాంశన పుట్టాడో? భ్రాతృహంత! వానికి మహామంత్రి రథగుప్తుని వత్తాసూ! ఎంతైనా చంపాపుర వాసి గదా! వాని కళ్ళెప్పుడూ తూర్పు తీరం మీదే. బౌద్ధ సంఘాలకి ఎప్పుడేమి ఆపద ముంచుకొస్తుందో?'

'కానీ ఆచార్యా, ఈ మన సామ్రాట్టు అంటే గాంధారం నుంచీ ఉజ్జయిని వరకూ గల పశ్చిమదేశం గడగడ వణుకుతుంది. యవనులు తూర్పుదిశ చూడవలెనంటేనే కలవర పడుతున్నారు. వీరత్వంలో మాత్రం తాతకేమీ తీసిపోడు. అలాంటి వాడు బౌద్ధుడైతే, ఆహా, సమస్త భారతంలో త్రిరత్నాలు ఎంత శోభించునో!' అంటూ, ఆచార్యుని వంక చూసాడు.

'వారి ముఖంలో ఏదో కలవరపాటు?'

అవునని తలాడించినా, అంతలోనే నిట్టూర్చి, తన వాదనని కొనసాగించాడు. 'అది వట్టి పగటికలే, క్రూరత్వంలో కంసుణ్ణి మరిపించే ఆ అశోకుడు అహింసను ఎట్లు చేపట్టేను? అయినా, సకల ఖండాన్నీ తన చండశాసనం కెలగడ తేగల దీక్షా, దానికి సరిగాగల ప్రతాపమూ అతనికి ఉన్నాయి. ఆంధ్ర, కర్నాటాలు మాత్రమే సామంతుల పాలననల్లి ఉన్నవి. ఆ కుటిల చాణక్య నీతిలో మీ బోంటి మహాసామంతులకు తేవయే లేదే'.

'అవును. అతని కన్ను ఈ ధర్మభూమిపై ఎప్పుడు పడుతుందో అన్న చింత లేకపోలేదు,' అని తలవూపాడు.

'శాతపుత్రా, నేను చెప్పే విషయం సావధానంగా విను. అట్టి పరిస్థితే కనుక వస్తే, బౌద్ధ వటవృక్షం అఖండంగా, స్వచ్ఛంగా విస్తరించిన 'కళింగాంధ్రాలు' ఏకఛత్ర ఛాయలో ఉంటేనే, దక్షిణదేశం ఆ మగధ ప్రాబల్యాన్ని ప్రతిఘటించి స్వతంత్రమవవచ్చు. ఇప్పటికే పశ్చిమాన కరునాటి సీమలెల్లా ఆ మౌర్యుని మహామాత్రుల చేతిలో ఉన్నాయి. ఇక కళింగమా, స్త్రీ స్వామ్య రాజ్యం, అది ఇంకెన్నాళ్ళు మన్నుతుందో?' అని మహారాజు కళ్ళలోకి తీక్షణంగా చూసాడు. శాతవాహనుని ముఖంలో ఎటువంటి ప్రతిస్పందనా తోచలేదు. 'మహారాణి కారువాకీ దేవి అంటే కళింగ ప్రజలకు అత్యంత భక్తీ, ప్రేమా. ఆ రాణి తమ పట్టమహిషి అయితే... తూర్పుతీరమంతా తమ అనుజ్ఞాభద్ధులు అవుతారు. ఇక కరునాడు కూడా తమదైతే, అటు భరుకచ్ఛమూ, ఇటు ధాన్యకటకమూ, దక్షిణదేశం జంబూద్వీపానికే కాణాచి కాగలదు.'

'ఏదో తమకు నాయందున్న వాత్సల్యం కొలదీ అలా అంటున్నారే కానీ, ఇవన్నీ సంభవమా?'

'ఎందుకు కాదు? మా దృష్టిలో అది తప్పకుండా సంభవమే. దాని సాఫల్యానికి తొలిమెట్టు కళింగమే'.

'ధర్మ రక్షణకి అదొక్కటే మార్గం అని మీ అభిప్రాయం అయితే... నేను ఒకవేళ సరేనన్నా, ఆ తూర్పు వాళ్ళకి, మా ఆంధ్రులంటే అదొక చిన్నచూపు. తమరేవిధంగా...?'

'తథాస్తు! శుభస్య శీఘ్రం!'



మహామాత్రుడూ, ధాన్యకటక నగరాధ్యక్షుడూ అయిన బుధగుప్తుడు సాయంకాలపు భోజనం కానిచ్చి, మెల్లిగా ఉయ్యాల బల్లపై కూర్చున్నాడు.

'ప్రభూ, కంచిక నుంచి ప్రతీహారి వచ్చాడు. ఏదో వర్తమానమట ఆ ఊరి రాజకుల నుండి'.

పల్లవభుక్తం నుంచి వచ్చిన లేత తమలపుటాకులపై మునిగోటితో తెల్ల సున్నం రాస్తూ 'ఇప్పుడే వస్తా. వసారాలో కూర్చోమను', అని, కస్తూరీ, పచ్చకర్పూరం కలిపి నానబెట్టి ఆవునేతిలో వేపిన వక్క పలుకులు మరో చేతిలో పుచ్చుకొని, తాంబూలాస్వాదనానికి సిద్ధమవుతూ వాకిట్లోకి నడిచాడు.

అతను నదీతీరం నుంచి పరుగు పరుగున వచ్చాడేమో, ఇంకా రొప్పుతూనే ఉన్నాడు. 'కూర్చోవయ్యా, ఎంతసేపని ఆ చూరు కింద నిలుచుంటావ్. అయినా ఈ వరదే కాకుండా ఇంకేమి ముంచుకొచ్చింది?' అన్నాడు బుద్ధగుప్తుడు విసుగ్గా. మహారాజు ధాన్యకటకం వచ్చినప్పటి నుండి అతనికి ఒక్క క్షణం కూడా తీరికలేదు.

'అయ్యా, మా రాజకులు మీతో అతిత్వరగా మనవి చేయమన్న విషయం, శ్రీశ్రీ నాగసేన రాజకుమారులు, కళింగమునుంచి, అదే... వారి సోదరి మహారాణి నుంచి మన ప్రభువులకు ఏదో వర్తమానం తెచ్చారట...'

'ఆ...ఆహ్, ఆగాగు', బుద్ధగుప్తుడు ఉలిక్కిపడ్డాడు. భుక్తాయాసంతో మూతలు పడుతున్న కన్నులను ఒక్కసారిగా విప్పార్చి 'ఎవరది? మళ్ళీ చెప్పు' అన్నాడు.

'అదే ప్రభూ, నాగసేన కుమారులు ఇప్పుడు కంచికలో ఉన్నారు. ఈ రాత్రికి అక్కడనే బసచేస్తారట. ఉదయాన్నే రాజదర్శనం కోరారు. తమకి మనవి చేయమని మా రాజకులు కన్నబుదొర నన్ను పంపించారు. నాయనగారు ఏ సమయమంటే ఆ సమయానికి వారిని ఇక్కడకు తోడ్కొని వస్తారు.'

కళింగ రాజకుమారులే స్వయంగా వచ్చారని విన్నంతనే, మహామాత్రుల తాంబూల చర్వణం ఆగిపోయింది. రక్తచ్ఛాయని మరిపించే జిహ్వారసాన్ని అక్కడే ఉన్న నీలలోహిత పాత్రలో ఉమ్మి, చేతులు చరుస్తూ, 'ఎవర్రా అక్కడ? వెంటనే రాజుగారి విడిది ప్రాసాదానికి వెళ్ళి, అక్కడ కొడబలిదొరతో, మేము అత్యవసరంగా దర్శనానికి వస్తున్నామని చెప్పు', అంటూ రాజదర్శనానికి సరిపడే దుస్తుల కొరకు లోనికి వెళ్ళాడు. నూలు ధోవతి విసర్జించి, ఎఱ్ఱని చీనిపట్టు ధోవతీ, పొన్నూలు అంగీ, ఉత్తరీయాలు ధరించి, లాంఛనపు బాసికం ఫాలభాగానికి కట్టి, హుటాహుటిగా బయలుదేరాడు.



'ప్రభువుగారు తిష్యస్వామి జతలో ఉద్యానంలో ఉన్నారు. తాము రాగానే ప్రవేశపెట్టమన్నారు', అని లోపలికి దారితీశాడు, కొడబలిదొర. నిర్మానుష్యమైన వనంలో వారిరువురూ ఏదో చర్చిస్తున్నారు.

'మహాప్రభో, ధాన్యకటకాధ్యక్షులు బుద్ధగుప్తుల వారు వేంచేశారు.'

'ఆ... రండి, రండి' అన్న పిలుపుతో ఆవైపు నియమిత వేగంతో నడుస్తూ, 'ప్రభూ తమ పెరువాడికి అంతరాయం కలుగజేశాను, క్షంతవ్యుణ్ణి. తమ అనుజ్ఞ అయితే ఆచార్యులకూ వందనం ఆచరిస్తాను'.

'ఏం మహామాత్రా, ఆచార్యులు సర్వకాల సర్వావస్థల్లో పూజనీయులు. దానికి మా అనుజ్ఞ దేనికి?' అని చిరునవ్వుతో, 'అయినా... వచ్చిన పని ఏదో అత్యవసరమన్నారు?'

'ప్రభూ, కంచిక నుండి వార్త', అంటూ అవతలి గట్టున మిణుక్కుమంటున్న దీప సమూహంవైపు చేయి చూపాడు.

'ఇంత వరదలో బల్లకట్టు కట్టినప్పుడే అనుకున్నాను, అత్యవసరమైన సమాచారమేదోనని', అని అర్థవంతంగా ఆచార్యుల వంక చూసాడు శాతవాహనుడు.

అవును ప్రభూ, కళింగం నుండి రాజభ్రాత, శ్రీ నాగసేనులవారే తమ దర్శనార్థం విచ్చేశారట. శ్రీకాకుళానికి బయలుదేరిన వారికి, తమ విడిది విషయం తెల్పి, కంచికలోనే బస చేయించడమైనదని, ఆ ఊరి రాజకుని వర్తమానం'.

'వెతకబోయిన తీగె కాలికి చుట్టుకున్నట్లు, మహారాణి కారువాకీదేవి సోదరుడు ఇచటకి వచ్చుటేమి? ఏదో ముహూర్త విశేషం వలెనున్నదే' అన్న ఆచార్యుల వైపు తలవగ్గి,

'అంతా తమ సంకల్పబలమూ, ఆ తథాగతుని అనుగ్రహమూ! తమ ఆజ్ఞ అయితే రేపు ఉదయమే ఆ రాజకుమారుని ఇచ్చుటికి ఆహ్వానిస్తాను'.

'కానీ... మనమే ఎదురేగి వారినిచ్చుటికి కొనివచ్చుట తగునేమో?'

మహాభోజుడు, శాతవాహనుడు కాసేపు అర్ధనిమీలిత నేత్రుడై, 'నిజమే, కార్యసిద్ధికి అదే తగిన పద్ధతి. అలాగే కానీయండి' అని మహామాత్రుని వైపు తిరిగి, 'రేపు మధ్యాహ్నం అవతలి గట్టుకు పోదాం. కావలసిన సన్నాహాలు కొడబలి దొరతో చర్చించి చేయగలరు. ఆ రాజకుమారుడు రాజకుల గృహంలో ఉన్నారు కదా?'

'క్షమించాలి. రాజకులు యథోచితంగా ఆహ్వానించినా వారెందుకో అచటి కరకటకాధికారి ఇంటనే బస చేసారట!'

'అక్కడ ఏమి విశేషం ఉందో!'



## ప్రభుత్వం - అధికారులు

ఆంధ్రదేశంలో ప్రభుత్వ పదవుల్లో అప్పటికీ ఇప్పటికీ పెద్ద మార్పేమీ లేదు. మంత్రులూ, కలెక్టర్లూ, ఆఫీసర్లూ.

అయితే పేర్లే తేడా... అశోకుని శాసనాల్లో మహామాత్ర, ప్రాదేశిక, రాజుక, యుక్త, అధ్యక్ష, పతివేదక, పులిసాని మొదలైన ప్రభుత్వాధికార్ల పేర్లు కనిపిస్తాయి. ఇవిగాక అర్థశాస్త్రంలో, జాతకకథల్లో మరికొన్ని పేర్లు. మొదట్లో శాతవాహనులు కూడా మౌర్యుల పద్ధతినే అనుసరించారనటానికి ఆంధ్ర, కర్నాటకలలో దొరికిన అనేక అశోకుని శాసనాలే చాలు. వాటిలో కొన్నింటిని ఈనాటి డెసిగ్నేషన్‌లతో పోలుస్తూ కింద పట్టిక చూపిస్తుంది.

| | |
|---|---|
| అమాత్య | మినిస్టర్ |
| సన్నిధాత్ర | చీఫ్ సెక్రెటరీ |
| సంహర్త్ర | హోమ్ సెక్రెటరీ |
| అధ్యక్ష | ప్రిన్సిపల్ సెక్రెటరీ |
| ప్రాదేశిక | జిల్లా కలెక్టర్/ మాజిస్ట్రేట్ |
| రాజుక | తాసిల్దార్/ సబ్ కలెక్టర్ |
| యుక్త | రిజిస్ట్రార్ |
| పతివేదక | ఇన్టెలిజెన్స్ కమిషనర్ |
| పులిసాని | పీ ఆర్ ఓ |
| దండనాయక | పోలీస్/జైల్ సూపరిండెంట్ |
| నగరవ్యాహలక | పోలీస్ కమిషనర్ |
| నగరక | మునిసిపల్ కమిషనర్ |
| స్థానిక | ఎమ్ ఆర్ ఓ |
| గ్రామక | వీ ఆర్ ఓ |

శాతవాహనుల కాలానికే ప్రభుత్వ విధానంలో భూస్వామ్యపద్ధతి కొంతకొంతగా చోటుచేసుకో సాగింది. ప్రాంతీయ ప్రభుత్వాలు సామంత ప్రభువుల చేతిలోకి రావటం మొదలైంది. చక్రవర్తికి వార్షిక కప్పం చెల్లిస్తూ, సైన్య సహకారం అందిస్తూ మహాభోజులు, మహారథులు అనే స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన పదవులు వాడుకలోకి వచ్చాయి. శాతవాహన పతనానంతరం వీళ్ళలో చాలామంది స్వతంత్ర రాజ్యాలు స్థాపించారు.



# 7

సాయంకాలపు తూరుపు గాలి. కొండ వాలున మావితోట. దూరంగా కృష్ణమ్మ. అవతలి గట్టున కోసుల కొలదీ విస్తరించిన ఆంధ్రనగరి. అతని కళ్ళకు అవేమీ కనపడటం లేదు. సర్వేంద్రియాలూ ఆ అపురూపమైన బాలికపైనే కేంద్రీకృతమైనాయి.

ప్రయాణ బడలిక ఇట్టే మాయమయింది.

ఆమెకు నిండా పదహారేళ్ళు లేవు. అయితేనేం, సంపూర్ణ సౌందర్యరాశి.

ఆంధ్ర యువతులు సామాన్యంగా సర్వ స్వతంత్రులు. అనాదిగా ఉన్న మాతృస్వామ్యపు గుర్తులు అంత త్వరగా మాసేవి కావు! దానికి తోడు ఆ బాల పదునాల్గు కళలలో కాణాచి. యుక్త వయస్కులైన కులీన స్త్రీలకు సముచితమైన నృత్యం, గానం, చిత్రలేఖనం వంటి లలితకళలనే గాక, శాస్త్ర వాఙ్మయాలనూ, అశ్వారోహణ, ధనుర్విద్యాది యుద్ధ కళలనూ సైతం తండ్రి ప్రోత్సాహంతో అభ్యసించింది. బ్రాహ్మణ సంస్కృతికి చెందిన ఇతిహాస పురాణాలే గాక, సమస్త జాతక కథలూ, ఆ తథాగతుని జీవిత గాథలూ, ప్రవచనాలూ ఆమెకు కొట్టిన పిండి.

ఎంతటి గంభీరమైన విషయమైనా సమర్ధవంతంగా తర్కించగల అసాధారణ నైపుణ్యం! 'ఆహా, తానెరిగిన రాజహర్మ్యాలలో కూడా కనిపించదే! ఒక సాధారణ గ్రామోద్యోగి తనయ, ఎంత అబ్బురం? సువర్ణం బడయాలంటే బురద నీరు వడగట్టక తప్పదు కదా! ఎంతటి జాతి వజ్రమైనా రేగడి భూమిలోనే కదా దొరుకుతుంది! ఈమెది తప్పక పంకంలో జన్మించిన మహాలక్ష్మి అంశ, లేదా, ఆ కృష్ణమ్మే ఈ యువతి రూపంలో సాక్షాత్కరించిందా?' అని తలపోస్తూ, ఆమె మోము చూస్తూ అలానే ఉండిపోయాడు.

'ఉజ్జయినికి దక్షిణదేశంలో మొత్తం ముప్పది ఆరు జాతులు. అన్నీ స్వల్పమైన భేదాలతో ఒకే భాష మాట్లాడతారు. కొందరు మహారట్టులూ, మరికొందరు కరునాటి రట్టకుడులు. ఇక తూర్పున మీ కళింగులు. భరుకచ్ఛం నుండి శ్రీకాకుళం వరకూ గల కృష్ణా- గౌతమీ నదీ ప్రదేశం ఒక్క రాజ్యంగా చూడాలనే మా అందరి ఆకాంక్ష. పడమటి యవన సీమలూ, తూర్పున యవ, మలయ, సువర్ణ, కాంభోజ ద్వీపాల వాణిజ్యాలకు మన ఆంధ్రదేశమే కదా కేంద్ర బిందువు. ఇట్టి ఈ సీమ ఏదియో ఒక రోజు ఏకమవుతుంది. అది మా శాతపుత్రుల వలనే సాధ్యం', అంటూ తలయెత్తి, తననే తదేకంగా చూస్తున్న నాగసేనుని చూసి ఒక క్షణకాలం నివ్వెరపోయింది. స్త్రీ సహజమైన సిగ్గు ఆమెను కప్పేసింది.

అతని ముఖంలో ప్రస్ఫుటమైన ఉద్వేగం ఆమెను కలవరపెట్టింది. ఆ మధ్యాహ్నం యాదృచ్ఛికంగా సంభవించిన అతని పరిష్వంగం వలన కలిగిన ఉద్రేకం, ఆ కన్య మనస్సునింకా వీడనేలేదు. ఏదో ఒక నవనూత్నమైన మైమరపు ఆమెను ఆవహించింది.

అంతే...

మరుక్షణంలో ఆమె ముఖారవిందం అతని వక్షస్థలాన్ని, ఆమె కుసుమ కోమలమైన తనువు అతని బాహు పంజరాన్ని చేరాయి. గాంధర్వ విధి ధర్మబద్ధం అయితే, వారికి ఆ ముహూర్తాన వివాహం అయినట్లే!

కానీ, అతడు ఆతిథ్య మర్యాదకు భంగం చేసే సంస్కార విహీనుడు కాదు. మరి ఆ కన్య ఎంత విద్యా వ్యాసంగాలలో కుశలత కలదైనా, ఇంకా అనుభవ శూన్య అయిన పసి బాలికే!

మెల్లగా తన బాహువులను సడలించి, వజ్ర పటిష్ఠమైన దక్షిణ హస్తంతో సున్నితంగా ఆమె చుబుకాన్ని ఎత్తి, ప్రేమతో నిండిన చూపులతో ఆమె కనుల లోతుల్లోకి చూస్తూ, 'మల్లికా, రేపు ఉదయం మీ నాయనగారిని, నీ కోసం అడుగుతాను. ఈ తూరుపు దేశపు మొరటు అనాగరికుడు నీకిష్టమేనా?'

'ఊహూ', అని కనులతోనే నవ్వి, అతని హృదయంపై వాలిపోయింది.





# 8

ఇంద్రకీలాద్రి కొండ దిగువ, విజయేంద్రపురం,

ధాన్యకటకానికి తూర్పుగా పది కోసుల దూరం. కృష్ణమ్మ రెండు పర్వతాల నడుమ ఒరుసుకొని ప్రవహిస్తుంది. రాజధాని నుండి వచ్చే రహదారి చాలావరకు వరదనీట మునిగిపోయింది. కోసులకొద్దీ నిలిచిపోయిన బండ్లు; రాసుల కొలదీ ధాన్యం, ఇతర వాణిజ్య సామాగ్రి దారికి ఇరువైపులా పేరుకుపోయాయి. ఆ పట్టణంలో ఏ వీధిని చూసినా అగమ్యగోచరులైన వణిక్ శ్రేష్ఠులు వారివారి కష్టాలు వెళ్ళబోసుకుంటున్నారు.

వారి మధ్య 'పీత కష్టాలు పీతవి' అన్నట్లు, వారందరికీ భోజన వసతులు కూర్చడంలో తెమలని రాజకశిఖామణి, సోంభొట్లు. 'వందకు పైగా ఉన్నారు. అందునా, ఎవ్వరికీ భోజనాదికాలకీ, ఆతిధ్యంకూ ఏ లోటూ రాకూడదని రాజాజ్ఞ. ధాన్యమైతే తేగలము కానీ, సస్యశాకాలు ఎక్కడనుండి తేవాలి? లంకలన్నీ మునిగిపోయాయి. దానికి తోడు రెండు కూరలు లేకుంటే వీరికి ముద్ద దిగదు. ఇక బండ్ల వాళ్ళు... ఉత్తరపు కొండంతా వాళ్ళే. అమ్మవారి కొండ కింద ఒక ఊరే వెలిసింది. ఈ కృష్ణమ్మ ఎప్పుడు దయ చూస్తుందో?' అంటూ వాపోసాగాడు.

'ఏది ఏమైనా ఈ వరద పుణ్యాన నిగమానికి బాగానే మిగుల్తుంది. రాజధాని నుంచి వచ్చిన ద్రవ్యంలో ఎంతలేదన్నా వెయ్యి పణాల దాకా పదిలం చెయ్యొచ్చు', అన్నాడు నిగమ శ్రేష్ఠి, చెన్నబు.

'ఏం లాభమో! ఈరోజు ఇరవై మషికాలు నెయ్యా పెరుగులకే వ్యయం అయ్యింది'.

'సరేలే, భొట్లూ, అంతా మన మంచికే అనుకో. ఈ వరద మూలాన మహారాజు దృష్టి మన రహదారి మీద పడింది. నది వారగా తూర్పుకొండ తొలిపించి రాచబాట వేస్తారట!'

'అదీ నిజమే'.

'ఇంకో విషయం, నా మేనల్లుడు చోళంలో ఉన్నాడు. అక్కడి బోయలు రాయి తొలవడంలో దిట్టలు. మీరు పిలిపించమంటే ఒక వెయ్యిమందిని రప్పించేద్దాం. ఏమంటారు?'

'సరేనయ్యా శెట్టీ, ఎంతైనా మనమూ మనమూ. కానీ ఈ పనికి మరి రాజధాని నుంచి ప్రత్యేకంగా రాచబిడ్డ చిముకులే వస్తారట!'

'ఆ, చిన్న బిడ్డ! పదహారేళ్ళు కూడా లేవు. ఇక మీరో, పట్టణమంతా మీ చేతిలో ఉంది.'

'అది కాదయ్యా, మా గురువులు చెపితే విన్నాను. మన రాజకుమారుడు శ్రీముఖ శాతవాహనుల

గురించి, ఆయన పద్నాలుగేళ్ళకే, అప్పుడు పౌధన్యంలో జరిగిన సత్రానికి రాజప్రతినిధిగా వెళ్ళారట. ఒకటా రెండా, ముప్పై ఒక్క మంది, మహాభోజులూ, మహారథులూనూ. ఆ వయస్సు లోనే ఆ చిన్నవాడు చూపిన ప్రతిభ, ఆంధ్ర రాజ్యాల విషయంలో అతని ఎరుక, వ్యాపార వాణిజ్యాలపై అభిప్రాయాలూ విని ఆరితేరిన మహామాత్రులే ఆశ్చర్యపడ్డారట! ఇక మా గురువులైతే, ఈ మహాంధ్ర సామ్రాజ్యాన్ని సాధ్యం చేయగల చక్రవర్తి, ఆ చిముకుడే, అని ఎన్నో మార్లు చెప్పారు'.

'అవును భొట్లూ, ఆ దూరాలోచన నాకు లేకబోయింది. అంటే... కాస్త నిదానంగా ఆలోచించి ముందంజ వేద్దాం అంటారు?'

'అంతే మరి. భావి చక్రవర్తే మనతో ఉంటే ఈ చిన్న చిన్న వాటికి తొందర దేనికి? చేసేది మహాపర్వతాన్ని తొలిచే యత్నం. నీవు అడిగేది, చిట్టెలుకని పట్టడానికి సాయం కావాలి అన్నట్లుంది'.

అంతలో బయటేదో రణగొణధ్వని.

'ఏమిత్రా? ఏంటా రభస?' అంటూ వాకిట్లోకి నడిచారిద్దరూ.

ఎదురుగా రేవు కాపరులు, నలుగురు. వారి మధ్య వంటిమీద గోచీ తప్ప నూలుపోగు లేని అపరిచిత వ్యక్తి. 'ఈ మనిషి వరదలో కొట్టు కొచ్చాడు స్వామీ, మన భాష రాదు. ఎందుకైనా మంచిదని మీవద్దకు తెచ్చాం'. నగ్నంగా చలికి వణుకుతున్న వాణ్ణి ఒకసారి నఖశిఖ పర్యంతం చూసి, 'చలికి చస్తాడేమో, ముందు తినటానికి ఏదైనా పెట్టి కొట్లో ఉంచండి. నేను శెట్టిగారు వెళ్ళాక వచ్చి చూస్తాను', అని చెన్నబు శ్రేష్ఠివైపు తిరిగి, 'మీ వర్తక శ్రేష్టులే అనుకుంటే, ఈ వరదలో కాందిశీకులు కూడా! ఇక మీరు అనుజ్ఞ ఇస్తే కాస్త పనిలో పడ్తాను'.

### ఇంద్రకీలాద్రి

కనకదుర్గమ్మ వెలిసిన కొండని ఇంద్రకీలాద్రి అని పిలుస్తారు. ఇప్పుడు ప్రకాశం బ్యారేజి ఉన్నచోట, కృష్ణానది రెండు కొండల మధ్య కనుమలో ప్రవహిస్తుంది. నదిలోకి చొచ్చుకు వచ్చిన ఆ రెండు కొండల మధ్య ఇంద్రుడు చేసిన బెజ్జంలో ప్రవహిస్తుంది కనుక ఈ ఊరికి బెజ్జంవాడ లేక బెజవాడ అని పేరు వచ్చిందని కొందరు చెబుతారు. అయితే, అమ్మవారి సహస్రాధికమైన పేర్లలో ఒకటైన 'విజయ'వల్ల ఈ ఊరు విజయవాడ అయిందనీ, కాలానుగుణంగా బెజవాడగా స్థిరపడిందనీ మరో అభిప్రాయం. శాసనాల వల్ల ఈ ఊరు ఒకప్పుడు 'విజయేంద్రం' అని పిలువబడేదని కూడా తెలుస్తుంది.

అయితే, ఒక విషయం మాత్రం నిజం. ఇది ఒక అతి ప్రాచీనమయిన పట్టణం. ఉండవల్లి, మొగల్రాజపురం గుహల వాస్తు ఈ విషయాన్ని బలపరుస్తుంది.

ఈ ఊరి దేవత, కనకదుర్గ. ఆమె కొండని ఇంద్రకీలమని ఎందుకు అన్నారు?

స్తూపనిర్మాణ ప్రక్రియలో మొట్టమొదట ఆ స్థలం నడిబొడ్డున, అంటే మూలస్థానంలో ఒక స్తంభాన్ని పాతి, దాని చుట్టూ మిగిలిన స్తూపాన్ని చక్రాకారంలో కడతారట. ఆ మూలస్తంభాన్ని 'ఇంద్రకీలం' అంటారు. మరి విజయవాడ దేనికి నడిబొడ్డు? చక్రానికి ఉండే 'స్పోక్స్' లాగా విజయవాడ నుండి అనేక రాజమార్గాలు వెడలుతాయి. అంటే.... రైల్వేస్టేషనూ, హైవేలు రాక మునుపే, ఈ పట్టణం ఒక వాణిజ్యకూడలి. మరి ధాన్యకటకం, వేంగి మొదలైన రాజధాని నగరాలు దగ్గరలోనే ఉండగా, ఈ ఊరు దేనికి కీలకం అయింది? బహుశా స్థలమహత్యమేమో!

'సరేనయ్యా భొట్లూ, నేనూ బయల్దేరుతాను. దయచేసి నేను చెప్పిన విషయం మాత్రం మరువకు. కంచి నుంచి వచ్చిన మావాళ్ళకి కాస్త కొండ ఎగువగా వసతి ఐతే బాగుంటుంది' అని వచ్చిన అసలు కారణం మరోసారి గుర్తుచేసి నిష్క్రమించాడు.



విజయేంద్రం ఐదు రహదారుల కూడలి. కళింగం నుంచి వచ్చే తూర్పు రహదారే గాక, చోళం నుంచి దక్షిణపు దారీ, కోసలం మీదుగా మగధకి పోయే కనుమ దారులూ, కరునాడు నుండి శ్రీ పర్వతమూ, శ్రీ ధాన్యంల మీదుగా రాజధానికీ ఆపై సాగర తీరానికీ సాగే రాజమార్గం ఈ ఊరి మీదుగానే పోతాయి. దక్షిణాపథం నలుమూలల నుండి వచ్చే వర్తక యాత్రిక సమూహంతో ఎప్పుడూ కిటకిటలాడే పట్టణం.

ఆ పట్టణపు రాజకుడు, రాజుచే స్వయంగా నియుక్తుడైన సమస్త గూఢచార సంఘానికీ అధ్యక్షుడు. పైకి సామాన్య రాజోద్యోగిగా కనిపించినా, సోంభట్టు, శ్రీశాతవాహనునికి ఆంతరంగికుడేగాక, మహామంత్రి పుత్రుడూనూ. అతనిచే నియుక్తులైన గూఢచారులు ఆంధ్రరాజ్యమే గాక, చోళం, కేరళం; ఉత్తరంలో ఉజ్జయినీ, గాంధారాలూ; తూర్పున, ఓఢ్ర, కళింగాలూ; ఇంకా, పాటలీపుత్రం, వైశాలీ మొదలైన నగరాల్లో సుమారు వెయ్యిమందికి పైగా ఉన్నారు. కానీ చాలా కొద్దిమందికి తప్ప వారెవ్వరికీ అతనెవరో ఎరుక ఉండదు. ఏ వర్తమానమైనా వంతుల వారీగా మాత్రమే అతనిని చేరుతుంది.

వచ్చిన ఆగంతకుడు ఎవరో అతను ఇట్టే పసిగట్టి కూడా ఆ విషయం పైకి వెలువరించలేదు. కారణం విదితమే! ఏదైనా అతి రహస్యమూ, అసామాన్యమూ ఐతే తప్ప తనవద్దకు ఎవ్వరూ రాను వీలులేదు. కొత్తగా మరేమి ముంచుకొచ్చిందో?

కొంచెం జావ త్రాగి, ఆ భటులు ఇచ్చిన దుప్పట్లో ముడుచుకొని ఉన్న వాణ్ణి చూసి, 'ఏమప్పా మునియప్పవరే?' అని పశ్చిమాంధ్ర భాషలో పలకరించాడు.

'క్షమించండి అయ్యా. కనకగిరి నుండి తమకొక ప్రత్యేక వర్తమానం తేవలసి ఈ విధంగా రావల్సి వచ్చింది'.

'సరే, దానికీ అర్ధనగ్నపు వేషమెందుకోయ్?'

'ఏమి చేయాలి స్వామీ, ఈ వరద పుణ్యమా అని సవారీ లేదు, నావలు సరేసరి, కందాపురం నుంచి కిందకి మనుష్య సంచారమే లేదు. ఊరిలోకి ఏమని చెప్పి ప్రవేశం చేయాలి? అందుకే వరదలో కొట్టుకొచ్చాననీ... దానికే ఈ వేషం.'

'భలేవాడివే! ఐతే ఏంటా అత్యవసర విషయం?'

'మనవి చేస్తాను. రాజభ్రాత విగతశోకులు సువర్ణగిరిలో ఉన్నారు, మీకు తెలుసు'.

'ఊ, వచ్చి ఒక నెల పైగా అయ్యింది. ఐతే?'

‘అవును, వచ్చినప్పటినుండీ సేనాధ్యక్షులతో ఏవో మంతనాలు, చాలా గోప్యంగా జరిగాయి....’ అంటూ ఒక క్షణం చుట్టూ కలయజూసి మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు. ‘ఏదో పెద్ద దండు వెడలే సన్నాహాలు జరుగుతున్నాయి, కానీ ఎటు వెళ్ళేదీ తెలియడం లేదు.’

‘సరే అదీ తెలిసిందే’.

‘ఇది ఎంతవరకూ ఉపయోగకరమో తెలీదు. కానీ, నా దృష్టికి వచ్చిన వేగు. నాకు అప్రస్తుతం అనిపించలేదు, ఐతే మాత్రం నన్ను క్షమించండి.’

‘అసలు విషయం ఏమిటో చెప్పు’, అన్నాడు, అతని తాత్సారానికి చిరాకు పడ్తూ.

‘ముఖ్యంగా మంత్రికుమారులు ఉపగుప్తులు, అదే రథగుప్తామాత్యుల కుమారుడు, ఆయన ఆధ్వర్యంలోనే ఈ మంతనాలు సాగాయి. పోయిన ద్వాదశి నాటి రాత్రి మన సుగ్గవ్వ వాటికలో విన్న విషయం... సుగ్గి మీకు తెలుసు, సువర్ణగిరిలో ఇరువది పడుచులతో పెద్ద వాటిక నడుపుతుంది. ఉపగుప్తులు దాదాపు ప్రతిరాత్రి అక్కడి వారాంగనలతోనే గడిపారు. ఆరోజు, నా చెవులతో విన్న విషయం... ఆయన కరునాటి వేశ్యల అందం గురించి ప్రశంసిస్తుండగా, విగతశోకులు ఆంధ్రదేశపు పడుచుల గురించి ప్రస్తావించారు. బదులుగా, ఆయన, ‘దండుతో గాకుండా, మనం కాస్త ముందుగా ఆంధ్రం వెళితే బాగుంటుందేమో’ అన్నారు. వెంటనే బయలుదేరి మీకు విన్నవిద్దామని...’

విన్నంతనే, సోంభట్టు విసుగు పటాపంచలయింది.





# 9

రాజుకుడు, కన్నబయ్యకి, మహారాజు కంచిక వస్తారన్న విషయం ఆ రాత్రికే తెలిసింది.

అంతే... ఊర్లో ఎవ్వరికీ నిద్రలేదు.

ఉరుకులు పరుగులతో రాత్రికి రాత్రి గ్రామాన్ని సింగారించడంలో ఉద్యుక్తులయ్యారు. మొగలి చిలుకులూ, రంగవల్లుల్తో ప్రతి వీధీ సూర్యోదయానికి ముందే సర్వాంగ సుందరంగా సిద్ధమయింది.

ప్రయాణ బడలిక వల్లనేమో, అదేమీ తెలియకుండా... మాలతీ లతల మంటపంలో, తెల్లని తల్పంపై హాయిగా నిదురించిన నాగసేనుడు, ఉదయ భాస్కరుని వాడి పుంజాల వేడికి కళ్ళుతెరిచాడు. అలవాటుగా అతని కుడిచేయి తలగడ కిందనున్న పిడిబాకు పైననే ఉంచి, చుట్టూ కలయజూసాడు.

ఎప్పుడూ తన వెంటనే ఉండే అంగరక్షకుల్ని త్రోసిరాజని, ఒంటరిగా ఈ ధాన్యకటక సీమలో ప్రవేశించాడు. అంత సాహసం అవసరమా అని అతడు ఒక్క క్షణం కూడా ఆలోచించలేదు. ఏ క్షణమైతే మగధ నుంచి వార్త వచ్చిందో, అదే క్షణాన, తన ప్రియ భగినికి, మహారాణికి కూడా చెప్పకుండా అట్లే బయలుదేరాడు. పదిమందినైనా ఒంటిచేత్తో గెలవగల అతని పోరాట పటిమపై అతనికి నిస్సంశయమైన నమ్మకం.

అయినా, పిష్ఠపురం వద్ద అతని ముద్రిక చూపక తప్పలేదు. కళింగానికీ, ఆంధ్రానికి ఎల్లలు పవిత్ర గౌతమీనది. పాపికొండల నుంచి దక్షిణ ముఖియై ఎన్నో పాయలుగా విడిపోయి తీరదేశాన్ని సస్యశ్యామలం చేస్తుంది. అక్కడి సరిహద్దు కాపరులు అతికఠినులు. రాజముద్రిక మాత్రమే మార్గమయ్యింది. 'ఈ పాటికి తన ప్రయాణ వార్త, తన చెల్లెలికి చేరే ఉంటుంది', అని ఆలోచిస్తూ పరిచారికల సమేతంగా తనను సమీపిస్తున్న మల్లికను చూసాడు.

'ఏమి ప్రభూ, తమ రాకతో ఈ గ్రామానికి రాజ దర్శన యోగం పట్టింది?'

'ఆ... రాజుగారు ఇక్కడికా?'

'అవునట, తమ రాక విషయం వినగానే వారే స్వయంగా మిమ్మల్ని సకల సత్కారాలతో ఆహ్వానించి...' అని ఒక క్షణం ఆగి, 'అందుకే ఇక మాబోటి వాళ్ళతో పనియేమని, ఈ నాపసానుల్ని నియోగించారు. మహారాజు ఈ మధ్యాహ్నమే వస్తారట. అప్పటిదాకా తమరేమి శృంగారం చేసుకుంటారో...' అంటూ మూతి విరిచింది.

'అయ్యో, నా తలరాత ఇలాగైనదే? కల నిజమై కంటబడ్డ కన్నెపిల్ల సేవలతో జీవితాంతం ఆనందిద్దాం అనుకున్నానే. ఆమె ఏదో సామాన్య స్త్రీ అనుకున్నాను. ఇప్పుడు తెలిసింది, ఆమె

అపర భ్రమరాంబిక అని. ఇక ఆమె సేవాభాగ్యం కావాలంటే సమస్త శక్తిపీఠాలకూ ఆలవాలమైన ఆ ఆంధ్రదేశ విభుడినే అడగాలేమో? ఆపైన ఆ దేవి అనుగ్రహం ఎట్లుండునో?' అని చిరునవ్వు నవ్వాడు.



నాగసేనుడు క్షవరాదికాలు ముగించి, స్నానం చేసి, తనవైన ఉచ్ఛిష్ఠ వస్త్రాలు ధరించి, తనకి ఆతిథ్యం ఇచ్చిన గృహస్తునితో సద్యం భోజనానికి కూర్చున్నాడు.

'అదేమి ప్రభూ, పట్టు వస్త్రాలు తెప్పించానే, మీరు స్వీకరించలేదూ?'

'ఆర్యా, మీ ఇంట ఆతిథ్యమే మహాభాగ్యం. నా జీవితంలో ఎప్పుడూ దొరకని సంపద మీ దర్శనం వల్ల పొందాను'.

'నాతో పరాచకాలు ఎందుకులేండి స్వామీ. సామాన్యుణ్ణి. తమకు ఆ దుస్తులు యోగ్యంగా అనిపించి ఉండవు? క్షంతవ్యుణ్ణి'.

'అయ్యయ్యో, ఎంతమాట, తమరి ఆతిథ్యం అపూర్వం. అయితే... నాదొక చిన్న విన్నపం. అతిథినై ఉండి ఇలాంటి ప్రస్తావన చేయడం తప్పే. కాని తప్పనిసరి. మీరు మన్నిస్తానంటే...' అంటూ ఆగి ప్రధమ సాంగత్యంలోనే తన హృదయం చూరగొన్న మల్లిక వైపు నర్మగర్భంగా చూసాడు.

అతని చూపూ, ఆ మాటలలోని అంతరార్థం ఆమె తండ్రికి స్ఫురించలేదు. ఆ అతిథి సామాన్యుడు కాదు. రాచబిడ్డ! 'కాని ఎటువంటి డంబమూ కానరాదు. ఎంత మర్యాద? ఏమైనా కులీన సంప్రదాయాలే అటువంటివి', అనుకుంటూ...

'ఎంతమాట, తమ సేవకుడిని, సెలవివ్వండి', అన్నాడు.

'మీరలా అనకూడదు. భరతావనికే వన్నె తెచ్చే కన్యామణిని ఇంట దాచిన హిమవంతుని వంటి

### కథ-కాలనిర్ణయం

ప్రాచీన భారతీయ చరిత్రయొక్క కాలనిర్ణయం బుద్ధుని పరినిర్వాణం ఏ సంవత్సరంలో అయిందా అన్న విషయంపై చాలావరకూ ఆధారపడి ఉంది. ఐతే అదే చాలా వివాదస్పదం!

చైనాలోని కాంటన్ నగరంలో ఒక రికార్డు దొరికింది. దాన్ని 'కాన్టన్ డాటెడ్ రికార్డ్' అంటారు. బుద్ధుని పరినిర్వాణం నుండీ ప్రతి వర్ధంతి నాడూ, అందులో ఒక చుక్క చొప్పున పెడుతూ, 975 సంవత్సరాల తరవాత, క్రీ.శ. 489లో ఆపారట! అంటే... 489 లోంచి 975 తీసివేస్తే క్రీ.పూ. 486 అవుతుంది. ఇది ఎక్కువమంది చరిత్రకారులు ఆమోదించే తేదీ. కనుక బుద్ధుని పరినిర్వాణం క్రీ.పూ. 486లో జరిగింది అని అంగీకరిస్తే... మౌర్యుల చరిత్రలోని వివిధ సంఘటనల తేదీలు ఈ విధంగా ఉంటాయి.

| | |
|---|---|
| బుద్ధుని పరినిర్వాణ | : క్రీ.పూ. 486 |
| అశోకుని పట్టాభిషేకం (−218) | : క్రీ.పూ. 268 |
| బిందుసారుని మరణం (+4) | : క్రీ.పూ. 272 |
| బిందుసారుని పట్టాభిషేకం (+28) | : క్రీ.పూ. 299 |
| చంద్రగుప్తుని పట్టాభిషేకం (+24) | : క్రీ.పూ. 323 |

ఈ తేదీలను – అలెక్జాండర్ ఇండియా వచ్చిన సంవత్సరం, అశోకుని 13వ శిలాశాసనంలోని గ్రీకు రాజుల వివరాలు– మొదలైన గ్రీకు ఆధారాలు బలపరుస్తాయి.

ఇక కళింగ యుద్ధం...

13వ శిలాశాసనం అశోకుడు రాజ్యానికి వచ్చిన 8వ సంవత్సరంలో కళింగయుద్ధం జరిగిందని చెబుతుంది. అంటే... ఈ కథ క్రీ.పూ. 260 లో జరిగింది అని అనుకోవాలి.

వారు. మహాలక్ష్మీ సరస్వతుల అంశ మీ తనయది. తమ ఆతిథ్యంతోబాటూ, కన్యాదానం కూడా చేసి అనుగ్రహిస్తే... మీరిచ్చిన చీనాంబరాలు వరదక్షిణగా గ్రహించగలను. తమరు అభ్యంతరం పెట్టరని మా ఆశ', అంటుండగా, అవునన్నట్లుగా తలాడిస్తూ పక్కన వచ్చి నిలిచింది, మల్లిక.

అసామాన్యమైన కన్య. కళల పట్టి, చదువుల సరస్వతి; తన ఇంట ఎలా పుట్టిందో, ఈ పిల్లకు తగిన వరుడిని ఎలా తేగలనో అని ఎంతోకాలంగా అతనిని వేధిస్తున్న శంక, ఒక్కసారిగా, సూర్యుని ముందు పొగమంచులా విడిపోయింది. పార్వతీ పరమేశ్వరులలా, రతీ మన్మథుల్లా తన ఎదురుగా ఉన్న జంటను చూస్తూ ఆనంద భాష్పాలు రాల్చాడు.



సకల లక్ష్మీ లక్షణ లక్షితయైన తన కూతురూ, అసామాన్య వీరుడూ అపర మహావిష్ణువులా వెలుగుతున్న ఆమె వరుడూ వెంటరాగా, అతడు కన్యాదానాపేక్షతో పొంగిన సముద్రుడులాగా, రాజ దర్శనానికి, కృష్ణవేణి వైపు నడిచాడు. అచట సాటి గ్రామోద్యోగులూ, సన్నిహితులూ అతని ఆనందానికి కారణం, అతను చెప్పకుండానే గ్రహించారు.

రేవు నుండి రాజకుల గృహం వరకూ, దారికి ఇరువైపులా రాజభటులు నిలిచి ఉన్నారు. ఊరంతా ఆ ఆంధ్ర వల్లభుని దర్శనానికై రేవు వద్దనే! ఆబాలవృద్ధులూ తమతమ తాహత్తుకు తగిన దుస్తులలో, ఆభరణాలలో; తిష్య మాసపు తిరునాళ్ళను మరిపింపజేసారు.

గ్రామకుడు కాకోలునికి ఇదే మొదటి రాజదర్శనం. రాజకుడు కన్నబుదొర శ్రీకాకుళం వాడే. శాతవాహనుని చిన్నతనం నుండీ ఎరిగినవాడు. వారిద్దరూ, పత్నీ పుత్ర సమేతంగా ముందు వరుసలో నిలిచారు.

అంతలో, అవతలి గట్టున బల్లకట్లు కదిలాయి. నల్లరాతితో మలచినట్లున్న కండరాలపై, స్వేద బిందువులు, రాకాకాశంలోని నక్షత్రాల్లా మెరుస్తుండగా, ఆ దాసరి బోయీలు, 'ఓహోయ్ లెస్సా... హోయ్ లెస్స' అంటూ బల్ల తాళ్ళు లాగసాగారు. రంగు రంగుల పుష్ప తోరణాలతో అలంకరించిన రహదారి బల్లకట్టుపైన నిలిచి ఉన్న ఆంధ్రవిభుడు కనబడగానే, భేరీ, నాదస్వరాది మంగళవాయిద్యాలు స్వాగతగీతాలు అందుకున్నాయి. స్తోత్ర పాఠకుల వేదపఠనం వాటికి పోటీపడింది. దక్షిణ కోసలం నుండి వచ్చిన బౌద్ధ భిక్షువులు మాత్రం మౌనంగా దారికి ఇరువైపులా, మనస్సులలోనే త్రిరత్నాలు పఠిస్తూ నిలిచారు.

ముప్పై ఒక్క ఆంధ్ర గణాల ప్రతినిధులూ;పౌధన్యం, ప్రతిష్ఠానం, నరసల, బ్రహ్మగిరి, శ్రీగిరి, భ్రమరగిరి, ముషిక, స్కంధగిరి, పల్లవభుక్తం మొదలైన నగరాల మహాభోజుల కుమారులు కూడిరాగా, శ్రీ శాతవాహనుడు, తారామండలంలో చంద్రుడిలా ప్రకాశించాడు.

సంప్రదాయం ప్రకారం, మొట్టమొదటగా ఐదుగురు గొల్లస్వాములు ఆయనకు ఎదురేగారు. వారి చేతులమీదుగా, ఒక చిన్న పిల్లనగ్రోవీ, డప్పు, సింధూర పాత్ర, సన్నికల్లు, తెంగాయా గల మేదర బుట్టల కావడిని స్వీకరించి, వారి పెరియ దొర ఇచ్చిన జొన్న జావను కండ్లకద్దుకొని

సేవించాడు. దేశీయ భాషలో వారితో కాసేపు ముచ్చటించిన తరువాతనే, ఆ 'సిరిసద వాణ్ణు' మిగిలిన వారివంక కన్నెత్తి చూసాడు. మొదట వేద పాఠకుల ఆశీర్వచనాలు గ్రహించి, దక్షిణలిచ్చి, పిమ్మట బౌద్ధ భిక్షువులను వారి భాషలో పరామర్శించి, రాజకుని ద్వారా వారి యోగక్షేమాలు విచారించాడు.

అంతట, హటాత్తుగా, పుత్రికా, జామాతా సహితుడైన ఆ చిరుద్యోగిని చూసి, 'ఏమయ్యా మల్లప్పా, మా దర్శనం కోసం వచ్చిన రాజబంధువులు నీ ఇంట బసచేసారట! ఏమా విశేషం, తప్పక చూడాలనే మీ కంచికకు వచ్చాను. మాకూ ఆ ఆతిథ్యం ఏదో ఇస్తే, కృతార్థులం', అంటూ చిరునవ్వు నవ్వాడు.

దానితో నోటమాటరాక నిలిచిన అతనిని చూసి, 'ఏమప్పా, మాట్లాడవే?' అని మరలా అడిగిన మహారాజుని చూసి, మల్లిక, 'ఎంతమాట ప్రభూ, సకల ఆంధ్ర సామ్రాజ్య రమావల్లభులే స్వయంగా పలుకరిస్తే, మావంటి వారికి నోట మాటెలా వస్తుంది? దైవ సమానులైన తమ అనుగ్రహం వలన కలిగిన మహదానందములో, మా తండ్రిగారు ఇంకేమి చెప్పగలరు! అయినా, పూర్వాపర సాగర మధ్యమైన ఈ దక్షిణాపథంలో ఉన్న ప్రతి గృహమూ తమదే కదా', అని ఆ మహారాజు పాదాలవద్ద మోకరిల్లింది.

వెంటనే, నవరత్న ఖచిత భూషణాన్వితం అయిన తన దక్షిణ హస్తాన్ని ఆమె శిరస్సుపై ఉంచి, 'ఇప్పుడు విశదం అయ్యింది! ఈ కంచిక చుట్టుపట్లగల వజ్రపు గనుల నుంచి ప్రతి జాతి వజ్రమూ మా కోశాగారానికి చేరాలనిగదా నియమం? ఇక్కడి కరకటకాధికారివై ఉండి, అన్నిటికన్నా మిన్నయైన ఈ కన్యారత్నాన్ని నీ ఇంట దాచావా?' అంటూ రాజకుని వైపు తిరిగి, 'ఇది తప్పక శిక్షార్హమైన నేరం! పైగా, అదేమో తన స్వంతమైనట్లు, ఎవరో వడ్డె వానికి దానం ఇస్తాడట. మా ఆంధ్రదేశానికే వన్నె తెచ్చే ఈ కన్నెపిల్లని' అంటూ ఆమె పుణికి పుచ్చుకొని పైకెత్తి, 'ఏమ్మా నిజమేనా?' అని అడిగాడు.

అప్పటికి నిశ్చేష్టత వీడి, ఆయన అనుగ్రహ పాత్రుడను అయినానని గ్రహించి, మ్రొక్కి, 'ధన్యుడిని ప్రభూ, తమరు అనుగ్రహిస్తే ఈ క్షణమే ఇంటికిపోయి, తమ రాకకి అన్నీ సిద్ధం చేస్తాను', అన్నాడు ఆమె తండ్రి.

'సరేనయ్యా', అని గంభీరంగా నవ్వి, 'నీకు ఇవ్వవలసిన శిక్ష గురించి, నీ ఆతిథ్యం స్వీకరించిన తరువాతే నిర్ణయిస్తాను. అంతవరకూ నీ పుత్రిక నాతోనే ఉంటుంది', అని ఆమె వంక తిరిగి, 'ఏమమ్మా చెప్పవేం, ఈ ఆంధ్ర దేశంలో నీకు తగినవాడే దొరకలేదా, ఈ తూరుపు వాడిని వరించావు?'

ఆ ప్రశ్నకు ముఖం దించి చిరునవ్వును దాచే వ్యర్థ ప్రయత్నం చేస్తున్న మల్లికను భుజం పట్టి, నాగసేనుని వంక చూస్తూ, 'ఏమయ్యా పెద్ద దొంగలా ఉన్నవే! రహస్యంగా మా సీమలోకి వచ్చావు. మా పిల్ల హృదయాన్నే దోచావు. ఆ...! నీ విషయం ఏదో తప్పక చూడవలసిందే! పద', అంటూ తన కుడిచేతిని అతని భుజంపై వేసి, విడిదివైపు దారితీసాడు.



చేరదేశం నుండి వచ్చిన నల్ల మిరియాలతో వండిన పెసరపప్పు పొంగలి, ఆవు నేతిలో వేపిన పదునారు శాకాలు, నల్ల దుంప, వడపప్పు, మధ్య కళింగపు తెల్ల బెల్లపు పానకాలతో కమ్మని విందు ఆరగించి, సుగంధ చూర్ణాలతో కట్టిన తాంబూలం బుగ్గన బిగించి, మహారాజుకు కాస్త దూరంగా, అశ్మకం, పులిందం మొదలైన ఆంధ్ర జాతుల రాజకుమారులతో ముచ్చటిస్తూ, పందిరి కింద కూర్చొని ఉన్నాడు, నాగసేనుడు.

ఆంధ్ర జాతులు ముప్పై ఆరు. వాటిలో కృష్ణానదీ– సాగర ప్రాంతంలోని, కాకుళం, శ్రీధాన్యం, కుదురెవటం, ధనధప్రోలు, పిత్రుధం అనే ఐదు నగరాలు మాత్రమే శాతవాహనులకు సాంప్రదాయకంగా సంక్రమించిన రాజ్యం. ఇక మిగిలిన ముప్పది ఒక్క నగరాలపై వారి అధికారం నిరంకుశం కాదు. అన్ని రాజ్యాల గణాధ్యక్షులూ అధికారంలో భాగస్వాములే. ఐతే, వారిని అందరినీ ఒక్క తాటిపై నడిపించడమే మొదటి నుండీ వారి ఉద్దేశ్యం. ప్రతి గణరాజ్యాధ్యక్షుని జ్యేష్ఠ కుమారుడూ, సంప్రదాయబద్ధుడై, శాతవాహనునకు దత్తుగా శ్రీకాకుళంలోనే ఉండాలి. అది నియమం.

బుద్ధదేవుని కాలంలో, వైదేహిపుత్ర అజాతశత్రువు కళింగాన్ని జయించి, గోదావరి నుండి మహానది వరకూ గల సమస్త కళింగ తీర ప్రాంతాన్నీ మగధలో విలీనం చేసాడు. మహానందుల అనంతరం కళింగం స్వతంత్రమైనా, మగధనుండి ఆపద ఎప్పుడూ ఉన్నదే. యవనుల వత్తిడితో చంద్రగుప్త మౌర్యుడి దృష్టి పశ్చిమ దేశంపై లగ్నమవడం వల్ల ఇంతకాలమూ ఎటువంటి విపత్తూ లేదు.

'ఇప్పుడు ఈ చండాశోకుడి కళ్ళు కళింగ తీరం మీద పడనేపడ్డవి. అతని సేనాబలం ముందు నిలవాలంటే కళింగానికి ఆంధ్రుల ప్రాపకం తప్ప వేరే శరణ్యం లేదు'.

'కానీ, శాతవాహనులకూ, మౌర్యులకూ మధ్య మైత్రి చిరకాలం నుండీ ఉన్నదే?'

మౌర్యుల సేనాబలం, ఆ చాణక్యామాత్యుని బుద్ధిబలమే, చిన్నాభిన్నంగా ఉన్న ఆంధ్ర జనజాతుల్నీ సంఘటిత పర్చడానికి దోహదం చేసాయి. దక్షిణాపథంలో మౌర్య స్కంధావారాలు పదహారు. అన్నీ గిరి దుర్గాలే. వాటిలో పన్నెండు పశ్చిమాంధ్రంలో ఉన్నాయి. మిగిలినవి తూర్పు తీరంలో. వారి వినియోగానికి కావలసిన సమస్త ఆహార, వస్తు, ఆయుధ సామగ్రి, అంతా ఆంధ్రులదే బాధ్యత.

'ఈ అసంఖ్యాక సేనాబలం కనుక మగధకు ఎదురునిలిస్తే...' అని ఆలోచనలో పడ్డ నాగసేనుని, భుజం తట్టి మహారాజు వద్దకు తోడ్కొని పోయాడు, కొడబలి దొర.



'సరే నాగసేన కుమారా, మీ వివాహం ఆర్ష సంప్రదాయం ప్రకారం మా నగరంలోనే జరుగుతుంది. మాఘం వస్తే, మీ బంధుజనులు కూడా కళింగం నుంచి వచ్చేందుకు వీలుంటుంది. మేము కూడా మీ సోదరి చారువాకీదేవిని చూడవచ్చు'.

'ప్రభూ, తమ అనుజ్ఞ ఐతే, ఆ విషయమే ప్రస్తావించడానికి వచ్చాను. ఎవ్వరితోనూ సంప్రదించకుండా స్వతంత్రించి నేనీ సాహసం చేయడానికి ఒక ఉద్దేశ్యం ఉంది. కళింగాంధ్రాలను ఏకం చేయాలని నా ఆకాంక్ష... మన రెండు రాజ్యాలూ వేరైనా మన భాష ఒక్కటే. మనం ఒక

తాటిపై నడిస్తే ఎవ్వరూ మనని తేరిపార చూడడానికి కూడా సాహసించలేరు. పైగా, మగధ కన్నులు మామీద పడనే పడ్డాయి. ఈ సమయంలో మన మధ్య బంధుత్వం కలిస్తే...' అని గుక్కతిప్పుకోకుండా తను వచ్చిన పని వివరిస్తూ, నర్మగర్భంగా నవ్వుతున్న శాతవాహనుని చూసి, ఒక క్షణం తటపటాయించి, 'స్వామీ, ఇక మా చెల్లెలు విషయంలో మీరు సంకోచించవలసిన అవసరం లేదు. ఆమె తప్పక మీకు తగిన...'

'ఆపవయ్యా అక్కడే. నీ ఉద్దేశ్యం రాజకీయపరంగా యుక్తమే. కానీ, కళింగ మహారాణి, ఇప్పుడే వివాహానికి యుక్త వయస్సు వచ్చిన చిన్న పిల్ల. ఈ వయస్సులో నాకు కూతురుతో సమానం. ఐతే, ఆమె నా కుమారుడు శ్రీముఖునికి పత్ని అయితే బాగుంటుందేమో?'

'తన సోదరి ఆంధ్ర సామ్రాజ్య పట్టమహిషి అయితే, శ్రీశాతవాహనుని అనంతరం ఆమె ఆంధ్ర కళింగాలకు ఉత్తరాధికారి కాగలదు. కానీ, ఆమె శ్రీముఖుని భార్య అయితే, గృహపతి అగుటచేత ఈ ఆంధ్ర ప్రభువుకు రెండు రాజ్యాలపై అధికారం ప్రాప్తిస్తుంది.' అది అతని ఉద్దేశ్యం కాదు. కానీ ఆయన ప్రస్తావన ఉచితమైనదీ, ప్రశ్నించజాలనిదీ. ఏ దిక్కూ తోచక ఊరకున్నాడు, నాగసేనుడు.

అది గ్రహించిన శాతవాహనుడు, 'మీరీ విషయంలో ఆలోచనకి కాస్త సమయం కావాలంటే, తీసుకోండి. మీ అనుజతో చర్చించాలంటే, మా కొడబలిదొర, మీ కొరకై ఒక వార్తాహరుడిని నియోగించ గలడు. ఇక ఈ వరద తగ్గుముఖం పట్టగానే, మేము రాజధానికి బయలుదేరుతాము. మీకు ఇష్టమైతే మాతో రావచ్చు. అప్పటివరకూ, ధాన్యకటకంలో మీకై ప్రత్యేకంగా విడిది సిద్ధంగా ఉంది. మల్లప్ప దొర కూడా కుటుంబ సమేతంగా కటకంలో ఉంటారు. ఏమంటారు?'

'తమ ఆజ్ఞ'






*పితృసమానులైన శ్రీశ్రీశ్రీ మహారాజశ్రీ శాతపుత్ర శాతవాహనాంధ్ర మహాభోజులకు, మగధ రాజు ప్రియదర్శి అభివందనాలు.*

ప్రాకృతంలో ఉన్న లేఖను చదువనారంభించాడు, శాతవాహనుడు. అనేక రాజముద్రికలతో భద్రమైన పేటిక అంచల ద్వారా కోసలం నుంచి వచ్చింది, అందులో సరిగంచు చీనాంబరంపై, చక్రవర్తి స్వహస్తాలతో రాసిన లేఖ. 'ఎంతటి దుర్మార్గుడైనా ఈ చండాశోకుని వినయం ప్రశంశనీయం!' అంటూ మిగిలిన లేఖను చదువసాగాడు.

*మా తండ్రి శ్రీ బిందుసార అమిత్రఘాతుల సన్నిహితులవటం వలన తమకు కొన్ని విషయాలు విశదీకరింపవలసి ఉన్నది. మా పితామహులు శ్రీ చంద్రగుప్తుల కాలం నుండీ మీ ఆంధ్ర రాజ్యాలు మగధ సామ్రాజ్యానికి భాగస్వాములై, సకల జంబూద్వీపాన్నీ ఆర్య సంస్కృతీబద్ధులను చేసారు. అయినా, యవన ప్రాలోభ్యానికి లోనై, కొన్ని ప్రాంతాలలో తిరుగుబాట్లు పొడ చూపుతున్నాయి. ముసిరిలో కేరళపుత్రుల తంత్రాన్ని మీ ఆధ్వర్యంలో మగధ సేనలు మట్టు చేసాయి. ఇప్పుడు, యవనుల దృష్టి తూర్పు తీరంపైన పడింది. యవ, మలయ ద్వీపాలతో వాణిజ్యంపై ఆధిపత్యమే వారి ఉద్దేశ్యం. కళింగం రాజరహితం. అక్కడ వారి కుతంత్రాలు ప్రబలుతున్నవి. ఇక ఉపేక్షించ తగదని మా నిశ్చయం.*

*ఆంధ్రదేశంలో ఉన్న పదహారు దళాలలో ఏడింటిని తమ కుమారుడు శ్రీముఖుని ఆధ్వర్యంలో గౌతమీ తీరానికి తరలించాలని మా ఆలోచన. మీ రాజధానిలో ఉన్న అందరు మహాభోజుల కుమారులనూ వారికి తోడుగా పంపగలరు. మా సహోదరులు, మాకు అత్యంత ప్రీతిపాత్రులైన తిష్య వీతశోకులు, ఇప్పుడు ఆంధ్రదేశంలోనే ఉన్నారు. యుద్ధ సమయంలో వారికి మీ ఆతిథ్యం ఇవ్వగలరు.*

*వర్ష ఋతువు గడచిన వెంటనే స్కంధావారాల నుండి దండ్లు వెడలగలవు. తమ అభిమతం వార్తాహరుని ద్వారా వెంటనే తెలియచేయగలరు.*

*ఇట్లు,*
*తమ ఆదరపాత్రుడు*
***అశోకుడు.***

'ఆహా ఏమి ఆలోచన! రాజతంత్రంలో తన తాతనే మరిపిస్తున్నాడే' అంటూ కొడుకు వైపు చూసాడు.

'ఏడు దళాలకు అధ్యక్షుడిగానా, లేక ఆ అశోకునికి అడుమానంగానా, నేను పోవలసింది?' అంటూ దిగ్గున లేచి, తనలో తానేదో ఆలోచిస్తూ రాజహార్మ్యం యొక్క గవాక్షం వద్దకు నడిచాడు, సిముకుడు, వరద బాగా తగ్గుముఖం పట్టింది. దూరంగా మహాలంకపై దృష్టి సారించాడు.

'ముప్పైరెండు ఆంధ్ర రాజకుమారులకు ప్రతిగా అతని 'సహోదరుడట', సుసీముడు అతని తమ్ములు నలుగురూ కూడా అతనికి 'సహోదరులే' కదా! వారినందరినీ తెగటార్చిన వానికి ఈ ఒక్కడు లెక్కా? భ్రాతృహంత!' అంటూ వెనుదిరిగాడు. చెరగని చిరునవ్వుతో అతని వంకే చూస్తున్న తండ్రిని చూసి కొంచెం శాంతించి, 'మరి మీ ఉద్దేశ్యం ఏమిటో?' అని ప్రశ్నించాడు.

సువిశాలమైన ఆ అంతస్సౌధంలో వారిద్దరే ఉన్నారు. మహారాజు మెల్లిగా లేచి, తనయుని భుజంపై చెయ్యివేసి, 'పద, శరన్మాసానికి మరి ఎంతో వ్యవధి లేదు. మగధ చక్రవర్తి నిర్ణయించిన పిమ్మట మన ఆంధ్ర భృత్యులకు వేరే మార్గం లేదు', అంటూ పక్కనే ఉన్న కంచుగంటను మ్రోగించాడు. మరుక్షణమే ప్రత్యక్షమైన అనుచరునితో, 'వెంటనే నాగసేన కుమారుని మేము పిలిచామని తోడ్కొనిరా. అటులనే కొడబలి దొరను ప్రవేశపెట్టు', కొడుకు వంక చూసి, 'స్థిమితపడు. ఇదీ ఒక విధంగా మంచిదే. తిష్యస్వామి మహాలంకలోనే ఉన్నారు. మహాచైత్యానికి వెళ్ళే సమయమైంది', అని వెలుపలికి దారితీసాడు.



శ్రీకాకుళానికి తూర్పున కృష్ణవేణి అనేక పాయలతో ఒక యోజన దూరం విస్తరించి ప్రవహిస్తుంది. ఆ పాయల మధ్య లంకలు. వాటిలో రెండు లోతైన పాయల మధ్య పెద్దలంక. దాని నడిబొడ్డున పగడంలా మెరిసే మహాచైత్యం. దాని చుట్టూ సంఘారామాలు.

ఇసుక తిన్నెలను కలుపుతూ పెద్దలంక నుండి రాజధానికి వెదురు బొంగులతో నిర్మించిన వంతెన, నీటి ప్రవాహంపై అటూయిటూ ఊగుతూ, అర్ధకోసు పొడవైన దారి. వరద సమయంలో దాటాలంటే అసంభవమే. వంతెనకి ఇరుపక్కలా నావలలో గజ ఈతగాళ్ళు, ఏ ఉపద్రవం వచ్చినా కాసేందుకు సిద్ధంగా ఉంటారు. ఆ వంతెనపై, ఎంతటి రాజైనా కాలినడకన వెళ్ళవలసిందే. బుద్ధదేవుని పాదాలు మోపిన ప్రదేశం అది, అతి పవిత్రమైన క్షేత్రం.

అక్కడి బౌద్ధులను మహాసాంఘికులు అంటారు. వారిది ఒక ప్రత్యేకమైన నమ్మకం. తథాగతుణ్ణి ఒక అర్హతునిగా కాక, దైవంగా భావిస్తారు. అంతటి దేవుని ఒక మనుష్యరూపంగా చూడటం, వారి దృష్టిలో ఒక హీనమైన భావన. ఆయన మనిషిగా అవతరించిన బోధిసత్వుడు. బుద్ధావతారం అన్ని బోధిసత్వుల రూపాలలో మిన్నయైనది. ప్రతి బోధిసత్వుని కథా, మానవునికి మంచిచెడ్డలు తెలపటానికి ఆ దైవం ప్రత్యక్షంగా అవతరించి చేసిన ప్రబోధం. ఆ ఉదాహరణలు ఆచరించడమే మానవ 'దమ్మం'. ఆ ధర్మాన్ని సామాన్య ప్రజలకు తెలియజేయడమే మహాసాంఘిక భిక్షువుల విధి.

**శ్రీకాకుళం**

ప్రస్తుత జిల్లా కేంద్రమైన శ్రీకాకుళం కాదు. కృష్ణా జిల్లాలో విజయవాడకి ఆగ్నేయంగా నది ఒడ్డున చిన్న గ్రామం. ఈ ఊరికి భట్టిప్రోలు ఎంతోదూరం లేదు. నది దాటాలి అంతే! ఒకప్పటి ఆంధ్ర రాజధాని ఈ గ్రామానికి దక్షిణంగా కృష్ణానది నడిబొడ్డున ఉండేదని ఆ ఊరివాళ్ళు చెప్పుకుంటారు. బౌద్ధ గ్రంథాలలోని మజెరికా నగరం మధ్య లంక లేక మహాలంక అనే పేర్లకి రూపాంతరం అయివుండవచ్చు అని చరిత్రకారుల అభిప్రాయం.

క్రీ.పూ. ఆంధ్రవిష్ణువు అనే ఒక మహావీరుడు ఈ ప్రాంతాలలో రాజ్యం చేసాడట. ఇప్పటికీ ఇక్కడ అతడి గుడి ఉంది. దేశంలోనే అతి పురాతనమైన ఆలాయాలలో ఒకటి. అతడు జైనుడట. భార్య ప్రోద్బలం వల్ల బౌద్ధం స్వీకరించాడుట. అందుకే, ఈ ప్రాంత వాసులని అంధకులు (గుడ్డివాళ్ళు) అవమని శపించినట్లు జైన వాఙ్మయం చెబుతుంది. బౌద్ధ గ్రంథం మహావంశం ప్రకారం, అంధకుల బౌధసంఘాలు దేశమంతా వ్యాపించి ఉండేవట. మగధ, వైశాలి మొదలైన జానపదాలలో కూడా వాళ్ళు చైత్య విహారాలు స్థాపించారు.

అంధకులు అనే మాట ఆంధ్రులు అనే పదానికి ప్రతిరూపమే. భట్టిప్రోలులోని బౌద్ధ శిధిలాలూ, అతి పురాతనమైన బ్రాహ్మి లిపి శాసనాలూ, ఈ ప్రాంతంలో ప్రాచీన ఆంధ్రనగరం ఉండేదనే వాదాన్ని బలపరుస్తాయి.

ఒక్క మహాలంకలోనే నాలుగువేల భిక్షువులు నివసిస్తారు. వారికి పెద్ద, శ్రీ జనకసుత సోమయ భంత. వారు దైవస్వరూపులూ, అపర బోధిసత్వులూ, కాంచీపురం నుండి, ధవళి వరకూ గల తీర దేశంలో, వెరసి పదునాల్గు ఆరామాలు వారి ఆధీనంలో ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి మూడు. పినాకినీనది ఒడ్డున ఉదయారామం, గౌతమీ తీరాన దక్షిణారామం, మరి కృష్ణవేణి నడిబొడ్డున గల ఈ మహాసంఘారామం. ఇవి అన్నీ ఆంధ్ర సీమలోనివే. ఇక కళింగంలో, కపోతగిరీ, ధవళగిరీ ముఖ్యమైనవి.

తిష్యస్వామి శిష్య సమేతంగా మహాచైత్యానికి ఆనుకొని ఉన్న వర్షాకాలపు వసతిలో విడిది చేసారు. అది పచ్చని తెంగాయ తోపు మధ్య నిర్మింపబడిన వంద గదుల ఆరామము.

మహాచైత్యంలో బుద్ధదేవుని పాద చిహ్నాలకు ప్రాతః కాల ప్రార్థనలు అర్పించి, సంప్రదాయానుసారం భిక్షాటనకు వెడలే సమయం. శాతవాహనుడు తన పరివారంతో ఆరామం వెలుపల, కావళ్ళకొద్దీ ధాన్యం సస్యశాకాలతో వేచి ఉన్నాడు. వారు బయటకు వచ్చిన వెంటనే మొదటి వాయనంగా వర్షర్తువుకు సరిపడా అన్ని సామగ్రులూ సమర్పించడం వారి ఆనవాయితీ. కానీ...

ఎందుకో జాప్యం?

ఒక యామం గడిచింది. ఇంకా ఆ మహాశ్రమణుని దర్శనం లేదు. ఏమైందో చూద్దామంటే, ప్రాతఃకాలపు ప్రార్థనా సమయంలో భిక్షువులకు తప్ప ఇతరులకు విహారంలోకి ప్రవేశం లేదు. వేచిచూడడం తప్ప వేరే గత్యంతరం లేదు.

మధ్యాహ్నసమయం. సూర్యుడు నడినెత్తికి వచ్చాడు. ఎండ తీవ్రంగా ఉంది. ఉదయం మగధనుండి వచ్చిన వర్తమానంతో మొదలైన శ్రీముఖుని చిరాకు ఆ ఉక్కపోతతో తారస్థాయిని చేరుకుంది. తండ్రివైపు విసుగ్గా చూసి, 'ఏమైందీ బోడి బిక్కులకి? ఇంకెంతసేపు నిరీక్షించాలి? మీరు ఉండాలంటే ఉండండి, నావల్లకాదు. నియమ భంగమైతే అయ్యింది. నేను వెళ్ళి చూస్తాను', అంటూ సర్రున లేసి అక్కడనుండి కదలడానికి ఉద్యుక్తుడయ్యాడు.

శాతవాహనుడు చెరగని చిరునవ్వుతో అతనిని చూస్తూ, 'కొన్ని సమయాల్లో ఓర్పు అవసరం.

ఏదో కారణం లేనిదే మనని ఇంతసేపు నిరీక్షింపజేయరు. సరే, అయినా నీ ఇష్టం. ఎందుకైనా మంచిది అంగరక్షకుల్ని వెంట తీసుకెళ్ళు, అప్రమత్తంగా ఉండటంలో తప్పులేదు', అన్నాడు.

ఇంతలో తమవైపే పరుగున వస్తున్న ఒక భిక్షువు...

'స్వామివారు తమని తోడ్కొని రమ్మన్నారు. తమరూ, మరి రాజకుమారులు చిముకులూ, కళింగ రాకుమారులూ మాత్రమే. పరివారాన్ని ఇక్కడే వదిలి రావలసింది అని వారి విన్నపం.'

'మరి వారి భిక్ష?'

'దానిని ఇక్కడే ఉండనివ్వండి. ఉదయపు ఆరాధన పూర్తయి ఎలాగూ చాలా జాగయ్యింది. తరువాత స్వీకరిస్తారేమో'

'సరే పదండి' బయలుదేరిన పిదప, 'అదేమి? ధ్యానానంతరం భిక్షాటనం కదా నియమం?' అని అడిగాడు శాతవాహనుడు.

'రాత్రి కరునాటి అథోలోక మహా చైత్యారామం నుండి స్వామివారు విచ్చేసారు. వేకువ జామునుండీ ఏవో ముఖ్యమైన చర్చలలో నిమగ్నులై ఉన్నారు. ప్రార్థన తరువాత సోమయాచార్యులు కూడా వారితో చేరారు. ఏదో అత్యవసర విషయమై ఉండవచ్చు' అని తలవంచి లెంపలు వేసుకుంటూ, 'ఇతర విషయాలలో తలదూర్చరాదు' అన్న వినయ పిటకంలోని శ్రమణ ధర్మాన్ని వల్లెవేస్తూ ఆరామం వైపు దారితీసాడు.



విహారానికి దూరంగా విశాలమైన చదును భూమి. అందులో వెయ్యికి పైగా భిక్షువులు వరుసలలో నిలిచి కర్రసాములో నిమగ్నులై ఉన్నారు. ముఖ్యంగా దూర ప్రయాణాలలో– అడవి మృగాలూ, దారిదోపిడిగాండ్లు, కిరాతులూ– అపాయాలు ఎప్పుడైనా రావచ్చు. చేతికర్రే వారి ఆయుధం. ప్రతి ఆరామంలో, ఈ విధంగా శిక్షణ పొందిన భిక్షువులు ఎప్పుడూ సిద్ధంగా ఉంటారు. శ్రమణ దీక్షాబద్ధులైన వారికి ఆయుధం పట్టడం నిషిద్ధం. ఐతే, ఆత్మరక్షణార్థం ఎల్లప్పుడూ సంసిద్ధులై ఉండక తప్పదు.

వారిని చూస్తూ, విహారంలో ప్రవేశించారు.

తిష్యస్వామి ఎదురోచ్చి, 'తమరు క్షమించాలి ప్రభూ, తుంబ కాలం నిరీక్షింపజేస్తిమి'.

'అయ్యయ్యో, అదేమి మాట? ఎంతో తప్పనిసరి కాకుంటే తప్ప...', అంటూ శిరస్సొంచాడు.

'నిజమే, కానీ మీకు కాస్త ముందుగా వర్తమానం చేద్దామంటే సాధ్యం కాలేదు'

'ఆ ప్రస్తావనే అవసరంలేదు స్వామీ. తమరెందుకు పిలిపించారో ఆజ్ఞాపిస్తే'

'తమను ఆజ్ఞాపించటమా! మేము భిక్షువులం ప్రభూ. బౌద్ధధర్మాన్ని రక్షించే మా ఈ యత్నంలో తమ సహాయాన్ని యాచించడమే మా ఉద్దేశ్యం. కనకగిరి వాసులు, అథోలోక సంఘారామపు శ్రీ యక్షథేరులు కూడా రాత్రే దయచేసారు. పదండి', అంటూ లోనికి దారితీసాడు.

అది విశాలమైన ప్రాంగణం. దానిలో ఒక మూల దర్భాసనాలపై ఇద్దరు మహాశ్రమణాచార్యులు కూర్చొని ఉన్నారు. వారి ఎదురుగా రాజోచితమైన ఆసనాలు మూడు. ముందుగా సోమయాచార్యునికి,

పిమ్మట యక్షథేరులకీ ప్రణామాలు ఆచరించి, రాజపురుషులు ముగ్గురూ వాటిలో ఆసీనులయ్యారు. కనుచూపు మేరలో వారు ఆరుగురూ తప్ప వేరెవ్వరూ లేరు.

'ఏం శ్రీముఖ కుమారా, వర్షాకాలపు నీరెండ కూడా మీకు ఓర్వశక్యంగా లేదా?' అంటూ తనవైపు నవ్వుతూ పలకరించిన సోమయాచార్యుని చూసి కళ్ళు తేలవేసాడు చిముకుడు.

'ఎంతైనా యవరక్తం. ఆ మాత్రం వేడి ఉండవలసిందే. అందునా సమస్త దక్షిణాపథ సేనానాయకుడు కదా!' అంటూ ఆయనకి వత్తాసు పలికాడు కరునాటి యక్షథేరుడు.

'ఇంతలో, అతి గోప్యమైన ఆ విషయం వీరికి ఎలా తెలిసిందా!' అని ఆశ్చర్యపోతున్న శ్రీముఖునీ, చిరునవ్వు చెరుగని శాతవాహనునీ, వారి మాటల అర్థం గోచరించక ప్రశ్నార్థకంగా చూసాడు, నాగసేనుడు.

'అవునయ్యా, నీ పక్కనున్నది ఎవరనుకున్నావు? స్వయంగా ఏడు స్కంధావారాల సేనతో నీ కళింగంపై దండెత్తనున్న మౌర్య సైన్యాధ్యక్షుడు', అని నవ్వుతున్న సోమయాచార్యుని చూసి ఒక్క క్షణం అచేతనుడై ఉండిపోయాడు.

తను ఎటువంటి క్లిష్టపరిస్థితిలో ఉన్నాడో అతనికి మెల్లగా గోచరమైంది. పారిపోవటానికి ప్రయత్నించడం నిష్ప్రయోజనం. ఎటూ తోచలేదు. బౌద్ధారామంలో ఉన్న అతని చేతిలో కరవాలం కూడా లేదు. బేలగా తనను ఆదరించిన శాతవాహనుని వంక చూసాడు. రాజు ముఖంలో ఎటువంటి స్పష్టతా కానరాలేదు.

'స్థిమితపడు నాగసేనా, అంతటి అవాంతరమేమీ లేదు', అని సోమయాచార్యుడు అభయ ముద్రతో అతని వైపు ప్రసన్నంగా చూస్తూ, 'కందపురం నుండి దండు వెడలటానికి ఇంకా రెండు మాసాలు పడ్తుంది. యుద్ధమేమీ ముంచుకు రాదులే. అంతవరకూ మా ఆరామంలో మీ రక్షణకేమీ ఇబ్బంది ఉండదు', అన్నాడు.

'కానీ, ఈ పరిస్థితిలో నేను కళింగంలో ఉండుట ఆవశ్యకం. యుద్ధం రానీ రాకపోనీ, నేను నా చెల్లెలి పక్కన ఉండటం ముఖ్యం కదా?'

'నిజమే, కానీ మిమ్మల్ని వెళ్ళనిస్తే శాతపుత్రులు ఆ చండాశోకుని ఆగ్రహానికి గురికాక తప్పదు. వారి అతిథిగా ఉంటే మిమ్మల్ని మగధాధీశునకు అప్పగించవలసిందే. అదే తమరు బౌద్ధసంఘపు రక్షణలో ఉంటే, మిమ్మల్ని ఎవ్వరూ తాకలేరు. ఐతే...' అంటూ అర్థవంతంగా అతని కళ్ళలోకి లోతుగా చూస్తూ ఆగిపోయాడు, ఆచార్యుడు.

'అంటే... నేను భిక్షు దీక్ష తీసుకోవాలనా, మీ ఉద్దేశ్యం? అసంభవం', అని దిగ్గున లేచి, వీరధర్మానుసారం, చేత కత్తిపట్టి నా చెల్లెలి వెంటనుండ వలసిన సమయంలో, నా క్షేమం కోసం పిరికితనంతో తల గొరిగించుకొని ఇక్కడ తలదాచుకోవాలా? ఏది దారి?' అనుకుంటూ పిడికిలి బిగించి, 'ఇప్పుడే వెళతాను. నా కరవాలం లేకుంటేనేమి. నా పిడికిలే ఆయుధం. ఎవరు ఆపగలరో ఆపండి', అంటూ వెలుపలికి దారితీయబోయాడు.

అంతలో... ఎక్కడినుండి ప్రత్యక్షమయ్యారో, వందకు పైగా సుశిక్షితులైన యోధులు, సంఘరక్షణ

దీక్షాబద్ధులైన బౌద్ధభిక్షువులు, ఎటు వెళ్ళటానికి దారినివ్వకుండా అతనిని చుట్టుముట్టారు. ఆ క్షణాన నిరాశ ముంచెత్తగా, దిక్కుతోచక అలాగే కూలబడిపోయాడు, నాగసేనుడు.

అతని పరిస్థితికి జాలి పడనివారు లేరు. శాతవాహనుడు లేచి, ఆ యువకుని జబ్బపట్టి లేపి, ఎగదన్నుతున్న దుఃఖాన్ని మింగడానికి వ్యర్థప్రయత్నం చేస్తున్న ఆతని భుజం చుట్టి, వాత్సల్యపూరితంగా, 'కుమారా, శాంతించు, నీ స్థితి నాకు అవగతమే. ఏమి చేసినా ఆలోచించి చేయాలి. వృధాగా ఎటువంటి సాహసమూ చేయటానికి సమయం కాదు', అని దగ్గరకు తీసాడు.

అంతే, అప్పటివరకూ ఆపిన దుఃఖం ఒక్కసారిగా పెల్లుబికింది. పితృసమానుడైన ఆ రాజును చేతులతో బంధించి తన మోకాళ్ళపై ఒరిగి, 'ప్రభో, మీరే ఏదైనా చేసి నన్ను ఈ ఆపదనుండి గట్టెక్కించాలి. మీరు పితృతుల్యులు. ఒక రాజన్యుని తోటి రాజన్యునిగా అర్థిస్తున్నాను. నా ధర్మం నేను నిర్వర్తించడంలో మీరే దారిచూపాలి'.

'శాతపుత్రుడు అతిథినీ, ఆశ్రితునీ వదిలిపెట్టే ధర్మరహితుడు కాదు. నీకేమీ భయంలేదు. శంక వీడి స్వస్థతచెందు', అని అతనిని వెంటబెట్టుకొని లోనికి తీసుకువెళ్ళాడు.



ఇంత జరుగుతున్నా శ్రీముఖుడు నిమ్మకు నీరెత్తినట్లు తన ఆసనం నుండి కదలక అలాగే ఉన్నాడు. ఒక పక్క అతి ప్రయాసతో నిర్మింపబడిన ఆంధ్ర జన సంఘటనం భవిష్యత్తు, మరొక పక్క తోటి రాజన్యునిపట్ల బాధ్యత. అతనిని విడవటం, అశోకునితో వైరం కొనితెచ్చుకొన్నట్లే. దానికి తోడు ఈ పరాన్నభుక్కులైన వివిధ బ్రాహ్మణ, శ్రమణ సంఘాలు. రాజకీయాలలో తలదూర్చక మానరు.

'ఇక తన తండ్రి ఈ నాగసేనుడికి చేసిన వాగ్దానం? ఈ క్లిష్ట సమయంలో ఆ ధాన్యకటకపు పిల్లతో ఇతని వివాహం, ఆహ్! అది జరిగే విషయమా? అయినా అదొక స్వల్ప విషయం. ఇప్పుడు ఈతని బతుకుకే ముప్పు వాటిల్లనుంది'.

ఈ బౌద్ధాచార్యులు అతనిని వదలరు. వారి సంఘం యొక్క ప్రయోజనానికి అతనిని ఒక పావుగా వాడుకోనాలనే వారి ఉద్దేశ్యం. ఇక్కడి నుంచి అతను తప్పించుకొని బయటకు వెళ్ళడం అసంభవం.

కళింగ యుద్ధం తప్పేటట్లులేదు. ఏడు స్కంధావారాలు, అంటే లక్షన్నర కాల్బలం, ఇంకా పదివేల అశ్వదళం, రెండువేలకు పైగా ఏనుగులు. ఇవి దక్షిణపు సేనలు మాత్రమే. కోసలనుండి మూడు స్కంధావారాలు ఇప్పటికే, మహాకాంతారపు మార్గాలు దిగ్బంధనం చేసాయి. మగధనుండీ, చంపానగరం నుండీ మరి ఎన్ని లక్షల సేనలు రానున్నవో? మహాలంకలోని నావసేన ఏ క్షణానైనా కదలడానికి సిద్ధంగా ఉంది.

ఇంత సైన్యంతో మీద పడితే, తూర్పు తీరం ఒక స్మశానం కాక తప్పదు. 'ఈ రాజకుమారుడు ఇక్కడ ఉండటమే అతనికి శ్రేయస్కరమేమో?'

అయినా అతనిని ఈ ఆచార్యుల ఆధీనంలో ఉంచటం వల్ల ప్రయోజనం? అతడు ఇక్కడ ఉన్న

విషయం ఈపాటికి ఆ మగధరాజుకి తెలిసే ఉంటుంది. ఏ క్షణాన్నైనా అక్కడనుండి సూచన రావచ్చు. సూచన ఏమిటి, అది రాజాజ్ఞ అనే అనుకోవాలి. దానికి ఆంధ్రభృత్యులు తలవంచ వలసిందే.

'ఛీ! బానిస బ్రతుకు. ఈ మగధ అధికారం ఎప్పుడు వీడుతుందో?'

అని తలపోస్తూ, తండ్రితో కలసి వెనుకకు వచ్చి పక్కనే కూలబడిన నాగసేనుని చూసాడు. ఆ క్షణంలో అతని మనస్సులో మెదిలిన ఆలోచన, చతుస్సాగర పర్యంతం, కచ్ఛద్వీపం నుండి యవద్వీపం వరకూ విస్తరించి నాల్గున్నర శతాబ్దాలకాలం అఖండంగా ప్రకాశించిన మహాంధ్రసామ్రాజ్యానికి పునాది రాయి అవుతుందని అతనికి తెలియదు!

మగధ రాజ్య వినాశనమే అతని ధ్యేయమయింది.



నాగసేనుని మహాలంకలోనే వదలి, తిరిగి రాజధానికి చేరిన తండ్రీ తనయుల కోసం రాజప్రాసాదంలో వేచిఉన్నాడు, సోంభొట్లు.

ధాన్యకటకం నుండి అత్యవసర సమాచారం.

'రాజభ్రాత విగతశోకులు, ఉపగుప్తామాత్యులతో సహా స్వల్ప పరివారంతో ధాన్యకటకానికి తూర్పున 'అమరశైలం' వద్ద విడిది చేసారు. రాజధానికి రావటానికి తమ అనుజ్ఞ కొరకు నిరీక్షిస్తున్నామని మనవి చేసారు.'

'స్వల్ప పరివారమా? కొన్ని సేనలతో ముందుగా వచ్చే ఆలోచన ఉందని మాత్రమే కదా మీ సమాచారం?' అని ఆశ్చర్యపడుతూ, 'అయినా వారు బయలుదేరిన విషయం కూడా తెలియలేదు. మీ వేగులు నిద్రిస్తున్నారా ఏమిటి?' అని సోంభొట్లను నిలదీసాడు, శాతవాహనుడు.

'క్షమించాలి ప్రభూ, బొత్తిగా ఇరవై మంది కూడా లేరు. మారు వేషాలలో ప్రయాణించారట! వీధినాటకాలాడే జక్కుల బృందంలా నావలో వచ్చారు. ధాన్యకటకం చేరాక మహామాత్రులు, బుద్ధగుప్తులకు వారు చెప్పేదాకా ఎవ్వరికీ తెలియలేదు. ధాన్యకటకపు రక్షణ సిబ్బందిలో వందమంది తప్ప వేరే రక్షణ కూడా లేదు. అందుకే కొండమీద వేసవి విడిది గృహంలో బసచేయించారట', అని తలవంచుకున్నాడు సోంభొట్లు.

'ఊహ్... వెంటనే పూర్వశైల స్కంధావారంలో కెంపయదొరకి కబురు పంపండి. పదివేల కాల్బలం, అశ్వసేనతో అమరశైలం చేరి వారికి పూర్తి రక్షణ వలయం కల్పించమని తెలియపర్చండి. ఈ రాత్రికే సేనలు అక్కడికి చేరాలి' అని కొడబలిదొరను నియోగించి, సోంభొట్లతో, 'కుమారులు శ్రీముఖులు రేపే బయలుదేరి రాజభ్రాత విగతశోకుల స్వాగత సత్కారాలకు స్వయంగా వస్తున్నరని వర్తమానం పంపండి.'

వారు వెళ్ళిన వెంటనే, కుమారునితో, 'పద నీతో కొన్ని విషయాలు చెప్పాలి' అని లోనికి దారితీసాడు, శాతవాహనుడు.



# 11

**తూ**ర్పు గాలికి నల్లని తెరచాపలు బిర్రుగా ఉబ్బి, గాలిలో ఎగురుతున్నట్లుగా పయనించింది, ఆ నావ.

అమావాస్యకి ఇంకా నాలుగు రోజులుంది, కటికచీకటి, ఎంతో నైపుణ్యంగల నావికుడైనా కూడా ఆ సమయంలో నదీ ప్రయాణం చేసేందుకు సాహసించడు. కృష్ణమ్మ అలలపై మహాచైత్యపు వెలిగే దీపాల ప్రతిబింబాలు మాత్రమే అతనికి దారి చూపాయి. మహాలంక ద్వీపం ఇంకా ఒక వెయ్యి గజాల దూరం ఉండగానే తెరచాపలు దింపేసి, నది మధ్య ఓలలాడుతూ నిలిచింది. ఏ క్షణాన్నైనా సూచన రావచ్చు. వెంటనే కదిలేందుకు సిద్ధంగా, అర లంగరు మాత్రమే వేసి, తాటి నిచ్చెనలు నీటిలోనికి జారవిడిచి ఎదురు చూడసాగాడు నౌక నాయకుడు.

రాత్రి నాల్గవ జాము, అందరూ గాఢనిద్రలో ఉండే సమయం. ఇంకో రెండు గంటలలోగా పనైపోవాలి. లంకలో ఎటువంటి సందడీ లేదు, మహాచైత్యానికి దూరంగా వంద గదుల విహారం. కాపలాగా రాటుతేలిన బౌద్ధ యోధులు. జట్లు జట్లుగా పహరా కాస్తున్నారు. చీమ కూడా చొరడానికి వీలులేదు. ఇంతలో కాగడాల వెలుగులో అటుగా వచ్చిన పదిమంది భిక్షువులు. వారి నాయకుడు ప్రచ్ఛన్న వేషంలో, కొడబలి దొర!

'ఎవరది?' అంటూ వారిని నిలదీసాడు కావలి జట్టు నాయకుడయిన భిక్షువు.

'తథాగతుని ఆఖరి మజిలీ?' అని ఎదురు ప్రశ్న వేసాడు, కొడబలి.

'రాజగృహమా?' ప్రశ్నాసంకేతం.

'సర్వలోకాలకూ నాథుడైన బోధిసత్త్వునికి ప్రపంచమే గృహం కదా', అన్నాడు కొడబలి, కొత్తగా గొరిగించిన తల నిమురుకుంటూ.

అది సరియైన జవాబు. 'లోనికి రావచ్చు', అంటూ దారి వదిలాడు కాపలా జట్టు నాయకుడు.

'పరవాలేదు. ఆచార్యుల వద్దనుండి వస్తున్నాము. అతిథిని వెంటనే ఆరామానికి తోడ్కొనిరమ్మని ఆజ్ఞ. రక్షణగా పది మంది యోధులను కూడా వెంట పంపవలసింది'

'ఈ సమయంలోనా? ఏంటో విశేషం?' అంటూ మెల్లగా అతని ఆశ్చర్యాన్ని వ్యక్తంచేసాడు.

'ఏమో, స్వాములు ముగ్గురూ రాత్రంతా ఏదో చర్చిస్తున్నారు. నిద్ర కూడా పోలేదు. బయలుదేరుదామా?' అని త్వరపెడుతూ, 'ఇంతకూ బందీ ఏంచేస్తున్నాడో' అని ప్రశ్నించాడు కొడబలి.

'పాపం అతనికీ నిద్రలేదు. అతని వద్దకు వెళ్ళడానికి కూడా అందరూ భయపడుతున్నారు. తనలో తానే మధనపడ్తూ ఉన్నాడు. ఎవరైనా మాట్లాడితే మండిపడ్తాడు.'

'అయితే, ఆచార్యులు చెప్పమన్న ఈ రహస్య సంకేతం అతనితో చెప్పండి', అని చెవిలో ఊదాడు. 'కల్యాణఘడియలోగా శుల్కాధ్యక్షుడి ఇంటికి పోవాలి. త్వరపడమని చెప్పమన్నారు'

✦ ✦ ✦

కృష్ణపక్షం చీకటి రాత్రిలో కాగడాల వెలుగు ఏపాటికి చాలేది? కీచురాళ్ళ మోత తప్ప వేరే సవ్వడి లేదు. చుట్టూ మడ తుప్పలు. ఆ చీకటిలో భూతాలలా ఒక్కసారిగా మీదపడ్డారు. కనుమూసి తెరిచేలోగా ఇరవైమంది భిక్షువులు వారి చురకత్తులకి బలయ్యారు. ఇంత జరిగినా, ఆర్పబడిన కాగడాల సురసురలు తప్ప వేరే శబ్దం లేదు.

మడ అడవి మధ్య ఊబినేలలో ఆ అగంతకులు చూపిన దారిలో తథాగతునిపై భారంవేసి ఒడ్డున నిలిచి ఉన్న పడవను చేరారు. నక్షత్రాల వెలుగులో లీలగా కనిపించే ఓడను చూసినంతవరకూ పక్కనే ఉన్న కొడబలిదొర నోరు విప్పలేదు. త్రాటి నిచ్చెనలు పట్టుకుని పైకెగబాకిన నాగసేనుడు, అప్పుడే తెలవారుతున్న వెలుగులో నావపై రెపరెపలాడుతున్న కళింగ ధ్వజాన్ని చూసి ఒక్కసారిగా నిట్టూర్చి, కళ్ళలో నీళ్ళు సుడితిరుగుతుండగా దానినే చూస్తూ నిలిచిపోయాడు.

'వేగిరపడవద్దు స్వామీ, పతాకం మాత్రమే మీ కళింగానిది. నావ ఆంధ్ర సేనలోదే. ముందుగా మనం ధాన్యకటకానికి వెళ్తున్నాం. అదీ అతి గోప్యంగా జరగాలని వారి ఉద్దేశ్యం. అందుకే చూసేవాళ్ళకు మీరు కళింగానికి తప్పించుకుపోయారనే భ్రాంతి కల్గించడమే ఈ పతాకం ఉద్దేశ్యం. యువరాజు శ్రీముఖులు మీకన్నీ అక్కడే వివరిస్తారు.'

'లేదు, ఈ పరిస్థితుల్లో నేను కళింగంలో నా సోదరి పక్కన ఉండటమే ఉచితం, ఏదో విధంగా నాకు తిరిగి వెళ్ళేందుకు సహకరించండి.'

'తప్పకుండా వెళుదురుగాని. ముందుగా మీ కళింగం నుండి వచ్చిన ఒక వార్త, అది శ్రీముఖుల నోట విన్నతరువాత మీరేవిధంగా నిశ్చయిస్తే, ఆ విధంగా జరుగుతుంది. అంతవరకూ సావధానంగా నా మాటవిని నాతో ధాన్యాకటకానికి రావలసింది...' అంటున్న కొడబలిదొర కళ్ళలోని ఏదో గంభీరమైన భావం నాగసేనుడిని కలవరపర్చింది.

కళింగం నుండి వార్త... ఏమయ్యుంటుందో?

✦

# 12

ఓఢ్రవీరుడు, ఉత్తర కళింగ సేనాధిపతి, మహాతలవరి శ్రీ ఐరావతదేవుడు ధవళగిరి నుండి బయలుదేరి రెండు రోజులయింది. మహాకాంతారం, చంపాపురీ వెళ్ళేదారులన్నీ మగధ సేనల ఆధీనంలో ఉన్నాయి. తూర్పుసాగర తీరమార్గంలో పయనించే వాణిజ్య నౌకలు మహానదీ ముఖంలోగల కళింగ పట్టణాలను తాకకుండా మగధ నావసేన దిగ్బంధనం చేసింది. ఒక్క నైరుతి మార్గంలో మాత్రమే ఇంకా వచ్చే యుద్ధపు జాడలు కనపడవు. ఏదైనా వార్త వస్తే ఆ మార్గం ద్వారానే!

అది ఆ మహాపురుషుడు, బావరి దేవుని శిష్యుడైన మేఘరాజుచే స్థాపింపబడిన విహారం.

కొండ అంచున నిలిచి సాగరంవైపు దృష్టి సారించాడు. ఆచార్యులు ధమ్మపాలునినుండి వర్తమానం రాగానే హుటాహుటిన బయలుదేరాడు. మార్గమధ్యంలోని రాజధానిలో కూడా ఆగలేదు.

'అయినా ఆగి ఏమి చేయను? ఆ ఆడుదానితో అచ్చికాలాడటం తప్ప. అయ్యో, ఏమి ఈ కళింగదేశపు దౌర్భాగ్యం?' అనుకుంటూ తనవైపే ఒంటరిగా నడచివస్తున్న ఆచార్యులని చూసి నమస్కరించి, 'ఆచార్యా, తమ ఆదేశం వినగానే వేంటనే బయలుదేరాను. ఆలస్యమైతే క్షమించాలి.'

'ఏమని క్షమించాలి, దండనాయకా? మీ అలసత్వం వల్ల ఇప్పుడు కళింగమే స్మశానమయ్యే పరిస్థితి వచ్చింది. ఆ చండాశోకుని సేనాబలానికి ఆంధ్రసేనలు తోడయితే ఈ ఆడుదాని కొంగుచాటున దాగిన మీ సేనలు ఈ దేశాన్ని ఏలాగూ కాపాడలేవు. ఇక అడవులపట్టి వలస పోవుటే మాకున్న ఒకేఒకదారి.' అంటూ హేళనగా నవ్వాడు.

'ఆహా ఎంత మాట? ఇంతకాలంగా మేము మీకు విన్నవించిన పాఠం మాకే వల్లెవేస్తున్నారు, ఆచార్యులు! ఆ ఆడుది గద్దెనెక్కినప్పుడే మా ఉత్తరకళింగం ఎదురు తిరిగింది. ఆ సమయంలో తమ బౌద్ధ సంఘాలన్నీ ఆ పిరికి నాగసేనుని వెనుక నిలిచి దేశాన్ని నిర్వీర్యం చేసారు. ఇప్పుడా మహావీరుడు యుద్ధం ఆసన్నం కాగానే తోకముడిచి పలాయనం చేసాడు. నన్ను అని ఏమి ప్రయోజనం? చేయవలసిందేమో వినిపించండి. ఇప్పటికైనా ఈ కళింగ రాజ్యాన్ని రక్షింపగల ధీరులు మా ఓఢ్ర వీరులే అని మీరు అంగీకరిస్తే చాలు', అని నిష్టూరంగా అన్నాడు.

'సరే, అయినదేమో అయ్యింది. తిరుగదోడి ప్రయోజనం లేదు. కావలసిన కార్యం ఆలోచించాలి', అని తలాడించి ఒక క్షణమాగి, చుట్టూ కలయజూసి, రహస్యంగా, 'ఇక ఆ నాగసేనుడు ఇటు రావడం సాధ్యంకాదు. అతను మహాలంకలో బందీగా ఉన్నాడు. ఇదే మంచి సమయం. రాణీ

చారువాకికి ఎటువంటి రక్షణా లేదు. మీరు వెంటనే రాజ్యాధికారం చేజిక్కించుకుంటే, ఉత్తర మధ్య కళింగాల సేనలు త్వరితంగా సమాయత్త పరచడానికి వీలవుతుంది.’

‘కానీ, మధ్యకళింగపు దండనాయకులు ఆ ఆడుదాని దాసులు, ఇక గౌతమీ తీరసైన్యాలు సరేసరి, ఆమె గీచిన గీటు దాటరు. కళింగపట్టణంలో ఐదు లక్షల సైన్యం ఆమె ఆధీనంలోనే ఉంది. ఉత్కళంనుండి సైన్యాలు కొనిరావడం అసాధ్యం. ఈ పరిస్థితిలో...’ అంటూ నీళ్ళు నాన్చాడు.

‘దానికి ఒక ఉపాయం యోచించే మిమ్ములను పిలిపించాము. దండనాయకులు, మేఘరాజతలవరి మనతో ఏకీభవిస్తే మనకు మార్గం సుగమమే కదా?’

‘తప్పకుండా. దక్షిణ కళింగ సేనలే గాక, రాజధాని రక్షణ కూడా వారి ఆధీనంలోనే ఉంది. వయోవృద్ధుడూ, జ్యేష్ఠుడూనూ. అపర ధనుంజయుడు, మరి ఆయన నా ఆధిపత్యం అంగీకరిస్తారా?’

‘సాధ్యమే. కానీ ఒక నిబంధన. వారిది ఒకటే ఆశయం, వారి కుమార్తెను మహారాణిగా చూడడం.’

‘ఎవరు? ఆ కన్యామణి, విశాఖాదేవియా?’

‘అవును, ఆమె తమ పట్టమహిషి అయితే, పట్టాభిషేకం ఉమ్మడిగానైతే వారికి ఏ అభ్యంతరం ఉండదని మా ఉద్దేశ్యం’ అన్నాడు థేర ధర్మపాలుడు, నర్మగర్భంగా.

‘అంతకన్నానా! వారు నాపక్కన ఉంటే ఒక్క మగధ సైన్యాలేల, సమస్త మహీమండలమే జయించగలను’, ఒక్కసారిగా చెప్పనలవిగాని ఉత్సాహంతో అతని వక్షం పొంగిపోయింది. ఎట్టకేలకు అతను కలలుగన్న రాజ్యాధికారమేగాక, ఆ అసమానమైన కన్యామణి, విశాఖాదేవి కూడా తన స్వంతమవనుంది. ఇక తామ్రలిప్తి నుండి గౌతమీ తీరం వరకూ గల కళింగ సీమలో తన ఆధిపత్యం అప్రతిహతం. తన గుండె చప్పుడే చెవులలో మార్మోగగా అలాగే కొన్ని క్షణాలు ప్రాన్పడిపోయాడు.



# 13

నావ మహాలంక విడిచి ఉత్తరదిశగా ప్రయాణిస్తుంది. సాయంకాలపు నీరెండలో ఓడ ముందుకొమ్ముపై నిలిచి ఎదురుతాకుతున్న చల్లని గాలిని ఆస్వాదిస్తూ నిలుచున్నాడు. కానీ అతని మనస్సు మనసులో లేదు. బౌద్ధారామంనుండి తప్పించుకున్నప్పటి ఉత్కంఠత ఇంకా వీడలేదు. దానికి తోడు ముందేమి జరగనున్నదో అన్న ఆందోళన అతనిని కలవరపెడ్తుంది. కర్మ బలానికి తలవంచి గమ్య రహితంగా కాలప్రవాహనికి కొట్టుకుపోయే మనస్తత్వం కాదు. కానీ ఏమీ చేయలేని నిస్సహాయత.

అది మూడు తెరచాపల యుద్ధనౌక. తూర్పు గాలి వేటుకి అవి చేసే ఛరచ్ఛరలు తప్ప వేరే శబ్దంలేదు. తెడ్లకు పనిలేదు. అవి వేసే బోయీలు సరంగు చుట్టూ చేరి వారి దేశీయంలో ఏదో ముచ్చటిస్తున్నారు.

ఎదురుగా కృష్ణమ్మ వయ్యారంగా మరో ఒంపుతిరిగింది. సంధ్యాకాశపు సూర్యుడు ఆమెను ఒక సింధూర వర్ణపు చీరెలో సింగారించాడు. ఇరు వైపులా ఎత్తయిన ఇంద్రశైల శిఖరాలు ఆమె పీనస్తనాలవలె తోచాయి. కనుమ దారిలో సన్నబడిన ప్రవాహం ఆమె నడుము ఒంపును జ్ఞప్తికి తెచ్చింది. అస్తమిస్తున్న సూర్యబింబం కాసేపు ఆమె నుదుట కుంకుమ బొట్టులా, అంతలోనే ఒక కెంపు ముక్కెరలా కిందకి జారసాగింది.

**తెలుగు-దేశీయం**

తమిళ 'సంగం' సాహిత్యం, తిరుపతికి ఉత్తరాన గల దేశాన్ని 'వడుగవళి' అని పిలుస్తుంది. 'వడుగ' అనేది ఒక భాష. ద్రవిడంలో 'వడక్కాన్' అంటే ఉత్తరదిశ. వడుగ అంటే... తమిళులకి ఉత్తరాన మాట్లాడే భాష అని అర్థం. అలాగే... 'తెన్' అంటే దక్షిణదిశ. ముందరి వాదాన్ని అనుసరిస్తే, 'తెనుగ' అంటే దక్షిణాపథంలో మాట్లాడే భాష అని ఊహించవచ్చు.

మరి తెలుగు అతి ప్రాచీన భాషలలో ఒకటి. సంస్కృత, ప్రాకృత శబ్దాలను తీసివేస్తే, మరాఠీకీ తెలుగుకీ చాలా సాపత్యం ఉంటుంది. అలాగే కర్నాటకలో మాట్లాడే కన్నడం, పాత తెలుగుకి ఎంతో దగ్గర. ఒకప్పుడు, మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలోని ప్రజలంతా కొంచెం తేడాతో, ఒకే భాష మాట్లాడే వారేమో? వాళ్ళనే 'ఆంధ్రులని' పిలిచేవారేమో? తెలుగే అని అనలేము కానీ, అది ఈ మూడు భాషలకి మాతృక అయివుంటుంది. దీనినే 'దేశి' అనేవారు. గుణాఢ్యుడు ఈ భాషలోనే బృహత్కథ రాసాడట. హాలుని గాథాసప్తశతిలో కూడా ఈ మూడు భాషల పదాలూ ధారాళంగా కనిపిస్తాయి. సంస్కృతి పరంగా ఈ మూడు రాష్ట్రాలదీ ఒకే వారసత్వం. కాలక్రమేణా మాటలో బేధాలు ఏర్పడి మూడు నిర్దిష్టమైన భాషలు ఏర్పడ్డాయి.

ఆ కాలంలో కూడా పామర పల్లె జనం మాటకూ, నగరాలలో సంస్కృత ప్రాకృతాలు చదువుకున్న వాళ్ళకూ భాషలో చాలా తేడా ఉండివుంటుంది. ఈ కాలంలో సిటీలో ఇంగ్లీష్ మీడియంలో చదువు కున్న వాళ్ళకి పల్లె పదాలు ఎలా అర్థం కావో... అలా!

ఆ దృశ్యం చూస్తూ పాటందుకున్నారు దాసరిబోయలు. అది పామరుల భాష. నుడి ఆంధ్రమే కానీ నాగరికులకు ఆ మాట అర్థం చేసుకోవడం అసులభం.

అందునా అతనిది తూర్పుదేశం.

కొర్రవ్వ- ఆయమ్మే కన్నబెన్న. ఆమె ప్రియుడు ఉప్పెనదొర!

తన ప్రియుడికై పరవళ్ళుతొక్కుతూ, అడుగడుగుకూ ఆమె తండ్రి పర్వతుడు తెచ్చే అవరోధాలను అధిగమిస్తూ చేసిన పయనమే ఆ పాటకు రూపం...

నేటుగ వచ్చెర ఆయమ్మ! మలరేడు కూతు రా ఆయమ్మ !!
ఆగ లేదు అబ్బ లేడు! కన్నునిండె నేస్తగాడు !!
నేలకు గోలకు తెస్తూ! నెళినెళి ఒళ్ళు విరుస్తూ !!
నేరము పెట్టక! నేయము కట్టగ !!
నేటుగ వచ్చెర ఆయమ్మ! నెరనేటుగ వచ్చెర ఆయమ్మ !!
నల్లరాతి గుండె! నల్లమబ్బు నెలవు !!
పిల్ల తండిరి కినిసి! నెరవుకడ్డము కాసె !!
పార దారి సున్న! ఏడ్చు పోటత్తె బెన్న !!
కూతేసి పిలిచె మగని! మగరాతి హొట్టెని !!
నేటుగ వచ్చెర ఆయమ్మ! నెరవు గానగలేదు ఆయమ్మ !!
పెంటి యాతన వినె! విన్నంత విరిగిబడె !!
చెలి యాలి చేబట్ట! దాటె చెలియలికట్ట !!
కొండ కొమ్మంతెగిసె! కొండచూల్గనిబెట్టె !!
కోరివచ్చిన కొమ్మ! కొర్రవ్వ బతుకమ్మ !!
నేటుగ వచ్చెర ఆయమ్మ! మగని నేరువు జూసెర ఆయమ్మ !!
చేయిజాసిన మగువ! చేయంద తెరువల్ల !!
సిట సిటని మండిపడి! సికురమై అడ్డుపడె !!
కూతురి ఇడుమే కానడు! కూళుడురా ఆయప్ప !!
ఆయమ్మ తండిరి! మలకొండ గిరిబండ !!
నేటుగ వచ్చెర ఆయమ్మ! నెరయేల్పుకై కూబెట్టె ఆయమ్మ !!
చివ్వకై చనుదెంచె! తెరగంటి యెకిమీడు !!
అరకయ్యి వడివేసె! మొయిలుతల పగదారి !!
పెళ్ళుమని తలవిచ్చె! కానబడె కనుదారి !!
ఎడద దడ పొంగాడ! ఒడలి పొడయని డాసె !!
నేటుగ వచ్చెర ఆయమ్మ! నెరయేల్పుకే తాయి రా ఆయమ్మ !!

‘ఆ విధంగా వేల్పురేడు చేయిపడిన ఈ పర్వతానికి ఇంద్రశైలమని పేరువచ్చింది’ అంటూ పక్కన నిలిచాడు కొడబలి దొర.



విజయేంద్రపురం రేవు, ఇంద్రశైలపు కనుమకు పడమరగా ఒక కోసు దూరం వరకూ, దాదాపు వందకు పైగా నావలతో క్రిక్కిరిసి ఉంది. రకరకాల యుద్ధనౌకలు, అన్నింటిపైనా మగధ రాజ్యపు నెమలివన్నె పతాకాలే. ఉత్తరపు ఒడ్డుపై నాలుగు స్కంధాల సైన్యం విడిసి ఉంది. సంధ్య చీకట్లు అలుముకుంటున్నాయి, కాగడాల వెలుగులో ఒక మహాపట్టణంలా ఉన్న ఆ సేనాసమూహాన్ని చూసిన నాగసేనుడి మనస్సు ఒక్కసారిగా ఉత్కంఠతకు లోనైంది.

అది తన స్వదేశాన్ని ముంచవస్తున్న మహాసాగర ప్రభంజనం. దాని ధాటికి కళింగం ఒక ఉప్పుపత్ర కాక తప్పదు. కళ్ళలో నీరు సుడులు తిరుగగా ఆ మహావీరుడు బేలయై నిస్సత్తువతో కూలబడిపోయాడు. అతని భుజంపై చెయ్యివేసి లేవదీసిన శ్రీముఖుని కూడా కొంతసేపటివరకూ పోల్చుకోలేక పోయాడు.





# 14

ధాన్యకటకానికి తూర్పున అమరశైలపు అంచులో తనదైన నూతన గృహంవైపు నడిచాడు, మల్లప్పదొర.

రోజుకొక వార్త, ఏ విషయమూ స్పష్టంగా తెలియదు. దైవానుగ్రహంగా తనకు దక్కిన జామాత నాగసేనుని క్షేమసమాచారాలు లేవు. వచ్చిన గాలి వార్తలు నమ్మి, పతి రాకకై వైకుంఠపుర ద్వారంలో అభిసారికయైన లక్ష్మీదేవిలా, తన వరునికై ఎదురుతెన్నులు కాస్తున్న కుమార్తె మల్లికను మరింత ఆందోళనకు గురిచేయలేదు.

కొండపై విడిసిన చక్రవర్తి సహోదరునికీ అతని పరివారానికీ తగిన వసతులు అమర్చడమేగాక వారి రక్షణకై పూర్వశైలంనుండి వచ్చిన పదివేలమంది రక్షణదళం కొరకు అమరారామపు కొండ మలుపులో వసతి ఏర్పాట్లు చేయడంలో గత రెండురోజులూ క్షణం తీరికలేకుండా గడిచిపోయాయి.

అతనికి ఆ ప్రదేశం కొత్త. రాజకునిగా బాధ్యతలు గ్రహించి నెలకూడా గడవలేదు. పక్క గ్రామాలనుండి సాయంకాలానికల్లా సరుకులు తెప్పించకుంటే, ఇంతమందికి రేపటి భోజనాదికాలు అసాధ్యం. 'ఒకరా ఇద్దరా, పదివేలమంది! దానికి తోడు వచ్చిన అతిథి, చక్రవర్తికి స్వయానా సహోదరుడు. చిన్న అపచారం జరిగినా తలకే ముప్పు', ఇలా ఆలోచిస్తూ వెనుదిరిగి నదివైపు చూసాడు.

నదిమధ్య ఓలలాడుతున్న ఓడ!

పక్కనే ఉన్న గ్రామకుని వంక చూస్తూ, 'ఏదో పెద్ద నావే, మూడు చాపల యుద్ధనౌక. తూర్పునుండి పైకి వెళుతున్నట్లుంది?' అన్నాడు.

'లేదయ్యా, ఇక్కడే ఆగినట్లుందే? ఉదయాన్న అయితే లేదు!' అని అనుమానంగా రాజకునివైపు చూస్తూ, 'ఏదైనా పెద్దాయనకు అండగా కింద నుంచి వచ్చిందేమో?' అన్నాడు గ్రామపెద్ద కాపయ్య.

'అలా అయితే వర్తమానం వచ్చి ఉండేదే? ఎందుకైనా మంచిది, మన దాసరి వానిని పంపి ఏమైనదీ కనుక్కొని రమ్మను' అంటూ తల ఎత్తి ఇంటివైపు చూసాడు.

ఇంటి చుట్టూ ఏదో సందడి!

గుంపులు గుంపులుగా జనం. ఏమయిందోనన్న ఆత్రుత. 'ఏమయిందో కనుక్కో' అని పరిచారకుణ్ణి నియోగించి, వడివడిగా అటువైపు అడుగులు వేయసాగాడు.

జనం మధ్యలో నిలిచి, నిక్కిచూస్తున్న పరిచారకునితో, 'ఏమైందిరా, ఏంటీ జనం?'

'తెలియదయ్యా, ఇంటిచుట్టూ రాజభటులు! ఎవ్వరినీ పోనీయడంలేదు' అన్న అతని మాటలకు వెనుదిరిగి చూసిన జనం, రాజకుడిని గుర్తించి పక్కకు జరుగుతూ దారి వదిలారు.

అడ్డుగా నిలిచిన రక్షక భటునితో తానెవరో చెప్పి, తనింట తాను ప్రవేశించడానికి అనుమతి కోరుతూ అక్కడే నిలిచాడు, మల్లప్పదొర. వార్త అందిన మరుక్షణమే హడావిడిగా బయటకు వచ్చిన కొడబలిదొరను గుర్తించి ఆశ్చర్యపడుతున్న అతనిని, 'క్షమించాలి మల్లప్పన్నా, మీ ఇంట మీకే అవరోధం. కాని తొందరలో ముందుగా మీకు తెలియపర్చనవలేదు. రండి రండి. అందరూ మీకొరకే ఎదురుచూస్తున్నారు' అని చేయందుకుని లోనికి దారితీసాడు.

గుమ్మంలో 'నాన్నగారండీ' అంటూ ఎదురు వచ్చిన కూతురు ముఖంలోని ఆనందమూ, అంతలోనే ఆమెను ముంచిన సిగ్గునూ గుర్తించిన మరుక్షణమే అతనికి వచ్చినదెవరో అర్థమయింది.

కానీ, ఎదురుగా ఉయ్యాల బల్లపై కూర్చొని ఉన్న నూనూగు మీసాల యువకుడినీ, అతని ముఖంలో ప్రస్ఫుటంగా కనిపించే రాజసాన్నీ చూసి అతని ఆశ్చర్యం రెట్టింపయింది. ఒక నిమేషకాలం ఏమీ తోచలేదు. తోచిన క్షణమే, అతనెవరో అవగతమయి, 'మహాప్రభో' అంటూ సాగిలపడ్డాడు.

మెల్లగా అతనిని లేవదీసి, 'మీ అనుమతి లేకుండా మీ గృహంలో మీకీవిధంగా అసౌకర్యం కలుగచేసాం. మీకు అభ్యంతరం లేదనుకుంటాను' అంటున్న యువరాజు శ్రీముఖుని చూసి అలాగే అవాక్కై నిలిచి చుట్టూ కలయచూసాడు.

అతని ఇంటి చావిడి, రాజసభలా ఉంది. మహామాత్రులూ, సైన్యాధ్యక్షులూ! వారిలో తన కాబోయే అల్లుని కొరకు వెదుకుతున్న అతని కళ్ళు, అతనివైపే చూస్తూ చిరునవ్వుతో నమస్కరిస్తున్న నాగసేనుని గుర్తించాయి.



'నా సోదరి చెర విడిపించిన వెంటనే మన వివాహం, దేవీ. దానికి నీ అభ్యంతరం ఉండదనుకుంటాను? అంటూ ఆమె పొదివిపట్టి అడిగాడు. ఏకాంతంగా మావితోటలో వారిరువురే ఉన్నారు.

'దేనికి అభ్యంతరం? మన వివాహానికా లేక ఈ స్వల్పమైన ఆలశ్యానికా?' అంటూ కిలకిలా నవ్వి, 'నా ఆడుబిడ్డ చారువాకీ దేవి క్షేమం, తమ కర్తవ్యం కంటే ఈ మన వివాహం ముఖ్యం కాదు. అయినా తమను చూసిన క్షణమే నేను మీదానినయ్యాను. మన వివాహం పైలోకంలో ఎప్పుడో అయింది, జరుగవలసింది శాస్త్రబద్ధమైన ఒక సంస్కారం మాత్రమే', అంటూ అతని ఎదపై వాలిపోయింది.

ఆలింగనంలో వారికి కాలగమనం తెలియలేదు. కలసిన రెండు హృదయాలకు తోడై ఆ కిశోరప్రాయపు శరీరాల మధ్య ఆ సమయంలోనే గాంధర్వ విధిలో వారి ఉద్వాహమయింది.



‘శరన్మాసంలోగా సైన్యం గౌతమిని దాటి పుష్యపౌర్ణిమలోగా కళింగపురిని చేరాలి. అటునుండి చక్రవర్తి మగధ సైన్యాలతో కటకపురిని పట్టి, ఆ పిమ్మట కనుమ దారులలో రాజధాని వరకూ రావటానికి సమయం పట్టవచ్చు’ అంటూ మగధ నుండి వచ్చిన ఆదేశాలని వివరించాడు, శ్రీముఖుడు, తన అతిముఖ్యులైన సన్నిహితులతో.

వారు అమరశైలం చేరి ఒక మాసం గడిచింది. అంతకాలమూ మల్లప్పదొర గృహమే వారి విడిది.

‘కళింగ సైన్యం రెండు భాగాలుగా విడివడి, ఒకటి ఉత్కళంలో మహానదీ తీరంలో ఐరావతదేవుని కిందా, మరొకటి దక్షిణంలో మేఘరాజ మహాతలవరి కింద వంశధార వద్దా విడిసి ఉన్నాయని వార్త. గోదావరి సీమలో మన సైన్యాలను వెనుకమారుగా చీకాకు పర్చుడానికి కొండజాతుల దండ్లు ఆయత్తపర్చారని మన వేగుల సమాచారం’ అని పరిస్థితిని విశదీకరించాడు, చారదళాధికారి సోంభొట్లు.

‘దక్షిణ కళింగపు సైన్యాలన్నీ రాజధాని వద్దనే, మేఘరాజు ప్రత్యక్ష పర్యవేక్షణలో ఉన్నాయట. నాగసేనుని ప్రోత్సాహంతో వారు మనతో చేరి ఎదురుతిరిగే ప్రమాదం నివారించడమే దాని ఉద్దేశ్యం’ అంటూ నాగసేనుని వైపు చూసాడు, శ్రీముఖుడు.

‘అహ్! ఐరావతుడు! ఆ ద్రోహికి తగిన బుద్ధి చెప్పడానికి నా వద్ద ఉపాయం ఉంది. కానీ నా సోదరి క్షేమం గురించే ఆందోళన. ఆమె గురించి ఏదైనా సమాచారం?’ అని సోంభొట్ల వంక చూసాడు.

‘ప్రస్తుతానికి ఎటువంటి వార్తా లేదు. కానీ ఆమె తమతో కూడి దేశం వదలి పారిపోయిందనీ, ఇంకా, శ్రమణవృత్తి స్వీకరించి బౌద్ధసంఘంలో చేరిందనీ రకరకాలుగా పుకార్లు మాత్రం వినిపిస్తున్నాయి. నా ఉద్దేశ్యం, ఆమెను రాజధాని నుండి రహస్యంగా వేరే పదిలమైన ప్రదేశానికి తరలించారని...’

అంతవరకూ శ్రీముఖుని పక్కనే ఉండి అందరినీ శ్రద్ధగా ఆలకిస్తున్న అమాత్యులు అనంతపాలుని సన్నని పొడి దగ్గు, ఘంటారావం వలె వినిపించింది.

ఒక్కసారిగా నిశ్శబ్దం. అందరి చూపులూ ఆయనపై నిలిచాయి. ఆయన విశ్వామిత్రగోత్రుడు. చతుర్వేది. శ్రీముఖునికి తొలి గురువు. శాతవాహన ప్రభువుకే గాక సకలాంధ్ర మహాభోజులకూ ఆయన మాట వేదవాక్కు. వైదిక సంస్కృతికి కంటకశైలంలో గల వారి ఆశ్రమం సమస్త దక్షిణాపథంలోనే పేరెన్నిక గలది. బౌద్ధ, జైన మత ప్రభంజనాలు దక్షిణదేశంలో ప్రవేశించటానికి కొన్ని వందల ఏండ్ల మునుపే, ఆర్య సంప్రదాయాలనూ, వర్ణాశ్రమ ధర్మాలనూ ఈ దేశానికి పరిచయం చేసిన గణ్యత వారి వంశానిదే. పులింద, శబర, ములక, అశ్మక మొదలైన ఆంధ్ర జాతుల రాజులకు ఆ వంశస్థులే కులగురువులు. వారిలో అగ్రగణ్యుడు అనంతపాలుడు.

‘నాగసేనా! కళింగంలో జరిగిన ఈ రాజద్రోహ చర్య ఒక రహస్యయుక్తిలో భాగమే. యువరాజు శ్రీముఖునికి అంతా విశదమే. మీకూ తెలియవలసిన సమయం వచ్చింది. కుమారా! ప్రస్తుతం నీ

చెల్లెలికి వచ్చిన ఆపద ఏదీ లేదు. ఇది తాత్కాలికమైన ఇబ్బంది మాత్రమే. స్థిమితపడు. ఆమె ఇప్పుడు బావరికొండపై, థేర ధమ్మపాలుని ఆరామంలో ఉంది. అంటే నా తమ్ముని ఇంట అతిథిగా ఉంది,' అంటూ చిరునవ్వు నవ్వుతున్న అనంతపాలుని చూసి నోరు తెరిచి కళ్ళు తెల్లవేసాడు, నాగసేనుడు.

'వైదిక సంప్రదాయానికి ఆటపట్టయిన ఆచార్య అనంతపాలుని సోదరుడు ఒక బౌద్ధుడా? అందునా ఒక సామాన్యుడుగాక కళింగ దేశానికే తలమానికమైన ఆచార్య ధమ్మపాలుని వెనుక ఇంత రహస్యమా? ఏమిటి ఈ యుక్తి? దీని కర్త ఎవరు?' వివరణ కోసం ప్రశ్నించే కళ్ళతో శ్రీముఖుని వంక చూసాడు.





# 15

దక్షిణారామానికి పశ్చిమంగా ఒక కోసు దూరంగా శ్రీముఖ శాతవాహనుని విడిది. ఆంధ్ర సైన్యం రెండు భాగాలుగా విడివడి వేర్వేరు మార్గాలలో పయనించాయి. ఒకటి నాల్గు స్కంధావారాల సేనా, గజ బలమూ ఉత్తర మార్గంలో ధవళేంద్రంవద్ద పెద్ద యేరు దాటి పది కోసుల వెడల్పుగా గౌతమీ తీరంలో విడిసింది. ఇక రెండవ సైన్యం ఉప్పుటేరుకు దక్షిణంగా సాగరతీరం వెంబడి ప్రయాణించి, దక్షిణారామానికి తూర్పున నావలలో గౌతమిని దాటి అదే వేగంతో పిష్ఠపురంచేరి, అక్కడి కటకాన్ని ఎటువంటి అడ్డగింపూ లేకుండా వశపర్చుకుంది.

'తమ అనుగ్రహంతో ఇంతవరకూ ఎటువంటి ఎదురూ లేదు. దక్షిణ కళింగం పూర్తిగా మన వశమైనట్లే. ఇక ఎటువంటి ప్రాణనష్టం లేకుండా కళింగాన్ని ఆ మహాతలవరి మేఘరాజు నుండి విడిపించుటే మిగిలింది' అంటూ మరోసారి నమస్కరించాడు, శ్రీముఖుడు.

'అదే మా ఉద్దేశ్యం కూడా. ఎట్టి పరిస్థితిలో ప్రాణనష్టాన్ని ఆపడమే మా ఉద్దేశ్యం. సోమయాచార్యులు కూడా అదే విషయం మీతో విన్నవించారు. ఆ వార్త తీసుకునే వచ్చాను' అంటూ కొంచెం తటపటాయిస్తూ ఆగాడు దక్షిణారామపు బౌద్ధాచార్యుడు వశిష్ఠదత్తుడు.

'విన్నపమేల? ఆజ్ఞాపించండి. వారి ఆజ్ఞ మా శాతవాహనులకు ఎల్లప్పుడూ శిరోధార్యం'

'నిజమే. కానీ ఆ నాగసేనుడు తప్పించుకొని మీ రక్షణలోనే ఉన్నాడని కొన్ని గాలి వార్తలు. ఎంత నమ్మరానిదైనా ఈ వార్త ఎడతెగకుండా మమ్మల్ని చేరుతూనే ఉంది. కొంచెం కలవరపడక తప్పకుంది.'

'అతను తప్పించుకోవటం దురదృష్టకరమే. కళింగమంతా జల్లెడ పట్టి అయినా అతనిని తప్పకుండా పట్టవలసిందే' అంటూ పక్కనే బవిరి గడ్డముతో ఒక సైన్యాధ్యక్షుని వేషంలో కూర్చొని ఉన్న నాగసేనుని చూసి, 'అతనిని వెదికి పట్టే బాధ్యత మీదే, ఏమంటారు, నాగబుదొరా?' అన్నాడు.

'తమ ఆజ్ఞ. సమయం మించిపోకుండా ఆ నాగసేనుని పట్టి మీకు అప్పగిస్తాను. ఇక మీరు ఆ విషయం మర్చిపోవచ్చు' అంటూ దాగని చిరునవ్వుని అణుచుకుంటూ తలపై చేయి ఉంచి ప్రమాణం చేసాడు, మారువేషంలో ఉన్న నాగసేనుడు.

'ఇక ఈ విషయంలో చింత అనవసరం. మన నాగబుదొర తలిస్తే అతనిని పట్టడం నిశ్చయం. మీకు తెలిసే ఉంటుంది ఆచార్యా, వీరు మన కొడబలిదొర సోదరుడు, ఉదయశైల దళపతి' అంటూ అతనిని పరిచయం చేసి, 'ఇక సోమయాచార్యుల ఆదేశం ఏమిటో సెలవిస్తే...'

'అదే, ఐరావతదేవుని తిరుగుబాటు వెనుక ఏదో అదృశ్యశక్తి ఉన్నదని వారి అనుమానం. ఈ కుట్రలో మగధరాజు హస్తం ఉందని మొదటగా అభిప్రాయపడ్డారు. అయితే అది అవాస్తవమని

రూఢీగా తెలిసింది. అదేదో బౌద్ధధర్మానికి వ్యతిరేకంగా, ఆ అశోకుని కసికి బౌద్ధసంఘాలను ఎరవేయటానికి చేసిన కుతంత్రంగా తోస్తుంది అని వారి అభిప్రాయం మీకు తెలుపమన్నారు. మీరు కొంచెం సావధానంగా వ్యవహరించి సంఘాల్ని రక్షించాలని వారి విన్నపం.'

'తప్పకుండా... బౌద్ధధర్మరక్షణ దీక్షాబద్ధులం. ఎట్టి పరిస్థితుల్లో మా ద్వారా కళింగంలోని సంఘారామాలకు ముప్పు వాటిల్లదు. ఇది మా హామీ. మీరు నిశ్చింతగా ఉండవచ్చును.'

'మంచిది, ఇక మేఘరాజతలవరుల విషయం. వారెందుకు ఆ ఐరావతదేవులతో చేరారో ఎంతకూ అంతుపట్టకుంది. వారిని ఈ చర్యకు ఎవరు ప్రోత్సాహించారో తెలియ రావడం లేదు. మొన్నటి వరకూ వారు కళింగాంధ్రాలను సంఘటిత పరచటానికే యత్నం చేస్తున్నారు. వారి మనస్సు ఈ విధంగా ఎలా మారిందో? మీరు ఆ విషయంలో కాస్త జాగ్రత్త పడాలి.'

'అదే మాకూ అంతుపట్టకుండా ఉంది. మేఘరాజులు కారువాకీదేవికి స్వంత మేనమామా, అత్యంత ఆంతరంగికులూనూ. ఈవిధంగా రాజకుటుంబానికి ఎందుకు ఎదురుతిరిగారో? వారు మా తండ్రిగారికి కూడా మంచి సన్నిహితులు', అని ఒక క్షణం ఆగి, 'ఆచార్య, తమతో ప్రస్తావించవలసిన విషయం మరియొకటి ఉన్నది. దక్షిణారామం ఆంధ్ర కళింగాల ఎల్లలో ఉండటం వలన తమరు మా రెండు రాజ్యాలకూ శ్రేయోభిలాషులు. యుద్ధనివారణ మాకునూ ఇష్టమే. మీరే ఏదోవిధంగా కలుగజేసుకొని వారితో మేము చెప్పవలసిన విషయమొకటి మనవి చేయవలసింది'

'సంధి ప్రయత్నం అందరికీ శ్రేయస్కరమే. కానీ మగధ సైనాలు ఈపాటికి ఉత్కళంలో ఇరావతదేవునితో తలపడి ఉండవచ్చు. ఇప్పటికే చాలా ఆలస్యం అయిందేమో?'

'నిజమే. కానీ పదుగురికీ మంచి జరిగేటప్పుడు, ఎంత ఆలస్యమైనా ప్రయత్నించడంలో తప్పులేదనుకుంటాను... అందుకే మా మాటగా వారికి ఈ వర్తమానం అందజేయండి. ఇది తుచ తప్పకుండా అతిరహస్యంగా వారివద్ద తమరు పలుక వలసింది. జాగ్రత్తగా వినండి...

'మహారాణి కారువాకీదేవిని క్షేమంగా మాకు అప్పగించాలి. అదీ ఆంధ్ర సైన్యం బావరికొండ చేరేలోపల జరగాలి. బదులుగా విశాఖాదేవి యొక్క భర్తను సకల కళింగ రాజ్యానికి అధిపతిని జేయటానికి శ్రీ శాతవాహన మహాభోజులు తమ శాయశక్తులా ప్రయత్నిస్తారు. యుద్ధ పర్యవసానం ఏమైనా సరే, ఆంధ్రజన సంఘటనం ఈ ఒడంబడికకు కట్టుబడి ఉంటుంది.'

విన్నవెంటనే నోరు వెళ్ళబెట్టిన ఆచార్యుడు, కొంత తేరుకొని, 'దీనికి ఆ చండాశోకుడు అంగీకరిస్తాడా?' అన్నాడు.

'అది మనచేతిలో లేదు. అయినా మగధ చక్రవర్తి సేనలతో ఐరావతదేవుని జయించి కళింగ రాజధాని చేరేసరికి ఇంకా ఒక మాసం పట్టవచ్చు. అప్పటి విషయం అప్పుడే ఆలోచించటం మంచిది. ఈలోగా తమరు ఏ అంతరాయమూ లేకుండా కళింగపట్టణం వెళ్ళటానికి కావలసిన ఏర్పాట్లు చేయగలం. మీరు సరేనంటే ఈరోజే మీ ప్రయాణం. ఏమంటారు?'

'నా ఈ ప్రయత్నం వలన యుద్ధం ఆగగలదంటే సరే. ఇప్పుడే ప్రస్థానం అవుతాను', అన్నాడు వశిష్ఠదత్తాచార్యుడు.





# 16

> **విశాఖపట్టణం చరిత్ర**
>
> ప్రభుత్వ రికార్డులలో ఈ విధంగా ఉంది... 1866వ సంవత్సరంలో, అప్పటి, గంజాం జిల్లా కలెక్టరు రాసిన విశాఖ జిల్లా మాన్యువల్ ఆధారంగా అప్పటికి నాలుగు వందల ఏళ్ళ కిందట, తీర్థపురాళ్ళ వద్ద కులోత్తుంగుడనే చోళరాజు, ఒక కుమారస్వామి ఆలయం కట్టించాడట. అది కాలగర్భాన సముద్ర గర్భంలో కలిసిపోయిందట. విశాఖ అనేది కుమార స్వామి పేర్లలో ఒకటి. ఆ విధంగా ఆ ఊరికి విశాఖపట్టణం అనే పేరు వచ్చిందట. బాగుంది! కానీ, ఆ వాదన, ఉట్టి పుక్కిటి పురాణమే!
>
> ద్రాక్షారామంలో భీమేశ్వరస్వామి ఆలయంలో క్రీశ. 1168కి చెందిన ఒక శాసనంలో, విశాఖపట్టణానికి చెందిన ఒక వర్తకుడు స్వామివారికి ఒక 'అఖండ లోహవర్తి' సమర్పించాడని రాసివుంది. అంటే వెయ్యి సంవత్సరాల క్రిందటే, విశాఖ ఒక వర్తకకేంద్రం అని తెలుస్తుంది.
>
> విశాఖ అనే వ్యక్తినామాలు బుద్ధచరిత్రలోనే కాక అమరావతి శాసనాలలో కూడా కనిపిస్తాయి. అంటే, విశాఖ అనబడే ఎవరో ఒకరి పేరు మీద ఈ పేరు వచ్చి ఉండవచ్చు.
>
> విశాఖ చుట్టూ ఉన్న చారిత్రాత్మక ఆలయాలూ, శిధిలాలూ, ఈ ప్రదేశానికి ఎంతో ప్రాచీనకాలం నుంచీ ఉన్న ప్రాముఖ్యాన్ని చాటుతాయి. ఉదాహరణకి, బావికొండ, తొట్లకొండ, బొజ్జనకొండ మొదలైన ప్రదేశాలలో దొరికిన క్రీపూ. నాటి శిధిలావశేషాలు.
>
> అతి ప్రాచీనమైన విశాఖ చరిత్రకి ఈ ప్రభుత్వ రికార్డులు న్యాయం చేయవు.

**సిం**హాద్రికి దక్షిణంగా రెండు పర్వత శ్రేణుల నడిమి లోవ. ఒక వైపు సముద్రం. ప్రకృతిసిద్ధమైన ఆ పర్వతాలే ఆ మహా సైన్యానికి కోటగోడలు. అక్కడ నుండి రెండే దారులు. ఒకటి తీరంవెంబడి కనుమ మార్గం. రెండవది వాయవ్యంగా శృంగపురి ద్వారా మహాకాంతారానికి వెళ్ళే దుర్లభమైన అడవి దారి.

సాగరమధ్యంలోకి చొచ్చుకుపోతున్న ఒక మహానౌకలా ఉన్న కపోతగిరి శిఖరంపై సైన్యాధ్యక్షుడు శ్రీముఖుని శిబిరం. కనుమ దారి సంరక్షిస్తూ కనుచూపుమేర వరకూ మోహరించి ఉంది కళింగ సైన్యం.

అస్తమిస్తున్న సూర్యుని వెలుగులో ఆ వైపు చూస్తూ, 'ఒకసారి ఆ దుర్భేధ్యమైన అడ్డు దాటితే ఇక కళింగపట్టణం వరకూ ఎటువంటి అవాంతరమూ ఉండదు. కానీ ముఖాముఖి పోరులో వారిని జయించి ముందుకు పోవడం అసంభవం' అన్నాడు నాగసేనుడు.

కానీ, శ్రీముఖుని చూపు మాత్రం సముద్రం పైనే, సుదీర్ఘంగా దేనికో ఎదురు చూస్తున్నట్లు.

'ఆ... ఏమన్నారు, మిత్రమా?' అంటూ వాస్తవంలోకి వచ్చాడు.

‘అదే. కనుమదారి మా కళింగ సైన్యానికే అనుకూలం. అందునా కొండ అంచులో వారిదే పైచెయ్యి అవుతుంది. పైనుంచి అంబుల వర్షమే కాక బండరాళ్ళు కూడా కురిపించగలరు. దానికి తోడు కంపకోట, కనీసం ఒక కోసు దూరం ప్రయాణిస్తేగానీ అవతలకు చేరలేము. అంటే అపారమైన సైన్య నష్టం తప్పదు. ఆ వంకనుండి సహాయం లేకుంటే అదీ కష్టమే.’

‘అంటే వేరే దారిలేదంటారు? సరే... ఇక వేచిచూడటమే. మగధ సైన్యాలు మీ రాజధానిని పట్టి మనవద్దకు వచ్చేవరకూ మన విడిది ఇక్కడేనేమో? ఏమంటారు, భొట్లుగారూ?’ అంటూ చిరునవ్వుతో సోంభొట్ల వంక చూసాడు.

సోంభొట్లు నవ్వుతూ, ‘అంతేనేమో యువరాజా, ఒకవైపు మహాపర్వతం, మరో వైపు అగాధమైన సాగరం. వేచి చూడటం తప్పేట్లు లేదు. కనీసం ఈ రాత్రి గడిచే వరకూ’.

‘అంటే?’

‘ఒక నిమిషం ఇటు చూడండి’ అని సముద్రం వంకకు తిరిగాడు శ్రీముఖుడు. అలుముకున్న చీకట్లో ఆకాశం నుంచి చుక్కలు కిందకి రాలినట్లు మిలమిలలాడే దీపాలతో నీలి సముద్రం నిండిపోయింది. వందల కొలదీ నౌకలు. విస్మయచకితుడై నాగసేనుడు కొద్దిక్షణాలు అలాగే మ్రాన్పడిపోయాడు.

‘అది ఆంధ్ర నావసేన మాత్రమే. మగధ నౌకాబలం ఈ రాత్రికి ఇక్కడికి తూర్పున నేల తాకనుంది. ఇక మీ కళింగసేనలు అడకత్తెరలో వక్కలవలె చిక్కక తప్పదు. నావసేన ఉప్పాడ రేవు తాకిన తక్షణమే సింహగిరి కొండలలో కాసిన కొడబలిదొర తన దండుతో కనుమ పైనున్న శత్రువుపై పడతాడు. కంపకోట తగులబడే మంటలే, మన సైన్యం ముందుకు కదిలేందుకు సంకేతం. ఆంధ్ర నావలు బావరికొండకు తూర్పున నిలిచి సైన్యానికి వెన్నుకాసేందుకు యుద్ధయంత్రాలతో సిద్ధంగా ఉంది. ముందుభాగంలో కొంత సైన్యనష్టం అయినా రేపు సాయంత్రానికి మార్గం సుగమం అవక తప్పదు’ అంటూ తన యుద్ధరచనను వివరించాడు దక్షిణ సైన్యాధ్యక్షుడు శ్రీముఖుడు.



లోయలో నాలుగు స్కంధావారాల ఆంధ్ర సేనలు. కొండ అంచున కళింగ దళాలు. అది పెద్ద గాలివానకు ముందుండే ప్రశాంతత. రాత్రి మూడవ యామపు ప్రారంభాన్ని ప్రకటిస్తూ పహరా భటులు చేసే నినాదాలు తప్ప వేరే అలికిడి లేదు. ఈ జాము గడిస్తే అర్థరాత్రి. యుద్ధం రేపే.

అది బావరికొండ. తథాగతుని దర్శించిన బావరిదేవుని శిష్యునిచే స్థాపించబడిన పవిత్ర క్షేత్రం. అతి రహస్యమైన ఈ సమావేశానికి తగిన స్థలం.

ఎనిమిది జట్ల అశ్వికదళం చుట్టిరాగా రథారూఢుడై వచ్చిన కొడబలిదొర, ఆచార్యుడు ధర్మపాలుని చూడగానే రథం దిగివచ్చి నమస్కరించాడు.

‘లే దొరా. అంతా మనం కోరిన విధంగానే జరిగింది అని మీ ప్రభువులకు చెప్పు. వారి అడుమానం ఈ పల్లకిలో ఉంది. నౌకాబలం కనిపించిన తక్షణమే ఈ కనుమను రక్షించటం

సంభవం కాదని గుర్తించిన తలవరి కళింగసేనలను వెనుకకు తగ్గమని ఆదేశించారు. ఇక మేఘరాజులు కోరినది వారికి ఇస్తే చాలు, ఈ యుద్ధం ఆగినట్లే'.

'యుద్ధం తప్పదు. చక్రవర్తికి కళింగ దేశ వినాశనమే ధ్యేయం. ఎంత మాత్రమూ ఆ పట్టు వీడుటనేదిలేదు.'

'అంటే, ఓఢ్రం బలిగాక తప్పదన్నమాట? మరి మేఘరాజు అల్లుడిని రాజుని చేస్తానని మీ ప్రభువు మాట?'

'అహ్ హ! ఒక్క ఓఢ్రమే కాదు. మొత్తం కళింగాన్ని శత్రునిశ్శేషం చేయడమే ప్రభువుల ఉద్దేశ్యం. మేఘరాజులకు ఇచ్చిన మాటే కాదు, చక్రవర్తికి ఇచ్చిన మాట కూడా తప్పరు. మీరే చూస్తారుగా!'



# 17

మహానది ఒడ్డున విడిసిన ఇరవై స్కంధాల మహాసైన్యం. ఒక స్కంధానికి మూడు వందల గజబలం, ఒక్కొక్క ఏనుగుకూ ఐదు అశ్వదళాల రక్షణ వలయం. దళానికి ఒక అశ్వయోధుడూ, పన్నెండు మంది కాలి బంట్లూ. వీరికి తోడు ధనుర్యోధుల దళాలు ఇరవై. దళానికి వందమంది మేటి విలుకాళ్ళూ, వారికి సహాయంగా అంబులపొదులు మోసేందుకు మనిషికి ఇద్దరు బోయీలు. ఇవిగాక ప్రత్యేకమైన యంత్రదళాలు.

ఒక్కొక్క దళానికీ ఒక్కొక్క శిబిరం. ఎవరి పనులు వారివే. మగధ సేనలో సేవకులకూ, స్త్రీలకూ ప్రవేశం లేదు, వారస్త్రీలకు కూడా. మద్యపానం పూర్తిగా నిషిద్ధం. దళాలకు కావలసిన సమస్త సంభారాలతో ఎడ్లబండ్లపైనా లేదా ఒంటెలతో ప్రయాణించే జీతగాళ్ళు. వీరి భత్యాలూ, రక్షణా ఆయా దళాల బాధ్యతే.

ప్రతి స్కంధానికి చుట్టుపట్ల గ్రామాల నుండి సేనాభుక్తం సేకరించటానికి ఒక మహామాత్రునితో కూడిన ఉద్యోగదళం. వీరు గాక లేఖకులు, భాండాగారికులూ. మహాసముద్రాన్ని తలపించే ఈ మగధ సేనా సమూహాన్ని ఒక చమురుకందెన పూసిన మహాయంత్రంలా నడిపింప జేయడమే వారి కర్తవ్యం.

ఈ మహాసాగరం మధ్య ద్వీపంలా ఇరవైవేల మూలబల రక్షణలో రాజ సౌధాన్ని మరపించే చక్రవర్తి శిబిరం.

దేవానాంప్రియ ప్రియదర్శి అశోకచక్రవర్తి నల్లబల్లపై కూర్చొని ఉన్నాడు. విప్పిన సిగముడి. చందన కస్తూరికాది సుగంధ తైలాలతో మెరుస్తూ కండలు తిరిగిన అతని నల్లని మేనిపై, అంగవస్త్రం తప్ప వేరే ఆచ్ఛాదన లేదు. చుట్టూ మహామల్లులను తలదన్నే అతని అంగరక్షకులు అందరూ స్త్రీలే!

వారి మధ్య సుఖాసీనులై మహామాత్యులు రథగుప్తులూ, ఆంధ్రమహాభోజుని ప్రతినిధిగా విచ్చేసిన మహర్షితుల్యులు శ్రీ అనంతపాలామాత్యులూ.

'కళింగాంధ్రాలలో బౌద్ధం ఒక విషవృక్షంలా పాతుకొని పోయింది. యవన వర్తక సంఘాలచే ప్రేరేపితులై నిరంతర ధనార్జనకాంక్షతో దేశ రాజకీయాలనే నిర్దేశించాలనేదే వారి ఉద్దేశ్యం. వారి పలుకుబడి రోజురోజుకీ ప్రబలిపోతుంది. ప్రజలలోనే కాదు గణరాజ్యాలలో కూడా వైదిక అర్ష సంప్రదాయాలకు విలువ తగ్గిపోయే ప్రమాదం ఉంది. చతుస్సాగర వేలావలయితమైన ఈ భరతఖండాన్ని ఒక తాటిపై తేవటం ఒక వైదిక మతం ద్వారానే సాధ్యం. పురాణపురుషులైన

## దేవానాం ప్రియ

అన్ని రాజ బిరుదాలతో అశోకుని పూర్తి పేరు– 'దేవానాంప్రియ ప్రియదర్శి రాజా అశోక'

ఇందులో 'అశోక' అనేది అతడి అసలు పేరు. రాజ్యాధికారం చేబట్టాక అతడు స్వీకరించిన నామం 'ప్రియదర్శి' అయ్యుండవచ్చు అని అశోకుని జీవితంపైనా, ప్రాచీన చరిత్రపైనా అనేక పరిశోధనలు చేసిన రోమిలా థాపర్ అభిప్రాయం.

ఇక 'దేవానాంప్రియ' అనే పేరు ఆ కాలంలో ప్రాచుర్యంలో ఉన్న రాజబిరుదం. తనకంటే ముందే అనేకమంది రాజులు ఆ బిరుదు ధరించారని అశోకుని 8వ శిలాశాసనం పేర్కొంది. అతడి సమకాలీనుడు, శ్రీలంక రాజు, 'తిస్స'కి కూడా ఆ బిరుదు ఉంది. వాల్మీకి రామాయణంలో రాముడికి ఉన్న పేర్లలో ఇది ఒకటి.

పతంజలి మహాభాష్యం అనే వ్యాకరణ గ్రంధంలో దేవానాంప్రియ అనేది 'ఆయుష్మాన్', 'దీర్ఘాయు' లాగానే ఒక దీవెనె లాంటిది అన్నాడు! ఆ మాటకి అర్థం, 'దేవతలకి ప్రియమైనవాడు' అని. అది దీవెన ఎలా అయిందో అర్థం కాదు. 'ఖుధాకో ప్యారా హోగయా' (దేవుడికి ప్రియమయ్యాడు) అంటే బాల్చీ తన్నేసాడు అని ప్రస్తుతం మనకి తెలిసిన అర్థం. అందుకనేనేమో, దేవానాంప్రియ అంటే మూర్ఖుడు అని మరో అర్థం కూడా చెప్పాడు, పతంజలి. బౌద్ధం స్వీకరించాడని, బ్రాహ్మణ ధర్మం ఆచరించే వారికి కోపమేమో?

శ్రీరామ, యుధిష్టిరాదుల తరువాత ఈ సమస్త భరతావనిని ఏకఛత్రఛ్ఛాయలోకి తెచ్చిన ఏకైక సామ్రాట్టులు మీరు. ఈ భూమిని మలినపరుస్తున్న నాస్తికవాదాన్ని కడిగి స్థిరమైన వైదిక సంప్రదాయాలను నెలకొల్పటం ఈ కలియుగంలో తమ చేతనే సాధ్యం' అంటున్న అనంతపాలుని అనర్గళమైన భాషణానికి అడ్డుకట్ట వేస్తూ, రథగుప్తామాత్యుడు...

'మీరు చెప్పేదానిలో కొంత యదార్ధము లేక పోలేదు స్వామీ. కానీ ఈ భరతఖండం అనేక మతాలకూ, వాదాలకూ ఆలవాలం. అనాదియైన వైదిక సంప్రదాయాలు ఎప్పుడో ఉడిగిపోయాయి. వేదాంతార్థమైన అద్వైతానికీ బౌద్ధానికీ సాన్నిహిత్యం మీరెరిగినదే. ఉపనిషత్తుల వాదాల కంటే, నిర్గ్రంధ, చారువాకాది హేతువాదాలు నాస్తికాలు కాదు. ఇవిగాక పుట్టకొకటీ చెట్టుకొకటీ అన్నట్లు అనేక గణ జనజాతుల నమ్మకాలూ, అసంఖ్యాకమైన దేవుళ్ళూ. వీరందరిపై ఒకే మతాన్ని నిర్దేశించటం వలన ప్రజలు చక్రవర్తిపై తిరుగబడే అవకాశమే ఎక్కువ. అయినా ఇప్పుడు మన అవసరం వేరు, భిన్న సంప్రదాయాలు ఒక్క రోజులో తుడిచేయడం అసాధ్యం. అందరికీ మన సామ్రాట్టును ప్రీతిపాత్రునిగా చేయడమే ప్రస్తుత రాజకీయ అవసరం'.

'కానీ చక్రవర్తికి వ్యతిరేకంగా ఆ ఐరావత దళవరిని ప్రేరేపించింది మాత్రం ఆ బౌద్ధసంఘాలే, కళింగ రాజ్ఞి చారువాకీ దేవి కూడా తిష్యస్వామి రక్షణలో ఉందని వినికిడి. ఇక ఆంధ్ర సైన్యాలు బావరికొండ వద్ద దక్షిణకళింగ సేనలను సునాయాసంగా గెలిచి తిరోగమనుల్ని చేసాయి. ఇప్పుడు సర్వతోభద్రమైన వ్యూహంతో కళింగరాజధానివైపు రోజుకు రెండుయోజనాల వేగంతో ప్రయాణిస్తున్నాయి. వచ్చే పౌర్ణిమకు కళింగపట్టణం ముట్టడించవచ్చు. తమరు ఐరావతుని తుదముట్టించినదే తడువు కళింగం చక్రవర్తి ఆధీనం అయినట్లే. ఆ పిమ్మట బౌద్ధసంఘాల ద్రోహ చింతనకు తగిన గుణపాఠం నేర్పవలసింది అనే మా విన్నపం.'

అంతవరకూ అంగమర్ధకుల సేవలందుతూ నిశ్శబ్దంగా వారిని ఆలకిస్తున్న అశోకుడు ఒక్కసారిగా

లేచి, మునివేళ్ళతో ముంగురులు వెనక్కి నెట్టి, ముడి బిగించి, ఏదో నిర్ణయానికి వచ్చిన రీతి పెదిమలు పంటనొక్కి, 'అమాత్యా, వెంటనే సోదరుడు శ్రీముఖునికి మా ఆదేశం వచ్చేవరకూ నాగావళీ నదీతీరాన్నే ఆగమని వర్తమానం పంపవలసింది. మహేంద్రగిరి శ్రేణుల నుండి ఎటువంటి ఆటవిక దళాల సహకారం కళింగ రాజధానికి చేరకుండా నిరోధించటం వారి బాధ్యత. ఇక సేనాపతి వైదేహీపుత్రుని, చతుర్దళాధిపతులతో రెండవ యామం ముగియునప్పటికి యుద్ధతంత్ర విచారణార్థం శిబిరానికి రావలసిందిగా ఆదేశించండి' అని అనంతపాలుని వంక తిరిగి, 'అనంతామాత్యా, మా గురుదేవుల అభిప్రాయం ఏమైనప్పటికీ, మేము మాత్రం మీతో పూర్తిగా ఏకీభవిస్తాం. మగధాధిపత్యానికి ఎదురు తిరిగితే జరిగే పర్యవసానం ఏమిటో సమస్త భరతావనికి తెలియజేయడమే మా ఉద్దేశ్యం. ఎత్తిన తల ఎవరిదైనా సరే తెగి నేలపడవలసిందే, ఉపేక్షించేది లేదు. మీకు ఆ విషయంలో చింత అనవసరం'.

అని ఒక క్షణం ఏదో ఆలోచించి, 'ఇక మాదొక చిన్న మనవి. యుద్ధానంతరం చక్రతీర్థపు ఒడ్డున గల గోవర్ధనక్షేత్రంలో...' అంటూ అనంతపాలునికి తన ఉద్దేశ్యం పూర్తిగా వివరించాడు అశోక చక్రవర్తి.





# 18

**లో**తుగా ప్రవహించే రెండు పాయల నడుమ కటకపురి. ఉత్తరకళింగపు ముఖ్యపట్టణం. మూడు అగడ్తలూ, ప్రాకారాల మధ్య గల జలదుర్గం. దానికి మూడు మహాద్వారాలు. ఐరావతదేవుడు ఉత్తరపు ద్వారపు గుమ్మటంపై నిలిచి చుట్టూ కలయజూసాడు. అవతలి ఒడ్డుపై నాలుగు కోసుల నిడివితో మహాసాగరాన్ని మరిపించే మగధ సైన్యం.

మగధ సైన్యం అక్కడ విడిసి రెండు వారాలయింది. లక్ష సైన్యం కోటలోనే ఉంది. అదిగాక తూర్పు, దక్షిణపు రేవులకు ఎట్టి ఆపదా లేదు. సైన్యభుక్తానికి లోటు లేదు.

'ఎంతటి సైన్యమైనా ఈ ఐరావత మహాదేవుని రక్షణలో ఉన్న కటకాన్ని పట్టడం అసాధ్యం. దేవానాంప్రియుడట! ముక్కోటి దేవుళ్ళు వానికి సాయం వచ్చినా ఈ మహానది ప్రవాహాన్ని దాటలేడు. ఇంకొన్నాళ్ళు చిందులు తొక్కి తోక ముడిచి తిరోగమిస్తాడు. హహహ్!' అంటూ పక్కన నిలిచిఉన్న తన మంత్రివర్గం వంక చూస్తూ మీసం మెలివేసాడు ఐరావతదేవుడు.

'తథాస్తు, ఇక పడమటి వీరులు నాగావళీ తీరంలో ఆగిపోయారట. అంధకులని ఊరకే అనలేదు. కళింగవీరుల ధాటికి కళ్ళు బైర్లుగమ్మి ఉంటాయి' అంటూ వత్తాసు పలికాడు, పట్టణనాయకుడు గంజరాజకేసరి.

'మనం కటకంలో ఉన్నంత వరకూ ఎటువంటి విపత్తూ లేదు. ఒక్కొక్క ఓఢ్ర వీరుడూ పదిమంది గంగపుత్రుల పెట్టు. పట్టణ రక్షణకు ఇంత మంది అవసరం లేదు. కొంత సైన్యం రాజధానికి మా మామకు సహాయంగా పంపితే' అంటూ తన ఆలోచనను బహిర్గతం చేసాడు.

'మీ ఆలోచన మంచిదే. కానీ రాజధానికి ఇప్పుడు వచ్చిన ఆపద ఏమీ లేదు. కొన్నాళ్ళు వేచి చూడటమే ఉచితం. పైగా నది పైభాగంలో దాటేందుకు మగధ సైన్యాలనుండి ఎటువంటి ప్రయత్నాలూ ఇప్పటి వరకూ మన దృష్టిపథానికి రాకపోయినా, వారు ఏదో ఒక సమయంలో అలా ప్రయత్నించక తప్పదు. అంతవరకూ నదీ తీరరక్షణ పటిష్టం చేయడంలో మనం కాస్త జాగ్రుతంగా ఉండటం అవసరమేమో?' అంటూ దళపతిని హెచ్చరించాడు గంజరాజు. ఎక్కడో ఉన్న రాజధానికంటే తనదైన కటకపురి రక్షణే అతని ప్రథమ ధ్యేయం.

'ఎందుకయ్యా భయం? సరే, నీవు చెప్పినట్లే ఈ అశోకుడు తోకముడిచిన పిమ్మటే మనం ఆ ఆంధ్రుల పనిపడదాం. రేపు ఉదయాన్నే ఒక స్కంధం నది పైన మోహరించే పని చూడండి' అని సేనాపతులను ఆదేశించి అక్కడనుండి కదిలాడు, ఉత్కళ సేనాధ్యక్షుడూ, కాబోయే కళింగ దేశాధిపతి, ఐరావతుడు.



కృష్ణపక్షపు చీకటి రాత్రి. నాల్గవ జాము. కటకపురికి పశ్చిమంగా ఒక కోసు దూరం. మహానది రెండు పాయలుగా చీలే ప్రదేశానికి కొంచెం దిగువ.

ఐదువేల ఏనుగులు ఉత్తర వాహినిలోకి ఉరికాయి. మావటి వాళ్ళ అంకుశ ఘాతాలకి అవి పెట్టే ఘీంకారాలు ఒక్కసారిగా మిన్ను ముట్టాయి. అంతవరకూ అడ్డులేని మహానదీ ప్రవాహం ఎదురుతన్ని దక్షిణపు దోవ పట్టింది. దిగువలో నది పారుదల పలచబడి నిలిచి పోయింది.

కనుమూసి తెరిచేలోగా మూడు లక్షల కాల్బలమూ, యుద్ధయంత్రాలూ, అగడ్తలు దాటే పలకలూ, నిచ్చెనలతో కటకాన్ని తాకాడు అశోకుడు. ఊచకోత మొదలయింది. తన సేనల హాహాకారాలు, సుఖనిద్రలో ఉన్న అతని చెవికి చేరేసరికే, ఐరావతుని మందిరం మగధ సైన్యాల ముట్టడికి లోనైంది.

కటకం వశమయిన ఉత్సాహంతో, బల్లెంపై నిలబెట్టిన ఐరావతుని శిరస్సే విజయధ్వజంగా ముందుకు కదిలిన మగధ సైన్యం, ఉత్కళ దేశాన్ని ముంచేసింది.

యుద్ధానికి బలియైన వారు లక్షకు పైబడగా, ఇక క్షతగాత్రులు అసంఖ్యాకం. చేతనైన వారు కాళ్ళకు బుద్ధిచెప్పి అడవుల్లోకి పారిపోగా మిగిలిన వారిని బంధించి, జట్లు జట్లుగా వంగ, కోసల రాజ్యాలకు బానిసలుగా తరలించి, ఎదురు తిరిగినవారిని తెగటారుస్తూ ఇరవై యోజనాల నిడివితో నాడీనదికి ఇరువైపులా కదులుతున్న మగధ ప్రభంజనం ధాటికి ఉత్కళం స్మశానంగా మారింది. పురుషులందరూ సైన్యంలో జేరడంతో, గ్రామాలలో ఆడవాళ్ళూ, పిల్లలూ, వృద్ధులే తప్ప రక్షణ లేకపోయింది. అదుపు తప్పిన మగధ సైనికుల క్రూరత్వానికి గ్రామాలకు గ్రామాలే నిర్మానుష్యం అయ్యాయి.

### కటక్

క్రీశ. పదమూడవ శతాబ్దినుండీ స్వతంత్రం వచ్చేవరకూ, ఉత్తరకళింగ (ఉత్కళ) దేశానికి రాజధాని. గాంగ వంశపు, అనంగ భీమునిచే నిర్మింప బడిందని, పూరీ దేవాలయపు స్థల పురాణం చెబుతుంది. ఐతే... భౌగోళికంగా ఆ పట్టణానికి ఎంతో ప్రాముఖ్యముంది. మహానది రెండు పాయల మధ్య దుర్భేధ్యమైన జలదుర్గం.

ఇక్కడ నుండి ప్రస్తుత రాజధాని భువనేశ్వర్ వెళ్ళే దారిలోని తోసలి (ధౌలి) వద్ద కళింగయుద్ధం జరిగివుంటుందని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. ఆ ప్రదేశంలో దొరికిన అశోకుని శిలాశాసనాలే దానికి నిదర్శనం. అయితే అదే శాసనం ఒడిషాలోని జౌగడలోనే కాక ఆంధ్ర దేశంలో కూడా దొరికింది. అందువలన, 'శాసనం దొరికింది' అన్న ప్రమాణం ఒక్కటే సరిపోదు. పైగా, ప్రాచీన కళింగ రాజధాని ఒడిశాలో లేదు. సాంప్రదాయకంగా కళింగ రాజధాని 'దంతపురి' విజయనగరం జిల్లాలోని కళింగపట్టణమో, లేక శ్రీకాకుళం జిల్లాలోని ముఖలింగమో (మధ్యకళింగం) అయివుండాలి. అన్ని లక్షల ప్రాణనష్టానికి కారణమైన ఆ కళింగ యుద్ధం సరిహద్దులలోనే ఆగిపోయిందని సరి పెట్టుకోలేం.

మగధనుండి, అటు కోసలం (సంబల్పూర్) మీదుగా కానీ, ఇటు చంపా (బెంగాల్) నుండి గానీ అంత పెద్ద సైన్యం దాడిచేస్తే, తమను రక్షించుకునేందుకు మహానది నడిమిన కటక్‌ను మించి అనువైన ప్రదేశం లేదు.





# 19

ఐరావాతుని పరాజయానికి ముందే ధనికులూ, వర్తక శ్రేష్ఠులూ, వివిధ వృత్తి శ్రేణుల నాయకులూ చేతికందిన సువర్ణాది ధనద్రవ్యాలతో, విలువైన సరుకులతో పలాయనమై, చక్రతీర్థ సరోవర తీరంలోని యవనఘడ పట్టణం చేరారు. అది యవన వర్తకుల వలస దుర్గం, అభేద్యమైన రేవుపట్టణం. ఐతే, సముద్ర మార్గాలు మగధ నావసేనల ముట్టడిలో ఉన్నాయి. యవన సేనానాయకులచే సుశిక్షితులైన లక్షకు పైబడే సైన్య సిబ్బంది, వివిధ శ్రేణులచే ఆ దుర్గరక్షణకై నియోగింపబడ్డారు. అపారమైన ధనరాసులతో నిండిన ఆ దుర్గమే ఇక అశోకుని లక్ష్యమయింది.

'అంతియోగుని ప్రతినిధి యవన దియమార్కుల నుండి సందేశం వచ్చింది. సమాపా నగరంలోని యవనఘడ దుర్గంలో వెయ్యికి పైగా విదేశీయులు నివసిస్తున్నారు. వాళ్ళ క్షేమం గూర్చి పారశీక ప్రభువుల విచారమేమో?' అంటూ పత్రాన్ని సామ్రాట్టు చేతికిచ్చాడు, రథగుప్తుడు.

అతడు సంస్కృతం, పదహారు ప్రాకృతాలే గాక గాంధర, పారశీక, యవన భాషలూ, దక్షిణ దేశపు పాళీ, ద్రవిడ భాషలూ కూడా చదివి అర్థం చేసుకోగలడు. నైజమెంత క్రూరమైనదైనా, అతడు భరతావనికి చక్రవర్తి కాగల బహుభాషా ప్రజ్ఞాశాలి, చిన్నతనంలోనే తనతాత శ్రీ చంద్రగుప్త చక్రవర్తిచే ప్రేరితుడై, సకల భారత దేశాటనమూ చేసి, వైవిధ్యభరితమూ, భిన్నమూనైన దేశ సంస్కృతిని అధ్యయనం చేసిన దిట్ట. భారత దేశాన్ని రాజకీయంగా ఏకఛత్రం కిందకు తేవటానికి ఉక్కుపాదమొక్కటే ఉపాయం, దానికి యుద్ధమొక్కటే మార్గం అని అతని ప్రగాఢ విశ్వాసం. పోటెత్తి విరిగిపడే అలల వెనుక ఒక గంభీరమైన సాగరమున్నట్లే, ఆ చండాశోకుని కాఠిన్యం వెనుకనున్న ఆ పాండిత్యమే స్వంత తండ్రి అమిత్రఘాతుడు వ్యతిరేకించినా, మహామాత్యుడు రథగుప్తుడు అతనిని చక్రవర్తిని చేయటానికి కారణం.

హుమ్మని ఒక క్షణం ఆలోచించిన వాడై, 'ఈ కాళింగుల ప్రతిఘటనను పూర్తిగా కాలరాచిన పిమ్మటే, ఎటువంటి శాంతియైనా సాధ్యం. ఈ ప్రయత్నంలో ఇటువంటి అసౌకర్యాలు తప్పవేమో? యుద్ధానంతరం అన్నీ సర్దుకుంటాయి. అంతవరకూ నా ధ్యేయాన్ని ఎవరూ నివారించలేరు. అయినా, కోట మనదైన పిమ్మట, ఆ యవనుల ప్రాణాలకు ఎట్టి ఆపదా కల్పించమనే సందేశం ఒక దూతద్వారా పంపగలరు. మరొక విషయం, శ్రేణీ సైన్యాలు మనకు ఎదురు నిలవని పక్షంలో, అన్ని నిగమాలకీ, వర్తకులకూ పూర్తి స్వేచ్ఛ, యుద్ధానంతరం మగధ దేశమంతటా వాణిజ్యం నెరపటానికి గుర్తింపూ

కలుగజేస్తామని తెల్పగలరు. ఇక దూత ఎవరయినదీ తమరే నిర్ణయింపగలరు' అని నర్మగర్భంగా చిరునవ్వు నవ్వాడు.



హస్తినాపురికి సంధి ప్రయత్నానికి వెడలిన శ్రీకృష్ణునిలా, యవన దుర్గాన్ని ప్రవేశించాడు, అనంతపాలుడు. వెనుక వేదపాఠం చేస్తూ ముగ్గురు పండితులూ, త్రిరత్నాలు వల్లించే బౌద్ధభిక్షువులూ, శ్వేతాంబరధారులు అయిన జైన శ్రమణులూ, ఇంకా ఆజీవిక, చారువాకాది వివిధ సంఘ ప్రతినిధులతో నగర ప్రాంగణం చేరాడు.

అది యవనుల శైలిలో కట్టబడిన నగరం. నగరమధ్యంలో ఎత్తైన సభామంటపం, దాని చుట్టూ నాగరీకులందరూ సభకూడుటకు అనువైన విశాలమయిన చావిడి. మొదటి పంక్తిలో, నగర ప్రముఖులూ, యవన వ్యాపార ముఖ్యులూ, వివిధ శ్రేణీ నాయకులూ, స్థానిక సేనాధ్యక్షులూ తమతమ సేవకులచే తేబడిన నల్లబల్లలపై కూర్చున్నారు. వారి వెనుక నేల ఈనినట్లు పౌరజనం. అందరూ చర్చలో భాగస్వాములే!

చేతిలో నల్లని పేటికతో నమ్రతతో పక్కనే నిలిచి అనంతామాత్యుడు చెప్పేది శ్రద్ధగా ఆలకిస్తున్న అతని శిష్యుడు తప్ప మిగిలిన ఆచార్యులు అంతా మంటపం కింద ఒక వరుసలో నిలిచి ఉన్నారు.

'నేనిక్కడకు ఒక రాయబారిగా రాలేదు. దేశశ్రేయస్సు కోరే ఆచార్యునిగా వచ్చాను. మగధ రాజు పంపినది సామాన్యమైన శాంతి సందేశం మాత్రమే. యుద్ధమధ్యంలో పగవాని మాటవిని సంధికి ఒప్పుకోవటం ఆత్మగౌరవమున్న ఎవరికైనా కష్టమే. అయితే, అవతల ప్రత్యర్థి సామాన్యుడు కాడు. కాశ్మీరం నుండి ద్రవిడం వరకూ, పారశీకం నుండి వంగదేశం వరకూ గల సమస్త దేశమూ అతని ఆధీనంలో ఉన్నది. అతని అర్థబలమూ, అంగబలమూ అపారం. శత్రుదుర్భేద్యమైన కటకంలో మహావీరుడు, ఐరావతదేవుడు ఓటమిని చవిచూడటం అందరికీ విదితమే. లక్షకు పైగా కళింగవీరులు హతులయ్యారు. యుద్ధంలో జయాపజయాలు దైవాధీనాలే అనుకున్నా, ఇప్పటి పరిస్థితిలో గెలుపు అతికష్టంతో కూడుకొనినది.

సరే, గెలుస్తామనే అనుకొన్నా, యుద్ధానంతరపు పరిస్థితిని ఒక్కమారు యోచించండి. అశేష జననష్టం తప్పనిసరి. ఊళ్ళకు ఊళ్ళే స్మశానాలై, కళింగదేశం ఒక మరుభూమి అవుతుంది. ఇక వాణిజ్యమంటారా, అసంఖ్యాకమైన మగధ నౌకాదళం ఒక పక్కా, సరిహద్దుల దిగ్బంధనం మరోపక్కా...' ఈ విధంగా సాగిన ఆచార్యుని వాదానికి, మొదట కాస్త చురచురలాడిన జనసందోహం మెల్లగా మెత్తబడసాగింది.

అప్పటివరకూ, చేతిలోని పేటికతో ఆచార్యుని పక్క నిలిచి జనంయొక్క మనోభావాన్ని గమనిస్తూ, ముందుగా ఏర్పరుచుకున్న సంజ్ఞకోసం వేచియున్న అతని శిష్యునివంక చూసాడు. పైకి ఆచార్యుని శిష్యసంఘంలోని ఒక సామాన్య బ్రహ్మచారి యైనా, అతను ఆంధ్ర గూఢచారగణంలో ప్రముఖుడు.

ఆచార్యుని ఆదేశానుసారం తాను కలుగచేసుకొన వలసిన సమయం ఆసన్నమయినదని గ్రహించి, ఒక అడుగు ముందుకు వేసి అందరూ వినేటట్లు,

'మీకేల ఈ కంఠశోష ఆచార్యా? దావానలానికి పెనుగాలి తోడైనట్లు ఆంధ్ర, మగధ సైన్యాలు మీదబడితే వీరంతా ఆ మంటలలో శలభాల్లా రాలక తప్పదు. ఆ బూడిద తూర్పు సాగరంలో నిమజ్జనం అయ్యేవరకూ, వీళ్ళకి బుద్ధిరాదు. కళ్ళముందు కనిపిస్తున్న మృత్యువును చూడలేని అంధులు. వీళ్ళని సాగదీయడం అనవసరం. చక్రవర్తి ఆజ్ఞను వ్యతిరేకిస్తే దానికి పర్యవసానం సర్వనాశనమే. చేతనైనచో ఎదిరించవచ్చు. వారి తలలు కూడా వీరి నాయకుని తల వలెనే నేలదొర్లుతాయి' అంటూ చేతనున్న పేటిక తలక్రిందులు చేసి, సగం కుళ్ళి నేలబడిన ఐరావతుని శిరస్సును జనమధ్యంలోకి తన్నాడు.

జనం క్రోధం కట్టలు తెంచుకుంది. కిందవరుసలోని వివిధ మతాచార్యులు అప్రమత్తులయేలోపే ఆ ఉన్మత్త ప్రభంజనం వారిపైనబడింది.



రహస్య మార్గంద్వారా తనశిష్యుని సహాయంతో యవనఘడ బయటపడ్డ అనంతపాలుని ద్వారా వివరాలు తెలుసుకొన్న శ్రీముఖుడు నవ్వుతూ, 'సాధువులైన మతాచార్యులపై జరిపిన ఈ అత్యాచారానికి బదులుగా కళింగులకు తగిన గుణపాఠం చెప్పడం చక్రవర్తికి తప్పనిసరి! ఇక ఉత్కళం మట్టిగలవడానికి వేరే ఎటువంటి అడ్డూ ఉండదు' అంటూ అమాత్యుని వంక చూసాడు.

'అవును, ఏ క్షణాన్నైనా ఆ వార్త రావచ్చు. యవనదుర్గం ముట్టడిలో ఉంది. అది ఇంకెంతో కాలం నిలువలేదు. మన సేనలు కళింగ రాజధానికి చేరకుండా నివారించడంలో అశోకుని ఉద్దేశ్యం ఏమిటో అంతుపట్టకుంది. ఈ విషయం రథగుప్తునితో కూడా కదిపి చూసాను. నిమ్మకు నీరెత్తినట్లు ఏదీ చెప్పడు. ఇంకోవిషయం, నాగసేనుడు మనవద్దనే ఉన్న సంగతి నీవు చెప్పినవిధంగా వారికి విన్నవించాను. చారులద్వారా వాళ్ళకి ముందే ఈ వార్త తెలిసి ఉంటుందని మనం అనుమానించినట్లే వాళ్ళలో ఎటువంటి ఆశ్చర్యమూ కనబడలేదు. పైగా విన్న తరువాత వారిని అప్పగించ వలసిందని ఎటువంటి ఆదేశమూ కూడా ఇవ్వలేదు.'



# 20

'ఈ సీమలో, నీ సాంగత్యంలో నేనిప్పుడు అనుభవించే ఆనందం పదిహేడేళ్ళ నా జీవితంలో ఎప్పుడూ చవిచూసి ఎరుగను' అంటూ చేతిలోని చేమంతి బంతిని మల్లికకు విసిరింది.

'అంత వెటకారం ఎందుకులే మహారాణీ, కళింగపురిలోని మహారాజ సౌధాలెక్కడ, ఈ పేదరాలి కుటీరమెక్కడ? మీ చోద్యం కానీ' అని బంతిని అలా పరిగెడుతూనే తిరిగి విసిరింది.

చెంగున లేడిపిల్లలా ఎగిరి ఆ బంతిని చేతబట్టుకుని ఆయాసపడుతూ నిలిచి, 'నన్నంత పెద్దని చేయనవసరం లేదు, వదినెగారు. ఈ పేద పలుకులూ, ఉరుకులూ మా అన్నగారు వచ్చేంత వరకేలే. అంత వరకూ ఈ మరదలి పోరు మీకు తప్పదు, ఏమనుకున్నా సరే' అన్నది కళింగ మహారాణి.

'ఏంచేస్తాం? అందుకనేనేమో అన్నారు, ఆడబిడ్డ అర్థ మొగుడని' అంటూ ఆమెను తన కౌగిలిలో చుట్టేసింది.

సాయంకాలపు పొగమంచు కృష్ణమ్మపై మేలిముసుగులా కదులుతుంది. సన్నని చిరుగాలికి, కొండ అంచున ఉన్న ఆ ఉద్యానవనం ఆహ్లాదకరంగా మారింది. మేలిజిలుగు పరికిణీలలో సరిగంచు ఓణీలలో పరుగులిడుతున్న ఆ నవయవ్వనవతులైన చిన్నారులకు బయట ప్రపంచముతో పనిలేదు. ఎప్పుడూ ఏవో ఆటలూ అల్లర్లూ. ఒకరికి ఒకరు తోడు. కొండ పైనున్న వసతిలో పరిచారికలు తప్ప వేరెవ్వరికీ ప్రవేశం లేదు. కొండచుట్టూ వారి రక్షణ నిమిత్తం ఒక స్కంధం సైన్యం. చీమ కూడా చొరలేదు. గృహపతి మల్లప్పదొర ద్వారా మాత్రమే వారికీ బాహ్యప్రపంచపు సమాచారం అందేది.

దిగువనున్న అమరారామంలో మాత్రం ఒకటే సందడి. చక్రవర్తి సోదరుడు, వీతశోకుని ద్వారా కొనిరాబడిన ఆ తథాగతుని అస్తికశేషం ఒకటి అచటనే నిక్షిప్తం చేస్తారట! వీతశోకుడు బౌద్ధుడు. అమరశైలం వద్ద చైత్యనిర్మాణానికి అతడి సంకల్పం. మహాశ్రమణక తిష్యస్వామి ఆధ్వర్యంలో ఆ నిర్మాణం జరుగనుంది. కారునాటిసీమలోని కనకగిరి అధోలోక చైత్యానికి ప్రతిరూపంగా ఈ మహాచైత్యం కట్టడానికి అంతా సిద్ధమైన పిమ్మట, కాకతాళీయంగా తిష్యస్వామితో మల్లిక చేసిన సూచనను అనుసరించి చేసిన మార్పుల వల్ల అమరశైల మహాచైత్యం అంతవరకూ కనీవినీ ఎరుగనంత పెద్దదిగా రూపుదిద్దుకోనున్నది. నిర్మాణానికై సిద్ధపరచిన ఇటుకలతో ముందుగా ఒక చక్రంవలె కుడ్యాన్ని నిర్మించి లోన మట్టిని నింపితే చైత్యాన్ని మరో నాలుగు రెట్లు పెద్దదిగా మలచవచ్చునన్నదే ఆమె సూచన.

కళింగయుద్ధం మాట ఎట్లున్నా, ధాన్యకటకంలో మాత్రం ఒక పండుగ వాతావరణం నెలకొనింది. బౌద్ధావశేషాలు గల కలశం దర్శించేటందుకు తండోపతండాలుగా జనం విరుగబడుతున్నారు. చైత్యనిర్మాణార్థం కట్టిన వారి ముడుపులతో పట్టణపు భండాగారం నిండిపోయింది.

'అంతమంది జనం మధ్య వీతశోకుని విడిదికి రక్షణ కల్పించడం చాలా కష్టసాధ్యం అవుతుందమ్మా. అయినాసరే రాజధాని శ్రీకాకుళానికి మారుటకు వారు ససేమిరా అంటున్నారు. చైత్యనిర్మాణం పూర్తి అయ్యే వరకూ ఇక్కడే ఉంటారట' అని తన సమస్యను వివరించసాగాడు మల్లప్పదొర.

'ఆయన శ్రమణుడు అవుతాడట? తిష్యస్వామి చెబితే విన్నాను' అని తన సందేహాన్ని వ్యక్తపరిచింది మహారాణి చారువాకి.

'దానిలో ఆశ్చర్య పడవలసిందేముంది? ఆ చండాశోకుని మనస్సు ఎప్పుడు మారుతుందో ఎవరికి ఎరుక? అతని నీడలో ఎప్పుడైనా ప్రాణాలకు ముప్పే. అలాంటి స్థితిలో బ్రతుకు జీవుడాయని సన్యాసం పట్టడంలో వింతేముంది?' అన్న మల్లికను చూసి, ఆహా! రాజధానులలో, అనుదినం రాజకీయాలతో తలమునకలయ్యే తనకే తట్టని విషయం ఈ పల్లెపిల్లకెలా తట్టిందా అనుకుంటూ, అందుకేనేమో మొదటి సమాగమంలోనే తన సోదరుని హృదయాన్ని హరించింది! అని ఆశ్చర్యపడింది.

'ఏమో, అంత రాజకీయాలు నాకు అంతుపట్టవు. అయితే, తిష్యస్వామి మాత్రం అతని మతాసక్తీ, ఉదాత్తతా ఒక అర్హతునికి ఉండదగ్గవని ఎప్పుడూ పొగుడుతారు. అసలు విషయం, రేపటినుండీ వీతశోకులు ఆరామంలో గాక, ఇక్కడే కొండపైన, మన ఇంటనే ఉండడానికి తగిన సౌకర్యాలు చేయమని రాజధాని నుండి వర్తమానం. ఇక చిన్నపిల్లలలా మీరు చేసే అల్లరికి ఆటకట్టే'

'మనయింటనా? వారూ వారి పరివారం, ఈ ఇల్లు చాలేనా?'

'ఏమమ్మా, ఇందాకేమో పేదరాలి కుటీరం అన్నావు? ఈ ఇంట చక్రవర్తి తనయులు తప్ప వేరెవ్వరూ అతిథులుగా తగరేమో' అంటూ నవ్వుతూ మూతివిరిచింది చారువాకి.

'ఏమో, మహారాణులు అడుగుమోపితే కుటీరాలు కూడా మహాసౌధాలు అవుతాయేమో!' అని పకపకమని నవ్వుతూ, 'నాయనగారూ, మరి పెద్దాయనకి కావలసిన వసతుల గురించి ఏమన్నా తెలిపారా?' అని అడిగింది.

'తెలియదు. ఇంకొంతసేపట్లో తిష్యస్వామి వస్తున్నారు. వారు ఎలాచెబితే అలా చేద్దాం'



తిష్యస్వామి బృందంలోని భిక్షువులూ, ఇతర పరివారం పందిరికింద విశ్రాంతి తీసుకుంటున్నారు. గృహపతి మల్లప్ప వారికి కావలసిన తాంబూలాది సౌకర్యాలు చూస్తూ వారితోనే ఉన్నాడు. కాగడాల వెలుతురులో పల్లకి బోయీలు తమలో తామేదో పిచ్చాపాటీ చేస్తున్నారు. భోజనమయి జాము దాటింది. లోపల ఆచార్యులు మహారాణి చారువాకీదేవితో ఏదో దీర్ఘమైన సమాలోచనలో నిమగ్నులై

ఉన్నారు. ఇంట్లోని పరిచారకులను కూడా బయట వేచియుండమని ఆదేశం. మల్లిక మాత్రం ఆమెకు తోడుగా వారితోనే ఉంది.

'అంతా నీ చేతిలోనే ఉందమ్మా. నీవు ఒప్పుకుంటే ఈ సర్వనాశనాన్ని కొంతైనా తప్పించగలవు' అని మహాశ్రమణులు చేతులుజాపి అర్థిస్తున్నా ఆ పదిహేడేళ్ళ ప్రాయపు పిల్ల కొంతకూడా చలించడంలేదు.

'నా ప్రాణాలైనా త్యజిస్తానుగానీ ఆ క్రూరుని నీడ కూడా నాపై పడనీయను. సర్వతోసుభిక్షమైన నా దేశాన్ని బీడుగా మార్చిన శత్రువును సిగ్గు విడిచి చేబట్టటమా? అది జరగని పని. తమరీ ప్రస్తావన ఇంతటితే ఆపితే మంచిది' అని చురచురలాడింది.

'నీ అభిప్రాయం తప్పననమ్మా. కానీ నీవే ఒకసారి ఆలోచించు. ఇప్పటికే ఉత్కళం స్మశానమయింది. కటకం సరే అది నీకు వ్యతిరేకులైన ఐరావతుని బలగం అనుకున్నా, యవనదుర్గంలో ఆ మగధ రాజు సృష్టించిన దారుణాలు చెప్పనలవిగావు. ఇరవై వేలమంది మట్టిగరిచారు. లక్షకు పైగా ప్రజలను బానిసలను చేసి మహాకాంతారపు ఇనుప గనులకు వలస పంపాడు. అంతేగాక స్త్రీలనూ, విదేశీయులను కూడా వదలలేదు. మరి మధ్యకళింగం నీ స్వంత సీమ, అక్కడి ప్రజలు మీ వంశాన్ని దైవసమానులుగా గౌరవిస్తారు. కనీసం వాళ్ళకొరకైనా నీవీ త్యాగం చేయడం సమంజసమేమో?'

'కావచ్చు' కొంచెం శాంతిస్తూ, 'కానీ... మహారాణినైన నన్ను రాత్రికి రాత్రి బందీని చేసి ఆ మేఘరాజుకు అధికారమిచ్చిన ఆ ప్రజల అనాదరణకు ప్రతిగా నేనెందుకు నా జీవితాన్ని త్యాగం చేయాలి? మీమీద మాకున్న గౌరవం కొలదీ నేనింతవరకూ ఈ విషయాన్ని గురించి యోచించాను. నా సోదరుడు నాగసేనుడు లంక నుండి తప్పించుకోవడం మీ సాయం వలనే సాధ్యం అయింది. అందుకు మేమెప్పుడూ మీకు కృతజ్ఞతా బద్ధులమే... కానీ ఈ విషయంలో మాత్రం మీరు నన్ను క్షమించాలి'.

'సరే తల్లీ, నీ ప్రజల మాట అటుంచు, నీ సోదరుడు నాగసేనుని ప్రసక్తి తెచ్చావు కనుక చెబుతున్నాను. ఎంత లేదన్నా శాతపుత్రుడు మగధ ప్రభువుకు సామంతుడే. నీ అన్నను మగధాధీశునకు అప్పగింపక తప్పదు. అతని క్షేమం కొరకైనా...' అంటూ పక్కనే ఉన్న మల్లిక వైపు చూసాడు.

అంతవరకూ మౌనంగా వారి మాటలను వింటున్న మల్లిక, తనను కలుగచేసుకొనమనే ఆచార్యుల ఆంతర్యం గ్రహించినదై, 'ఆచార్యా, ఇది మహారాణి చారువాకీ దేవి మనస్సుకి సంబంధించిన విషయం. ఇందులో నా ప్రోద్బలం అసమంజసమూ, అనౌచిత్యమూ. ఇక నాగసేన ప్రభువు విషయంలో, నాకంటే జీవితాంతం వారి సాంగత్యంలో మెలగిన ఆమెకే వారిపట్ల విచారం మెండు. నేను కలుగ చేసుకొనకుండా ఉండటమే మంచిది'.

అతిస్వల్ప సమయంలోనే తన మనస్సు చూరగొన్న నెచ్చెలి మాటలలోని ఉదారతని గమనించిన చారువాకి కళ్ళలో నీళ్ళూరాయి.

'నిజమే తాను ఎంతసేపూ తన ఇష్టాయిష్టాల గురించి ఆలోచించినదేగానీ, తన నిర్ణయంతో ముడిబడియున్న ఇతరుల అక్కర చూడలేదు. ఎంత అయిష్టమయినదైనా, తనపై ఆధారపడిన ప్రజలకూ, స్వజనులకూ శ్రేయోజనకమైనచో ఆ నిర్ణయం మహారాణిగా తన కర్తవ్యం. విధి తన నుదుట ఒక క్రూర శాత్రవునితో ఉద్వాహం లిఖించి ఉన్నట్లయితే తన ఈ నిర్ణయం నిమిత్తమాత్రమే కదా', అనుకొంటూ తలవూపి, 'ఆచార్య, మీరనుకున్న విధంగా నేను ఒప్పుకోవటం అందరికీ క్షేమకారణమే అయితే, అలాగే కానీయండి', అని కళ్ళలో నీళ్ళు పొంగగా తన చెలి మల్లిక ఎదపై వాలిపోయింది.

'అయితే, రేపే ప్రయాణం. ఏమ్మా మల్లికా! నీవూ మాతో కళింగం వస్తావా?' అంటున్న తిష్యస్వామితో,

'లేదు స్వామీ, నా ప్రభువు నన్ను చేబట్టి వెంటగొనిపోవు వరకూ ఇదే నా ఉనికి. పైగా మీరు లేని తరుణంలో, చైత్య నిర్మాణంలో నాయనగారికి సాయపడుతూ, ఆ తథాగతుని సేవలో నా ప్రభువు కోసం వేచి ఉంటాను. అంతవరకూ నా మరదలికి తమ రక్షణలో ఎటువంటి హానీ కలుగదని భావిస్తాను' అని తన వడిలో బేలయైన మహారాణి చుబుకం ఎత్తి, కనులలోకి చూస్తూ అన్నది.

'ఆ విషయంలో నీకేమీ దిగులు అవసరం లేదమ్మా, నీ చెలి నేటి నుండీ మహారాణి చారువాకిగా కాదు, కర్ణాటాంధ్రకళింగ దేశాల బౌద్ధసంఘాల ప్రతినిధియైన ఈ తిష్యుని రక్షణలో, 'తిష్యరక్షిత' అనే నూతన నామధేయంతో పిలువబడగలదు. ఆమె క్షేమానికి దక్షిణ దేశపు సమస్త బౌద్ధసంఘాలూ తమ ప్రాణాలైనా ఒడ్డగలవు' అంటూ లేచి నిలిచిన ఆచార్యుడు వారికి అభయముద్రా సహితుడైన బుద్ధదేవుని ప్రతిరూపంలా కనిపించాడు.

### అశోకుని రాణి ఎవరు?

దీపవంశ, మహావంశ, అశోకావధాన అనే, శ్రీలంకలో భద్రపరచబడిన, బౌద్ధగ్రంథాల ఆధారంగా అశోకుని జీవితచరిత్ర కొంతవరకూ తెలుస్తుంది. అయితే ఆ వివరాలేవీ వివాద రహితాలు కావు. ఆ గ్రంథాలలో దొరికిన అశోకుని భార్యల పేర్లు... విదీశామహాదేవి, అసంధిమిత్ర, పద్మావతి, తిష్యరక్షిత, కారువాకి.

వీటిలో మొదటిది 'దేవి'. విదీశలో ఒక వర్తకుని కూతురట. శ్రీలంకకు బౌద్ధధర్మాన్ని ప్రచారం చేసిన మహేంద్రా, సంఘమిత్రలకి తల్లి. కానీ ఆమె ఎప్పుడూ రాణి కాలేదు.

ఇక 'అసంధిమిత్ర' అతడి పట్టమహిషి. ఆమె అసలు పేరు 'పద్మావతి' అయివుండవచ్చు. ఆమె అశోకుని మరణానికి పదేళ్ళ ముందే మరణించింది (బహుశా క్రీపూ. 242) అప్పుడతడి రెండవ భార్య 'తిష్యరక్షిత' పట్టపు రాణి అయింది. బౌద్ధగ్రంథాలనుబట్టి ఆమె బౌద్ధానికి వ్యతిరేకి. మహాబోధిలోని వృక్షాన్ని మందు పెట్టి చంపిందని ఆమెపై అపవాదు. అలహాబాదు స్తంభంపై ఉన్న 'రాణీ శాసనంలో' అశోకుని రెండవ భార్య పేరు 'కారువాకీ' అని ఉంది. దీనినిబట్టి కారువాకియే తిష్యరక్షిత అనుకోవచ్చు. ఆమెకు పట్టంకట్టిన నాటినుండీ అశోకుని పతనం ప్రారంభమయింది. అశోకుని అధికారం కొంతకొంతగా అతడి చేజార సాగింది. ఆ సమయంలో పగ్గాలు ఎవరిచేత ఉన్నాయో, ఆ కథ ఎవరు నడిపించారో వివరాలు తెలియవు. కానీ, అశోకుని మరణానికి మరుక్షణమే, అటు కళింగనుంచి ఇటు మహారాష్ట్రం వరకూ విస్తరించిన ఆంధ్ర సామ్రాజ్యం స్థాపించబడింది.



# 21

మహేంద్రుని వాహనమైన ఐరావతాన్ని తలపింపజేసే మహోన్నత మత్తగజం వెనుక సూచీ వ్యూహరచనలో నిలిచిన అశేష మగధ సైన్యం నాలుగు యోజనాల పొడవున బారుతీరి గంభీరమైన గంగా ప్రవహంలా తోచింది.

మగధ పతాక లాంఛనాలతో నిలిచిన ఆ పట్టపుటేనుగు పైన రజత మణిమయమైన అంబారీపై, శ్వేత ఛత్రచ్ఛాయలో కవచ శిరస్త్రాణాలు లేకుండా సింధూర వర్ణపు జిలుగు ధోవతిలో, సరిగంచు కుచ్చు తలపాగాపై కెంపుల హారంతో కట్టిన బెత్తెడు వెడల్పుగల సువర్ణ మకుటంతో, మంచి ముత్యాలతో కుడిపక్కకు అలవోకగా ముడివేసిన నల్లని కురులతో, నాలుగంగుళాల నిడివి గల బంగారపు కంటెతో, మలయద్వీపపు పగడాల మాల చుట్టిన ఉపవీతంతో పెండ్లికుమారునిలా నిలిచిన చక్రవర్తిని చూసి కళింగనగర సైనికులు దిగ్భ్రాంతులయ్యారు.

'ఏమిటితను? శత్రుసేనను నడిపించే మహావీరునిలాగా కాకుండా పండుగకు అత్తవారింటికి పోయే కొత్త పెండ్లికొడుకులా వస్తున్నాడే?'

'ధనుర్ధారులైన అంగరక్షకులు గాక సుకుమారులైన స్త్రీజనం మధ్యంలో ఉన్నాడేమి?'

ఈ చండాశోకుడు నరక జరాసంధాది రాక్షసుల అంశన బుట్టిన మహాక్రూరుడని అనుకుంటిమే, ఇదేమి శాంతమూర్తియైన జగన్నాథునిలా ఉన్నాడే?'

'ఆ కుడిపక్క ఉచ్ఛైశ్రవాన్ని తలపించే శ్వేతాశ్వంపై అపర స్కంధకుమారుని వలెనున్న ఆ మహావీరుడెవరో? అది పడమటి ఆంధ్రుల అశ్వముఖ లాంఛనం! ఆంధ్ర యువరాజు శ్రీముఖ శాతవాహనుడేమో?'

అంతలో ఆ మహా మత్తగజపు వెనుకనుండి శరత్కాలపు లేతమబ్బురంగు గల మహోన్నత పారశీకంపై ఒంటరిగా వాయువేగంతో మేఘరాజ తలవరి రథం ముందుకు వచ్చినిలిచిన వీరుని చూసి ఒక్కసారిగా కళింగ శ్రేణులలో కలకలం బయలుదేరింది.

'అది నాగసేనకుమారుడు!'

పరుగిడుతున్న గుర్రంపైనుంచి అదే ఊపులో గెంతి, వయోవృద్ధుడూ, గురుతుల్యుడూనైన మేఘరాజతలవరికి ప్రణామంచేసి ఆ మహావీరుడు ఇచ్చిన వర్తమానం, క్షణాల్లో, కార్చిచ్చువలె కళింగసేనంతా వ్యాపించింది.

అంతవరకూ చక్రవర్తి వామహస్తంచే పరివేష్టితమైన నడుముతో ఆ మహా గజాన్ని అధివహించి చెరగని చిరునవ్వుతో, తెల్లని రవపట్టపు నూలి వస్త్రం వెనుక ఆ చక్రవర్తి కొనవేళ్ళ స్పర్శకు పులకించి ఎరుపెక్కిన ఆమె పీన కుచాలను దాచేందుకు వ్యర్థప్రయత్నం చేస్తూ అతని వామపార్శ్వంలో ఒదిగిపోతున్న ఆ భామను కళింగమహారాణి చారువాకీదేవిగా గుర్తించిన కళింగవీరుల జయజయ ధ్వానాలు ఒక్కసారిగా మిన్నుముట్టాయి.



# 22

వైశాఖమాసం, పౌర్ణమికి ఇంకా నాలుగురోజులుంది. తథాగతుని జయంత్యుత్సవాలకై తీర్చిదిద్దిన ఆరామమంతా కళకళలాడుతుంది. శ్రీధాన్యపురిలో ఎక్కడలేని హడావిడి. కళింగ జైత్రయాత్రలో విజయుడై ఆంధ్రరాజధానికి తిరిగి వస్తున్న మహాదండనాయకుడు, కర్ణాటకళింగాంధ్ర మహాభోజుడు, కుమార శ్రీముఖ శాతవాహనుడు ఆదినమే నగరానికి విచ్చేస్తున్నాడు. నగర ప్రవేశానికి ముందుగా జరగవలసిన ప్రాయశ్చిత్త కార్యక్రమానికి కావలసిన సన్నాహాలతో మల్లప్పదొర తలమునకలై ఉన్నాడు.

'దానికి తోడు శ్రీముఖుడిని సకల దక్షిణాపథానికి రాజ పట్టాభిషిక్తుని చేయటానికి చక్రవర్తి అనుజ్ఞ ఇచ్చారట. అవసరమైన హిరణ్యగర్భ మహాయజ్ఞానికి మహా పండితులతో, శ్రీ అనంతపాలామాత్యులే ఆధ్వర్యం వహిస్తారట. ఒక్క శ్రీధాన్యం నుంచే లక్ష పణాలు బలిభాగంగా పోగుజేయాలి. అయితే, అమాత్యులు వచ్చీరాగానే నిన్ను తక్షణమే చూడాలని కబురు పంపారు. అల్లుడు, నాగసేనకుమారుని నుండి ఏదైనా వర్తమానమేమో?' అని కూతురుతో అన్నాడు.

'ఐతే ఇప్పుడే బయలుదేరుతాను. ఎలాగూ కిందకు వెళ్ళవలసిన అవసరం ఉంది. అమరచైత్యానికి ఛత్రప్రతిష్ఠ చేయడం ఈ బుద్ధపౌర్ణిమకే జరలగాలని తిష్యస్వామివారి ఆలోచన. మన శ్రీముఖ ప్రభువు సముఖంలోనైతే బాగుంటుంది'

'అంతకన్నానా? ఒకవైపు వైదిక ధర్మయుక్తమైన హిరణ్యగర్భం ద్వారా సద్బ్రాహ్మణుడైన వెంటనే, బౌద్ధచైత్యానికి ఛత్రారోహణం చేస్తే, రెండు మతాలకూ సమన్వయం ప్రకటించినట్లు ప్రశస్తంగా ఉంటుందిగదా?'

'నిజం నాన్నగారు! ఈ కళింగాంధ్రాలలో ఎన్నో మతాలూ, ఎన్నెన్నో జాతులు. అందరి మనస్సెరిగినప్పుడే కదా మన శాతవాహనకులం చిరకాలం ఈ దక్షిణాపథాన్ని పాలించగలిగేది'

'నా తల్లీ! కళింగ రాజవంశానికి కాబోయే కోడలివైనా, స్వంత దేశంపైన నీ అభిమానం గొప్పదే' అని ఆమె తల మూర్కొని, సరే నీవిక బయలుదేరు. పల్లకి సిద్ధంగా ఉంది. అల్లుని గురించి వార్త ఏదైనా వెంటనే తెలియజేయమ్మా. వారిప్పుడు చక్రవర్తితో తోసలిలో ఉన్నారట. అంతకు మించి వేరే ఏ విషయమూ తెలియడంలేదు.'

✦ ✦ ✦

బల్లకట్టు ఒడ్డుతాకిన మరునిమిషంలో వారిని శ్రీముఖుని విడిదికి తోడ్కొనిపోవడానికి వందమంది ప్రత్యేక రక్షణదళంతో ఎదురొచ్చాడు, కొడబలిదొర. కంచిక చుట్టూ రెండు స్కంధాల సైన్యం విడిసి

ఉంది. కొండవారున ఒకప్పటి తన ఇల్లే ఇప్పుడు మహాదండనాయకుని విడిది. ఊహ తెలిసినప్పటినుండీ అది ఆమె ఇల్లు. పల్లకీ వద్దని చెప్పి కొడబలిదొర పక్కనే ఆవైపు నడువసాగింది.

అప్పుడే ముసురుతున్న చీకట్లు, దీపాలుపెట్టే సమయం. వెనుదిరిగిచూస్తే చైత్యంపై వెలుగుతున్న వేలదీపాలతో ధాన్యకటకం ఒక కొత్తదనం సంతరించుకుంది. కటకానికి నివాసం మారిన పిదప నది దాటి ఈ పక్కకు రావడం ఇదే మొదటిసారి. దీపకాంతితో ధగధగలాడుతూ ఆకాశానంటే ఆ స్తూపాన్ని చూస్తూ అలాగే నిలిచిపోయింది.

అది చూసిన తిష్యస్వామి పల్లకీ దిగి, 'ఏమ్మా, ఆగిపోయావ్?' అంటూ పక్కనే నిలిచి, 'నీవన్నట్లే వంద అడుగుల పొడవుతో ఇంతెత్తు కట్టడం భరతఖండంలోనే లేదు'.

**అమరావతి స్తూపం మొదటి దశ**

పురాతత్వ శాస్త్రజ్ఞులు అమరావతి స్తూపం నిర్మాణంలో ఐదు దశలు ఉన్నట్లుగా గుర్తించారు. మొదట్లో ఈ స్తూపం ఏవిధంగా నిర్మించారో, అంత స్పష్టంగా తెలియదు. కానీ... క్రీపూ. 4వ శతాబ్దిలోనే ఇక్కడ బుద్ధుని అవశేషాలు ఆరాధించేవారని చరిత్రకారుల అభిప్రాయం. చిన్నదిగా ఈ స్తూపం అశోకుని కాలానికి ముందే ఉండేది. అప్పటికే (క్రీపూ. 250), చక్రాకృతిలో ఇటుకలతో కట్టిన బీజస్థానం ఏర్పడి ఉంది. అశోకుని పూర్వపు బ్రాహ్మి లిపిలో, 'ధిసపాత', 'మలస' అనే అక్షరాలున్న మట్టిపాత్రలు లభించాయి. నునుపైన అశోకుని కాలపు రాతితో ప్రాకారం, రెండు ద్వారాలూ నిర్మించారు. అశోకుని శాసనం ఉన్న రాతిస్తంభం కూడా లభించింది. అప్పటికే స్తూపపు పరిమాణం, సమకాలీన స్తూపలలో అతి పెద్దది అయి వుండవచ్చు.

'కృష్ణమ్మ అలలమీద ఆ దీపాల ప్రతిబింబాలు చూస్తూ, జీవితాంతం ఇక్కడే ఉండిపోవాలనిపిస్తుంది స్వామీ'

'అదేంమాటమ్మా? కలలో కూడా అలా అనకు. అసలే సంధ్యాసమయం. తథాస్తు పలికే దేవత లుంటారు. కళింగనగరంలో నాగసేనుని మహారాణివై, నీ చేతిమీద ఇటువంటివి ఇంకెన్నెన్నో చైత్యాల నిర్మాణం చేయాలి,' అని విడిదివైపు దారితీసాడు.



కొడబలిదొర వారి రాకను తెలిపిన మరుక్షణం శ్రీముఖుడు వారికి ఎదురొచ్చి తిష్యస్వామికి నమస్కరించి సాదరంగా లోనికి తీసుకెళ్ళాడు.

'రామ్మా, నీకోసమే ఎదురుచూస్తున్నాము' అని పలకరించిన ఆంధ్ర మహాభోజుడు, పితృసమానుడూ అయిన శ్రీ శాతవాహనులను అక్కడ చూసి నిర్ఘాంతపోయి, మరుక్షణం తేరుకొని సాష్టాంగపడిన మల్లికను పొదివిబట్టి లేపి, 'నీతో పని ఉండే ఇంతదూరం వచ్చానమ్మా. పూర్తిగా విని ఎటువంటి వత్తిడికీ లోనుగాక నీ నిర్ణయం చెప్పు', అంటూ పక్కనే కూర్చుండపెట్టుకొని, శిరస్సుపై చెయ్యుంచి, కనులలోని వాత్సల్యాన్ని దాచకుండా పలికిన మహారాజును చూసి, నోట మాటరాక మ్రాన్పడిపోయింది.

'ప్రభువుల ఆదేశం ప్రకారమే వారి రాక గురించి నీకు చెప్పలేదమ్మా. వారే అన్ని విషయాలూ పూర్తిగా వివరిస్తామన్నారు. నాగసేనకుమారుడు మనదేశం వచ్చినప్పడినుండి వచ్చిన ఎన్నో రాజకీయ

పరిణామాలు నీకు తెలుసు. దేశశ్రేయస్సు దృష్ట్యా మహారాజు ఎన్నో కఠినమైన నిర్ణయాలు తీసుకొనక తప్పలేదు, అయినా, నీకూ, నాగసేనునికీ ఇచ్చిన మాట మాత్రం మరిచిపోలేదు. వారు చెప్పేది సావధానంగా విని ఆపై నీ మాట చెప్పు. చిన్నదానివైనా, నీవు బుద్ధిశాలివి. తగిన నిర్ణయం తీసుకుంటావని మా దృఢమైన అభిప్రాయం' అంటున్న తిష్యస్వామి వైపు తలాడించి, మనస్సు ఏదో కీడు శంకించగా దైవసమానుడైన మహారాజు వంక తలమోడ్చి,

'నాయనగారూ, తమర్ని ఈ విధంగా సంబోధించినందుకు క్షమించండి. మీరు నాకేకాదు, సమస్త ఆంధ్రప్రజకే పితృసమానులు. మీ నిర్ణయానికి సకల దక్షిణాపథమే కట్టుబడి ఉంటుంది. నన్ను అనవసరంగా పెద్దని చేస్తున్నారు. ఆజ్ఞాపించండి' అని ఒక క్షణం ఆగి, 'అయితే, మీ నిర్ణయంవల్ల నా ప్రభువు నాగసేనుని క్షేమానికి ఎటువంటి నష్టమూ జరగదు కదా?' అంటూ దుఃఖం ఒక్కసారిగా ఎగదన్నగా బేలయై ఆ మహారాజు భుజంపై వాలిపోయింది.

'లేమ్మా లే, నీ నాగసేనునికి వచ్చిన ఆపద ఏమీ లేదు. స్థిమితపడు. పద అలా చల్లగాలిలోకి' అంటూ ఆమెను లేవదీసి బయటికి దారితీసాడు. మహాచైత్యపు వేయిదీపాల కాంతిముందు చంద్రుడు లేని రాకాకాశంలో కూడా తారలు వెలవెలపోతున్నాయి. అప్పుడే తిరిగిన తూర్పుగాలికి ఆమె కొంత ఊరట చెంది, చీరె కొంగుతో కళ్ళు తుడుచుకొని, మహాచైత్య ప్రభలవైపు తదేకంగా చూస్తూ, అందు నిక్షిప్తమైన తథాగతుని భౌతికావశేషాలపై మనస్సు కేంద్రీకరించి, తన ప్రాణసమానుడైన ప్రియుని క్షేమంకొరకు ధ్యానిస్తూ నిలిచిపోయింది.

'ఏమ్మా, కుమారుడు నాగసేనుడి కొరకు ప్రార్థిస్తున్నావా? నీ ప్రార్థనలే అతడికి రక్షాకవచమమ్మా. అతడు యాదృచ్ఛికంగా నిన్నిక్కడ కలిసి ఉండకపోతే, నేనా దినాన అతనికా వాగ్దానం చేయకపోదును. అప్రతిహతమైన మగధసైన్యానికి అతడు ఎదురు నిలిచి ఉండెడివాడు. జయాపజయాలు ఆ బుద్ధదేవుని ఆధీనం అనుకున్నా, ఆ సమయంలో చక్రవర్తియొక్క ధృఢదీక్ష కళింగదేశాన్ని కాలరాచటమే. అంటే, మగధరాజుకు ఎదురు తిరగటం ఆత్మహత్యా సదృశమే. దానికితోడు, అధోలోక సంఘారామపు యక్షథేరుడు, చక్రవర్తికి అనుయాయి. సోమయాచార్యులతో కూడి నీ స్వామిని బంధించటం వెనుక మహామంత్రి రథగుప్తామాత్యుల హస్తం ఉండి ఉంటుంది. తిష్యస్వామి సహాయం లేనట్లయితే అతనిని లంకనుండి తప్పించటం సాధ్యం అయేది కాదని నీకు తెలుసు'.

'అందుకు, తమకూ, ఆచార్యులకూ మేమెప్పుడూ ఋణపడి ఉంటాము'

'దానికేముందమ్మా, అసలు పశ్న అప్పుడే ఉదయించింది. నాగసేన కుమారుణ్ణి అశోకుని క్రోధానికి ఎదురేగకుండా నివారించడమెలా? సోదరి చారువాకి క్షేమమే అతని ఏకైక లక్ష్యం. ఆమె మహారాణిగా ఉన్నంతవరకూ మగధ ఆక్రమణని ఎదిరించడం అతనికి తప్పదు'.

'అంటే, ఐరావతుని తిరుగుబాటు?'

'చక్కగా ఊహించావు. బావరికొండ ధమ్మపాలుడు, మన అనంతామాత్యుని సోదరుడే. వారి ప్రోద్బలంతోనే అది సాధ్యమయింది. లేకుంటే ఒంటరిగా ఐరావతుడు ఆ ధైర్యం చేయకపోను'.

'అందుకే మేఘరాజతలవరి కుమార్తె విశాఖాదేవిని ఎర వేశారనమాట!'

'ఊ. ఒక్క విశాఖాదేవే కాదు, కళింగ రాజ్యాధికారమే స్వంతమవుతుందని ఆశపడ్డాడు,' అని చిరునవ్వు నవ్వి, 'కానీ మేఘరాజు కూడా ఈ పథకంలో భాగమని పాపం తెలీదు. మేఘరాజు దక్షణకళింగాధిపతి, మనకు ఎంతో ఆప్తుడు. దానికి తోడు రాజవంశంపట్ల అతని విశ్వాసం అచంచలమైనది. కుమారి చారువాకిని క్షేమంగా బావరికొండపై ధమ్మపాలుని వద్దకు చేర్చి, పైకి మాత్రం ఐరావతునితో చేరినట్లు నటించాడు.'

'అందుకనేనేమో, శ్రీముఖ ప్రభువుకు బావరికొండ వద్ద అంత సునాయాసంగా విజయం సిద్ధించింది?'

'అవును. లేకుంటే కపోతగిరి కనుమ దాటటం ఎంతటి సైన్యానికైనా అసాధ్యమే. దక్షిణ కళింగ సైన్యాన్ని రక్షించుకోవటమే మేఘరాజు వెనుకంజ ఉద్దేశ్యం. పైగా వారితో మనకెట్టి వైరమూ లేదు'.

'అది తెలిసే చక్రవర్తి మన సేనలు మేఘరాజుతో చేరకుండా నాగావళివద్దనే నిరోధించి ఉంటారు. ఇంత తెలిసి ఆ చక్రవర్తి ఎందుకు ఉపేక్షించారో?'

'నా తల్లే, మా అమాత్యులకే అందని ఊహ నీకెలా తట్టిందమ్మా? చెబుతా విను. కటకపురిలో ఓఢ్ర సైన్యాలు పతనమైన తరువాత మిగిలిన కళింగాన్ని రక్షించేందుకు ఒకే ఒక ఉపాయం మిగిలింది. అది అనంతపాలామాత్యులు రథగుప్తులకు నివేదించారు'.

'అంటే చారువాకిని సంప్రదించకుండానే ఆమెను చక్రవర్తికి కట్టబెట్టడానికి నిర్ణయించారా? ప్రభూ, ఆమె అంగీకరించకుంటే?'

'నిజమే, కానీ ఆ సమయంలో యుద్ధనివారణకు వేరే గత్యంతరం లేదు. అయినా అది నీ నెచ్చెలి క్షేమం, ఆమె ప్రజల క్షేమం కొరకు చేసిన ప్రయత్నమే. అందునా అశోకుడు అందరూ అనుకున్నంత క్రూరుడు కాడమ్మా. విశాలమైన సామ్రాజ్యాన్ని పాలించాలంటే కొన్ని సమయాల్లో రాజు నిరంకుశుడు కాక తప్పదు. అమిత్రఘాతుల కాలంలో అనేక ప్రాంతాలలో మగధ అధికారం క్షీణించింది. ఈ చక్రవర్తి మహావీరుడు, యుద్ధకుశలతలో తన తాత చంద్రగుప్తులకేమీ తీసిపోడు. రథగుప్తులు అతనికి పట్టం కట్టటానికి అదే ముఖ్య కారణం. ఎంతటి వీరుడో అంత బుద్ధిశాలి. రాజప్రతినిధిగా ఉన్నప్పుడే తక్షశిలలో తలెత్తిన తిరుగుబాటును అణగద్రొక్కటానికి అనేకమందిని బలిగొనక తప్పలేదు. దానితో మొదలైన చండాశోకుడనే అపకీర్తిని అతని సోదరులే మగధలో గోరంతని కొండంత చేసి ప్రచారం చేసారు. ఇక సుసీముడూ మరి మిగిలిన సోదరులు అతనిని తుదముట్టించడానికి చేసిన ప్రయత్నాలు కోకొల్లలు, రథగుప్తుల యుక్తివల్ల ఫలించలేదుగానీ.'

'ఎంతయినా భ్రాతృహత్యకు కారణము రాజ్యకాంక్షే కదా?'

'యోగ్యుడనని నమ్మకం గలవాడు ఎవరైనా సరే అధికారము దక్కించుకోవటానికి ప్రయత్నించటంలో తప్పులేదు. రాజతంత్రం ప్రకారమూ సామ దాన భేదోపాయాలు పనిచేయకపోతే దండోపాయం తప్పదు. పైగా అశోకుడు ఉజ్జయినిలో కుమారప్రతినిధిగా ఉన్నప్పుడు సుసీముడు

తన తమ్ములతో కలిసి అతనిపై దండెత్తాడు గానీ అశోకుడు పాటలీపుత్రంపై దాడిచేయలేదు. తండ్రి అమిత్రఘాతుని మరణానంతరం రథగుప్తుడు పిలువనంపిన తరువాతనే రాజ్యం చేబట్టాడు. చూడమ్మా, నాకూ నీలాగే అశోకుడంటే ఇదేవిధమైన దురభిప్రాయం ఉండేది. కానీ అతని తమ్ముడు విగతశోకునితో పరిచయం తరువాత సూర్యుడు తాకిన పొగమంచులా అది విడిపోయింది. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే, నా ఉద్దేశ్యంలో చక్రవర్తి కుమారి చారువాకికి తగినవాడు. వారిరువురి కలయిక వలన ఎంతో జననష్టాన్ని నివారించ సాధ్యమైంది'.

'కానీ నాయనగారూ, చారువాకిని వివాహమాడటానికి అంగీకరించిన తరువాత కూడా యవనఘధ పైకి ఎందుకు దండెత్తారు?' అమాయకమైన ఆ ప్రశ్నకు శాతవాహనుని ముఖంలో ఒక నిమేషకాలం ప్రస్ఫుటమైన కలవరం ఆమెనుండి దాగలేదు.

హుమ్మని ఒక నిమిషం ఆలోచించినవాడై, 'సరేనమ్మా, ఇప్పటివరకూ అతిగోప్యం అయిన ఈ విషయం నీవద్ద దాచను, విను. యవనులు పడమటి సాగర తీర వాణిజ్యానికి మాత్రమే పరిమితమైనంత వరకూ మన ఆంధ్రదేశానికి ప్రాముఖ్యం ఉంటుంది. తూర్పు తీరంలో కనుక వాళ్ళ ప్రాబల్యం పెరిగితే, యవ, మలయ, సువర్ణ ద్వీపాలపై మన ఆంధ్ర వర్తకుల పలుకుబడి క్షీణిస్తుంది. అది మన అభివృద్ధికే ముప్పు'.

'అంటే, యవనదుర్గంలో అనంతామాత్యులపై జరిగిన దాడి యాదృచ్ఛికం కాదు. ఆ పట్టణ ప్రజలని కావాలనే రెచ్చగొట్టారనమాట?'

'అవునమ్మా... లేకుంటే ఆ ఐరావతదేవుని అనుయాయులను పూర్తిగా మట్టుబెట్టి, చారువాకీ, నాగసేనుల అధికారాన్ని నిష్కంటకం చేయడం సాధ్యం అయ్యేదికాదు' అని దోషి వలె తలదించి, 'నా ప్రజల మేలుకోరి చేసిన ఈ ప్రయత్నంలో కొంత జననష్టం తప్పలేదు'.

'మీరు అంతగా చింతించనవసరం లేదు ప్రభూ, యవనఘధ పతనం మనకే కాదు, మగధకూ ఉపయోగకరమే కదా? అనంతపాలామాత్యులు ఈ విధంగా చేస్తారని రథగుప్తులు ముందుగా ఊహించబట్టే, సంధి ప్రయత్నానికి వారిని నియోగించారేమో?'

ఆ మాటలలోని గూఢార్థం స్ఫురించిన మహారాజు నిర్ఘాంతపోయి, మాట రాక అలాగే మ్రాన్పడిపోయాడు.

'అంతేగాదు, ఆంధ్ర కళింగ దేశాలను సంఘటితం చేసేందుకు తమరు చేస్తున్న ప్రయత్నాన్ని చక్రవర్తి ముందుగానే ఊహించారేమో? దక్షిణ కళింగానికీ ఆంధ్రులకూ ఉన్న సంబంధ బాంధవ్యాలు అందరూ ఎరిగినవే. మనది ఒకే భాష ఒకే సంస్కృతీ. కళింగాంధ్రములు కలిసి మగధకు ఎదురుతిరిగే ప్రమాదం నివారించుటకే ఉత్కళ మధ్య కళింగాల మధ్య మిత్రభేధం కల్పించి ఉండవచ్చును కదా?'

'కానీ ఉత్కళాన్ని అణిచివేయటం ద్వారా కళింగాన్ని మనకు మరింత దగ్గర చేసినట్లు కదా?'

'ఏలాగు, నాయనగారూ? మీరే ఆలోచించండి. కళింగ మహారాణి ఇప్పుడు మగధ రాజు పట్టమహిషి. ఇక మిగిలింది మేఘరాజ వంశం. వారిని నిరర్థకం చేసే పథకం కూడా...' ఆమె

మాటను పూర్తి చేసే లోపలే శాతవాహనుని ముఖంలో దిగ్భ్రాంతి ప్రస్ఫుటమయింది. ఒక్కసారిగా మగధ రాజ్యతంత్రమెల్లా కనులకు కట్టినట్లు విశదమయింది. ఆహా! ఒకవైపు కుటిలనీతి తంత్రజ్ఞుడు చాణక్య విష్ణుగుప్తుని వారసుడైన రథగుప్తామాత్యుడు, మరోవైపు తన పితామహుడు చంద్రగుప్తుని నోటినుండి ఊడిపడిన సామ్రాట్టు అశోకుడు. వీరు ఆడిన చతురంగ క్రీడలో అందరం ఆటబొమ్మలమే! అనుకుంటూ,

'నీవన్నది నిజమే తల్లీ. ఇప్పుడు అర్థమౌతుంది. ఇంతకాలం ఈ నాటకానికి సూత్రధారులం అనుకుంటున్న మేము వట్టి తోలుబొమ్మలం మాత్రమే. నీ నిశితమైన బుద్ధితో నా కళ్ళు తెరిపించావు... ముందుగా నేను చెప్పేది విను. నిన్ను మొట్టమొదట చూసినప్పటి నుంచి నీవంటే ఏదో వాత్సల్యం. నీతో మాట్లాడిన ఈ స్వల్ప సమయంలో నాకు పుత్రికలు లేని కొరత తీరింది. నేటి నుంచీ నాకు శ్రీముఖుడు ఎంతో నీవూ అంతే. సకల రాజ మర్యాదలతో శాతవాహన కులదీపికవై ఉందువుగాక!'

'మహాప్రసాదం, ప్రభూ, మీ వాత్సల్యానికి నేనెప్పుడూ ఋణపడి ఉంటాను. కానీ నా గమ్యం కళింగంలో నా ప్రభువు నాగసేనుని సేవ. ఎక్కడ ఉన్నా పితృసములైన మీ ప్రేమ మరువను.'

'అయ్యో తల్లీ, నేను ఇంతవరకూ చెప్పబోయిన విషయం సావధానంగా విను'. అంటూ ఆమె శిరస్సుపై చేయుంచి దగ్గరకు తీసుకొని, 'ఈ నాటకంలో అందరికన్నా ఎక్కువ క్లేశం అనుభవించవలసింది నీవే తల్లీ' అన్నాడు.

దుర్నిమిత్తమైన మహారాజు మాటలు విని అయోమయమైన మనస్థితితో నాగసేనునికి ఏ విపత్తు వచ్చిందో అని కీడును శంకిస్తున్న మల్లికతో, 'చూడమ్మా, నీవు అనుమానించినట్లే మేఘరాజును నిర్వీర్యం చేసేందుకు పన్నిన పథకంలో నేనూ కూడా ఒక పావునై నీవద్దకు వచ్చాను. నీవు అన్నంత వరకూ నాకే తట్టలేదు. ఇది చక్రవర్తి నుండి వచ్చిన ప్రత్యేక వర్తమానం. చక్రవర్తికి లోబడటానికి మేఘరాజ తలవరి పెట్టిన ఒకే ఒక షరతు, తన కుమార్తె నాగసేనుని ఇల్లాలు అయితే అతనిని దక్షిణ కళింగపు వారసునిగా ప్రకటించి తాను రాజ్యత్యాగమే కాక ప్రాణత్యాగం కూడా చేయటానికి ఒప్పుకొన్నాడట. అయితే నీ ప్రభువు దానికి అంగీకరించలేదు. సమస్త కళింగ జనపదానికీ అతనినే రాజప్రతినిధిని చేస్తామని లోభపెట్టినా అతను విశాఖాదేవిని చేబట్టటానికి ఒప్పలేదట. నీవు కనుక వివాహాన్ని తిరస్కరించి ఉపాసకురాలివైతే నాగసేనుడు తోసలిలో మహాభోజుడగుట సాధ్యమవుతుంది అని రథగుప్తులు నన్ను కోరగా నిన్ను ఒప్పించడానికే వచ్చాను. అయితే, కళింగానికి నాగసేనుని అధిపతిని చేయడంలో చక్రవర్తి ఉద్దేశ్యం మాత్రం నా ఊహకు అందకుంది'.

పొంగి వస్తున్న దుఃఖాన్ని అదిమిపెట్టి, ప్రస్తుతమైన రాజకీయ సమస్యపై మనస్సు పెట్టి, 'నాయనగారూ, నా ప్రభువు నాగసేనుని భవిష్యత్తు కొరకేనైతే, నేను నా ప్రాణత్యాగం చేయడానికైనా సిద్ధమే. కానీ... నా మనస్సుకి ఎందుకో వేరేవిధంగా తోస్తుంది. కళింగాన్ని మన ఆంధ్రులకు దూరం చేసే ఈ పథకంలో తెలిసో తెలియకో నా స్వామి కూడా ఎందుకు పాత్రధారి అయి ఉండకూడదు? వారు మన దేశానికి వచ్చిన పిదపే కదా ఇంత తంత్రమూ జరిగింది. పైగా చక్రవర్తి యుద్ధానంతరం పశ్చాత్తాపానికి లోనవడం, అంత త్వరగా బౌద్ధం స్వీకరించడం చూస్తే...

ఇదేదో ఈ పథకంలో సాయపడిన బౌద్ధసంఘాలకి ఆయన చూపిన ప్రతిఫలంలా అనిపిస్తుంది. నాగసేన ప్రభువును ఇక్కడకు రావటానికి పురికొల్పినదెవరో తెలిస్తే, ఇంతకాలం మన మధ్యనే ఉండి, చక్రవర్తి ఆదేశాల మేరకు మీకు సూచనలిస్తూ కథనూ నడిపించిన సూత్రధారి ఎవరో తేటతెల్లం అవుతుంది.'

'చాలా సులభం... నాకు ఇప్పుడు పూర్తిగా అవగతమయింది. నీవూ గ్రహించే ఉంటావు. నాగసేనుడు వచ్చిన సమయానికి వారి రాక కాకతాళీయం కాదు. అదీగాక చక్రవర్తి సోదరుడు వీతశోకుడూ, రథగుప్తుని కుమారుడు ఉపగుప్తుడూ కర్ణాటం వచ్చిన తదుపరే ఈ పథకానికి నాంది పలకడం జరిగింది' అని ఒక క్షణమాగి, 'చూడమ్మా, ఒక తండ్రిగా తన ప్రియపుత్రికని ఒక కోరిక కోరుతాను, చెల్లిస్తావుగా తల్లీ?'

'ఊ' అని తలదించిన ఆమె శిరస్సు నిమురుతూ,

'ఎవరక్కడ?' అన్న క్షణంలో ప్రత్యక్షమైన కోడబలిదొరతో, 'ఆచార్యులు తిష్యస్వామిని మేము కోరామని తోడ్కొని రండి', అని పురమాయించి, మల్లికతో ఆప్యాయంగా,

'జాగ్రత్తగా విను తల్లీ, మనమీ పథకాన్ని గుర్తించినట్లు వేరెవ్వరికీ తెలియకూడదు. ప్రస్తుతానికి చక్రవర్తి కోరిన విధంగా దీక్ష తీసుకున్నట్లే ప్రవర్తించు. తిష్యస్వామికి ప్రఛ్ఛాయలా ఇక్కడే ఉండి ఏ విషయం నీ దృష్టికి వచ్చినా వెంటనే నాకు తెలియజేయాలి. సోంభొంట్లను నీకు రక్షణగా ఇక్కడే ఉండేట్లు ఏర్పాటు చేస్తాను. నాకైతే నాగసేనుడు తెలిసితెలిసీ ఈ పథకంలో పాలుపంచుకొని ఉంటాడని అనిపించడంలేదు. దీని వెనక ఈ బౌద్ధసంఘాల తంత్రం గోచరమౌతుంది. అసలు విషయం తెలియడానికి సమయం పట్టవచ్చు. ఏమైనా, నాగసేనుని కళింగ రాజ్యాభిషిక్తుని చేసేవరకూ వేచియుండి ఆపైనే మన భవిష్యత్ కార్యాచరణం నిర్ణయిద్దాం. సరేనా? అంతవరకూ నీవు ఎట్టి సందేహాలూ లేకుండా ఇక్కడే ఉంటావు కదా తల్లీ?'

అతి కష్టంగా పెల్లుబుకుతున్న కన్నీళ్ళని దిగమింగుతూ నిస్సహాయయై శాతవాహనుని పక్కనేఉన్న మల్లికను చూసి విషయం అర్థమయినా, తెలియనట్లు నటిస్తూ నిలిచిపోయిన తిష్యస్వామితో, రాజు, 'ఆచార్యా, కొన్ని అనివార్యమైన కారణాలవల్ల, మీ శిష్యురాలు ఒక అసాధారణమైన నిర్ణయం తీసుకోవలసి వచ్చింది. మల్లిక నాకు పుత్రికతో సమానం. ఈ క్షణం నుంచీ మీరే ఈమెకు తల్లీ, తండ్రీ గురువూనూ. ఈ చైత్యనిర్మాణం పూర్తి అయ్యే వరకూ ఈమె ఇక్కడే మీతోనే ఉండగలదు. ఈ వయస్సులో శ్రమణవృత్తి స్వీకరిస్తానని పట్టుపట్టి, ఎంత చెప్పినా నా మాట వినటం లేదు. మీరైనా కొంత చెప్పండి. మీవద్ద సామాన్య శిష్యురాలిగా ఉంటూ చైత్య నిర్మాణంలో మీకు సహాయపడితే చాలు. నిర్మాణం పూర్తి అయిన తదుపరి, మీరే యోగ్యత గ్రహించి దీక్షని ఇవ్వవచ్చు. ఏమంటారు?' అని, అన్నీ తెలిసీ ఆశ్చర్యాన్ని నటిస్తున్న ఆచార్యునికి అప్పగించాడు.





# 23

శిష్యురాలితో తిష్యస్వామి రేవుకుచేరిన కొన్ని నిమిషాలకు కదిలిన బల్లకట్లు చూస్తూ నిలిచిపోయాడు శాతవాహనుడు. చుట్టూ అలుముకున్న స్తబ్ధతను ఛేదిస్తూ, శ్రీముఖుడు అనంతపాలామాత్యుని ఉద్దేశ్యించి, 'కత్తిమొనతోనే శాంతిని సాధించగలం, ఏక్షణాన్న అది పదును తప్పుతుందో మరునిమిషమే అరాచకం ప్రబలుతుంది'.

'నిజమేకావచ్చు, కానీ భరతఖండంలో ఇక జయించవలసిన దేశాలు లేవుగదా'.

'అందుకని మన ఆయుధాలు మూలబెట్టి కాషాయాలుగట్టి ధర్మపన్నాలు వల్లించడం మొదలుపెడితే, ఈ రాజ్యం ఇంకెన్నాళ్ళు మన్నేను? ఇక రాజులంతా సన్యాసులవాల్సిందే' అన్నాడు శ్రీముఖుడు, అమాత్యుని వంక వ్యంగ్యంగా నవ్వుతూ, 'జైత్రయాత్రలకు బదులుగా ధర్మయాత్రలు చేస్తాడట!'

'అవి వట్టి మొసలికన్నీళ్ళు. దేశంలో అతను సృష్టించిన హింసాకాండ వలన పడిన మచ్చని మాపుకొనే ప్రయత్నం మాత్రమే. చేప దొరికేవరకే ఎంతటి కొంగజపమైనా, చూద్దాం ఎన్నాళ్ళు చేస్తాడో?'

'ఈలోగా ఈ అశోకుని బౌద్ధవాదానికి మగధ సైన్యవ్యవస్థ నిర్వీర్యం కాక తప్పదు'

'అదీ ఒకవిధంగా మన మంచికేనేమో కుమారా. ఆలోచించు. చక్రవర్తే కనుక ఇదే విధానాన్ని కొనసాగిస్తే వైదీక బ్రాహ్మణులలోనూ, ఇతర జైన, అజీవక సంఘాలలోనూ కొంత అసంతృప్తి రాక తప్పదు. అప్పటి వరకూ క్షాత్రధర్మ ప్రవృతులైన వీరులకెల్లా మనమే ప్రత్యమ్నాయం కల్పించగలిగితే?'

'అదెలా సాధ్యం అమాత్యా, సైన్యబలాలని వెంటనే తగ్గించాలని కదా అతని ఆదేశం?'

'అన్నిదిశలనుండి సురక్షితమయిన ఆర్యావర్తానికయితే ఈ ఆలోచనవల్ల ఎటువంటి ఇబ్బందీ లేదు. కానీ సరిహద్దు నగరాలైన తక్షిశిల, ఉజ్జయినీ, సువర్ణగిరి, ఉత్కళపు నూతన రాజధానియైన తోసలి నగరాలకు రక్షణ అవసరం. ఇక సింధూ తీరం నుండి తామ్రలిప్తి వరకూ గల అనంతమైన తీరప్రాంతాలు. ఇవిగాక, ద్రవిడ జాతులయిన పాండ్య, కేరళపుత్రులు ఇప్పటికీ స్వతంత్రులే'.

'అంటే దక్షిణ దేశంలో సైన్యాన్ని తగ్గించటం అసాధ్యం అంటారు?'

'అవును, తూర్పు, పశ్చిమ దక్షిణ రాజధానులు, మహారాట్ట కళింగ కర్ణాట మహాభోజుల ఆధీనంలోనే ఉంటాయి. అంటే దక్షిణాపథపతులైన మీ శాతవాహనుల బలం ఏమాత్రం తరగదు. ఒకవేళ క్షీణిస్తే మగధ ప్రాబల్యమే'.

'మీ మాట ప్రకారం అదే జరిగితే, సమస్త భారతదేశంలో మనకి ఎదురే ఉండదు, అంటూ లేచి అమాత్యునికి నమస్కరించాడు భావి ఆంధ్ర శాతవాహన సామ్రాజ్య సంస్థాపకుడు, శ్రీముఖ శాతవాహనుడు'.

అంతవరకూ మౌనంగా వారిని గమనిస్తున్న శాతవాహనుడు, 'కుమారా, అంత ఆత్రం తగదు. ప్రత్యర్థిని ఎప్పుడూ తక్కువ అంచనా వేయకూడదు. నీ పదవిలోని అధికారం నేతిబీరకాయలో నెయ్యివంటిది... ఆలోచించు, మేఘరాజే కనుక తాను చెప్పినవిధంగా గజదంతాఘాతానికి తన ప్రాణత్యాగం కావిస్తే, సమస్త తూర్పు తీరం చక్రవర్తి బావమరిది నాగసేనుని పాలవుతుంది. అంటే దక్షిణాపథపతిగా నీ పలుకుబడి గోదావరి దాటదు. ఇక కర్ణాటపు సువర్ణగిరిలో రాజవచనికులంతా బౌద్ధులూ, చక్రవర్తిచే ప్రత్యేకంగా నియమించబడ్డ మహామాత్రులూ. మగధ స్కంధావారాలు ఇక ఉండనే ఉన్నాయి'.

'అంటే మనం చేయగలిగింది ఏమీ లేదనా మీ ఉద్దేశ్యం?'

'లేకపోకేమి, చాలా ఉంది. నీవనుకున్నట్లు దక్షిణాపథం స్వతంత్రం కావటం ఇప్పుడిప్పుడే సాధ్యం కాదు. మగధను నిర్వీర్యం చేయడమే మన లక్ష్యం అయితే, నాగసేనునీ, తద్వారా చారువాకీదేవి సహకారం లేకపోతే అది అసాధ్యం. అందుకే మనం చాలా జాగ్రత్తగా అడుగు ముందుకేయాలి'.

'ప్రభూ, తమ మాటలు ఏదో నిగూఢమైన, మాకు తెలియని సమాచారాన్ని సూచిస్తున్నాయి' అంటూ తన సందేహాన్ని వెళ్ళబుచ్చాడు, సూక్ష్మబుద్ధియైన అనంతపాలుడు.

'అవును అమాత్యా, అంతా విశదీకరిస్తాను. ఈలోగా, మన తక్షణకర్తవ్యం ఒకటి ఉంది. ఏదో విధంగా విశాఖాదేవితో, నాగసేనుని వివాహానికి విఘ్నం కలిగించాలి. ఈ జ్యేష్ఠమాసారంభంలోనే మేఘాద్రిగడ్డపై మేఘరాజు స్వర్గారోహణా, నాగసేనుని వారసునిగా ప్రకటించటం జరుగనున్నాయి. మీరే స్వయంగా ఈ గ్రీష్మతాపానికి వెరువక బావరికొండకు వెళ్ళి ఈ కార్యాన్ని సాధించాలి'.

'తథాస్తు'

అమాత్యుని సంకల్పానికి వంతపాడినట్లు ఆకాశం ఉరిమింది. ముంగారుజల్లులకి బౌద్ధచైత్యంపై వెలుగుతున్న దీపాలు నిస్తేజమై, చుట్టూ ఒక్కసారిగా చిమ్మచీకటి అలుముకుంది.




గౌతమీపుత్ర శాతకర్ణి
మహేంద్ర సామ్రాజ్యం
క్రీశ. 85
ములక - అంతర్లీనమైన రాష్ట్రాలు
సిరితన - పర్వత శ్రేణులు
- కథలో ప్రస్తావించిన పట్టణాలు
కుషాణ
శక
మగధ
(కాణ్వ)
క్షహరాట్టులు
కుకుర
ఆకర
అభీర
ఉజ్జయిని
సౌరాష్ట్ర
అవంతి
విదర్భ
వింధ్య
పరియాత్ర
భరుకచ్ఛం
అనూప
కోసల
దశార్ణ
ములక
ప్రతిష్ఠానం
శూర్పారక
కోసలపట్టణ
తగరపురి
క్షహరాటపురి
వ్యాసపురి
అశ్మక
నాణెఘాట్
పౌధన్యం
నరసల
కళింగ
కల్యాణీపురి
(కొల్లియానోపోలిస్)
కొండపురి
విశాఖ
అశిక
యజ్ఞవటం
ధాన్యకటకం
ఇంద్రకీలం
కదంబ
వైజయంతి
శ్రీపర్వతం
కుదురెవటం
పిధృడం
సిరితన
ధనదపురం
పల్లవకం
చకోర
కళభ్ర
మహిష
సెతగిరి
మలయ
ముజేరిస్

# 24

## అమరావతి మ్యూజియం, క్రీ.శ. 1987

'**బా**గుందిరా! అంటే ఈ స్తూపం చూడాల్సిందే' ఉపేంద్ర చెప్పినది విన్నాక నాకెందుకో కొంచెం చరిత్ర మీద ఇంట్రెస్టు పుట్టిన మాట వాస్తవమే. అదేదో తొందరగా చూసేసి ఒక పనైపోయింది అనిపిద్దామని, ఎదురుగా కనిపిస్తున్న పెద్ద గుట్ట వైపు అడుగేసాను.

'అక్కడేమి చూస్తావురా? ముందు మ్యూజియంలో స్తూపం మోడల్ ఒకటి తయారు చేసాం. అది చూస్తేగానీ నీకు దాని గురించి పూర్తిగా అవగాహన రాదు, అని లోనికి దారి తీసాడు, ఉపేంద్ర.

బ్యూటిఫుల్ స్కేల్ మోడల్!

'చాలా కష్టాలకోర్చి చేసార్రా, మీరు పిచ్చినాయాళ్లు కాకపోతే, ఎదురుగా ఒరిజినల్ పెట్టుకుని ఇదెందుకురా ఇక్కడ? యూ షుడ్ గెట్ సమ్ మార్కెటింగ్ ఎక్స్పర్టైస్. ఇదే ఏ హైదరాబాద్ ఏర్పోర్టులోనో పెడితే కొంచెం టూరిస్ట్ ఇంట్రెస్ట్ పెరుగుతుంది' అన్నాను ఎగతాళిగా.

ఉపేంద్ర ముఖం అదోలా అయింది. 'నేనన్నదానికి హర్ట్ అయ్యాడా? ఊహూ... వాజ్ ఇట్ ఇంట్రాస్పెక్షన్?'

'నీవు అన్నది చాలావరకూ నిజమేరా, కానీ... ఈ అమరావతి విషయంలో సాధ్యం కాదు. మేము చేసిందే రైటు. స్తూపం మొండు చూస్తే నీకే తెలుస్తుంది', అన్నాడు చాలా సీరియస్‌గా.

'నీవు చెయ్యరా ఆ పని... పెద్ద మార్కెటింగ్ మేనేజర్‌వి కదా, ఈ మోడల్ చూసి అదే ఊహించుకొని వచ్చిన వాళ్ళు ముందు నీ మొహం పగల కొడతారు'.

'అదేం?'

'పద. నువ్వే చూద్దువుగాని...'

✦ ✦ ✦

పెద్ద మట్టిదిబ్బ.

అక్కడక్కడా పడి ఉన్న పాలరాతి శకలాలు. చుట్టూ బార్బుడ్ వైర్ ఫెన్స్.

పెద్ద నీలి రంగు బోర్డు. భారతీయ పురావాస్తు సర్వే, నోటిస్. ఈ కట్టడాన్ని పాడుచేసినవాళ్ళు శిక్షార్హులు, అని దాని సారాంశం.

‘ఎవరినిరా ఇప్పుడు శిక్షించేది? 1958 లో చేసిన చట్టం? అయినదంతా ఈ ఏన్షియెంట్ మాన్యుమెంట్స్ యాక్ట్ వచ్చే ముందే కదా అయింది’, అన్నాడు రమేష్ ఆ బోర్డ్ చూస్తూ.

అవునని తల ఊపాడు, ఉపేంద్ర. ‘ద సో కాల్డ్ ఆంటిక్వేరియన్స్, హిస్టారియన్స్, సివిల్ సర్వెంట్స్. వాళ్ళ ఉద్దేశ్యాలు మంచివే అయివుండవచ్చు. కానీ...’

నాకు ఆ క్షణంలో అర్థం కాలేదు... ప్రశ్నార్థకంగా ఉపేంద్ర వంక చూసాను.

‘ఓకే, లెట్ మీ మేక్ ఇట్ క్లియర్. మనం విన్న అమరావతి స్తూపం ఇదే. కానీ ఆ శిల్పాలు ఇప్పుడు ఇక్కడ లేవు. నీవు చూస్తున్న మట్టి గుట్టా, ఆ మ్యూజియంలో చూసిన కొన్ని లైమ్ స్టోన్ స్లాబులూ తప్ప వేరే మరేమీ లేవు’, అన్నాడు ఉపేంద్ర.

‘సో...’ పెద్ద మేధావిలా పోజు పెట్టి, ‘ఓకే దెన్... ది సో కాల్డ్ స్తూపం ఈజ్ అనింపార్టెంట్, రైట్? దెన్ లెట్స్ గో టూ ది కేవ్స్’ అన్నాను.

‘కేవ్సా?’ అని వాళ్ళిద్దరూ ఒకరి ముఖం ఒకరు చూసుకోవడంతో నాకిక కోపం ఆగలేదు. ‘అయామ్ గోయింగ్. ఐ కాంట్ టేక్ దిస్ ఎనీమోర్... ఆల్రైట్, యూ కాల్డ్ మీ హియర్’, రమేష్‌తో, ‘ఏదో గ్రేట్ మాన్యుమెంట్ అన్నావు. ఇప్పుడేమో చూద్దాం అంటే ఏమీ లేవంటావ్. ఐ మే బీ ఇగ్నోరెంట్. బట్ అయామ్ నాట్ ఏ ఫూల్, ఓకే? అమరావతి గుహలు చూడకపోవచ్చు కానీ అవి ఉన్నాయని నాకు తెలియదనుకోకండి. మీరు కాకపోతే ఇక్కడ ఎవరిని అడిగినా చూపిస్తారు’, అని విసావిసా అక్కడనుంచి కదిలాను.

‘ఆగరా ఎక్కడికెళతావ్’ అని వెనుకే పరిగెత్తుకుని వచ్చారు.

‘ఇట్స్ మై బిజినెస్. మీకెందుకు? వీలైతే గుహలు చూస్తాను. అదీ ఇక్కడకి వచ్చాను కాబట్టి... దెన్.. ఐ విల్ గో హోమ్’

‘ఇక్కడ చూడడానికి గుహలేమీ లేవురా... ఆగు’ వెనక్కి తిరిగి చూస్తే వాళ్ళ ముఖాలలో ఎగతాళి లేదు. సీరియస్‌గా నిజమే చెబుతున్నారు అనిపించింది.

మరి ఆ పాట?

‘అమరావతీ గుహల అపురూప శిల్పాలు...’ అని ‘మా తెలుగుతల్లికీ మల్లెపూదండ’ పాటలోని చరణాన్ని రాగయుక్తంగా పాడి, ‘నాకూ తెలుసూ అని ఇప్పటికైనా నమ్ముతారా?’

ఆహ్! అని నోరెళ్ళబెట్టారు ఇద్దరూ. నిజంగా గుహలేమీ లేవని తెలిసాక నోరెళ్ళబెట్టడం నా వంతు అయింది.

కాసేపాగి...

‘మరి ఏమీ పెద్దగా లేని ఈ అమరావతి అంత వరల్డ్ ఫేమస్ ఎలా అయింది?’ అడిగాను.

ఉపేంద్ర నవ్వుతూ, ‘బాగా అడిగావురా, ఇక్కడ లేక పోయినా... లండన్, బెర్లిన్, ప్యారిస్, బాస్టన్... అలా ప్రతి అంతర్జాతీయ మ్యూజియంలోనూ ఉన్నాయి. వాటి అన్నింటిలో లండన్ బ్రిటిష్ మ్యూజియంలోని కలెక్షన్ అతి పెద్దది. వాటిలో కొన్ని 1867 లో ప్యారిస్ ఎగ్జిబిషన్‌లో మొట్టమొదటి సారి విమర్శకులూ, పత్రికారులూ, మేధావుల ముందు ప్రదర్శింపబడ్డాయి...’ అని చెప్పసాగాడు.



25

## లండన్ నగరం, క్రీ.శ. 1866

రోడ్డు అంతా సందడిగా ఉంది. ఆదివారం. ఊరంతా రోడ్డుమీదే ఉన్నారా అన్నట్లు హడావుడి చూస్తే, మళ్ళీ ఇంగ్లాండుకు మంచిరోజులు వచ్చాయి అనిపించక తప్పదు. ప్రపంచపు అన్ని మూలలనుండీ విజయ వార్తలే. ముఖ్యంగా ఇండియా! సిపాయి తిరుగుబాటు ఒక హిస్టరీ. బ్రిటిష్ సామ్రాజ్యానికి ఇక ఎదురులేదు అనే భావన ప్రతి పౌరుడి ముఖంపైనా ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

డాక్ కార్టు, ఎర్ల్స్ కోర్ట్ జంక్షన్ వద్ద ఆగింది. అక్కడ నుండి సౌత్ కెన్సింగ్టన్ మ్యూజియం ఎంతో దూరం లేదు. వేసవి వానలకి తోడు బండి చక్రాల వల్ల ఏర్పడిన బురద నీటిని గెంతుతూ రోడ్డు దాటాడు, జేమ్స్ ఫెర్గూసన్.

తెల్లని మేసన్రీ స్తంభాలతో, గ్రీకు శైలి కట్టడం. వాస్తు కళలంటే సంస్థాపకుడు హెన్రీ కోల్‌కు గల అభిలాష ప్రతి అంగుళంలో కనిపిస్తుంది.

ఆదివారం గవర్నమెంట్ హౌస్‌కి సెలవు. అందుకే ఇక్కడ మీటింగ్. హెన్రీ కోల్, సైన్స్ & ఆర్ట్స్ డిపార్ట్‌మెంట్ సెక్రటరీయే కాదు, సౌత్ కెన్సింగ్‌టన్ మ్యూజియంకి డైరెక్టర్ కూడా. పైగా ప్రిన్స్ఆల్బర్ట్‌కి ఆంతరంగికుడూ. కళలలో అభిరుచి ఇద్దరికీ ఎక్కువే!

'ఎందుకు పిలిపించాడో?'

'మీ కోసమే ఎదురు చూస్తున్నారు' అని గొడుగు అందుకుని లోనికి దారి చూపాడు ఎడ్వర్డ్. ఎన్నోయేళ్ళగా కోల్ దివాణంలో పనిచేస్తున్నాడు. హెన్రీ కోల్‌కి బట్లరూ, బైలిఫ్, కోచ్‌మన్ అన్నీ అతనే. 'మిస్టర్ జేమ్స్, చిన్న మాట. సర్ హెన్రీతో పాటూ ఫ్రాన్స్ నుండి వచ్చిన మార్కీస్ ద్యుప్రీ కూడా ఉన్నారు', ముక్కు చిట్లిస్తూ ఆ దేశంపై తనకుగల అయిష్టతను ఏమాత్రమూ దాచకుండా.

'ఓహ్! నేనేదో ఇన్ఫార్మల్‌గా కలవడమే అనుకున్నానే? ఏమిటి విషయం, ఎడ్వర్డ్?'

'ఏమో నాకేమి తెలుసు? సర్ హెన్రీ విషయం మీకు తెలుసు కదా? అఖరి నిమిషందాకా ఏమీ చెప్పడు. అయినా మీకే చెప్పని విషయాలు బట్లర్‌ని నాకు చెబుతారా?' అని ఫెర్గుసన్ దుస్తుల వంక ఎగాదిగా చూస్తూ, 'ప్రిన్స్ ఆల్బర్ట్ వచ్చే అవకాశం మాత్రం ఉంది. లేకుంటే, వారికోసం ప్రత్యేకించిన అస్సాం టీ సిద్ధం చేయమని చెప్పరు,' అన్నాడు.

ఆదివారం కదా అని, తెల్లని ఫ్లానెల్స్, కాలికో షర్టూ, కాస్త నలిగిన గ్రీన్ బేజ్ కోటూ, కాళ్ళకు కాన్వాస్ బూట్లూ, ఇక పలుచ బడుతున్న ఎర్రని జుట్టు కప్పుతూ బౌలింగ్ హ్యాటూ. మేరీలీబాన్

**జేమ్స్ ఫెర్గుసన్**

1883. ఇల్బర్ట్ బిల్లు ప్రవేశపెట్టే యత్నానికి వ్యతిరేకత ఊపందుకొంటుంది. అది భారతీయ న్యాయమూర్తులకు బ్రిటిష్ పౌరులను విచారించేందుకు హక్కు కలిగించే ప్రయత్నం. ఇదేమి చోద్యం? రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాధినేతలైన ఆంగ్లేయులకీ, అనాగరిక భారతీయులకీ సమానత్వమా? లేదు! మేధావి వర్గం ముందుకొచ్చి, భారతీయులలో అంతటి మేధాశక్తి, ఆంగ్లేయులనే విచారింపగల మానసిక పరిణతి లేదని లోకానికి తెలియచెప్పే మహాకార్యంలో నిమగ్నం అయింది.

భారతీయ సంస్కృతీ, చరిత్రల గురించి ఎన్నో పరిశీలనాత్మక గ్రంధాలు వ్రాసిన మేధావి, శ్రీ రాజేంద్రలాల్ మిత్రా. భారతీయులలోనూ విద్యావంతులూ, మేధావులూ ఉన్నారని వాదించేవారికి ఒక మంచి ఉదాహరణ. ఆయన వాదనలను ఖండించడమేగాక, 'ఇండియన్లకు ఆంగ్లేయుల క్రిమినల్ చర్యలను విచారించే అధికారాన్ని ఇవ్వడం భావ్యం కాదని తెలియజేయడమే ముఖ్యోద్దేశం' అని పీఠికలో పేర్కొంటూ, జేమ్స్ ఫెర్గుసన్ ప్రచురించిన మౌలికమైన గ్రంథం – 'ఆర్కియాలజీ ఇన్ ఇండియా'.

అంతమాత్రం చేత భారతీయ సంస్కృతికి అతడు చేసిన సేవను తక్కువగా ఎంచలేము. 1875లో అతడు ప్రచురించిన సచిత్ర గ్రంథం, 'ట్రీ అండ్ సర్పెంట్ వర్షిప్'లో అమరావతికీ, బౌద్ధ వాస్తుకళకీ ప్రపంచపు నలుదిశలలో ఇచ్చిన ప్రాచుర్యం అసామాన్యం. అంతేగాక, లండనులో ఒకమూల దిక్కులేకుండా పడివున్న అమరావతి శిల్పాలను వెలికితీసి, ప్యారిస్ నగరంలో ప్రదర్శించిన ఘనత కూడా అతడికే దక్కుతుంది.

క్రోకే లాన్స్ నుండి అలాగే వచ్చేసాడు. ప్రిన్స్ వస్తున్నాడని తెలిసి ఉంటే కొంచెం సరియైన దుస్తులు ధరించేవాడే? అయినా ఇప్పుడు చేయగలిగింది లేదు.

'థ్యాంక్స్ హెన్రీ... అంటే ఏదో పెద్ద విషయమే.'

'ఆహ్... ఏమీ లేదు. ప్యారిస్‌లో జరగబోయే ఎగ్జిబిషన్ గురించనుకుంటాను. బ్రిటిష్ మ్యూజియమ్ నుండి కల్నల్ మెయ్సీ కూడా వస్తారట! తప్పుగా అనుకోకపోతే చెప్తాను, మిస్టర్ జేమ్స్. మీకు అందరికీ ఫ్యాషన్ అయిపోయింది కానీ, లేకపోతే చెట్లకీ పాములకీ పూజలు చేసే ఆ అనాగరిక ఇండియన్లది ఒక కళా?'

'ఆహహ్ హెన్రీ! చెట్లూ పాములూ! భలే! నా పుస్తకానికి మంచి టైటిల్ సూచించావు. నిజమే ఆ చెట్లూ పుట్టలూ పట్టుకు తిరిగే ఇండియన్లలో అంత మంచి కళాకారులా? సాధ్యం కాదు. తప్పకుండా అది మన ప్రాచీన గ్రీకూ, రోమన్ సంప్రదాయమే. బాక్ట్రియా ద్వారా ఆ అనాగరికులకు చేరి ఉండాలి... పద. సర్ హెన్రీ ఎక్కడ? ఆఫీసులోనే కదా?' అంటూ లోనికి దారితీసాడు, ఫెర్గుసన్.

✦ ✦ ✦

'భోపాల్ బేగం సరేనన్నా మీ బ్రిటిష్ రెసిడెంట్ వద్దన్నారట. లేకుంటే ఎగ్జిబిషన్ ముఖద్వారంగా ఆ భిల్సాటోప్ సాంచీ తోరణాన్నే పెడదాము అనుకున్నాం', అంటూ తన నిరాశను వెలిబుచ్చాడు మార్కిస్ ద్యూప్రీ.

'అవునవును, విన్నాను. కానీ సంప్రదాయక వాస్తు సంపదను తరలించరాదని కొలోనియల్ ఆఫిసులో వచ్చిన కొత్త సెక్రెటరీ ఉద్దేశ్యం'. అని తలవూపాడు, సర్ హెన్రీ. అతని మాటలలో వ్యంగ్యం తొంగి చూసింది.

'దానిలో తప్పేముంది సర్?' అంటూ తండ్రి అడగకుండానే జోక్యం చేసుకున్నాడు, లెఫ్టనెంట్ హెన్రీ కోల్ జూనియర్, సర్ హెన్రీ తనయుడూ, బొంబాయిలో ఇండియన్ ఆర్మీలో ఆఫీసర్. 'పురాతన కట్టడాలను ఇలా మ్యూజియంలకి

తరలించడంకన్నా ఉన్న స్థలంలోనే సంరక్షించడం ఉచితం కదా?'

'నిజమే యంగ్ హెన్రీ, నాగరికుల ప్రపంచంలో, అంటే ఐరోపాలో అయితే సరే. కానీ ఆ మారుమూల ప్రదేశాలలో అనాగరిక మనుష్యుల మధ్య ఉంచడంలో ఉపయోగం?' అని తన అభిప్రాయాన్ని ప్రకటించాడు, ఫెర్గుసన్.

'ఈ వాగ్వాదం ఇప్పుడు అప్రస్తుతం' అని వారిని వారించి, 'ఇప్పుడు కావలసింది బ్రిటిష్ సామ్రాజ్య ప్రతిష్ఠ ఇనుమడించేలా ప్యారిస్ ఎగ్జిబిషన్లో మనమేమి చేయాలో ఆలోచించాలి. భిల్సాలోని సాంచి తోరణాన్ని వాకిలిగా నిలబెట్టాలనే వారి ఉద్దేశ్యం అయితే మనం దానికి తప్పక సహకరించాలి' అని డ్యూఫ్రీ వైపు చూస్తూ, 'ఒకవేళ ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్‌తో చేసిన ప్రతిరూపాలయితే సమంజసమేమో? ఏమంటారు, మార్కీస్?' అన్నాడు సర్ హెన్రీ.

'ఆహ్... ప్లాస్టర్! నిజమైన వస్తువులకి ఉండే విలువ వాటికెలా వస్తుంది, సర్ హెన్రీ? తప్పదు అంటే సరే, కానీ ముఖద్వారంగానా? అసాధ్యం!'

'మిమ్మల్ని అర్థం చేసుకోగలను, మార్కీస్. ఇండియా బ్రిటిష్ సామ్రాజ్యంలో అతి ముఖ్యమైన భాగం. 'ఏ జ్యువెల్ ఇన్ ద క్రౌన్!' అక్కడి కళాసంపద అపురూపం. భవిష్యత్తులో పారిశ్రామిక వాస్తుకళలో మార్పులు ఎంతో అవసరం. లేకుంటే చూడండి... నల్లని ఇనుప చిమ్నీలూ, రేకుల షెడ్లూ, మన నగరాల స్వరూపమే దిగజారిపోయింది. పారిశ్రామికంగా వస్తున్న మార్పులతో మారుతున్న ఈ వాస్తుకళని ప్రాచీన సంప్రదాయాలకు అనుగుణంగా సంస్కరించడం ఒక్కటే మార్గం. దానికి ఈ ఎగ్జిబిషన్‌లు ఎంతో దోహదపడగలవు'. అని పటిష్ఠమైన తన అభిప్రాయాన్ని తెలుపుతూ, 'ఈ విషయంలో మీరు చింతించనవసరం లేదు. మన మిస్టర్ జేమ్స్ ఫెర్గుసన్ మీకు తెలుసు. మంచి ఆర్కిటెక్టే కాదు, ప్రాచీన శిల్ప సంప్రదాయాలపై ఎంతో పరిశోధన చేసిన మేధావి. వారి పర్యవేక్షణలో ఇండియా పెవిలియన్ అత్యంత ప్రతిష్ఠాత్మకంగా తీర్చిదిద్దబడుతుంది. దీనికి ప్రిన్స్ ఆల్బర్ట్ పూర్తి సహకారం ఉంది. మీరిక నిశ్చింతగా ఉండండి... ఏమంటారు, మిస్టర్ జేమ్స్?' అని ఫెర్గుసన్ వంక చేయిజాచాడు, సర్ హెన్రీ కోల్.

'అంతకంటేనా? మీరు నాపై ఉంచిన బాధ్యతకి సరితూగడానికి ప్రయత్నిస్తాను, సర్ హెన్రీ, మీ సహకారం ఉంటే కృతార్థుడిని అవగలననే నా అభిప్రాయం', చేతిని అందుకుని కరచాలనం చేస్తూ అన్నాడు, ఫెర్గుసన్.

✦ ✦ ✦

'బౌద్ధుల కళాశైలి పెర్షియాలో మొదలై మిగిలిన ఇండియా అంతా పాకి ఉంటుంది, కల్నల్ మెయ్సీ. లేకుంటే ఆ ఇండియన్లలో అంత ప్రజ్ఞా? అసంభవం కాదూ?' అన్నాడు ఫెర్గుసన్. వారిద్దరూ ముక్కులు మూసుకొని సౌథ్వార్క్ తీరంలో బీల్స్ వార్ఫ్ వైపు త్వరత్వరగా అడుగులేయ సాగారు. దారి చాలా సన్నం. నిలిచిపోయిన సరుకుల వాహనాల వల్ల హార్స్ కోచ్ వెళ్ళేందుకు మార్గం లేదు. బురదా, చెత్తా, కుళ్ళు కంపు.

'మంచి చోటే మన వెదుకులాట ప్రారంభిస్తున్నాం. నీవు విన్నది నిజమేకదా కల్నల్?'

'నో డౌట్! మిస్టర్ జేమ్స్. అతడు ఎంతో నమ్మకంగా చెప్పాడు' అని నమ్మబలికాడు కల్నల్ మేయ్యొ.

'వేర్ హౌస్ ఏదో తెలియకుండా ఎలా కనుక్కోవడం?'

'ఓహ్, అదేమీ సమస్య కాదు. అవి వార్ఫ్ పక్కనే అందరికీ కనిపించే విధంగా పడి ఉన్నాయట. అయినా ఒకటా రెండా వందకుపైగా శిలాఖండాలు'.

'ఆహా! అంటే ఎండకు ఎండుతూ... వానకు తడుస్తూ?'

'యస్. అదే దౌర్భాగ్యం. సిపాయి మ్యూటినీ, కొత్త గవర్నమెంటూ. వాటిని పట్టించుకునే నాథుడే లేడు. ఇక బ్రిటిష్ మ్యూజియంకి తరలిద్దామంటే, అవి ఈస్ట్ ఇండియా కంపెనీ సొత్తు. అనుమతి తీసుకోవాలంటే గవర్నమెంటు, కంపనీ నుండి క్రౌనుకి, మారడం వల్ల సాధ్యం కాలేదు. పోర్ట్ అధికారులకు తెలుస్తుంది. పదండి, విచారిద్దాం'.

తడిచిపోయిన చుట్టను పదేపదే వెలిగించేందుకు వ్యర్థప్రయత్నం చేస్తున్న పోర్ట్ అధికారి వాళ్ళిద్దరినీ చూడగానే లేచి నిలుచున్నాడు. ముఖాలనుబట్టీ, దుస్తులనుబట్టీ మనుష్యుల ఇంపార్టెన్స్ గ్రహించడం అతనికి వెన్నతో పెట్టిన విద్య. 'హౌ మే ఐ హెల్ప్ యూ? మెస్సర్స్...?'

పరిచయాల అనంతరం, అసలు విషయానికి వస్తూ...

'అవునవును. 'ఎలియట్స్ మార్బుల్స్!' చాలాకాలం ఇక్కడే పడి ఉన్నాయి. కొన్నేళ్ళ క్రితమే ఇక్కడనుండి తీసుకువెళ్ళారు. ఒక్క నిమిషం... డిటెయిల్స్ రిజిస్టర్‌లో ఉంటాయి. చూసి చెబుతాను' అని షెల్ఫులోని లెడ్జర్ పుస్తకాలు ఒక్కటొక్కటిగా దుమ్ము దులపసాగాడు.

అరగంట గడిచింది.

ఆఖరికి, 'ప్చ్' అని మూతి విరిచి, 'క్షమించండి... చాలా కాలం అయింది కదా, వివరాలు దొరకడం కష్టం' అన్నాడు.

'అలాగంటే ఎలా? ఒకటా రెండా, వందకుపైగా శిల్పాలు? టన్నుల కొద్దీ బరువుంటాయి. ఏ వివరాలూ లేకుండా ఎలా మాయమవుతాయి', అన్నాడు కల్నల్ మెయ్యొ, కొంచెం కటువుగా.

'నో నో, కల్నల్. నాకు ఒక వారం గడువు ఇవ్వండి చాలు. అవి ఎవరు రిలీజు చేసారో కనుక్కొని మీకు ఇన్ఫార్మ్ చేస్తాను'.



'నేను చేయగలిగింది చేసాను, మిస్టర్ జేమ్స్. ఇక ఆ శిల్పాలు ఎక్కడ ఉన్నాయో కనుక్కోవడం అసాధ్యం. మీరీ ప్రయత్నం విరమించుకుంటే మంచిది', అని చేతులెత్తేసాడు కల్నల్ మెయ్యొ.

'లేదు కల్నల్, అన్ని శిలలు అంత సులభంగా మాయమవడం సాధ్యం కాదు. ఇది ఓల్డ్ బెయ్లీ, కల్నల్. అరణ్యం కాదు'. ఫెర్గుసన్ అంత త్వరగా పట్టు వీడేవాడు కాదు.

'మెకెంజీ రిపోర్టు చూసిన తరువాత ఎగ్జిబిషన్‌కి అవే తగినవేమో అనిపించింది. అందుకే

కాకున్నా, అలాంటి కళాఖండాలు ప్రజల దృష్టికి తీసుకు రావడం మన బాధ్యత. ఎంతైనా అవి మన సంస్కృతి యొక్క భిన్నత్వానికి నిదర్శనాలు!'

'అరే! ఎక్కడో ఓరియెంట్‌లో దొరికిన శిల్పాలకీ మన సంస్కృతికీ ఉన్న సంబంధం ఏమిటి, మిస్టర్ జేమ్స్?'

'ఓరియెంట్ కానీయండీ, ఓక్సిడెంట్ కానీయండి. మానవుని కళా దృక్పథానికీ, సృజనాత్మక శక్తికీ మాతృక మన గ్రీకు సంస్కృతే! లేకుంటే ఆ అనాగరిక ఇండియన్లకు అది సాధ్యమా? అలెగ్జాండర్ జైత్రయాత్ర వల్ల ఆసియాకి వలసపోయిన ఐరోపా వాసుల భిక్షమే కానీ, లేకుంటే ఈ పంతొమ్మిదవ శతాబ్దంలో కూడా మూఢవిశ్వాసాల మధ్య మగ్గే, వాళ్ళకి అంత రసజ్ఞతా? అంత అభిరుచా? అబ్సర్డ్!'

'సరే మీ అభిప్రాయాన్ని నేనెందుకు కాదనాలి? ఈ అమరావతి రాళ్ళ గురించి మీకు సహాయ పడలేక పోయినా, ఎగ్జిబిషన్ విషయంలో మీకు ఏ అవసరం వచ్చినా మా బ్రిటిష్ మ్యూజియమ్ ద్వారాలు మీకోసం తెరిచే ఉంటాయి. గుడ్ లక్, మిస్టర్ జేమ్స్'.

'ఆహ్, ఒక్క క్షణం కల్నల్. ఆ రాళ్ళను గురించి ఆ పోర్ట్ క్లర్క్ ఏమన్నాడు? 'ఎలియట్స్ మార్బుల్స్' అని కదూ? ఎలియట్ పాలరాళ్ళు? ఈ ఎలియట్ ఎవరో తెలిస్తే మనకి వాటి జాడ తెలియవచ్చేమో?'

'ఇంకెవరు, మిస్టర్ జేమ్స్? సర్ వాల్టర్ ఎలియట్... ఈ సంవత్సరపు స్టార్ ఆఫ్ ఇండియా! కంపనీ పదవి విరమించి ఆన్యూటీపై ఇక్కడే లండన్ నగరంలో ఉన్నాడు. నిజమే అతడిని కలిస్తే మీకు కొన్ని వివరాలు తెలియవచ్చు. ఐ విష్ యూ లక్!'



**అన్ని మావే - దురభిప్రాయం**

18వ శతాబ్దం... ఐరోపా దేశాలు ప్రపంచాన్ని జయించి తమ సామ్రాజ్యాలు స్థాపించుకుంటున్న సమయం. నాగరికతకు ఆలవాలమైన ఐరోపా, అనాగరిక ప్రపంచానికి నాగరికతను పంచు తున్నదనే అహంభావం.

కానీ, ఆ దేశాలలో ఒక్కొక్కటిగా బయట పడుతున్న ప్రాచీన వైభవపు ఆనవాళ్ళు వాళ్ళకి మింగుడు పడలేదు. మురికి కూపాలలో, అర్ధ నగ్నంగా బ్రతికే ఆ హీనదేశాలకి అంత పరిణతి చెందిన నాగరికతా? అసంభవం!

మరి వాళ్ళకి అంతటి సంస్కృతి ఎలా అబ్బింది? ఆ ప్రశ్నకి ఒకే ఒక జవాబు. మనుషులలో తెల్ల చర్మంగల ఐరోపా ఖండపు కాకేసియన్ జాతులకు మాత్రమే అంతటి నాగరికతను సృజింపగల మనోపరిణతీ, సామర్థ్యమూ ఉన్నాయి. మరి అంత ప్రాచీన కాలంలో ఐరోపాలో ఉన్న నాగరికతలు ఏవి? గ్రీకు దేశాలు? రోమన్ సామ్రాజ్యం?

అంతే జవాబు దొరికింది!

అలెగ్జాండరు జైత్రయాత్ర కారణంగా వలసవచ్చిన ఐరోపా దేశీయుల వద్దనుండో, లేక ఆ పిమ్మట అతడి సైన్యాధ్యక్షులచే స్థాపించబడిన రాజ్యాల వలననో... ఈ అనాగరికులకి కొంచెం నాగరికతా, కళాభిరుచి అబ్బివుంటాయి.

కానీ అంతలోనే క్రీపూ. 5వ శతాబ్ది, అంటే, అంతకుమునుపే, ఇండియాలో మహానగరాలూ, సామ్రాజ్యాలూ, పరిణతి చెందిన వివిధ మత ధర్మాలూ ఉన్నాయనే సత్యం వెలికి వచ్చింది. అంటే...అలెగ్జాండరుకి ముందే కొందరు తెల్లవాళ్ళు మనదేశం వచ్చి ఉండాలిగా? ఆ విధంగా ఆర్యుల దండయాత్రలు అనే వాదానికి అంకురార్పణ జరిగింది. అందులో నిజమెంతో? కల్పన ఎంతో?



# 26

'ఇది సౌత్ ఇండియా నుండి వచ్చిన టీ. గుడ్ విత్ అ డాష్ ఆఫ్ మిల్క్', సిల్వర్ కెటిల్‌లోని ద్రవాన్ని పింగాణీ కప్పులోకి వంచుతూ.

'హిమాలయాలు నార్త్ ఇండియాలో కదా ఉన్నాయి? అంతెత్తు పర్వతాలు సౌత్ ఇండియాలోనా, సర్ వాల్టర్?' అని తన సందేహాన్ని వ్యక్తంచేస్తూ కప్పు అందుకున్నాడు, ఫెర్గుసన్.

'అది ఊటీ, ఎ స్మాల్ టౌన్ ఇన్ బ్లూ మౌంటెన్స్. నా జీవితంలో సగానికి పైగా మద్రాసులో గడిపాను, మిస్టర్ జేమ్స్. దట్ సిటీ ఈజ్ ఇన్టాలరబుల్ ఇన్ సమ్మర్. వేసవిలో ప్రెసిడెన్సీ ఆఫీసులు అన్నీ ఊటీకి షిఫ్ట్ అవుతాయి. ఇట్స్ లవ్లీ ఔట్ దేర్! ఇప్పటికీ నాకు వంద హెక్టేర్ల టీ గార్డెన్ ఉంది. మై నెవ్యూ మానేజెస్ ఇట్. ఈ టీ అక్కడిదే!'

'ఓహ్! ఈస్ట్ ఇండియా కంపెనీ ఉద్యోగం అంటే... ఎ గుడ్ పార్ట్ ఆఫ్ లైఫ్ ఇన్ ది హీట్ ఎండ్ డస్ట్ అనుకున్నాను. సో... మీరు ప్రతి ఏడాదీ ఆ వేడినుండి ఎస్కేప్ అయ్యేవాళ్ళనమాట!'

'నో నో. నాట్ ఆల్వేస్! అంతకన్నా మండుటెండలు చూసాను. ముఖ్యంగా, నేను గుంటూరులో కలెక్టరుగా ఉన్నప్పుడు. అప్పుడే ఇరవై ఏళ్ళు గడిచిపోయాయి? దట్ వాజ్ అ టైమ్ వెల్ స్పెంట్, మిస్టర్ జేమ్స్. మీరు అడిగే అమరావతి టోప్ అప్పుడే పరిశోధించాను. ఫోర్ట్ సెంట్ జార్జిలో మీలాగే మెకెంజీ రాత ప్రతులు చూడడం జరిగింది. ఐ వాజ్ ఏ ట్రాన్స్లేటర్ ఫర్ కానరీస్ అండ్ తెలుగూ. ఆయన రిపోర్టులు నా జిజ్ఞాసను రగిల్చాయి. 1845 లో అనుకుంటాను, దీపాలదిన్నె గుట్టకు తూర్పువైపు, దగ్గరే ఉండి ఎక్స్కవేషన్ జరిపించాను. ఇట్స్ అ హ్యూజ్ టోప్, మిస్టర్ జేమ్స్. కనీసం వంద అడుగుల ఎత్తు, రెండు వందల అడుగుల వ్యాసం గల ఒకేఒక కట్టడం... అదిగో చూడండి, ఆ రెండు సింహం శిల్పాలు, అవి అక్కడవే. తూర్పు ద్వారానికి ఇరువైపులా దొరికాయి', అని తన ఇంటి సింహద్వారానికి ఇరువైపులా నాలుగు అడుగుల ఎత్తు స్తంభాలపై నిలిపిన సింహపు బొమ్మలను చూపాడు.

ఫెర్గుసన్ లేచి వాటిని పరిశీలిస్తూ, 'అన్డౌటెడ్లీ గ్రీక్! ఇలాంటి త్రీ డైమెన్షన్ శిల్పాలు ఆ కాలంలో ఒక గ్రీకు శిల్పుల వల్లనే చేతనవును. ఏమంటారు సర్ వాల్టర్?' అని ఆ బొమ్మల జూలు దువ్వుతూ, 'ఓహ్, దీజ్ నేటివ్ బార్బేరియన్స్! ఇంత అద్భుతమైన పాలరాళ్ళపై రంగు వేసి నాశనం చేసారు. చూడండి ఇంకా ఆ ఎర్ర రంగుయొక్క ట్రేసెస్ కనిపిస్తున్నాయి', అన్నాడు ఫెర్గుసన్ ముఖాన్ని అదో మాదిరిగా పెడుతూ.

‘నో మిస్టర్ జేమ్స్, ఐ డోంట్ అగ్రీ విత్ యూ. ఆ శిల్పాలు నిర్ద్వంద్వంగా భారతీయులవే... ఆ ఫీలింగూ, ఆ ఎంపథీ విదేశీయులకి సాధ్యం కాదు. మీరు నా రిపోర్ట్ చదవండి. ఒక్కొక్క శిల్పంలో ఆ శిల్పి చూపిన ఫెమిలియారిటీ; పరిసరాలపై, జీవన విధానంపై అతడికి ఉన్న అవగాహన... ఆ శిల్పి తప్పకుండా ఇండియనే’.

‘యూ మిజరబుల్ ఓల్డ్ ఫూల్! ఆ అనాగరిక దేశంలో జీవితమంతా గడిపి నీవు కూడా అలాగే తయారయ్యావు’, అని మనసులోని ఆలోచనని త్రొక్కిపెడుతూ, ‘ఏ రిపోర్టు, సర్ వాల్టర్? నాకు ఎక్కడా తారసపడలేదే?’ అన్నాడు, ఫెర్గుసన్.

‘ఓహ్? అది చాలా డిటైల్డ్ రిపోర్ట్, మద్రాసు నుండి పంపించాను... టు ది సెక్రెటరీ ఆఫ్ స్టేట్’

‘నో! ఉంటే నా దృష్టికి తప్పకుండా వచ్చి ఉండేదే?’ అని, ‘అయినా అనాగరికులని ప్రేమించే ఈ ఫూల్ రాసిన నాన్సెన్స్ చదవాల్సిన అవసరం ఎవరికి. ఎవరో చెత్తబుట్టలో వేసి మంచి పనే చేసి ఉంటారు’, అనుకుంటూ, ‘ఐ మస్ట్ లుక్ ఫర్ ఇట్. దొరికితే తప్పకుండా చదువుతాను, ఇట్స్ ఎ ప్రివిలెజ్ టు షేర్ యువర్ థాట్స్, సర్ వాల్టర్... యెస్, బై ది వే, ఇప్పుడా శిలలు ఎక్కడున్నాయి?’

### ఎలియెట్స్ మార్బుల్స్

సర్ వాల్టర్ ఎలియట్. 1821లో ఈస్టిండియా కంపెనీలో చేరి అనేక పదవులు చేబట్టాడు. 1844లో మద్రాసు రెవెన్యూ బోర్డు మెంబరుగా ఉంటూ, గుంటూరుకి కమిషనరుగా వచ్చాడు. బహు భాషా పండితుడు. తెలుగు, కన్నడ, పారశీ భాషలకి అధికారిక దుబాసీగా మద్రాసు ప్రభుత్వంలోనే కాక, ఫోర్ట్ కాలేజీ మెంబరుగా కూడా ప్రఖ్యాతి గాంచాడు. గుంటూరులో కమిషనరుగా ఉన్నప్పుడు, అమరావతిలో అస్తవ్యస్తంగా పడివున్న శిల్పాలను మద్రాసు తరలించడమేగాక, మచిలీపట్నంలో ఉన్న శిల్పాలను కూడా ఎంతో శ్రమకోర్చి మద్రాసు చేర్చాడు.

అక్కడనుండి ఆ శిల్పాలు లండన్ చేరడంతో అమరావతి శిల్పాలు పాశ్చాత్యుల దృష్టిలో పడటానికి కారణభూతుడయ్యాడు. లండన్ నగరంలోని అమరావతి శిల్పాలకి అప్పటి పేరు, ఎలియట్స్ మార్బుల్స్.

1866 లో విక్టోరియా మహారాణి అతడికి, ‘నైట్ కమాండర్ ఆఫ్ ది స్టార్ ఆఫ్ ఇండియా’ ప్రశస్తితో గౌరవించింది.

‘ఓహ్! మద్రాసులో... ఫోర్ట్ మ్యూజియంలో. ఇట్వాజ్ క్వైట్ యాన్ ఎఫర్ట్ గెటింగ్ దెమ్ దేర్. ముఖ్యంగా మసూలిపటాం శిలలు’.

‘మసులిపటామా? అమరావతి శిల్పాలు అక్కడికెలా వెళ్ళాయి, సర్ వాల్టర్?’

‘అది ఒక పెద్ద కథ, మిస్టర్ జేమ్స్. ఈ శతాబ్దం మొదట్లో అనుకుంటాను, అప్పటి కలెక్టరు రాబర్ట్సన్, మసులీపటాం సెంటర్లో, మద్దెలపొల్లెమ్ వెళ్ళే దారిలో ఒక మార్కెట్ కట్టించాడు. దాని చుట్టూ అమరావతి నుండి వచ్చిన శిలాఫలకాలు తాపడం చేసాడు. 1850 లో నేను చూసేసరికి ఆ మార్కెట్ శిధిలావస్థలో ఉంది. ఆ రాళ్ళ బరువు వల్లనేనేమో ఆ భవనం కూలిపోయింది. ఆ సంవత్సరం నేను మద్రాసులో బోర్డ్ ఆఫ్ రెవెన్యూలో ఫస్ట్ మెంబరుగా ఉన్నాను. ఆ శిలలని మద్రాసు తరలించాక తెలిసింది, వాటిలో కొన్ని అక్కడి సీనియర్ రెసిడెంట్ అలెగ్జాండర్ పెరట్లో ఉన్నాయని. ఆహహ్, అప్పుడు మొదలయింది అసలు కథ...’

'మెకెంజీ ప్రతులలో రాబర్ట్సన్ మార్కెట్ మ్యాపు మాత్రం చూసాను. అంటే... మెకెంజీనే ఆ శిలలు తవ్వి మసులీపటాం పంపించి ఉంటాడు'.

'యెస్ యెస్, ప్రాబబ్లీ ట్రూ! కానీ మెకెంజీ రిపోర్టులో మాత్రం ఆ ప్రస్తావనే లేదు బట్... నేను కొన్ని రూమర్స్ విన్నాను. చాలా వరకూ మంచి శిలలు ప్రైవేట్ కలెక్షన్లకు అమ్మివేసారని. వాటిలో ఎంత మాత్రం నిజముందో చెప్పలేం... అయితే అలెగ్జాండర్ భార్య మాత్రం అవి తాను కొన్నాననీ రాబర్ట్సన్ శిథిలాలనుండి తరలించినవి కావనీ బుకాయించింది. నేను స్వయంగా వెళ్ళి అడిగితే, మస్కెట్ గురిపెట్టి బెదిరించింది కూడా, బ్రహ్మరాక్షసి! ఆ నలభై నాలుగు శిలలను ఆమె నుండి విడిపించి మద్రాసు చేర్చేసరికి నా తల ప్రాణం తోకకి వచ్చిందనుకో మిస్టర్ జేమ్స్' అని గట్టిగా నిట్టూర్చాడు సర్ వాల్టర్ ఎలియట్.

'అంటే, మొత్తం ఎన్ని శిలలు మద్రాసుకి చేర్చారు?'

'లెట్ మీ రీకౌంట్... 79 శిలలు అమరావతి నుండి నేరుగా మద్రాసు పంపించినవి. 38 రాబర్ట్సన్ శిథిలాల నుండి వెలికి తీసినవి. ఇవికాక 7 మెకెంజీ ద్వారా మద్రాసుకు వచ్చినవి. మొత్తం 124. ఇక అలెగ్జాండర్ వద్దనుంచి విడిపించిన 44తో కలిపితే 168 శిలలు. అంటే ఇప్పుడు ఫోర్ట్ సెంట్ జార్జిలో 168 శిలలు దొరుకుతాయి'.

'యూ విల్ బి సర్ప్రైజ్డ్, సర్ వాల్టర్. ఆ శిలలు ఇప్పుడు ఇంగ్లాండులో ఉన్నాయి. అయితే అవి ఎవరివద్ద ఉన్నాయో ఎవరికీ తెలియదు. సౌత్వార్క్ పోర్ట్ అధికారుల వద్ద ఎలాంటి వివరాలూ తెలియలేదు'

'ఓహ్ మై గాడ్!' నిర్ఘాంతపోయి, క్షణంలో తేరుకుని, 'సారీ మిస్టర్ జేమ్స్, ఫర్ టేకింగ్ గాడ్స్ నేమ్ ఇన్ వెయిన్. ఇది ఎప్పుడు జరిగింది?' అని అడిగాడు.

'ఈ విషయంలో అదేమీ అనుచితం కాదు. ది యాక్ట్ ఈజ్ మోర్ సాక్రిలెజియస్ దాన్ యువర్ వర్డ్, హూ ఎవర్ హేడ్ కమిటెడ్ ఇట్! మీరు రిటైర్ అయిన మరుసటి సంవత్సరమే అవి లండన్ చేరాయి. ఇంతవరకూ వాటిని మీరే వెంటతెచ్చారు అనుకున్నాను, అయామ్ సారీ'.

'నాకు ఆ ఉద్దేశ్యమే లేదు. ఆన్ హైండ్ సైట్, అదే మంచి పనేమో? అక్కడ వదలకుండా ఉండవలసింది'.

'హుమ్... ఫర్ మీ ఇట్స్ ఎ డెడ్ ఎండ్!'

'డోంట్ డెస్పెయిర్, మిస్టర్ జేమ్స్. నేను ఇండియా ఆఫీసులో విచారించి మీకు తెలియజేస్తాను'.



మెయిల్ కోచ్ వచ్చి లెక్స్టర్ అవెన్యూలోని ఫెర్గుసన్ ఇంటిముందు ఆగింది. 'ఇండియా హౌస్‌నుండి, మిలార్డ్. సర్ వాల్టర్ ఎలియట్ ఆదేశాలమేరకు అండర్ సెక్రటరీ– కొలోనియల్ ఎఫైర్స్ ఆఫీసు నుండి వచ్చాను. ఇవి హౌస్ ఆర్కైవులలోనివి. మీ అవసరం తీరాక, ఇండియా హౌసులో మేజర్

ఆట్కిన్సన్‌కి తిరిగి ఇవ్వగలరు' ఎనిమిది పెద్ద పెట్టెలూ, ఒక మనీలా కవరూ ఇచ్చి, సెలవు తీసుకున్నాడు.

కవరు తెరవకుండా పక్కనపెట్టి, మొదటి పెట్టె తెరిచాడు, ఫెర్గుసన్. అప్పటికే సెపియా రంగు తిరిగిన ఛాయాచిత్రాలు. బ్యూటిఫుల్! బుద్ధుని భిక్షపాత్రను తీసుకొని ఆకాశానికి ఎగురుతున్న ఏంజెల్స్! అమరావతి శిల్పం, నో డౌట్! చిత్రం పైన ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజీ చిహ్నం. కింద ఇండియా ఇంకులో రాసిన రోమన్ సంఖ్యా, కాప్టన్ ట్రైప్, గవర్నమెంటు ఫోటోగ్రాఫర్, మద్రాస్, అనే రబ్బర్ స్టాంపూ...

మొత్తం నూట ఇరవై చిత్రాలు. వాటితో పాటూ, ఒక్కొక్క చిత్రాన్నీ వివరిస్తూ ఎవరో రెవరెండ్ టాయ్లర్ రాసిన రిపోర్టు... యూస్లెస్! అసలు శిల్పాలు లేకుండా ఈ చిత్రాల వల్ల ఉపయోగం శూన్యం! అనుకుంటూ, మేజాబల్లపై ఉన్న కత్తితో కవరుపై ఉన్న మైనపు ముద్రను జాగ్రత్తగా ఊడదీసి, అందులోని ఒకే ఒక కాగితాన్ని బయటికి తీసాడు. అది సర్ వాల్టర్ ఎలియట్ యొక్క కోట్ ఆఫ్ ఆర్మ్స్, గ్యూటెన్‌బర్గ్ యంత్రంపై ముద్రించబడిన ఊదారంగు లేఖ. ఇండియా ఇంకుతో రాసిన స్పష్టమైన అక్షరాలలో రెండే రెండు వాక్యాలు...

*లండన్*
*12 ఆగస్టు 1866*
*మై డియర్ మిస్టర్ జేమ్స్,*
*ఇంతకన్నా నా వల్ల కాలేదు. ఆల్ ది బెస్ట్,*

*భవదీయుడు*

***వాల్టర్ ఎలియట్***

*PS : చిన్న సలహా, ఇండియా హౌసులో విచారించండి.*
*అక్కడ ఫోర్బ్స్ వాట్సన్ వల్ల ఏదైనా ఉపయోగం ఉండవచ్చు.*





# 27

'ఫైఫ్ హౌస్.

సైప్రస్ వృక్షాల మధ్య కంకర రాళ్ళ రోడ్డు. దూరంగా విసిరివేసినట్లు ఎర్రని ఇటుకల కట్టడం. రకరకాల నెమళ్ళూ ఏనుగులూ ఇతర జంతువుల రూపాలలో మలిచిన పూల పొదలు.

ఇండియా మ్యూజియం.

అది ఒకటి ఉన్నట్లు కూడా ఫెర్గుసన్‌కి అప్పటి వరకూ తెలియదు!

ముందుగా కబురు చేయడం వల్ల, కార్ట్ దిగిన వెంటనే ఎదురువచ్చి స్వాగతం చెప్పాడు, రాబర్ట్ కోల్బర్ట్, మ్యూజియం క్యూరేటర్.

'మిమ్మల్ని కలవడం నాకు ఎంతో ఆనందదాయకం, మిస్టర్ ఫెర్గుసన్. మీ గురించి ఎంతో విన్నాను. పని ఏమిటో సెలవియ్యండి. మీ సేవకి ఎల్లప్పుడూ సిద్ధం'

'థాంక్యూ సర్. ఇండియా హౌస్‌లో వాట్సన్‌గారిని కలిస్తే మీ వద్దకు పంపారు', అని వచ్చిన పని వివరించాడు, ఫెర్గుసన్.

'అమ్మరవట్టీ? ఈజ్ దట్ ది బుద్దిస్ట్ ప్లేస్ మెకెంజీ రోట్ అబౌట్? ఓహ్... ఇక్కడ ఆ ప్రదేశానికి సంబంధించినవి ఏవీ లేవు. అయాంసారీ, మిస్టర్ ఫెర్గుసన్. మీ ప్రయత్నం వృధా అయింది'

'పరవాలేదు, మిస్టర్ కోల్బర్ట్. థాంక్యూ వెరీ మచ్. ఇక నేను వెళ్తాను', అని లేచి నిలుచున్నాడు.

'అరే, అప్పుడే వెళ్తారా? మీకు కావలసిన బుద్దిస్ట్ మెటీరియల్ లేకపోయినా ఇండియా వాణిజ్యానికీ, న్యాచురల్ హిస్టరీకి సంబంధించినవి ఇక్కడ ఎన్నో ఉన్నాయి. ఇఫ్ యూ డోన్ట్ మైండ్, నేనే స్వయంగా చూపిస్తాను', అన్నాడు మ్యూజియం క్యూరేటర్ కంగారుగా, ఫెర్గుసన్ చాలా ప్రముఖ వ్యక్తి, అందునా డైరెక్టర్ వాట్సన్ అతిథి... 'ఆహ్... మిస్టర్ ఫెర్గుసన్. ఇప్పుడే గుర్తుకొచ్చింది, గార్డెనులో కొన్ని శిల్పాలు చూసాను, బుద్దిస్ట్ అనుకుంటాను. మీరు ఒక నిమిషం దయచేస్తే...'

✦ ✦ ✦

'దిస్ ఈజ్ జెఫ్రీ. ఎ గుడ్ యార్క్‌షైర్ మ్యాన్. అద్భుతమైన గార్డనర్', చేస్తున్న పని ఆపి టోపి తీసి తలవంచిన తోటమాలిని చూపుతూ అన్నాడు, కోల్బర్ట్. 'నేను ఈ ఉద్యోగానికి వచ్చి మూడేళ్ళు అయింది, మిస్టర్ ఫెర్గుసన్. గొప్పచెప్పుకోవడం కాదు కానీ, ఈ తోట అంతా నేనే అభివృద్ధి

చేసాను. అఫ్‌కోర్స్, జెఫ్రీ డిడ్ ఆల్ ది హార్డ్ వర్క్. ఆ శిలలను పొదల మధ్య నిలిపింది ఇతడే. ఎక్సెలెంట్ వర్క్! చూద్దురుగాని పదండి', అని గర్వంగా అంటూ ప్రహరీ గోడ వైపు దారితీసాడు.

అతడు జెఫ్రీ గురించి చెప్పినదానిలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. ప్రస్తుత విక్టోరియా మహారాణి యుగానికి చెందిన అధునాతనమైన కళాసృష్టి. ఇంగ్లాండులో పెరుగుతున్న సాంకేతిక, భౌగోళిక జ్ఞానానికి తార్కాణాలుగా మలచబడిన రంగురంగుల పొదలు.

అది స్టోన్ హెంజ్,

అక్కడ... లీనింగ్ టవర్ ఆఫ్ పిసా,

ఆహ్! తాజ్ మహల్... 'వండర్ ఫుల్' అని ప్రశంసిస్తూ, జెఫ్రీ భుజం చరిచాడు.

ఎర్రని క్రోటన్ పొద! రూపం స్పష్టంగా తెలుస్తుంది... అది అమరావతి స్తూపం! టాయ్లర్ చిత్రాలలో ఎన్నో మార్లు చూసాడు. సందేహం లేదు.

'దేర్... దే ఆర్!'

క్రోటన్ స్తూపానికి నాలుగు వైపులా నిలువెత్తు పాలరాతి శిలా ఫలకాలు. ఎలియట్స్ మార్బుల్స్!!!!



'వేర్ ఆర్ ది రెస్ట్?' విపరీతమైన ఉత్సాహంతో జెఫ్రీ భుజాలు పట్టుకుని కుదిపేసాడు, ఫెర్గుసన్.

కళ్ళు తేలవేసి తడబడుతూ, 'క్ క్ కోచ్... హౌస్' అని వేలెత్తి భవనం వెనుకకి చూపాడు, జెఫ్రీ.

'గత ఆరేళ్ళుగా ఇక్కడే పడి ఉన్నాయి, సర్. ఏ ఉపయోగం లేదు కదా అని తోటలో పెట్టాను. క్షమించండి' అంటూ భవనం వెనుక గుర్రపు శాలల వైపు దారితీసాడు, జెఫ్రీ.

అస్తవ్యస్తంగా పడి ఉన్న అమరావతీ సీమ అపురూప శిల్ప సృష్టి. మనుష్య జాతికి సంక్రమించిన అద్భుతమైన వారసత్వ సంపద. విరిగి పడిపోయిన బండ్లూ, పెరిగిపోయిన కలుపు మొక్కలూ, బురద, గుర్రాల మలమూత్రాల కంపు మధ్య.

ఎక్కడో ఆటవికులకు ఆలవాలమైన అరణ్య ప్రదేశంలో కాదు. తినడానికి తిండిలేని బడుగు జీవాలుండే ఆఫ్రికా ఆసియా దేశాలలో కాదు. జంతు ప్రకృతిని వీడని అనాగరికుల మధ్య కాదు.

ఇక్కడ... ఆధునిక ప్రపంచ నాగరికతకే కేంద్ర బిందువైన లండన్ మహానగరంలో... భారతీయ సంస్కృతిని ప్రదర్శించే ఉద్దేశ్యంతో స్థాపించబడిన సంగ్రహాలయంలో...

'థాంక్ గాడ్! ఈ కళాఖండాల్ని సృజించిన మన శిల్పులు ఇప్పుడు లేరు. దే డోంట్ డిసర్వ్ దిజ్ ట్రీట్మెంట్...'





# 28

## అమరావతి స్తూపం క్రీ.శ. 1987

'నేను నమ్మను. ఎక్కడో యూరప్‌నుంచి ఇక్కడికి వచ్చి శిల్పాలు చెక్కడానికి వాళ్ళకేమీ పనిలేదా? ఎవడో మనవాడే అటుపోయి నేర్చుకుని వచ్చి ఉండవచ్చు కదా?' అన్నాను.

ఉపేంద్ర కాసేపు నావంక దీర్ఘంగా చూస్తూ ఉండిపోయాడు. ముఖం మీద నాకైతే ఎలాంటి ఫీలింగూ కనపడలేదు. తలవిదిల్చి రమేష్‌తో, 'చూసావా... నమ్మం నమ్మం అంటూనే ఆ పాశ్చాత్యులు చెప్పిందంతా ఎంత సులభంగా నమ్ముతామో!' అన్నాడు.

ఆ మాటలకి తలవూపుతూ నావైపు తిరిగి, 'అంటే నీ ఉద్దేశ్యంలో... ఒకళ్ళ వద్ద నేర్చుకోవడమో, అనుకరించడమో తప్ప మనలో ఎటువంటి క్రియేటివిటీ– అంటే సృజనాత్మక శక్తి– లేదంటావ్?' ముడిపడిన కనుబొమలూ, వెడల్పైన ముక్కుపుటాలూ... ఎరుపెక్కిన రమేష్ ముఖంమీద కోపం నన్ను ఆశ్చర్యపరిచింది.

'నేనన్నదాంట్లో తప్పేముంది?' నివ్వెరపోయి చూస్తూ ఉండిపోయాను.

'పాపం వాడినడిగేం లాభంరా? మన సో కాల్డ్ మేధావులలో సగం మంది అభిప్రాయం అదే', అని రమేష్‌కి సర్దిచెప్పి, నావంక తిరిగాడు, ఉపేంద్ర.

'ఇక్కడ మనవాళ్ళు ఆ దేశం వెళ్ళారా, లేక వాళ్లు ఇక్కడికి వచ్చారా అన్నది కాదు ప్రశ్న. మన శిల్పసంపద అంతా యూరోపియన్లు మనకి పెట్టిన భిక్షేననీ, స్వతహాగా మన భారతీయులకి సృజనాత్మక శక్తి లేదనీ, అలెగ్జాండర్ ఇండియా రావడంవల్ల, అతడి వెనుక వచ్చిన గ్రీకు పౌరులూ, రాజులూ, శిల్పులూ మనకి శిల్పకళ నేర్పి ఉంటారని అప్పటి మేధావులు అభిప్రాయపడ్డారు. ఇప్పటికీ, మన పుస్తకాలలో కొనసాగుతున్న అభిప్రాయం చాలావరకూ అదే– యూరోపియన్ల గొప్పతనం, మనమంటే చిన్నచూపు. మనవాళ్ళలో ప్రాచీన సంస్కృతిపట్ల గర్వం లేకపోవడానికి అది ఒక ముఖ్య కారణం'.

'కానీ, ఫెర్గుసన్, హెన్రీకోల్ వంటి వాళ్ళు ఎంతో శ్రమకోర్చి మన శిల్పసంపద గొప్పతనం పదిమందికీ తెలియజేసారు. వాళ్ళేమీ తక్కువ వాళ్ళు కాదు... శిల్ప వాస్తు శాస్త్రాలలో మేధావులు, వాళ్ళు చెప్పినదానిలో నిజం ఉండవచ్చు కదా?'

'కాదనను, కానీ వాళ్ళ ఆలోచనా శైలి ఆ కాలాన్ని ప్రతిబింబిస్తుంది. అవి పారిశ్రామిక విప్లవం ప్రపంచాన్నే మార్చేసిన రోజులు. అనాగరిక దేశాలని ఉద్ధరించి వారికి నాగరికత నేర్పే బాధ్యత

పాశ్చాత్యులదే అన్న భావమే సామ్రాజ్యవాదానికి పునాది. ఆ భావం జాత్యహంకారంగా మారి అప్పటి మేధావివర్గపు నరనరాలలో జీర్ణించుకు పోయింది. ఒక బానిస దేశంలో అంతటి సృజనాత్మకతా, రసజ్ఞతా, ఒకవేళ కనిపించినా దానిని ఒప్పుకోవడం వాళ్ళకి కష్టమే'.

'అంటే... ఇదంతా గ్రీకు నాగరికత పుణ్యమే అని సర్దిచెప్పుకుంటే సరిపోతుందని అలా చేసారా?'

'ఊహూ... సర్దిచెప్పుకోడం కాదు. అదే వాళ్ళ నమ్మకం. అఫ్కోర్స్, ఆ కాలంలో', అని నా భుజం తట్టాడు, ఉపేంద్ర.

'ఆ కాలంలో ఏంటి, ఇప్పుడూ అంతే. మన సంస్కృతి మీద అవగాహన శూన్యం. పాశ్చాత్య కళలంటే ఎగబడతాం', అన్నాడు రమేష్.

నాకు నిజమే అనిపించింది.



'అమరావతి శైలి. ప్రాచీన శిల్పరచనా పద్ధతులలో దీనికి ఒక నిర్దిష్టమైన స్థానం ఉంది', అన్నాడు ఉపేంద్ర. ముగ్గురం మ్యూజియం క్యూరేటర్ ఆఫీసులో కూర్చొని ఉన్నాం.

'కాఫీ తెప్పించనా?' అని అడుగుతూ ఒక పుస్తకాన్ని నా ముందుకు తోసారు, క్యూరేటర్ రాంబాబుగారు.

'ట్రీ అండ్ స్నేక్ వర్షిప్'

'అది జేమ్స్ ఫెర్గుసన్ రాసిన పుస్తకం', అని ఎగతాళిగా నవ్వాడు, రమేష్.

'ఎందుకురా అంత వ్యంగ్యం? 1875 లో ప్రచురితమైనప్పుడు ఐరోపాలో, అమెరికాలో హాట్ కేక్సులా అమ్ముడయింది. భారతీయ శిల్పకళకి ఈ ఒక్క పుస్తకం ఇచ్చిన ప్రాచుర్యం ఇంకేదీ ఇవ్వలేదు. ముఖ్యంగా అమరావతి శిల్ప శైలి ప్రపంచానికి తెలియజేసింది ఈ పుస్తకమే. దాని రచయితకి జాత్యహంకారం ఉండవచ్చు. అతడు చెప్పినదానిలో తప్పులు ఉండవచ్చు. కానీ భారతీయ పురాతత్వశాస్త్ర చరిత్రలో దీని ప్రాముఖ్యాన్ని మాత్రం తక్కువగా ఎంచకూడదు', అన్నాడు ఉపేంద్ర.

ఎర్రని బైండింగ్ చేసిన ఆ పుస్తకపు పేజీలు తిప్పసాగాను. వృక్షాలూ, సర్పాలూ ఆరాధించే హిందూ సంప్రదాయం అంటూ, భారతీయ శిల్పాలని ప్రపంచానికి ఆవిష్కరించిన మౌలిక గ్రంథం. అందులో సాంచీ స్తూపానికి చెందినవే కాక అమరావతి బొమ్మలు కూడా ఉంచాడు. పేజీల మార్జిన్లలో ఉన్న చిన్న చిన్న నోటింగ్స్– కొన్ని ఇంగ్లీషులోను, కొన్ని తెలుగులో. అవి ఎవరివా అని మొదటి పేజీకి వెనక్కి వచ్చాను.

ఆర్.సుబ్రహ్మణ్యం – అని ఇంగ్లీషులో చేసిన సంతకం.

ఎవరూ అని ప్రశ్నార్థకంగా రాంబాబుగారి వంక చూసాను.

'మా గురువు గారు... ప్రొఫెసర్ రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారు. ఈ పుస్తకం వారి లైబ్రరీలోదే. ఇప్పుడు స్తూపంవద్ద మీరు చూసే కాస్తో కూస్తో శిల్పాలు ఆయన ఆధ్వర్యంలో వెలికి తీసినవే'.



దిగువ క్రిష్ణా నాగరికత కేంద్రాలు
1. అమరావతి
2. పెద్దమద్దూరు
3. ధరణికోట
4. గ్రంధిసిరి
5. విద్యాధరపురం
6. వుండవల్లి
7. మొగల్రాజపురం
8. మంగళగిరి
9. గుడివాడ
10. ఘంటసాల
11. భట్టిప్రోలు
12. శ్రీకాకుళం
13. పాండూర
14. గూడూరు
కోటిలింగాల
పాషీగామ్
ధూలికట్ట
వరంగల్
కాపవరం
కొండాపూర్
తిరుమల్గెరి
హైదరాబాద్
గాజులబండ
నేలకొండపల్లి
పణిగిరి
వదమంకొండ
జగ్గయ్యపేట
ఏలేశ్వరం
నాగార్జునికొండ
గోలి
చేజర్ల
గుమ్మడిదుర్రు
విజయవాడ
కర్నూల్
నిట్టూరు
చందవరం
దూపాడు
రాజులమందగిరి
చినగంజాం
పెద్దగంజాం
అమ్మనబ్రోలు
కనుపర్తి
ఎర్రగుడి
ఉప్పుగుండూరు
రామతీర్ధం
నందలూరు
తిరుపతి
అశ్వారావుపేట్
లింగరాజుపాలెం
గుంటుపల్లి
కొత్తూరు
అల్లూరు
ఆరుగోలను
ఆదుర్రు
కొడబలి
పిఠాపురం
సంకరం
ధరాపాలెం
గోపాలపట్నం
విశాఖపట్నం
పావురాలకొండ
తొట్లకొండ
బావికొండ
దంతపురం
రామతీర్ధం
సారిపల్లి
కళింగపట్నం
సాలిగుండం
BUDDHIST REMAINS
IN
ANDHRA PRADESH
ఆంధ్రప్రదేశ్ లోని
బౌద్ధ కేంద్రాలు

‘ఇవే కాదు. ఈ అమరావతి శైలి శిల్పాలు మరికొన్ని చోట్ల కూడా బయటపడ్డాయి. ఉదాహరణకి శ్రీపర్వతం... అదృష్టవశాత్తూ, ఆ శిల్పాలనూ, శిథిలాలనూ పునరుద్ధరించి నాగార్జునికొండపైన పునఃప్రతిష్ఠించారు. లేకుంటే అవి నాగార్జునసాగర్ రిజర్వాయర్ కింద మునిగి మనకు దక్కకుండా పోయేవి’, అన్నాడు ఉపేంద్ర.

‘ఇంకా మనకి తెలియకుండా ఇంకెన్ని ఉన్నాయో?’ అన్నాడు రమేష్.

‘అవును. మన అదృష్టం బాగుండి ఏదో ఒకరోజు అలాంటి స్తూపపు శిథిలాలే కనుక దొరికితే, ఒక పూర్తి స్తూపాన్ని పునర్నిర్మించడం సాధ్యం అవుతుంది. ఆ విధంగా అమరావతి శైలి స్తూపాన్ని ఉత్తుత్తి ఊహలలో కాకుండా నిజంగా చూడవచ్చు’, ఎక్కడో స్వప్నపథంలో విహరిస్తున్నట్లు ఎటో చూస్తూ అంటున్న ఉపేంద్ర మాటలకి నాకు విపరీతమైన నవ్వు వచ్చింది.

‘బాగున్నాయిరా మీ కలలు. ఇంతకాలం దొరకనివి ఇంకా ఈ ప్రదేశంలో ఎక్కడో మీకోసం ఎదురుచూస్తూ ఉన్నాయనా మీ ఆశ?’ అడగకుండా ఉండలేకపోయాను.

‘వై నాట్?’ అంటూ లేచి ఎదురుగా గోడపైన ఉన్న మ్యాప్ వద్దకు వెళ్ళాడు, రమేష్.

‘బుద్ధిస్ట్ రిమెయిన్స్ ఇన్ ఆంధ్రప్రదేశ్’

‘ఇక్కడ చూడు. మన ఆంధ్రాలోనే ఎన్ని చోట్ల బౌద్ధ శిథిలాల ఆనవాళ్లు ఉన్నాయో. ఇక గుజరాత్ నుండి, ఇటు ఒరిస్సాదాకా, అటు బస్తర్ నుండి కంచి దాకా విస్తరించిన శాతవాహన ఆంధ్ర సామ్రాజ్యంలో ఎక్కడో ఒకచోట అమరావతి శైలి స్తూపం నిక్షిప్తమై ఉండడం అసాధ్యమేమీ కాదు’

ఉపేంద్ర వైపు, ‘నిజమా? అన్నట్లు చూస్తూ, ‘మౌర్య సామ్రాజ్యం, గుప్తుల స్వర్ణయుగం, మొఘల్ సామ్రాజ్యం అనేవి స్కూల్లో చదువుకున్నాం. ఎందుకంటే అవి పెద్దపెద్ద రాజ్యాలు, చాలా కాలం పరిపాలించారు. ఎప్పుడో కొంతకాలం ఆంధ్రలో రాజ్యం వెలిగించిన శాతవాహన వంశం...’

‘స్టాప్ ఇట్!’ అని బల్ల చరుస్తూ దిగ్గున లేచాడు, ఉపేంద్ర. ఆ విసురుకి అతడు కూర్చున్న కుర్చీ వెనక్కి పడింది. ‘పెద్ద రాజ్యాలూ! చాలా కాలం! నిన్ను అని లాభం లేదు. మన టెక్స్ట్ బుక్స్‌నీ, వాటిని రాసిన వాళ్ళనీ అనాలి’, అని రాంబాబుగారి వంక చూస్తూ, పడిపోయిన కుర్చీని నిలబెట్టి, ‘సారీ సార్’, అని మళ్ళా కుర్చీలో కూలబడ్డాడు.

‘డోంట్ వర్రీ...మీ ఆవేశం నాకు అర్థమయింది. మీవాడు చెప్పింది కూడా రైటే. చూడండి, నాలుగు వందల పేజీల హిస్టరీ పుస్తకంలో, ఐదు వందల సంవత్సరాలు అఖండంగా, దేశంలో సగానికి పైగా ప్రదేశాన్ని పరిపాలించిన శాతవాహనుల చరిత్ర ఒక పేజీకి మించి ఉండదు. నిజానికి చూస్తే, శాతవాహన సామ్రాజ్యం అటు రోమన్ సామ్రాజ్యానికీ, ఇటు చైనా దేశానికీ మధ్య వాణిజ్యానికి వారధిగా నిలిచింది. ఆంధ్రులు అటు మగధపై కూడా అధికారం చలాయించారు అనడానికి చారిత్రిక ఆధారాలు అనేకం ఉన్నాయి’, అని నావంక చూస్తూ, ‘అది మీరు అనుకున్నట్లు కొద్దికాలం కాదు... ఉదాహరణకి, మౌర్య సామ్రాజ్యం క్రీస్తు పూర్వం 324 నుండి 187 వరకూ, అంటే నూట ముప్పై సంవత్సరాలు అధికారంలో ఉంది. ఇక గుప్తులు... క్రీస్తు శకం 321 నుండీ మహా అయితే రెండు

**కనగానహళ్ళి**

కర్నాటకలో, క్రొత్తగా ఏర్పరిచిన యాదగిర్ జిల్లా. హైదరాబాద్- బీజాపూర్ రోడ్డులో... జిల్లా కేంద్రానికి 20కిమీ దూరంలో భీమానది ఒడ్డున ఉన్న చిన్న గ్రామం 'సన్నతి'. అక్కడ ఒకానొకప్పుడు ఒక కాళికాలయం ఉండేది. 1980లలో భీమానది పైన ఆనకట్ట కట్టడం మొదలైంది. వచ్చేవాళ్ళూ పోయేవాళ్ళూ. పశువులు కాసుకుని పొట్టపోసుకునే ఊరి వాళ్ళు ఆకస్మాత్తుగా డబ్బులు కళ్ళజూడటం మొదలెట్టారు. వాళ్ళకి, ఊర్లో శిధిలమై పడివున్న ఆలయాన్ని పునర్నిర్మించాలనే ఆలోచన వచ్చింది. ఆ విషయంలో పురాతత్వ శాఖ సహాయం కోరారు. అది మధ్యయుగపు కట్టడం. చూడటానికి వెళ్ళిన పరిశీలనా బృందం, గర్భగుడి గోడ వారన ఆనించి నిలిపిన ఒక రాతి పలకను చూసారు.

అది ఒకప్పుడు గర్భగుడి నేలమీద పరిచిన పలక రాయి. భూకంపంవల్లనేమో అక్కడక్కడా పగిలిపోయి ఉంది. పలక మధ్యలో చతురస్రాకారపు రంధ్రం. కాళికాదేవి ప్రతిమని నిలిపేందుకు వీలుగా చేసారు. రాతిమీద ఏవో అర్థంకాని రాతలు చెక్కివున్నాయి.

అది అశోకుని 13వ శిలాశాసనం. ఆశ్చర్యం! ఎక్కడినుంచి వచ్చింది? ఈ ప్రదేశంలో ఎక్కడా ప్రాచీన పట్టణపు ఆనవాళ్ళు లేవే? అని కొన్నాళ్ళు తర్జనభర్జనపడి, ఆ రాతిని అక్కడి డ్యామ్ సెక్యూరిటీ ఆఫీసులో భద్రపరిచి ఇక దాన్ని గురించి మరిచిపోయారు. 1992లో, ప్రొ.పూనాచా ఆ ప్రదేశాన్ని పరిశీలించి, ఆ గ్రామానికి దిగువ కనగానహళ్ళి అనే గ్రామం వద్ద నాలుగేళ్ళు శాస్త్రయుక్తంగా జరిపిన తవ్వకాల వల్ల, అక్కడ ఒక స్తూపం బయట పడింది. అదే అధోలోకచైత్యం. 7వ శతాబ్దంలో హ్యూయెన్ త్సాంగ్ దర్శించిన కనకపురి (క-నొ-క-నొ-పు-లో) నగరం అదే.

వందల యేళ్ళు పాలించారేమో... మొఘల్ సామ్రాజ్యం... 1526 నుంచి ప్లాసీ యుద్ధం వరకూ, అంటే రెండు వందల సంవత్సరాలు. ఒక అశోకుని టైంలో ఇరవై యేళ్ళూ, ఔరంగజేబు టైంలో ఇరవై యేళ్ళూ తప్ప దక్షిణదేశం ఎప్పుడూ వాళ్ళ ఆధీనంలో లేదు. పూర్తి ఉత్తర భారతదేశంలో కూడా వారి అధికారం ఉన్నది చాలా కొద్దిరోజులే. మరి శాతవాహన వంశం క్రీస్తు పూర్వం 230లో శ్రీముఖునితో మొదలై, క్రీస్తుశకం మూడవ శతాబ్దం చివరి వరకూ ఈ ప్రాంతాన్ని పాలించింది. అంటే కనీసం నాలుగు వందల యేళ్ళకు పైచిలుకే'.

'ఈ ప్రాంతం అంటే ఈ ఒక్క అమరావతి చుట్టుపక్కల ప్రాంతమే అనుకోకు' అంటూ కలుగచేసుకుని, 'అల్మోస్ట్ ఎంటైర్ సౌత్ ఇండియా. అటు బొంబాయి నుంచి ఇటు విశాఖపట్టణం వరకూ, ఉత్తరంలో నాగపూర్ నుంచి దక్షిణాన బెంగుళూరు దాకా... అంత విశాలమైన రాజ్యాన్ని, అంతకాలం అఖండంగా పరిపాలించిన రాజ వంశం మన దేశ చరిత్రలోనే లేదు', అన్నాడు ఉపేంద్ర.

'మరి ఇదేం దౌర్భాగ్యం? మన గురించి రాసిన వాళ్ళు లేరా? లేకపోతే సరైన ఆధారాలు లేకా?'

'అదేమీ కాదు, మన ఆంధ్రులకి చరిత్రపట్ల ఉన్న ఉదాసీన వైఖరి', అని ఉపేంద్ర నోరు విప్పేలోగా అడ్డుతగిలాడు, రమేష్.

'నిజమే... ముందుగా నీ ప్రశ్నకి సమాధానం. ఆంధ్రుల చరిత్ర గురించి రాసిన వాళ్ళు లేకేం. కె.ఆర్.సుబ్రమణ్యం, బి.ఎస్.ఎల్. హనుమంత రావ్.... ఇలా చాలా మంచి చరిత్రకారులే ఉన్నారు. మంచి పుస్తకాలు కూడా రాసారు, సెమైనల్ వర్క్స్. కానీ చదివే నాథుడెవ్వడు? చరిత్ర గురించి రాసి

అచ్చేయించాలంటే, తల ప్రాణం తోకకొస్తుంది. అనుభవం మీద చెబుతున్నాను', అంటూ చేతులెత్తాడు, ఉపేంద్ర.

'ఇక ఆధారాలు అంటావా? ఒక నాసిక్ ప్రశస్తి చాలు ఆంధ్ర శాతవాహనుల వైభవం చాటడానికి', అని ఆసక్తిగా చూస్తున్న నన్ను చూసి, ఉపేంద్రతో, 'నీవు చెప్పరా', అన్నాడు రమేష్.

'అది గౌతమీ బాలశ్రీ అనే శాతవాహన రాణి, తన కొడుకు శాతకర్ణి చక్రవర్తి గురించి రాయించిన శాసనం. దాని ప్రకారం వాళ్ళ రాజ్యం, సమస్త దక్షిణదేశమే కాక ఉత్తరాన రాజస్థాన్ వరకూ విస్తరించింది. క్షహరాట్టులు, అంటే స్కిథియన్ రాజులపై విజయాలే కాక, శాతవాహనుల రథాశ్వాలు మూడు సముద్రాల లోని నీళ్ళు తాగేవని తెలుపుతుంది. అంటే పశ్చిమాన అరేబియా సముద్రం, తూర్పున బంగాళాఖాతమే కాక దక్షిణంలో కన్యాకుమారి వరకూ ఆంధ్రుల అధికారం చెల్లింది', అంటూ చెప్పడం మొదలెట్టాడు, ఉపేంద్ర.

'సార్, దయచేసి ఇంకో రౌండు కాఫీ చెప్పండి', అని రాంబాబుగారిని అడిగి ఒకసారి ఒళ్ళువిరిచి ఆవలించాడు, రమేష్.



### నాసిక్ శాసనం

గౌతమీ బాలశ్రీ దేవి వేయించిన దానశాసనంలో ఆమె కుమారుడు గౌతమీపుత్ర శాతకర్ణి ప్రశస్తి కనిపిస్తుంది. ఈ శాసనం అతడి కుమారుడు వాశిష్ఠీపుత్ర పులుమావి రాజ్యం చేస్తున్నప్పుడు చెక్కబడింది. శాతకర్ణిని ఏక బ్రాహ్మణుడనీ; వర్ణధర్మాన్ని కాపాడిన వాడనీ; క్షత్రియ మాన దర్పాలు హరించినవాడనీ; సకల దక్షిణాపథానికీ అధిపతియనీ; శక, యవన, పహ్లవ నిశూధనుడనీ; క్షహరాట్ట వంశాన్ని పూర్తిగా తుడిచిపెట్టిన వాడనీ కీర్తించడమే కాక ఆ చక్రవర్తి సామ్రాజ్యంలోని వివిధ ప్రాంతాలను వివరిస్తుంది.

అవి... అశిక (హైదరాబాద్, మెదక్ జిల్లా) అశ్మక (నిజామాబాద్, ఔరంగాబాద్ జిల్లాలు) ములక (పైథాన్ ప్రాంతం) అపరాంత (బొంబాయి, కొంకణ్, పూనా పరిసరాలు) అనూప (మహిష్మతి, ఎగువ నర్మద ప్రాంతం) విదర్భ (నాగపూర్, బేరార్) ఆకర (విదిశ, తూర్పు మాళ్వా) అవంతి (ఉజ్జయిని, పశ్చిమ మాళ్వా) సౌరాష్ట్ర (దక్షిణ కథియవాడ్ ప్రాంతం) కుకుర (దక్షిణ రాజస్థాన్) దేశాలు.

అంతేగాక, శాతవాహనుల రాజ్యమందలి అనేక పర్వత శ్రేణులని కూడా తెలుపుతుంది. అవి... వింధ్య శ్రేణి (తూర్పు వింధ్య పర్వతాలు), అచివత్ (ఆరావళి శ్రేణి), పరియాత్ర (పశ్చిమ వింధ్యా శ్రేణీ), సహ్య (పడమటి కనుమలు), కన్హగిరి (కన్హేరీ కొండలు), మలయ పర్వతాలు (నీలగిరి, పళని కొండలు), మహేంద్ర (తూర్పు కనుమలు), చకోర (అనంతపురం, చిత్రదుర్గ, తుమ్కూర్ జిల్లాలోని కొండలు), సెతగిరి (సత్యమంగళం, చిత్తూరు కొండలు), సిరితన (నలమల) కొండలు.

'త్రిసముద్రపితతోయవాహన' అంటే మూడు సముద్రాల్లోని నీళ్ళతో దప్పిక తీర్చుకునే గుర్రాలు కలవాడు అని ఆ తల్లి అన్నదానిలో ఏమాత్రమూ అతిశయోక్తి లేదు.



# 29

## పౌధన్యపురి రాజ్యం, క్రీ.శ. 78

పవిత్ర గోదావరీ నదీతీరం.

పడమటి కనుమల్లో నాసికానగరి వద్ద పుట్టి ఆంధ్ర, మహరాట్టుల సీమలను సస్యశ్యామలంచేస్తూ తూర్పుకనుమలతో దోబూచులాడుతూ దక్షిణారామానికి దిగువగా ప్రాగ్సాగరంలో కలిసే మహానది. ఒక్క పవిత్రస్నానంతోనే సకల పాపాలూ హరించగల పుణ్యనది.

అది ప్రతి పన్నెండేళ్ళకూ ఒకసారి వచ్చే మహా పర్వదినం. ఆనాడు ఆ నదీమతల్లి జలాల్లో మునకవేయని దౌర్భాగ్యుడు ఆ ప్రదేశంలోనే ఉండడు. నేలయీనిటట్లు జనం.

అది వ్యాసపురి క్షేత్రం.

నదీతీరంలో అమ్మవారి కోవెల. ఆమె బ్రాహ్మణులకు బ్రాహ్మి, వైదీకులకు విద్యాదాయియైన సరస్వతి, ద్రావిడులకు ఇలాదేవి, మరియూ సామాన్య జానపదులకు బొడ్డెమ్మతల్లి. ఇక బౌద్ధధర్మాన్ని ఆచారించేవారికి బుద్ధిస్వరూపిణి ప్రజ్ఞాపారమిత. మహత్వ కవిత్వ పటుత్వ సంపదలిచ్చే కల్పవల్లి.

ఉచ్చైశ్రవాలవంటి పంచకల్యాణులపై సైనికులు దారిచూపగా, మణిమయ ఛత్ర చామరాలతో రాచభటులు ముందురాగా, భేరీ నాదస్వరాలకి అనువుగా వేశ్యారమణీ సమూహం నృత్యగీతాలు ఆలపించగా, రక్షకబృందం, పరివారం చుట్టూ నడవగా, రాజమాత గౌతమీదేవియొక్క రాచపల్లకి దేవి ఆలయం ముందు వచ్చి నిలిచింది.

ఐరావతపు దంతాలవన్నె వెలినూలు చీరె, కావిరంగు కాశ్మీరపు ఉన్ని పైబట్టతో ఆభరణరహితయై దైవమాత అదితీదేవిలా పల్లకిదిగిన రాజమాత గౌతమీదేవిని చూసిన మరుక్షణం జయధ్వానాలు మిన్నంటాయి.

శాతవాహన సామ్రాజ్య క్షేమదాయా... జయః

శ్రీశాతకర్ణి వరపుత్ర దాయిత హిరణ్యగర్భీ... జయః

ఆంధ్ర కర్ణాట జన కల్యాణకారిణీ... జయః

అపరిమిత ధన ధాన్య దాన ప్రదాయినీ... జయః

రాజమాత దర్శనార్థం విరగబడ్డ జనాన్ని అదుపుజేయడం ఒక మహాయజ్ఞమే!

అంతలో...

అదే పల్లకీనుండి,

మహాచీనంలో ప్రత్యేకించి నేయించిన నాజూకు నాచుపచ్చ హోంబొట్టుపై, కాంచీపురపు బంగారు బూటాతో మామిడిపిందెల అంచు చీరె, చాటున దోబూచులాడే లేత కుచాగ్రాలను దాచే వ్యర్థ ప్రయత్నం చేస్తున్న కుంకుమరంగు మజలంక రవపట్టపు రవికె, దానిపై ఆరుపేర్ల సువర్ణ పణహారం, శంఖాన్ని పోలిన మెడచుట్టూ రవ్వల కంఠాభరణం, వసంతఋతువు ఆగమనం తెలియజేసే మొదటి మామిడి పిందెవంటి చుబుకంపై మూడు చుక్కల పచ్చబొట్టు, సంకర్షణుని హలాగ్రంలా కోటేరేసిన నాసాగ్రంపై మంచిముత్యపు నత్తు, బెత్తెడు జారిన జంట సంపెగలవంటి చెవులపై ఉయ్యాలలూగే కుండలాలు, మహాసాగరంవలె సమస్త భూమండలాన్నీ తమ లోతుల్లో దాచగల కాటుకదిద్దిన కళ్ళు. భ్రూమధ్యంలో ఎర్రని దోసపిందె బొట్టు, విశాలమైన పాపిట పచ్చల రావిరేకు, తుమ్మెద రెక్కలను తలదన్నే కచసంపదను ముత్యాల సరాలతోనూ, సన్నని కనకాంబరాలతోనూ పేనిన బారెడు జడ, ఎడమ భుజంపై పడగెత్తి నునువైన చామనఛాయ కైదండను చుట్టిన వాసుకీబంధపు వెండి వంకీ, ముంజేయి నుండి మోచేతి వరకూ తీర్చిన రత్నమయమైన కంకణాల బరువుకు వణికే పల్లవ కోమలమైన బాహువులు, అర్ధచంద్రమను బోలిన నాభిని తనలో దాచిన ఆకాశం వంటి నడుముకు వెండి గంటలు కూర్చిన కెంపుల వడ్డాణం, కస్తూరికాది పాదలేపనాలతో మిశ్రితమైన లత్తుకతో అరుణకాంతులు వెదజల్లే పాదద్వయం... రత్న మంజూషపై అవి మోపినప్పుడు చేసిన మణికింకిణుల కణక్కణానాదాలకు నిశ్చేష్టులైన జనానికి, ఆ అసమాన సౌందర్యరాశి, ఆ అలౌకిక లావణ్యమణీ ఎవరో ఊహకందలేదు...

'ఈమె మానవ సుందరి కాదు దేవలోకంనుండి వచ్చిన అప్సరకన్య కాబోలు!'

'లేక నాగలోకంనుండి వచ్చిన ఉలూచీ దేవియా?'

'లేదు, ఈ మచ్చెకంటి, సాగరగర్భాన ఉదయించిన లక్ష్మీదేవియే!'

'ఆకుపచ్చని చీరెలో వసంతుని సహోదరి, కామునికై వచ్చిన రతీదేవేమో?'

**ఆభరణాలూ... అలంకారాలూ...**

శాతవాహనులనాటి ఆంధ్రుల వస్త్రధారణ, ఆభరణాలూ ఎలావుండేవో తెలియాలంటే, అమరావతి శిల్పాలే చాలు. శిధిలాలలో... మట్టి గాజులూ, శంఖపు చిప్పల కడియాలూ, రకరకాల పూసలూ దొరికినా, అవి ఎలా అలంకరించుకునే వాళ్ళో తెలియాలంటే, ఆ కాలపు శిల్పాలనూ, అజంతా చిత్రాలనూ చూడాలి. ఉదాహరణకి, కుండలాల బరువుకి జారిన చెవి చిల్లులో వేలు పెట్టుకున్న స్త్రీ శిల్పం. పూసల వరుసల చెవి పోగులూ, మణికట్టునుంచీ మోచేతివరకూ కంకణాలూ, దండ కడియాలూ, కాళ్ళకు అందెలూ... ఇక హారాలయితే రకరకాలు!

స్త్రీలే కాదు, పురుషులు కూడా ఆభరణాలు ధరించి వయ్యారాలు పోయే అద్భుత శిల్పాలు అమరావతి శైలిలో కనిపిస్తాయి.

ఇక వస్త్రాలలో రకరకాలు. చెంగులు తీర్చిన చీరెలూ, ధోవతులూ, ముందు అలవోకగా ముడివేసిన రవికెలూ, దట్టీలు.

అలా చూడవల్సిందే కానీ చెప్పనలవి కాదు.

### బాసర

కాశ్మీరులో పుట్టి, దాదాపుగా ఇప్పటి భారత పాకిస్తాన్ సరిహద్దు రేఖ మీదుగా గుజరాత్ లోని కచ్ వద్ద సముద్రంలో కలిసిన ఒక మహానది ఆనవాళ్ళు సాటిలైట్ చిత్రాలలో కనిపిస్తాయి. 'దేవీతమా నదీతమా సరస్వతీ' అని కీర్తించబడిన నది అదేనని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. పురాతత్వ శాస్త్రజ్ఞులు, వందల కొలదిగా సింధూ నాగరికతనాటి గ్రామాలూ, పట్టణాల ఆనవాళ్ళు అక్కడ కనుగొన్నారు. ఏవో ప్రకృతి వైపరీత్యాలవల్ల ఆ మహానది ఎండిపోయి అదృశ్యం అయిందట.

వేదాలు ఆ నది వడ్డున పుట్టాయన్న జ్ఞాపకాల వల్లనేమో, ఆ నదీదేవతని, విద్యా, జ్ఞానాలకు అధిదేవతగా భావిస్తాం. ఐతే ఆ దేవతకి గుడి కట్టి ఆరాధించే ఆచారం మనదేశంలో లేదు. దానికి వ్యతిరేకంగా రెండు ఉదాహరణలు మాత్రం ఉన్నాయి. ఒకటి, సరస్వతి పుట్టిన స్థలమైన కాశ్మీరులో... రెండవది మన రాష్ట్రంలోని బాసర క్షేత్రం. మహర్షి వేదవ్యాసుడే బాసర క్షేత్రానికి వచ్చి అక్కడ ఆశ్రమం నెలకొల్పాడట.

బాసర అతి పురాతన క్షేత్రం. క్రీస్తు పూర్వమే ఆ ప్రదేశంలో ఉన్న అనేక బౌద్ధ ఆరామాల ఆనవాళ్ళు కనుగొన్నారు. శాతవాహన యుగంలో బౌద్ధ, బ్రాహ్మణ మతాల మధ్య కీచులాటలు అంతగా కనిపించవు. మహాయాన బౌద్ధంలోని ప్రజ్ఞా పారమితా దేవికీ, జ్ఞాన సరస్వతికీ పెద్ద తేడా కనిపించదు. ఇద్దరూ విద్యాధిదేవతలే. ఆ తల్లిని రెండు మతాలవారు ప్రజ్ఞా జ్ఞాన ప్రదాయినిగా ఆరాధించడానికి అవకాశం ఉంది. వీరిలో 'ఎవరు ముందు? ఎవరు తరువాత?' అనేది మాత్రం నిరూపించలేము.

ఇలా తమలోతామే ఊహించుకుంటూ చేష్టలుడిగిన జనానికి బావనీవాడు చేస్తున్న సింగినాదపు హెచ్చరికతో తెలివివచ్చింది.

'వినండహో... విసాకనాగడుదొర మగ, కలింగ రట్టోడి కూతు, సాతకన్ని మారాజు కాబోయే ఇల్లాలు, తెన్గుకన్నడ సీమకి దేవుళ్ళిచ్చిన దొరసాని, సాతవానికుల మారాణి, సిరితాయి వాసిర్ఠీయమ్మ... మారాజుని మనువాడ పైఠానపూరి దారి మనసీమ కొచ్చె. బిరాన మొక్కుడీ' అన్నంతనే జనంలో కలిగిన కలకలం అతింత కాదు.



రాజమాత పూజలాచరించి ఆలయం విడిచి వచ్చేందుకు ఇంకా చాలా సమయం పట్టవచ్చు. ఈలోగా ఆమె అదేశించిన విధంగా దాన శాసనాలు సిద్ధపరిచి, నదీ ముఖంగా నిర్మించబడిన స్తంభాల మండపంలో ఎదురు చూడసాగాడు స్కంధగిరి శిలావద్ధంకి శ్రేణికుడు విశ్వనాథుడు.

ముంగాలి వేళ్ళపై నిలిచి ఆ దృశ్యాన్ని చూస్తున్న అతని బావమరిది, మల్లన్న అతనిని మోచేతితో పొడుస్తూ, 'విస్సన్నబావా, కళింగదేశపు మహారథి, మేఘవాహన కులపతి, విశాఖ నాగదత్త భూపతికి వాశిష్ఠీదేవి ఏకైక సంతానం కదా? ఆ మహావీరుని జామాత అయితే ఇక మన శాతకర్ణి ప్రభువుకు పూర్వసాగర తీరదేశాలేకాదు, యవ మలయ సువర్ణద్వీపాలపై ఆధిపత్యంలో తిరుగే ఉండదు' అంటూ ప్రశ్నార్థకంగా అతనివంక చూసాడు.

'అవునురా, ఇక మాతామహుల మహరాట్ట సీమలైన అనుప, అవంతులు కూడా క్షహరాట్టుల పట్టునుండి విడిపిస్తే, మహాంధ్ర సామ్రాజ్యం అటుతూర్పున మహాచీనాకు, ఇటు పడమర యవనసీమలకు వారధి కాగలదు'.

'కలిసొచ్చిన కాలానికి నడిచొచ్చే కొడుకు నట్టింటికొస్తాడని పెద్దలు ఊరకే అనలేదు. లేకుంటే తూర్పుదొరలతో మనది తాతలనాటి వైరం కదా? ఇప్పటికీ ఆ కళింగుడు ఉప్పెనదొర చేసిన ఘోరాలు ముసలివాళ్ళ మాటలలో వింటూనే ఉంటాం, ఈ పెళ్ళితో ఆ ఖారవెళ్ళ రాజవంశంతో మన ఆంధ్రులకు మైత్రీ సంబంధాలు స్థిరపడ్డట్లేనా, బావా?'

'అంతా మహారాణి గౌతమీదేవి ఆలోచనేరా. ఆ మహాతల్లి నీడవుంటే చాలు... పోయిన వైశాఖమాసంలో ధాన్యకటకం వెళ్ళాను, నీవు ఎరుగుదువుగా?'

'ఆహ్ తెలియక మరిచిపోతానా? కందపురిలో రాతిగుండ్లు దొర్లించేపని నాకప్పగించి నీవు చక్కాపోతివి. ఏదో నా అక్క మొగం చూసి నీదగ్గర ఉన్నాగానీ, లేకుంటే ఆ జాతరకి నేనేపోదును'

'చాల్లేరా, ఎప్పుడూ నీగోల నీదే', అని నెత్తిన సున్నితంగా మొట్టి, 'అప్పుడు విశాఖనాగడుదొరని స్వయంగా చూసాను. నాగార్జునదేవులు నిర్మిస్తున్నారే... ఆ అమరారామ మహాచైత్యపు నూతనప్రాకారం? దాని మూలస్తంభం ఆ దొరే స్వహస్తాలతో నాటారు. వయసు పైబడినా ఆ మహావీరుని బలం అమోఘం! అంత పెద్ద బండని ఎవరి సహాయం లేకుండా తన భుజాన్న ఎత్తి మోసాడు. అంతటి మహాబలుడు కానీ ఏం లాభం? పుత్రసంతానం లేదు. మేఘవాహన వంశం అతనితోనే ఆఖరు'.

'మంచిదే కదా బావా. ఇప్పుడు శాతకర్ణిప్రభువును అల్లునిగా చేస్తే కళింగాంధ్రాలు ఏకమైనట్లే. ఒక భాష మాట్లాడే అన్నదమ్ములం... విడివిడిగా రాజ్యం చేయడంకంటే ఒకే రాజ్యంగా కలిసివుంటేనే కదా సుఖం?'

'నిజమేరా, ఇక క్షహరాట్టుల పని కూడా పడితే మహారాజు ఒక కొత్త యుగానికే నాంది పలికినట్లే'

'అంతే బావా, ఆ మహాతల్లి నీడన కార్తికేయునిలా మన ప్రభువుది అప్రతిహతచక్రమే'.





# 30

'ఏమిట్రా, ఒక్కడివే వచ్చావ్? నీ బావగారేరీ?' అంటూ తలపాగా కొక్కానికి తగిలించి పట్టుకండువాతో ముఖం తుడుచుకుంటున్న మల్లన్నకి ఎదురొచ్చింది అతని అక్క అచ్చమాదేవి.

'నీ మొగుడి విషయం నీకేమన్నా కొత్తా? రాచకార్యాలూ...!' అని దీర్ఘం తీస్తూ, 'మారాణి వచ్చిందోలేదో... నన్ను అక్కడనుంచి తరిమేసాడు. బోడి బడాయి... ఇదిగో వీడు నా బావమరిది, అని మహారాణికి పరిచయం చేస్తే ఏం పోతుందో? అన్ని పనులకీ నేనే కావాలి. కానీ అఖరికి కూరలో కరేపాకులా తీసి పారేస్తాడు'.

'సరెలే, ఇప్పుడు నీ వయసేం మీరిపోయిందని మహారాజుల పరిచయం కావాలి? సమయం వచ్చినప్పుడు ఆయనే అన్నీ చూసుకుంటారు, వెళ్ళి ముఖం చేతులూ కడుక్కో. భోజనం పెడతాను'.

'ఇప్పుడే వద్దులేవే. బావ వచ్చాక చేస్తాను. దారిలో ఏదో కాస్త తినే వచ్చాను'.

'అదేం పోయేకాలంరా? తిన్నగా ఇంటికి రాక బయట తిండ్లు దేనికి?'

'అదికాదులేవే... బావ పొమ్మంటేనే పోయాను. కాంభోజం నుంచి రాజుగారి కొడుకులట, వాళ్ళ విడిదికి పనిమీద వెళ్ళాను. వాళ్ళ ముఖాలు నువ్వు చూడాల్సిందే, అదో రకం' అని పకపకా నవ్వుతూ, 'ఇక వాళ్ళ భాష... మాట్లాడేది తెలుగే అయినా ఆ యాస వింటే పొట్టచెక్కలవాల్సిందే'.

'వాళ్ళ మాట సరేగానీ, కొత్త రాణిని చూసావా?'

'ఆహా! చూడక? అబ్బా! ఎంత అందంగా ఉందనుకున్నావే! రెండు కళ్ళూ చాలలేదంటే నమ్ము. రంభ దిగొచ్చినట్లుంది'

'నోర్ముయ్యరా. మహారాణిని గురించి అట్లాగేనా మాట్లాడేది? కళ్ళుపోతాయ్'

'అంత భయమెందుకే, ఏ మారాణినో కట్టుకుని పోతాననా నీ అనుమానం? నీ కూతురుండగా నాకు ఇంకొకళ్ళు దేనికి?'

'ఆహ్, ఆశ! నిన్నెవరు చేసుకుంటారు, మావయ్యా?' అని ముక్కుపై వేలెట్టి ఎక్కిరిస్తూ పక్కనే వచ్చి నిలిచింది అతని మేనకోడలు, పదహారేళ్ళ భ్రమరం. అచ్చమ్మా, విశ్వనాథుల పెద్దకూతురు. పుట్టినప్పుడే తన ముద్దుల తమ్మునికి కాబోయే భార్యగా నిశ్చయించి, తగినట్లుగా శ్రీపర్వతపు తల్లి పేరు పెట్టారు ఆ దంపతులు. పేరుకు తమ్ముడైనా మల్లన్న ఆ దంపతులకు కొడుకుతో సమానం.

వారి వివాహానికి, అతని వయస్సు నాలుగేళ్ళు. అతనికి ఊహ తెలిసినప్పడి నుంచీ అక్కే అతనికి అన్నీయై సాకింది, తల్లికంటే ఎక్కువ.

'పోవే కోతిముండా... నేనుగాక నీకెవ్వరే దిక్కు?'

'ఏమో ఎవరికి తెలుసు? ఏ మహారాజో యువరాజో వస్తాడేమో. అయినా రాళ్ళు కొట్టుకునే నీకంటే నాకింకెవరైనా సరే. సంవత్సరంలో సగం ఎలాగూ ఉళ్ళో ఉండరు, మీకంటే ఏ చిన్న రైతన్నా నయం, ఇంటిపట్టున ఉంటాడు'.

'ఇంటిపట్టునే ఉండాలంటే ఏ గంగిరెద్దునో తెచ్చి పెరట్లో కట్టేసుకో. అంతదానికి మొగుడెందుకు?' అంటూ భుజంచుట్టి అక్కున చేర్చుకున్నాడు. బుగ్గలు ఎర్రబడగా తలయెత్తి కళ్ళలోకి ప్రేమగా చూస్తూ అతని భుజంపై వాలిపోయింది భ్రమరం.

✦ ✦ ✦

బయట పందిరికింద క్రిక్కిరిసినట్లు జనం. జాతర పుణ్యమా అని విశ్వనాథుని ఇంట రెండు బంతులలో కనీసం నూరు విస్తర్లన్నా లేచాయి.

భోజనానంతరం, చేతులు కడుక్కొని, తమలపాకు బుగ్గన బిగించి మండువా అరుగు మీద కూర్చున్నాడు విస్సన్న. ముంగిట్లో దీపం పెట్టి చేత విసినెకర్రతో పక్కనే చేరింది భ్రమరం.

'ఎక్కడే నీ మొగుడు? ఒక పనిచెపితే సరిగ్గా అవదు. చీకటి పడ్డా ఎక్కడ పచార్లు చేస్తున్నాడో? తొందరగా పెళ్ళిచేస్తేనన్నా ఇంటిపట్టున ఉంటాడేమో?' అన్న తండ్రి మాటలకు సిగ్గుతో తలవంచి విసినెకర్రను విసురుగా విసరసాగింది.

'ఎందుకు మా తమ్ముడిని ఆడిపోసుకుంటారు? ఉదయాన్నుంచీ మీరు చెప్పే పనులమీదే కాళ్ళరిగేలా తిరుగుతున్నాడు. ఆ పల్లవనాటి

### కథ - కాలనిర్ణయం

గౌతమీ పుత్ర శాతకర్ణి గురించి చరిత్రకారుల్లో ఏకాభిప్రాయం లేదు. 'అందరిలోకి ముఖ్యుడు డాక్టర్ సర్కార్. గౌతమీ పుత్రుని రాజ్యకాలం క్రీశ. 106-130 వరకూ అని వీరి వాదం. అందుకు ఆధారం, పశ్చిమ క్షహరాట్టుడు నహపనుని శాసనాలు. వీటిలో ఆఖరిది శక సంవత్సరం 46లో ఉంది కనుక శాతకర్ణి అతడిని ఆలోగా జయించి ఉండడానికి వీలు లేదు. శక 46 అంటే, 46+78= క్రీశ 124. గౌతమీ పుత్రుడు తను రాజ్యానికి వచ్చిన 18వ సంవత్సరంలో క్షహరాట్టులను జయించాడని నాసిక్ ప్రశస్తి చెప్తుంది. అంటే, 124–18= క్రీశ.106 లో రాజ్యానికి వచ్చినట్లు. కానీ, ఈ వాదాన్ని కర్ధమక రాజు రుద్రదమనుని కథియవాడ్‌లోని శాసనం అంగీకరించదు. ఎందుకంటే అదే సమయంలో అతని తాత 'ఛస్థాన' గుజరాత్ ప్రాంతాన్ని పరిపాలిస్తున్నట్లు చెప్తుంది. గౌతమీ బాలశ్రీ శాసనం ప్రకారం శాతకర్ణి కుమారుడు పులకేశి అధికారంలోకి వచ్చిన 19 ఏళ్ళ తరువాత కూడా శాతవాహన రాజ్యం ఏమాత్రమూ క్షీణించలేదు. కనుక గౌతమీపుత్ర శాతకర్ణి కాలం అంతకు ముందే ఉండాలి.

ఇక, రోమన్ గ్రంథం, 'పెరిప్లస్ మారిస్ ఎరిత్రే'. దీనిలో పశ్చిమతీరంపై నాంబెనస్ (నహపన) ఆధిపత్యం ఉన్నట్లు చెప్పబడిందని ధృవీకరించబడింది. అంటే, అంతకు ముందే నహపన ఉన్నాడని ఖాయం. అందువల్ల గౌతమీ పుత్ర శాతకర్ణి క్రీశ. ఒకటో శతాబ్ది ఆఖరి రోజులలో రాజ్యమేలాడని తెలుస్తుంది.

శాతకర్ణి క్రీశ. 78 లో అధికారంలోకి వచ్చాడని మాత్రం నిరూపించలేము. శాలివాహన శకం శాతకర్ణి పట్టాభిషేకాన్నే పురస్కరించుకుని ఆరంభించారని అనుకుంటే, మన కథ క్రీశ. 78వ సంవత్సరం నాటిదే అవుతుంది.

శెట్టిగారిని కలవమని మీరేకదా చెప్పుత?' అంటూ రుసరుసలాడుతూ వచ్చి పక్కనే చతికిలబడింది అతని సతీమణి.

'నీ తమ్ముడిని ఒక మాటంటే చాలు, విరుచుకుబడతావ్. ఆ శెట్టిని కలవమని పొద్దున్ననగా కదా చెప్పాను?'

'అవునూ... చెప్పారు. ఆ కాంభోజరాజు కొడుకుల్ని కలవమని కూడా మీరేకదా చెప్పారు. పాపం ఎండనబడి వచ్చాడు. మీకోసం ఎదురు చూస్తూ భోజనం కూడా చేయలేదు. ఎంతసేపూ పనేగానీ, రాణీగారు వచ్చినప్పుడు కనీసం వాణ్ణి మీ బావమరిది అని పరిచయం కూడా చేయలేదట, ఎంత వాపోయాడో బిడ్డడు' అన్నది మెటికలు విరుస్తూ.

'ఆహ్, పరిచయం ఒకటీ, వాడు చేసిన పనికి ఇప్పుడు నా తలకి చుట్టుకుంది. వద్దురా అంటే వినక బుద్ధదేవుని ప్రతిమ చెక్కాడు. మనుషలవీ మారాజులవీ అయితే సరే, దేవుడి బొమ్మ! ఎక్కడా కనీ వినీ ఎరగం', అంటూ లెంపలేసుకుని, 'నిగమ పెద్దలంతా ఒకటే వత్తిడి, నీ తమ్ముణ్ణి కాస్త అదుపులో పెట్టమని. ఈ విషయం మహారాణికి తెలిస్తే వాడి తలకేం ముప్పు వస్తుందోనని కదా వాణ్ణి అక్కడనుండి పొమ్మంది.'

'అల్లాగా? నిజమేనండీ, మరీ పెద్దంతరం లేకుండా పోతున్నాడు. ఎంత ధైర్యం? దేవుడి బొమ్మే? కళ్ళు పోవూ?'

అంతలో పూసల తెర పక్కకు నెట్టి మండువాలోకి వచ్చిన మల్లన, 'నీవన్నట్లే ప్రతిదానికి కళ్ళుపోతే, దేశమంతా గుడ్డోళ్ళయి ఉండేవారు ఈపాటికి. ఆ ముసలోళ్ల మాటలకేంగానీ, ఆ కాంభోజ యువరాజులైతే ఎంత మెచ్చుకున్నారో!'

'చూసావా? భయమూ భక్తీ లేకుండా! ఈ పిచ్చోడికి ఆ వెర్రోళ్ళు తోడు'

'అంత మెచ్చుకున్నారేం మావయ్యా? నాకూ చూపించవూ?' అని గోముగా పలకరించిన మేనకోడలి వంక చిరునవ్వు నవ్వుతూ,

'అది నీకెందుకులేవే, నీ బొమ్మే చెక్కి పెడతాను'.

'ఆహ్, అదే మంచిది. ఇద్దరికీ ముడేసిపడేస్తే, పెళ్ళాం బొమ్మలు చెక్కుతూ ఇంట్లోనే పడుంటావ్'.

'అంత ఆశే, బావా? ఏదో నా అక్కమీద మక్కువతో అరణం వచ్చానుగానీ, నీ ఇంట్లో ఇల్లరికం ఉంటానా? కాంభోజంలో చైత్యనిర్మాణమట. నన్ను స్వయంగా వచ్చి అన్నీ చూసుకోమ్మని ఎంత బతిమాలారో!'

'కొంపదీసి సరేనన్నావా, ఏమిట్రా? ఎంతదూరం! మూడనెలలు నడి సముద్రంలో ప్రయాణం. అందులో అంతా అడివి మనుషులట, వీల్లేదు', అని వణికిపోతూ తన భయాన్ని వెల్లడించింది అచ్చమ్మ.

'నిజంగా అంత భయపడ్డావేమే?' అని ఆమె పక్కనజేరి వడిలో తలపెట్టి, 'నిన్నొదిలి ఎక్కడికి వెళతానే? రాలేనని చెప్పానులే' అన్నాడు మల్లన మురిపెంగా.

'నా నాయనే, మంచిపని చేసావ్. వాళ్ళేమీ అనలేదు కదా?'

'ఏమంటారే, నీ భయంగానీ. బావ పంపించడు అని చెప్పేసా. అందుకే ఆలశ్యం. బుద్ధుడి బొమ్మ వాళ్ళకు కావాలని ఒకటే పట్టుబడితే, అమ్మేసాను. శ్రేణితో సంబంధం లేకుండా నా స్వంత సంపాదన' అన్నాడు కళ్ళెగరేస్తూ.

'మొదటి సంపాదనే? అంతా నాకే ఇవ్వాలి మావయ్యా' అంటూ ఊపుతున్న విసినెకర్రను కింద పెట్టి ఒక్క ఉరుకున పక్కనే చేరింది, భ్రమరాంబ.

'ఎంతిచ్చారో, నీ మొదటి సంపాదన?' అన్నాడు బావమరిదితో వ్యంగ్యంగా విశ్వనాథుడు.

బొడ్డున మొలతాటికి భద్రంగా కట్టిన సంచిని విప్పి తన మేనకోడలి దోసిట గ్రుమ్మరిస్తూ, 'ఎంతోలేదులే బావా, నూరు కార్షపణాలే', అన్నాడు మల్లన్న.

కణకణమని రాలుతున్న వెండి నాణాలను కనులు విప్పార్చి చూస్తూ 'ఆఆహ్, నూరు పణాలా!!' అని నోరెళ్ళబెట్టాడు, విస్సన్న.



'నాన్నగారూ... మీకోసం రాజభటులు వచ్చారు' అంటూ పరిగెత్తుకుని మండువాలోకి వచ్చాడు, విశ్వనాథుని కడగొట్టు కొడుకు, ఆరేళ్ళవాడు సోమనాథుడు.

'రాజభటులు ఈ సమయంలోనా? నువ్వు కాస్త వెళ్ళి చూడమ్మా' అని కూతుర్ని పురమాయించి, 'ఇంతసేపూ బయటేమి చేస్తున్నావురా భడవా? ఇలారా' అని చిన్న కొడుకుని ఒళ్ళో కూర్చోనబెట్టుకున్నాడు విశ్వనాథుడు. తన అల్లుడు తెచ్చిన నూరు పణాల గలగలలు అతని చెవులనింకా వీడనేలేదు.

'ఆడుకుంటున్నాం, నాన్నగారూ... 'పులీ మేకా'. కొసూరు కన్నప్పలేడూ, అన్న వాడికి మూడుసార్లు డిల్లాపెట్టాడు, జిల్లాయిలే జిల్లాయిలే...'

'దీపాలు పెట్టాక ఇంకా ఆటలేమిటి?' అంటూ భార్య వంక చూసాడు.

'ఆహ్ ఏమవుతుంది, మీ చోద్యంగానీ, పొరుగూర్లవాళ్ళతో పందిరంతా సందడిగా ఉంది. వాడి తోటివయసు వాళ్ళతో ఒకరోజు కాస్త ఆడితే తప్పేముందిలేద్దురూ' కొడుకుకు వత్తాసుగా.

'నీ గారాబమే, పెద్దవాడు ఇలా తయారయ్యాడు ఇక వీళ్ళనీ అలాగే చెయ్యి'

'ఏం తయారయాడేంటి... ఇంతకాలం కాపురంలో, ఒక్కసారైనా నూరు కాసులు తెచ్చి నా చేతిలో పోసారూ? పైగా బుద్ధుని విగ్రహంచేసాడని ఆడిపోసుకోవడం కూడా. నా పెంపకం కాబట్టే నా తండ్రి ఇంతవాడయ్యాడు' అని ముసిముసి నవ్వులు పోతున్న తమ్ముని తల మూర్కొని ముద్దిలింది.

'ఇందాకే కదే, దేవుణ్ణి చేయడం పాపమంటివి? ఇంతలోనే ఇలా మాటమార్చావే?' అన్నాడు భార్య మనస్సెరిగిన విస్సన్న ఎగతాళిగా.

'ఏమో బాబూ, పాప పుణ్యాల విషయం నాకేమి తెలుసు? తప్పయితే ఆ మహాదేవుడికి ఒక

**డబ్బు - విలువ**

ఆనాటి ప్రభుత్వంలో వివిధ ఉద్యోగులూ వాళ్ళ వేతనాల వివరాలు కౌటిల్యుని అర్థశాస్త్రంలో వివరించబడ్డాయి. వాటిలో అతితక్కువ జీతం 60 పణాలు, ఒక సామాన్యమైన కుటుంబీకుడికి ఒక సంవత్సరంపాటూ నాలుగు పూటల భోజనానికి, ఉండే ఇంటికి సరిపోయే జీతమది. బరువునిబట్టి చూస్తే ఆనాటి పెద్ద వెండి నాణెం 256 గురివింద గింజలతో తూగేది. అంటే దాదాపు ముప్పై గ్రాములు. ఇప్పటి వెండి విలువతో సరితూస్తే దాదాపు నూట అరవై రూపాయలు. అంటే అతితక్కువ జీతం సంవత్సరానికి పదివేల రూపాయలు. ఇక రాజధానిలో అత్యున్నత అధికారులు - పురోహితుడు, అమాత్యుడు, సేనాపతి వంటి వారి జీతం 48 వేల పణాలు, అంటే 800ల రెట్లు ఎక్కువ.

శాతవాహనుల కాలంలో కూడా వేతనాలలో వ్యత్యాసం అలాగే ఉండి ఉండవచ్చు. అయితే, ఉన్నతోద్యోగుల జీతాలు ద్రవ్యరూపంలో కాకుండా భూమిశిస్తు వసూలు రూపంగా ఇచ్చిఉంటారని చరిత్రకారుల అభిప్రాయం. రోమన్ సామ్రాజ్యంతో వాణిజ్యం పెరగడం వల్ల మౌర్యుల పణంకంటే, శాతవాహనుల కాలంలోని కార్షపణం విలువ ఎక్కువే. దీనికి అనేక చోట్ల దొరికిన నాణాల నిధులే నిదర్శనం. పణం అనేది ఒక వెండి నాణెం. అర్థ, పావు, ఎనిమిదో వంతు పణం నాణాలు కూడా వెండివే. పణంలో పదహారోవంతుని 'మషకం' అనే వారు. దానికి నాలుగు 'కాకణీ'లు. మషకం, అరమషకం, కాకణి, అరకాణి నాణాలు రాగివి.

పెద్దమొత్తాలకి వర్తకపు శ్రేణులనుండీ హామీ పత్రాలు, అంటే డిమాండ్ డ్రాఫ్ట్‌లు కూడా వాడకంలో ఉండేవి. నాణాలూ, పత్రాలూ ఫోర్జరీ చేసినవాళ్ళకి శిక్షలు కూడా చాలా కఠినంగా ఉండేవి.

బిల్వపత్రం, బుద్ధదేవుడికి ఒక పాటలీ పుష్పం సమర్పించి లెంపలేసుకుంటే సరి' అని తల దించుకున్న భార్యతో,

'అహహ్, అంతేలే ఒక పత్రం పుష్పంతో పనిగానిచ్చేస్తావ్. నూరు పణాలు మరి ఊరకే వస్తాయా?'

ఇద్దరు రాజభటులను వెంటబెట్టుకుని మండువాలోకి వచ్చిన కూతురిని చూడగానే అతని నవ్వు అర్ధాంతరంగా ఆగిపోయింది.

వెంటనే లేచి, 'చిన్నవాడు చెబితే నమ్మలేదు, ఈ సమయంలో...?' అంటూ ఆగిపోయిన భర్తను చూసి,

'రండి రండి. ఇలా అరుగుమీద కూర్చోండి. చల్లగా కాస్త మజ్జిగ తీసుకుంటారా?' అని వచ్చిన రాజభటులను మర్యాదగా కూర్చోబెట్టేలోగా సజ్జలో చక్కెరకేళీలూ దానిమ్మ పండ్లేగాక రెండు ముంతల చల్లమజ్జిగతో వారిముందు ప్రత్యక్షమయింది, భ్రమరాంబ.

'నీ మగు సత్తెంగా లచ్చిందేవే, శెట్టరూ' అని ఆమె చేతిలోని సజ్జను అందుకుంటూ, 'కలగాలం సల్లంగా ఉండవ్వా' అని దీవించి, 'ఏనూయిల్ల శెట్టరె... పెద్ద మహారాణీవారు నిమగె అవసరపడ్డ కబురు సేసుండే. చెప్పేదానికి వచ్చుంటిమి', తమదైన దక్షిణపు యాసలో.

'ఏమిటో, కాస్త తొందరగా సెలవియ్యండి' అన్నాడు విశ్వనాథుడు కంగారుగా.

'తొందరేనూ ఇల్ల సామీ. దొడ్డ అరసమ్మ తెల్లారుతానే పైథానం ప్రయాణ మాడుతుంద్రు. ఈలోగడ నిమ్మన్నె ఓమారు రమ్మనె. కూడ మీ అల్లుణ్ణి కూడతోడ్కొని పోవాలె. సిద్ధమవుతే... కాపయదొర అరమనె నల్లే ఆయమ్మ విడిది.'

'సరే సరే, ఇప్పుడే బయలుదేరుదాం. మల్లన్నా వెంటనే రాముడిని బండి కట్టమను, కాపయ్యమంత్రి కోట కోసుకు పైగా ఉంటుంది, చీకట్లో... దివిటీలతో పదిమంది చాలు' అని రాజభటులతో 'మీరు పందిట్లో ఒక ఘడియ విశ్రాంతి తీసుకోండి నేనూ, అల్లుడూ తయారవుతాం, మహారాణీవారి దర్శనం కదా' అంటూ హడావుడిగా లోనికి పరుగులెత్తాడు.

వెంటగా వచ్చిన భార్య అచ్చమ్మతో, 'ఇప్పుడేమి ముంచుకొచ్చిందే? నీ తమ్ముడి నిర్వాకమే అయ్యుంటుంది... ఆ బుద్ధప్రతిమ విషయం మహారాణికి తెలిసిందేమో? తప్పురా అని చెబితే వినలేదు. ఇది మహారాణి దృష్టిలో పడితే... దైవాపచారానికి దండన తలకొస్తుంది. వీణ్ణి విడిచి వెళదామంటే వెంట తీసుకురమ్మని ఆజ్ఞ. ఏం చేయాలో పాలుబోకుంది... అచ్చం' అంటూ బేలయై కూలబడిపోయాడు.

'పరవాలేదులే బావా, నీకన్నీ అనుమానాలే. దేవుని ప్రతిమ చేయడం అంత అపచారం కాదులే. యవనదేశాల్లో అది మామూలేనట, గాంధారం నుంచి వచ్చిన దేవదారుడు లేడూ, మన నిగమంలోనే పని నేర్చుకుంటున్నాడు, అతను చెప్పాడు. భయపడకు, విషయం మంచిదే అయ్యుంటుంది. లేకుంటే ఆ రాజభటులు అంత మర్యాదగా మాట్లాడుతారా? బంధించే తీసుకెళ్ళేవారు. నీకు అనవసరమైన కంగారు. పద తయారవ్వు' మనస్సులోని ఆదుర్దా బయటకు కనిపించకుండా నవ్వుతూ, 'అక్కా, నువ్వైనా చెప్పవే', అంటూ అతనిని లేవదీసాడు.





# 31

ఓడు...ఓడంటూ, చర్నాకోల ఝులిపిస్తూ ఎడ్లబండిని ఆఘమేఘాలమీద పరిగెత్తించాడు బోయరాముడు. విశ్వనాథుని నమ్మినబంటూ, మల్లన్నకి చిన్నప్పటినుండీ సావాసగాడూ.

'అన్నో, ఆ బుద్ధుడిబొమ్మకి వెట్టికట్టి రేవు జేర్చినా. నీయవ్వ ఎంత ముద్దొచ్చిందో! నిఝం మణిషల్లే ఉందనుకో... కోసలపట్టం రేవులో ఓడకి ఎక్కిస్తారట'

'అఘోరించావులే, ఇక నోరుముయ్యరా' అంటూ చిరాకుబడ్డ విశ్వనాథునితో,

'అదిగాదులే దొరా... చిన్దొరతో జెప్పే... నాపేర్న ఒక రామన్న బొమ్మ జెక్కించరాదూ? అమ్మోరి గుడికాడే నిలబెట్టి జాతర్లు సేయొచ్చు'

'నీయబ్బ నోర్మూయమన్నానా, దేవుడి బొమ్మరా... ఏడన్నా చూసావా? తప్పురా'

'ఏం తప్పులే దొరా? ఎంసేపూ కతల్లో యిండమేగానీ, ఆ దేముని ముగం కానరాదు. ఆ బాపనయ్య జెప్పేది సగం ఎరుకకేరాదు. ఎదుర్నే బొమ్ముంటే మొక్కడం సులువుగాదేంది?'

'పెద్దమ్మవారి గుళ్ళో మొక్కుతున్నావుగదరా?'

'నిజమేననుకో... పాపమొస్తేవొచ్చింది గానీ ఓమాట సెబుతా యిను. ఆ అమ్మోరికీ సాకిరేవుబండకీ తేడాయేంటంటా? మనసులో తలుసుకొని మొక్కితే ఏడన్నా దేముడుంటాడనిగదా ఆ బాపనయ్య సెబుతా? పెద్దోళ్ళు సెప్పింద్రు గనుక గుళ్ళో పోయి మొక్కుతాం. గుడేంటికిలే... సెట్టుకి మొక్కంటే సెట్టుకి, పుట్టకి మొక్కంటే పుట్టకీ... అదే కనుముక్కు తీరుగా అమ్మోరి బొమ్మనుకో... ఏందొరా? ఇంకోరు సెప్పే పనే లేదుగా?'

అతని మాటలోని వాదానికి 'ఊ' కొడుతూ విని, 'నీకు బాగా తర్కం ముదిరిందిరా. క్రితం జన్మలో బ్రాహ్మడివైయుంటావ్. ఏదో పాపిష్ఠి పనిజేసి ఇట్లా పుట్టావ్. ఇక పద'. అన్నాడు చిరునవ్వుతో.

'ఏంజేసినా మంచే జేసుంటా దొరా. నీనీడన ఈ జల్మే బాగుంది' అని కాళ్ళుతన్నిపెట్టి పగ్గాలు లాగుతూ, 'హుర్ ర్ ర్... నిలునిలు' అంటూ బండిని అమాత్యుని దివాణం వాకిలి వద్ద నిలిపాడు బోయరాముడు.



'ఏం శ్రేష్ఠీ, నీ అల్లుడు ఇంత మంచి శిల్పియని మాతో చెప్పనేలేదు' అని మోకాళ్ళపై, తలనేల ఆనించి మ్రొక్కుతున్న విశ్వనాథుని ప్రశ్నించింది, నది వడ్డున వసంత మంటపంలో కొలువుతీరిన మహారాణి, రాజమాత గౌతమీ బాలశ్రీ.

'చిన్నవాడు తల్లీ, తెలియక చేసాడు. ఈ అపరాధం కాసి క్షమించు తల్లీ' అంటూ వంచిన తలయెత్తకుండా అలానే సాగిలపడ్డాడు, విశ్వనాథుడు.

'అరే, దీనిలో అతని అపరాధమేముంది శ్రేష్ఠీ? ఏదైనా ఉంటే ఇంతటి మహాశిల్పిని నీవద్ద ఉంచుకొని మాకు పరిచయంచేయక, అతని సామర్థ్యాన్ని నిరుపయోగం చేస్తున్న నీది తప్పు. యాదృచ్ఛికంగా, కాంభోజ యువరాజులు కౌండిన్య కుమారులద్వారా ఆ బుద్ధదేవుని విగ్రహం గూర్చి విన్నాము కనుక కానీ, లేకున్నచో అంతటి కళాఖండాన్ని చూసే అదృష్టం కోల్పోయి ఉండేవారం. అంతేకాదు శ్రేష్ఠీ, నీ అల్లునికి జన్మతహా వచ్చిన సామర్థ్యానికి విద్యని జోడించినట్లయితే అతడొక అసామాన్యమైన శిల్పి కాగలడు. ఎంతటి జాతి వజ్రమైనా సానపట్టినప్పుడే కదా శోభించేది?' అంటున్న మహారాణి మాటల అర్థం అవగతమౌతున్న కొలదీ, అతనిని పీడిస్తున్న భయం వీడసాగింది. తలయెత్తి నమస్కరిస్తూ,

'అంతా తమ కటాక్షం తల్లీ. మీ దయకు పాత్రుడైన నా బిడ్డ అదృష్టవంతుడు. తమ దయవల్ల మల్లన్న ఇప్పటికే శ్రేణీ శాలలో శిల్ప వాస్తు శాస్త్రాలు అభ్యసించాడు. ఇక పనితనంలో మెలుకువలు నేర్చితే చాలు తల్లీ, నిగమంలో ప్రవేశార్హత వచ్చినట్లే.'

'అది సామాన్య శిల్పకారునికి సరిపడవచ్చు శ్రేష్ఠీ. కానీ కుమారుని ప్రతిభ అసామాన్యం. ఒక మహా శిల్పి కావాలంటే, పనితనంతో పాటూ, శాస్త్ర వాఙ్మయాలలో కూడా ప్రవేశం ఉండాలి. దానికి ప్రత్యేకమైన శిక్షణ అవసరం', అని మల్లన్నను సంబోధిస్తూ, 'ఏం నాయనా, ఆచార్య నాగార్జునుని వద్ద విద్యాభ్యాసం చేస్తావా?'

### అమరావతి శిల్పశైలి

అటు ఆధ్యాత్మికశాంతి, ఇటు సౌందర్యతృష్ణ. ఇది జీవితాన్ని త్యజించిన సన్యాసుల సృష్టి కాదు. సంసారబంధాల్ని అనుభవించి, సుఖ సంతోషాలనూ, భయాందోళననూ తగు పాళ్ళలో చవిచూసిన నాగరికులచే సృజింప బడిన అపూర్వ కళాశైలి. ఈ శిల్పాలలో ఆనాటి ఐశ్వర్యమూ, జీవనశైలిలోని పరిణతీ, కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది. సామాజిక స్రవంతిలోని వైవిధ్యాన్ని అనుభవించి, అవగాహన చేసుకున్న వ్యక్తి మాత్రమే ఆ శిల్పాల హావభావాలలో తొణికిసలాడే, ప్రేమ, భక్తి, దయ, గర్వం, వినోదం, భయం, ఆతృత, విషాదం, కోపం మొదలైన మనః స్థితులను సజీవమేమో అనిపించే విధంగా శిలలో ప్రదర్శించగలడు. ఈ శిల్పాలు చలనరహితాలు కాదు, ప్రతి భంగిమలోనూ, మౌఖికభావాలలోనూ, చైతన్యం తొంగి చూస్తుంది. క్లిష్టమైన మత సంబంధమైన కథాంశాలలో కూడా, పూర్తి స్వేచ్ఛతో, నాటి సమాజాన్ని ప్రతిబింబింప జేస్తూ, స్థానిక వైవిధ్యానికి అద్దం పట్టుతూ, విశిష్టమైన, స్వంతమైన శైలి కనబరిచాడు, ఆంధ్ర శిల్పి.

వివిధ దశలలో దేశీయమైన వ్యక్తిత్వంతో మొదలై, కాలానుగుణంగా ఆనాటి శిల్ప రచనలలోని నూతన పంథాలను తనలో విలీనం చేసుకుంటూ తరువాతి తరాలకూ; వైవిధ్యమైన, ఆంధ్ర, పల్లవ, కర్నాట, ద్రవిడ, మహారాష్ట్రి శైలులకు మాతృకయై శతాబ్దాల పాటూ, సాగిన శిల్ప సాంప్రదాయం.

'మహాప్రసాదం మహారాణీ, తమ దయ అపారం. ఏదో ఉబుసుపోకకి చెక్కిన ప్రతిమ, ఇలా మీ దయకు నన్ను పాత్రుని చేస్తుందనుకోలేదు. అదృష్టవంతుణ్ణి' అంటూ తలవంచి నమస్కరించాడు మల్లన్న.

'ఉబుసుపోకకు చెక్కినా, ఆ బుద్ధదేవుని కంటజూచినట్లు ఆ శిల్పాన్ని మలిచావు. మహాయాన బౌద్ధతత్వాన్ని జీర్ణించుకున్న అర్హతులకు కూడా కనిపించని, ఆ దేవుని కరుణాపూర్ణ వీక్షణాలూ, అభయముద్రలో ఆ తథాగతుని బోధిసత్వ నిరతీ, పద్మాసనస్థుడైన స్వామి ధ్యాన దీక్ష... నీ ప్రతిమలో ప్రస్ఫుటింపజేసావు. నీ విద్య దైవదత్తం. ఇక నీవు సరేనంటే ఆ శ్రీపర్వత పరిషత్తులో శిక్షణకు ఏర్పాట్లు చేస్తాము'.

'కానీ... నాదొక చిన్న మనవి తల్లీ...'

'నిస్సంకోచంగా చెప్పు నాయనా'

'తల్లీ, నాకు ఊహ తెలిసిననాటి నుండీ నా అక్కాబావలే నాకు తల్లితండ్రులై పెంచారు, నా బాగుకోరే వారి నిర్ణయమేదైతే అదే నా కర్తవ్యం, నా మాట అనుచితమైతే క్షమించండి మహారాణీ, క్షంతవ్యుడిని'.

'సరియైన మాట నాయనా, అలాగే నీ బావగారినే అడుగుతాను' అని నవ్వుతూ, 'ఆహా! విశ్వనాథ శ్రేష్ఠీ, వినండి, ఈక్షణం నుండీ మీ అల్లుడు మల్లయ శెట్టి వద్ధంకిని ధాన్యకటకంలో, మా ఆస్థాన శిల్పకారునిగా నియమిస్తున్నాం. అయితే... పదవి చేబట్టే ముందు అతడు, ఆచార్యదేవుని వద్ద శ్రీపర్వత ధామంలో శిక్షణ గ్రహించవలసి ఉంది. సంతృప్తికరంగా శిక్షణ ముగించిన పిమ్మట వత్సరానికి ఆరువేల పణాల వేతనంతో పదివేల సుశిక్షితులైన శిల్పకారులతో ధాన్యకటక–ఆహారంలోని శిల్ప వాస్తు నిర్మాణపు పనులను పర్యవేక్షించటమే గాక, అమరారామ చైత్యాన్ని అభివృద్ధి చేసే బాధ్యత కూడా చేబట్టగలడు. శిక్షణా సమయంలో ఉపకారభృతిగా వెయ్యి పణాలు భండాగారికుని వద్దనుండి గ్రహింతురుగాక', విని నోటమాటరాక ప్రాన్పడిపోయిన విశ్వనాథునితో, 'ఇంకొకమాట శ్రేష్ఠీ... నీతో వేరే ఒక పని ఉంది. వచ్చే మాఘమాసం ఏనుగుల సవారీకి అనువైనది, సేతగిరి నుండి వచ్చే గజదళం ఇక్కడకు చేరగలదు. శ్రీపర్వతం వద్ద రెండువేల పలకల పాలరాయిని తెప్పకట్లకి ఎక్కించేందుకు ఒప్పందం కుదిరింది. అవిగాక పది అడుగుల నిడివి గుండ్లు ముప్పది కావలెనని పలనాటి శెట్టికి– ఇప్పుడు మీ ఊరనే ఉన్నాడు– మా ఆజ్ఞగా తెలపండి' అని ఒక క్షణం ఆగి, నవ్వుతూ మల్లన్న వంక కనుసైగచేసి, విశ్వనాథునితో, 'తరువాత అసలు విషయం... నీకిష్టమైతేనే... వెయ్యిమంది వాస్తుకార్మికులతో మీరు ధాన్యకటకంలో స్థిరనివాసం ఏర్పరుచుకొన వీలైతే, అమరారామానికి దక్షిణంగా పదివేల నివర్తనాల సాగుభూమిగల గ్రామాన్ని మీ శిలావద్ధంకి శ్రేణికి కార్మికభృతి కొరకు మీ పరంచేయగలం... ఇంటికి వెళ్ళి మీ నిగమసభతోనూ, కుటుంబ సభ్యులతోనూ ఆలోచించి మీ నిర్ణయాన్ని, కాపయామాత్యునకు తెలియజేయండి. వచ్చే సంవత్సరం, మీ అల్లుడు శిక్షణ పూర్తిచేసి శ్రీధాన్యం వచ్చుసరికి చైత్య పునర్నిర్మాణం ఆరంభించాలని మా ఉద్దేశ్యం'

సిరితల్లి తలుపుతట్టినట్లు ఒక్కసారిగా ఒనకూడిన అదృష్టానికి తలతిరగగా, ఏమనేందుకూ దిక్కుతోచక, తలాడించి సాష్టాంగపడ్డాడు, విశ్వనాథుడు.



# 32

రోజుకి యోజనంకంటే ఎక్కువ ప్రయాణించరాదని బావగారి కట్టడి. బోయరాముడికి విస్సన్న దొర మాటంటే హనుమంతుడికి రామాజ్ఞలాగే. ఇల్లు వదిలి సరిగ్గా నెల గడిచింది.

పౌధన్యానికి దక్షిణదిశగా ఇరవై యోజనాలు ప్రయాణిస్తే కొండపురి. పదివేల గడపల మహాపట్టణం. 'ఇంకెంత రెండు రోజుల్లో సేరిపోతాం. సిన్దొరా, పోయిన తడవ మీ ఇంటికి బోతిమే? ఆరేళ్ళయ్యుండ్లా? బుడ్డోడి పురిటికి... నీయప్ప ఇంకిది ఆకరి కాన్పు, పుట్టింట్లోనే కావాలని పట్టుపట్టుండ్లా? గుర్తుందా? ఏమాటకామాటే కానీ, నీ పెద్దన్న మా దార్మికుడు. జరీ పంచె, గళ్ళ అంగీ పెట్టి... అదిసాలక... బంగారు గొలుసిచ్చిణ్ణు. మారాజు'.

'నీ వాగుడాపి కాస్త త్వరగా తోలరా. కాలినడక బిక్కువులు కూడా మనకన్నా ముందు పోతున్నార్రా. నీవూ నీ పెళ్ళినడకలు', అని విసుక్కుంటూ, 'కాస్త త్వరగాపోతే రాత్రికల్లా ఇల్లుచేరొచ్చురా'.

'పెద్దొర సెప్పుండ్లా? ఇయ్యాల రాతిరికి సత్రంలో కునికి రేపుదయాన్నే పోదాం. ఇంటికి పోవాలని అంత తొందరగా ఉందా? ఉండుద్దిలే... సొంతోళ్ళని సూడాలని ఆ మాత్తరం ఉండాల్లే... అద్సరేగానీ సిన్దొరా... బెమరమ్మతో నీ మనువు ఈడ సేసుకుంటవా... మనూళ్ళోనా?'

'ఓరి నీయవ్వ! నీవిట్లాగే తోలితే నా పెళ్ళయ్యేటప్పుడికి ముసలోడినైపోతాన్రా. మనతోపాటూ బయల్దేరినవాళ్లు ఈపాటికి కంచికి పోయుంటారు...'

అంతలో పదిమంది రౌతులు దారిలో బండ్లనీ, పల్లకీలు మోసే బోయీలనూ పక్కకి అదులుస్తూ వెనుకనున్న నాలుగు గుర్రాలు కూర్చిన రథానికి దారి కల్పిస్తూ ఆఘమేఘాలమీద ఎదురొచ్చారు.

'ఎవరో మహారాజు? బండి పక్కకు దించరా' అన్నాడు మల్లన్న కంగారుగా.

'సరిగా సూడు దొరా.. ఆళ్ళొచ్చేది నీకోసవే. రదం కొమ్ముమీన సిన్నం సూడు' అంటూ తాపీగా దారి మధ్యలో బండి ఆపాడు, బోయరాముడు.

దుమ్మురేపుతూ సుడిగాలిలా వచ్చి ఆగిన రథంపైనుంచి దిగిన తన చిన్నన్నను గుర్తించి బండిదిగి పరుగున అతనిని చేరిన మల్లన్నను గాఢంగా కౌగిలించి, భుజాలు పట్టి ఎగాదిగా పరీక్షిస్తూ, 'పొడగరివే అయ్యావురా! చూసి ఎన్నాళ్ళయిందో' అంటూ మరలా అతనిని తన బాహువులలో బంధించాడు, కొండపురి ఉపసేనాపతీ, గజసేనాధ్యక్షుడూ, నగర నిగమాధ్యక్షుడు కోమటి రట్టకుడి కొమరయ్యదొర తోబుట్టువూ, సింగనదొర.

**యోజనం**

యోజనం అంటే ఎంతదూరం? ఈ ప్రశ్నకి వేర్వేరు పండితులవి వేర్వేరు సమాధానాలు. ఒక సైనిక దళం ఒకరోజులో ప్రయాణించే దూరాన్ని యోజనం అంటారు. 5వ శతాబ్దపు సూర్య సిద్ధాంతం ప్రకారం అది దాదాపుగా 5 మైళ్ళు. అంటే 8 కిమీ. అదే యోజనం విజయనగర సామ్రాజ్యపు కాలంలో 8 మైళ్ళు, అంటే 11 కిమీ అయింది. ఉదాహరణకి, హైదరాబాదు-విజయవాడ హైవేలో రోడ్డు ప్రక్కనే కొన్ని మసీదులవంటి కట్టడాలు కనిపిస్తాయి. రెండు మినార్లతో ఒకే విధంగా కట్టబడినవి. ఈ 'హైవే'ని నైజాం కాలంలో 'దండుబాట' అనేవాళ్ళు. సైన్యం నిలిచినప్పుడల్లా వాళ్ళ భోజనావసరాలకి, ఒక లంగరూ (పెద్ద వంటశాల), నమాజుకొరకు ఒక మసీదూ కట్టారట. వీటి మధ్య దూరం సుమారుగా 11 కిమీ ఉంటుంది. గ్రాండ్ ట్రంకురోడ్డు, అంటే బెంగాల్ నుంచి పంజాబు దాకా ఉన్న రహదారిలో కాస్త పెద్ద ఊరికీ ఊరికీ మధ్య దూరం కూడా కాస్త అటూయిటుగా 11 కిమీ ఉంటుంది. ఈ విషయాన్నీ, పరమేశ్వరాచార్యుని ఖగోళ సిద్ధాంతాలనూ పరిగణనలోకి తీసుకుని, ప్రముఖ చరిత్రకారుడు, అలెగ్జాండర్ కన్నింఘాం, యోజనాన్ని 11 కిమీ.గా నిర్ధారించాడు. యోజనానికి 4 కోసులు.

'నీవు బయలుదేరిన కబురంది పది దినాలయింది. అన్నగారు ఆందోళన పడుతున్నారు. దేనికింత ఆలశ్యం? మార్గంలో ఏదైనా...'

'అదేంలేదు చిన్నన్నా... మన అక్కగారు అప్పగింతలుపెట్టి నన్ను వీడి పరంచేసారు. వీడి నత్తనడకలతో నెలనాళ్ళు పట్టింది', అంటూ రాముడిని చూపాడు.

'ఏరా, రాముడూ బాగున్నావా?' అని పలకరించిన సింగనతో,

'తమదయ దొరా' అని కాళ్ళుమొక్కి, 'అయినా పెద్దొర మాటయ్యా... తిరుగులేదు. ఈడనుంచి రథం మీదే పోతాంలే' అన్నాడు బోయరాముడు మురిసిపోతూ.

'రథమెందుకురా? ఏనుగంబారీలో పోదువులే' అని భుజం తట్టిన సింగనితో,

'నావొల్లకాదయ్యా! నాకు బండే నయం. ఏనుగెక్కితే కడుపు తిప్పుద్ది' అంటూ తలవంచి నసిగాడు.

'సరే పదండి. ఇంటికెళదాం. నీవూ రథమెక్కరా శకలు పోకుండా, బండి మనవాళ్ళు తెస్తారులే'.

ఎడ్లు జాగ్రత్తని అప్పగింతలు చేసి ఒక్క గంతులో సారథి పక్కన చేరాడు, రాముడు.

కొండమీద కొమరయ్య శెట్టి దేవిడీ. చిన్న తమ్ముడు వచ్చిన సందర్భంలో అంతా పండుగ సందడి. అందునా మహారాణి కృపకు పాత్రుడై, చిన్న వయసులోనే అంత ప్రముఖ రాజోద్యోగిగా నియమితుడైన వార్త కార్చిచ్చులా ఊరంతా తెలిసింది. వచ్చే జనం... పోయే జనం. విందూ వినోదాలతో వారం అలానే గడిచిపోయింది. పెద్దన్న కొమరయ్య అయితే ఒక్క క్షణం కూడా తన కడగొట్టు తమ్ముని వదలడు. ఇక వదినెల మురిపెం సరేసరి, ముగ్గురు వదినెల ముద్దుల మరిదాయె!

వంద పడకల దివాణం!

చిన్నప్పుడే, వారి ఒక్కగానొక్క సోదరితో అరణంగా పోవడంవల్ల తన స్వంత అన్నదమ్ములతో ఎక్కువగా గడిపిందిలేదు. ఎప్పుడన్నా చుట్టపు చూపుగా వచ్చినా అక్కా బావలతోనే. పెద్దన్న ఊరికే

పెద్ద, అతని తమ్ములు లక్ష్మణ శత్రుఘ్నులే! రెండవవాడు సేనాపతి. ఇక మూడవ అన్న, బసవన్న, నగరానికి తూర్పునగల మూషికానది లోయలోని వజ్రపు గనులకు గుత్తాధిపతి.

శాతవాహన వంశానికి విశ్వాసపాత్రులై, వారినీడన అంచెలంచెలుగా ఎదిగి, నేడు కొండపురి నగరానికే ఉత్తరాధికారులయ్యారు. మహారాజు కొండపురి ఆహారానికి అమాత్యుడుగా ఎవరిని నియమించినా, వీరి కుటుంబానిదే అక్కడ పైచెయ్యి. అయితే దానివల్ల మహారాజుకు ఏ చింతాలేదు. శాతవాహన సామ్రాట్టు కోరితే ప్రాణాలైనా ఇచ్చేందుకు వారెప్పుడూ సిద్ధమే.

నగరానికి కొత్తగా వచ్చిన అమాత్యుడు, ధర్మదేవుడు.

కృష్ణా తీరాన ఆచార్య నాగార్జునుని జన్మస్థలమైన వేదపల్లి వాస్తవ్యుడు. తరతరాలుగా ధాన్యకటకంలో శాతవాహనుల ప్రాపున రాజోద్యోగులై ఎన్నో మహత్తరమైన పదవులు చేబట్టిన నియోగి బ్రాహ్మణ వంశస్థుడు. ప్రియదర్శి అశోకుని కాలంలోనే బౌద్ధం స్వీకరించి సింహళ, మలయ, సువర్ణద్వీపాలలో ధర్మయాత్రలు చేసిన, వారి పూర్వికుల ప్రతిష్ఠకి ఎన్నడూ మచ్చరానీయక, అటు భృత్యధర్మాన్నీ, ఇటు బౌద్ధధర్మాన్నీ అచంచలమైన దీక్షతో అనుసరించే యోగి. ఉన్న ఇద్దరు పుత్రులలో ఒకడు రాజభృత్యుడై కనకగిరిలో లేఖకుడైతే, రెండవవాడు, సోమదేవుడు, శ్రీపర్వతంలో ఆచార్యదేవుడు నాగార్జుననకు ప్రియశిష్యుడు.

### కొండాపూర్

హైదరాబాదు చరిత్ర అంటే మనకి కాకతీయుల కాలంలో కట్టబడ్డ గోల్కొండతో మొదలయిందనీ, ఖులీ కుతుబ్‌షా తన ప్రేయసి కోసం కట్టించిన భాగ్యనగరంతో మూసి నదికి ఈ ప్రక్కకి వచ్చిందనీ మాత్రమే తెలుసు. ఐతే... అటు ఉత్తర దక్షిణ దేశాలకి, ఇటు తూర్పు పడమర సముద్రాలకీ నడిబొడ్డయిన ఈ ప్రదేశం అతి ప్రాచీనమైన శిలాయుగం నుండి ఎంతో ప్రాముఖ్యం కలిగి ఉంది. ఆ గత వైభవపు ఆనవాళ్ళు చూడాలంటే, కొండాపూర్ మ్యూజియం చూడాలి.

పాత రాతియుగం నుండి అక్కడ ఆదిమ మానవులు నివాసాలు ఏర్పరుచుకున్న ఆనవాళ్ళు కనిపిస్తాయి. అయితే, క్రీపూ. 3వ శతాబ్దం నుంచీ, ఇది ఒక పట్టణంగా వర్ధిల్లింది. మౌర్యుల కాలంలోని ముప్పై ఆంధ్ర దుర్గాలలో ఇది ఒక్కటి. శాతవాహనులకి పూర్వమే, ఇది 'అశిక' రాజ్యానికి రాజధాని. రోమన్ సామ్రాజ్యంతో దక్షిణదేశపు వాణిజ్యానికి ఇదొక ప్రధాన కేంద్రం. ఆ కాలంలోనే ఇది ఒక కాస్మోపాలిటన్ నగరం. ఇక్కడ దొరికిన, టైబీరియస్ కైసర్ చిహ్నంగల రోమన్ సెస్టెర్సిస్‌తో చేసిన కాసులపేరు, అప్పుడు, రోమన్ పౌరులు ఇక్కడ నివసించారని తెలియచేస్తుంది.

మ్యూజియంకి ఉత్తరంగా పురాతత్వ శాస్త్రజ్ఞులు తవ్వకాలలో వెలికి తీసిన శిధిలాలు చూడవచ్చు.

సందర్శన వేళలు

ఉ॥10గం. – సా॥ 5గం. వరకు

(శుక్రవారం శెలవు)

ఆచార్యుని ఆదేశాన పశ్చిమదిశ యాత్రకై బయలుదేరి, యాదృచ్ఛికంగా కొండపురిలో తన తండ్రియింటనున్న సోమదేవుడు, ఆనాటి ప్రత్యేక అతిథి.





# 33

**కో**మరయ్య శెట్టి సౌధ ప్రాంగణంలో, ప్రత్యేకంగా నిర్మింపబడిన యవనికపై, మహాప్రస్థానమనే యక్షగానం. సిద్ధార్థ గౌతముడు, జరా మరణ దుఃఖాది మానవ వేదనలను చూసినవాడై, నిర్వేద పరితప్తాత్ముడై, సకల భోగాలకూ ఆలవాలమైన స్వగృహాన్నీ, కుటుంబాన్నీ వదిలి, మనుష్యజన్మకు నిశ్చితమైన దుఃఖపీడనుండి విముక్తి ఎటులా అని వెదుకుతూ పురం వీడటమే, ఆ కథా విశేషం.

ముందువరుసలో సోమదేవుని పక్కనే కూర్చొని, చెమర్చిన కళ్ళతో, ఇల్లు వీడిన గౌతమునిలో తనను తానే ఊహించుకుంటూ, అక్కా బావలపై బెంగతో దుఃఖం ఆగక వెక్కువెక్కుతున్న మల్లన్నను చూస్తూ, బంగారు పళ్ళెంలోని ఫలహారాలను కిందపెట్టి,

‘ఈ జక్కులాట నీ ప్నానానికొచ్చిందే? ఊరుకో చిన్దొరా’

అని పక్కన నిలిచి, సోమదేవునితో, ‘నీవన్నా సెప్పు సామీ, జల్మంతా ఇంటనే ఉండాలంటే ఎట్లవుతదీ?’ అని మల్లన్న అరచేతిని తన రెండుచేతులలో పట్టుకుని,

‘ఈ చిన్న సామిని సూడు, నీకంటే నాలుగేళ్ళేమో పెద్ద, ఎనిమిదేళ్లు గురువులకాడ విజ్జె నేరిసిండు, కొండల్లో ఉండొచ్చిండు, ఇప్పుడేమో పడమటి దేశాలుపట్టి పోతుండు. అమ్మా అయ్యా లేకనా? అటుసూడు. గౌరమ్మంటి యమ్మ, శివయ్య లాంటి అయ్యా!’ అని సోమదేవుని వంక చూసి లెంపలేసుకుంటూ, ‘నేనేం తప్పు సెప్పినానా సామీ?’ అన్నాడు బోయరాముడు.

సోమదేవుడు అతనివంక చిరునవ్వు నవ్వుతూ, ‘నిజమేనోయీ, నా గురించి చాలానే తెలుసుకున్నావ్. కానీ నీ పరిచయమే లేదు’ అన్నాడు రాముడి కళ్ళలోకి తీక్షణంగా చూస్తూ.

అప్పటికి స్థిమితపడి, ఉత్తరీయంతో కనులు తుడుచుకుంటూ, ‘వీడు బోయరాముడు, స్వామీ. మా బావగారి నమ్మిన బంటు. నాకు తోడుగా శ్రీపర్వతానికి తీసుకు వెళుతున్నాను. కాస్త మాటలెక్కువ’ అని పరిచయం చేసాడు, మల్లన్న.

‘అద్దేసూడు. నేనేమెక్కువ మాటాడినా? యాడకీ పోకుండా ఇంటిపట్టునే ఉండాలంటే ఎట్టా? మామహా గొప్పోళ్ళకే తప్పలేదు. అంతటి దమ్మరాజే అడవులకి పోలా? అంతెందుకు, మా రాములోరు ఇస్వామిత్తులతో నేనుబోను అని ఇంటో కూకుంటే అంతోటి ఈరుండు అయ్యేటోడా? అస్సలు అడవులు పట్టి బోకుంటే ఆ రామణుణ్ణి సంపేటోడా, అంతగొప్ప దేముడయ్యేటోడా? నువ్వుజెప్పు సామీ, తల్లి పొదుగు ఎచ్చగా ఉందని పిల్ల గుడ్డులోనే ఉంటే ఏమవుద్దీ? కుళ్ళిపోద్ది, అంతేగాదు?’

'నిజమే రాముడూ, చాలా చక్కగా చెప్పావు. నీలాంటి తోడు దొరకడం మన మల్లన్న అదృష్టం. అసలు నీలాంటి గురువు దొరికుంటే నాకు శ్రీపర్వతం పోయే పనితప్పేది',

'ఊరుకో సామీ, మీదీ ఎకసెక్కం. ఏదో నే సెప్పొచ్చిందేంటంటే ఒక సంవచ్చరం కళ్ళు మూసుకుంటే... నేర్సుకునేది నేర్సుకుని రాజధానికి పోడమే. అప్పొ పెద్దొరా ఆడకే వస్తుండ్రు కదా అని'.

'మరి నీ సంగతి ఏమిటి, రాముడూ?'

'నాదేముండె సాములూ. మా పెద్దొర ఏడుంటే ఆడనే నేనూ'.

'అంత నిశ్చయంగా చెపుతున్నావ్? మన భవిష్యత్తు మన చేతుల్లో లేదేమో? అయినా ఆ విషయం ఎందుకులే? మరి... నాకొక చిన్న సహాయం చేసిపెడతావా, రాముడూ? శ్రీపర్వతం వెళుతున్నావుగా, అందుకని'.

'తప్పకుండా సామీ నువ్వు సెప్పాలి... అంతే'

'అయితే, మల్లన్నా, నేనెలాగూ విందుకు ఉండటంలేదు. మీ రాముడిని నాతో ఇంటి వరకూ పంపిస్తే ఒక లేఖ ఇస్తాను. అది అతడు ఆచార్యులకు చేరిస్తే చాలు'.

'దానిదేముంది స్వామీ, నేనే స్వయంగా ఆచార్యులకు అందజేస్తాను' అంటున్న మల్లన్నతో, 'లేదు మల్లన్నా, అది రాముడే స్వయంగా ఆచార్యుల స్వహస్తాలకు అందించాలి. నీ ద్వారా కాదు'. అని రాముడి వంక తిరిగి, చూడు రాముడూ! మా పెద్ద గురువుగారు నీ శ్రీరాముడిలా దేవుడిలాంటి వారు. నేనిచ్చిన లేఖ వారికి తప్ప ఇంకెవ్వరికీ ఇవ్వకూడదు, సరేనా', అంటూ రాముడి తోడుగా వెలుపలికి దారితీసాడు, సోమదేవుడు.



వినోదానంతరం కమ్మని విందు. బౌద్ధధర్మాన్ని ఆచరించే అమాత్యుడు ముఖ్య అతిథి... భక్ష్య భోజ్య చోష్య లేహ్యాదులన్నీ సాత్వికమైన శాకాహారాలే. ముత్యాలవంటి మహాశాలి వరియన్నంతో పాటూ, జొన్నా గోధుమ రొట్టెలూ, ఆరు రకాల అట్లు, మంచిబెల్లపు పులుసులూ, పెసరపప్పూ... ఇక ఉడికించినవీ, వేయించినవీ, పొంగించినవీ అనేక రకాల శాకాలూ... కుడుములూ పోళీలూ అపూపాలూ, చక్కెర చిలకలూ, పాయసాలూ, పరవాన్నాలతో రాజోచితమైన విందు.

దశరథనందనులని మరిపించే నలుగురు అన్నదమ్ములూ తాంబూలాస్వాదనకై అంతఃసౌధంలోని వసంత వనంలోకి అడుగుపెట్టారు. అతిథి ధర్మదేవుని ఉన్నతాసనానికి అటూ ఇటూ కోమరయ్య, బసవయ్యలు, చిన్నవాడు మల్లన్న కొంచెం దూరంగా వదినెలతో ముచ్చట్లాడుతూ కూర్చున్నాడు. పెద్ద వదినె, వైదేహి నిజంగా సీతాసాధ్వే. పనివాళ్ళను పురమాయిస్తూ క్షణం తీరక ఉండదు.

'రేపేనా ప్రయాణం? ఇంతలో వారం గడిచిపోయింది. ఇంకొన్నాళ్ళు ఇక్కడే వుంచేద్దామంటే, మహారాణి ఆజ్ఞ- గడువులోగా చదువు పూర్తిచేసి శ్రీధాన్యం చేరాలట. తప్పదు', అని మెటికలు

## ఆంధ్ర మీల్స్

ఆంధ్రా స్టైలు భోజనం అంటే, నవరంధ్రాల లోంచీ ఆవిరి పుట్టించేలా కారంగా ఉంటాయని మనందరి అభిప్రాయం. కానీ కొన్ని శతాబ్దాల క్రిందటి వరకూ, మనకు మిరపకాయ అంటే తెలీదు. పోర్చుగీసు వాళ్ళ పుణ్యమా అని, మధ్య అమెరికానుండి మనకి సంక్రమించిన శాకాలు, మిరప, టమాటో వగైరా... అవి లేకుండా ఇప్పుడు మనకి ముద్ద దిగదు. ఆంధ్రుల 'ఆవకాయ' కూడా ఈ మధ్య సంక్రమించిందే అంటే ఆశ్చర్యపోక తప్పదు!

అంతకు ముందు మన వంటల్లో మిరియాల ఘాటు అక్కడక్కడా కనిపించినా, అమ్మ చేతి ముద్దలోని కమ్మదనం, తీయదనం పాలే ఎక్కువ. మధ్యయుగం నాటి వంటలకూ, శాతవాహనుల కాలానికీ పెద్ద తేడా ఉండక పోవచ్చు. శ్రీనాథుని వంటి, భోజన ప్రియులైన కవుల కావ్యాలలో మన భక్ష్య భోజ్యాల ప్రసక్తి అప్పుడప్పుడు కనిపిస్తుంది. కానీ అవన్నీ శాకాహారుల జిహ్వాలూరించే స్వచ్ఛమైన వెజిటేరియన్ వంటలు. అప్పుడప్పుడు శ్రీకృష్ణదేవరాయల వంటి మహాభోగులు మాంసాహారం గురించి చెప్పినా, అది చాలా తక్కువే.

కాశీఖండంలో, శ్రీనాథుడు ఇచ్చిన వంటల లిస్టులో సగానికి పైగా మనకి తెలియనే తెలియవు. ఉదాహరణగా కొన్నింటిని చూద్దాం. *అపూపం, ఇప్పట్టు, గొల్లెడ, అంగరపోళీ, సారసత్తు, బొంతరకుడుము, మడుగపూవు, మోరుండ, పెసరపులగం, చిరుగడం, బడిదెం, బులుపలు, పులివరకలు, చాపట్టు, చారులు, తియ్యగూరలూ, వచ్చడులు, గిజ్జ ణులు, అనుములు, మినుములు, బుడుకులు, నడుకులు, నిలిమిడి, చలిమిడి...* ఇలా సాగుతూనే ఉంటుంది.

విరుస్తూ, 'ఏదో నా తృప్తి కోసం కొన్ని అప్పాలూ, లడ్లూ, బెల్లపు సున్నులూ కట్టించాను. మకర సంకరానికి అరిసెలూ, మరికొన్ని... మీ చిన్నన్నతో చెప్పి పంపిస్తాను. సరేనా? రాముడికి తోడుగా ఇద్దరు పనివాళ్ళు వస్తారు. నీకేది కావలసినా వెంటనే వాళ్ళతో కబురుచేయి. అంచె గుర్రాలపై క్షణంలో నాకు తెలుస్తుంది'.

'ఇవన్నీ ఎందుకులే వదినా? అక్క కట్టిచ్చినవే సంవత్సరం తిన్నా మిగిలిపోతాయ్', అన్నాడు మూడవ వదినె కల్యాణి బలవంతంగాపెట్టే లడ్డూలు తినలేక గారాలు కుడుస్తున్న మల్లన్న.

'ఏమీ మిగలవు. ఆ శ్రీపర్వతాన వేలకొలదీ విద్యార్థులు. ఎంతయినా శాకాలూ మూలాలే కదా భోజనం. వాళ్ళతో పంచుకుంటే నెల తిరిగేలోగా అడుగు అంటిపోతాయి. మనకు ఉన్నదాన్ని పదిమందితో పంచుకుంటేనే కదా తృప్తి, ఏం నాయనా?'

'ఈ మధ్య పెద్దక్కగారికి బౌద్ధ శ్రమణులమీద జాలి ఎక్కువ అయిందిలే, మల్లన్నా' అంటూ చిన్న వదినె చెన్నసిరి, తొండమండలపు మహారథి కందవర్మ కడగొట్టు కూతురు. 'మొన్న బావగారికి తెలీకుండా ఓడయాంత్రశ్రేణికి వెయ్యి పణాలు తాను ముట్టజెపిందే కాక మాతో చెరియొక వెయ్యి ఇప్పించింది. నూటికి పండ్రెండు వడ్డీ. దానిని మూషికపు ఒడ్డున గల వర్షాకాలపు ఆరామానికి ఖర్చు చేయాలని ఒప్పందం'.

'సరేలే వదినా, ధనాగారంలో ఎందుకూ పనిరాకుండా గుడ్లు పెట్టడంకంటే, పరులకైనా ఉపయోగపడుతుంది'

'బాగా చెప్పావు, నాయనా. నీ చిన్న వదిన ఏమీ తక్కువ తినలేదులే, పోయిన సంవత్సరం, పల్లవకంలో కరువు వస్తే, ఇరవై ఏనుగులపై

సంభారాలు పంపింది. ఎంతయినా స్వంతగడ్డ పైన మమకారం ఎక్కువే'. అని తలతిప్పి ముంగిలి వైపు చూస్తూ, 'ఏమే నీ మొగుడేడీ? గజసేనాధ్యక్షుడికి ఈ సమయంలో ఏమి రాచకార్యాలో? నీవన్నా పంపించావేమిటి?' అన్నది ఆరాతీస్తూ.

'లేదక్కా...ఇందాకనగా ఎవరో వచ్చారు, ప్రతిష్ఠానం నుండేమో...అరిగో వెనుక వాకిలివద్ద...'

'ఊహ్...' దీర్ఘంగా ఆవంకే చూస్తూ, కనుబొమ్మలు ముడివేసి, 'పెద్దమరిది నిలుచున్న వైనం చూస్తే ఏదో సమస్య వచ్చినట్లుందే', అని పైకంటూ, అమాత్యునితో ఏదో గంభీరంగా చర్చిస్తున్న భర్తవైపు అడుగులేసింది.

భార్య రాకతో తలయెత్తి ఏమిటన్నట్లు చూస్తున్న కొమరయ్యతో, 'అటు చూడండి. మరిదిగారి వాలకం చూస్తే ఏదో సమస్య లాగా...' అని చిన్న మరిదితో, నీవన్నా వెళ్ళి చూడు బసవా', ఆందోళన ముఖంలో ప్రస్ఫుటంకాగా అమాత్యుని వైపూ తన భర్త వైపూ ప్రశ్నార్థకంగా చూసింది.

'అంత ఆందోళన చెందనవసరం లేదమ్మా. ఎప్పుడూ ఉండేదే. భరుఖచ్ఛంలో వృషభదత్తుడు పెద్ద నావసేనని సిద్ధం చేస్తున్నాడని వార్త', అని బదులు పలికాడు, అమాత్యుడు.

'ఊ.. నభవాహన క్షత్రపుడు అతనిని తన అల్లుడుగా చేసుకుంటున్నాడట! మన చక్రవర్తి ఇంకా చిన్నవాడు, దేశం స్త్రీస్వామ్యం అనే వారి చిన్నచూపు. వాళ్ళకి తెలియదు. మన గౌతమీ దేవి అపర దుర్గాదేవియని...' అంటున్న ఆమె భర్త మాటలు పూర్తికాకుండానే, అసలు వార్త అందించాడు అమాత్యుడు.

### స్త్రీ

ఆది మానవుల కాలంనుంచీ సమాజంలో స్త్రీల పాత్ర ఎప్పుడూ ప్రముఖమే అని సామాజిక శాస్త్రజ్ఞులు చెబుతారు. శాత వాహనుల కాలం నుంచీ, ఆర్థిక వనరులపైన పురుషుల గుత్తాధిపత్యం మొదలయింది. స్త్రీల పాత్ర ఇంటికే పరిమితమవసాగింది. మనుధర్మశాస్త్రం ఆ కాలంలోనే రచించ బడిందని చరిత్రకారుల అభిప్రాయం. మానవ ధర్మ శాస్త్రం గృహిణిని భర్తపైనే ఆధారపడమని నిర్దేశిస్తుంది. ఇక ఆర్థికంగా ఎటువంటి స్వాతంత్ర్యమూ లేని పెళ్ళికాని బాలికలూ, ముదుసలుల సంగతి సరేసరి. అమరావతిలో పతి చితిపైకి ఎక్కుతున్న ఒక వనిత శిల్పాన్ని చూడవచ్చు. అంటే, అప్పటికే సతీసహగమనంలాంటి దురాచారాలు మొదలైనాయని చెప్పవచ్చు.

ఐతే... స్త్రీలు వేయించిన శాసనాలు వేరే కథ చెప్తాయి. రాజుల ప్రశస్తులకే పరిమితమయిన నాగనికా, గౌతమీ బాలశ్రీ శాసనాలు ఒకపక్క అయితే, స్వతంత్రంగా తాము చేసిన దానాలూ, పెట్టుబడులూ వివరిస్తూ వేయించినవి పెక్కు ఉన్నాయి. బౌద్ధసంఘాలకి ధనిక స్త్రీలు ఇచ్చిన దానాల వివరాలు కోకొల్లలు. అవేగాక స్థానిక వర్తక సంస్థలలో, వివిధ పరిశ్రమలకు సంబంధించిన శ్రేణీ, నిగమాలలో స్త్రీల పెట్టుబడులు కూడా చాలానే కనిపిస్తాయి.

కానీ, అమరావతి శిల్పాలలోని స్త్రీలని చూస్తే మాత్రం వాళ్ళు పురుషులతో సమానంగా సామాజిక జీవనంలో పాలు పంచుకున్నారని అనిపిస్తోంది.

'సూర్పారక, కల్యాణి రేవుల రక్షణకి ఇప్పటికే సైన్యాలు కదిలాయి. మీ మరిదిగారి గజసైన్యాన్ని వైజయంతీపురంలో మహా స్కంధావారంలో నిలిపి మహారాజు ఆగమనానికి నిరీక్షించమని ఆదేశం వచ్చింది'.

‘ఇంతలో మళ్ళీ యుద్ధమా?’ అంటూ నిస్సత్తువగా పక్కనే కూలబడి, ‘మరి చక్రవర్తి వివాహమహోత్సవం?’ అన్నది వైదేహి.

‘దానికొచ్చిన ఆటంకమేమీలేదులే. నీవూ నీ తోడికోడళ్ళూ ఎప్పుడు అలంకరించుకుంటే అప్పుడే పెళ్ళట’ అని పెద్దగా నవ్వుతూ, ‘వచ్చే మాఘ పంచమికే ముహూర్తం. నీ మరిది అదేపనిలో ఉన్నాడు, పెళ్ళి కానుకలూ, మహారాజ కట్నాలూ సిద్ధం అయి ఏనుగులు కదిలితే, వాటి వెనుకే మన ప్రయాణం’ అన్నాడు కొమరయ్య.

‘మరీ ఇంత తొందరగానా?’ కంసాలులకూ, పట్టుసాలెలకూ పురమాయించ వలసిన పనులు గుర్తుచేసుకుంటూ.

‘తప్పదు. ఏంచేస్తాం? వివాహమైన వెంటనే చక్రవర్తుల వైజయంతి ప్రయాణం’

‘అయ్యో, కాళ్ళ పారాణియైనా ఆరకుండా యుద్ధయాత్రా?’



# 34

విప్పిన నల్లని కురులలా వంద పాయలుగా విడి, తన పేరును సార్థకం చేస్తు కొండల మధ్య కొలువుతీరింది, కృష్ణవేణి. చుట్టూ పచ్చని ప్రకృతి. చల్లని గాలితో రమణీయమైన ప్రదేశం. కొండల మధ్య, కెంపుల ప్రోవులా మహాచైత్యం. ఆ చైత్యపు నీడన నూరు నివర్తనాల మహా క్రీడాంగణం. సంఘ సమావేశాలకు అదే కూడలి. చుట్టూ యవన, చీనీ, పారశీక శైలులలో అనేక కట్టడాలు – గ్రంధాలయాలూ, ఉపన్యాసకూటాలూ, యవనికలూ, వాస్తు శిల్పాగారాలూ, వైద్యశాలలూ, యంత్రాగారాలూ, రసాయన ప్రయోగశాలలూ. వాటి చుట్టూ వసతి గృహాలూ, భోజనాల చావిళ్ళూ. నేలయీనినట్లు విద్యార్థి బృందాలు– కాషాయ వస్త్రధారులైన శ్రమణులూ, శ్వేతాంబరధారులైన బ్రాహ్మణులూ.

కొండపై ఏనుగు అంబారీ పైనుండి ఆ దృశ్యాన్ని చూస్తూ

'ఇదేదో కొత్తలోకం లాగుంది, చిన్దొరా' అని నోరెళ్ళబెట్టిన బోయరాముడు, 'ఇంత మందిలో ఆ పెద్దగురువును ఎలా పట్టేది?'

మల్లన్నదీ అదే ఆలోచన. తాను పెరిగిన వ్యాసపురికీ, ఈ శ్రీపర్వత క్షేత్రానికీ నక్కకీ నాగలోకానికీ ఉన్నంత సాపత్యం. అందుకేనేమో ఈ నాగార్జునాచార్యుని విద్యాలయాన్ని నాగలోకంతో పోలుస్తారు.

'నాదో సిన్న సందేగం సిన్దొరా' అని తనవంక ఇబ్బందిగా చూస్తున్న రాముడివంక ఏమిటో చెప్పు అని కళ్ళెగరేసాడు.

అంగీ మడతల్లో పదిలంచేసిన తాళపత్రాల్ని బయటకు తీసి, 'ఇది సూడు సిన్దొరా, ఆ చిన్న సాములోరు ఇచ్చిన తాటాకు పతరం'

'తప్పురా ఇంకొకరి లేఖలు మనం చదువకూడదు'

'ఎహె, అందులో సదికేందుకేముందీ? ఉత్త కాళీ తాటాకైతే!'

'ఆఆహ్?' అని ఆశ్చర్యపోతూ, 'ఏదీ ఇలా ఇవ్వు'.

రాముడు చెప్పినట్లు అవి ఉత్త తాళపత్రాలే. అక్షరం రాసిన ఆనవాళ్లు కూడా లేవు.

'రాముడూ ఇవేనా? నువ్వేమైనా పారవేసావా? చెప్పు' అని నిలదీసాడు.

'అమ్మో! సత్తె పెమాణికంగా అట్టాంటి పనిచేస్తానా సిన్దొరా?' అని తలపై చేయి పెట్టుకుని,

## నాగార్జుని కొండ

దీనినే శ్రీపర్వత విజయపురి అనేవారు. ఇది హైదరాబాదుకీ, గుంటూరుకీ మధ్య కృష్ణానది కుడి ఒడ్డున ఉంది. నాగార్జునసాగర్ నిర్మాణం వల్ల ఏర్పడిన జలాశయంలో మునిగిపోనున్న శిథిలాలనూ, అవశేషాలనూ, భారతీయ పురాతత్వ సర్వే, ప్రొ.రాయప్రోలు సుబ్రహ్మణ్యం ఆధ్వర్యంలో రికార్డు సమయంలో వెలికి తీసి పరిరక్షించింది. ఈ ఫలితమే, నాగార్జునకొండ మ్యూజియం. ప్రాచీన రాతియుగం నుండి క్రీశ. 3వ శతాబ్ది వరకూ గల అనేక పురాతన వస్తువులనూ, శిల్పాలనూ ఇక్కడ భద్రపరిచారు. అంతేకాక, ముంపుకు గురియైన ప్రదేశంనుండి కొన్ని ముఖ్యమైన కట్టడాలు తరలించి కొండపై పునర్నిర్మించారు.

ఇక్ష్వాకుల అనంతరం ఈ పట్టణం పూర్తిగా పతనమయింది. క్రీశ. పదునాల్గవ శతాబ్దంలో ఈ కొండపైన ఒక కోట నిర్మించబడింది. కళింగ గజపతులకీ, శ్రీకృష్ణదేవరాయలకీ మధ్య జరిగిన యుద్ధంలో ఈ గిరిదుర్గపు పాత్ర గురించి కొన్ని కథనాలు ఉన్నాయి. అయితే ఆచార్య నాగార్జునునికీ ఈ ప్రదేశానికీ సంబంధ మున్నట్లు పురాతత్వ ఆధారాలు లేవు. కానీ, నాగార్జునుని శ్రీపర్వతాచార్యుడనీ, అతని ఆశ్రమం శ్రీపర్వతారామం అని చైనా, టిబెట్ రికార్డులు చెబుతాయి. స్థానిక కథనాలు, మధ్యయుగంలో ఆ కొండకు నాగార్జునుని పేరుండటం వలన, ఈ కొండే నాగార్జునుని పర్వతం అని నిర్ధారించవచ్చు.

ఆకాలంలో ఆచార్య నాగార్జునుని శ్రీపర్వత క్షేత్రం ఎలావుండేదో తెలుసుకోవాలంటే, చైనా యాత్రికులు ఫాహియాన్, హ్యూయెన్ త్సాంగుల కథనాలే ఆధారం.

సందర్శన వేళలు
ఉ॥10.30గం నుండీ సా॥5.00 గం.
(శుక్రవారం శెలవు)

'సామి ఇయ్యంగనే జిలుగుబట్టలో సుట్టి మొలలో దోపినా. ఒక్క చణంకూడా నా కళ్ళనుంచి దూరంగాలే'.

'సరే నా మాటవిను. ఎక్కడా ఈ విషయం గురించి నోరెత్తవద్దు. ఆచార్యుని వద్ద ఆ ప్రస్తావనే తేవద్దు. ఇవిగో, ఇవి నీ దగ్గరే జాగ్రత్తగా ఉంచు' అని తాళపత్రాలు రాముడి చేతికిచ్చి, 'పద. మనమిక నడిచే వెళ్ళాలి. నగరంలో బండ్లూ వాహనాలూ నిషేధం' అని ముందుకు దారి తీసాడు.

వరుసలో నిలిపిన నిలువెత్తు శిలా స్తంభాల వెనుక అరటిబోదులూ, చేమంతిపూవులతో అలంకరించిన స్వస్తి తోరణం. పనివాళ్ళను బయటే ఆగమని, రాముడు మాత్రం తోడుగా, లోనికి అడుగు మోపిన తక్షణం, 'ఆచార్యులు మీరు వచ్చినవెంటనే వారి వద్దకు తోడ్కొని రమ్మన్నారు, మీరు వ్యాసపురి నుండి వచ్చిన శిల్పులేకదా?'

అంటూ ఎదురువచ్చిన భిక్షువుకు శిరస్సొంచి నమస్కరిస్తూ, 'ఆశ్చర్యంగా ఉంది స్వామీ, మా రాక విషయం ఆచార్యులకు ఎలా తెలిసింది? ముందుగా కబురేమీ పంపలేదే!'

ఆ ప్రశ్నకు అతను నర్మగర్భమైన చిరునవ్వు నవ్వుతూ, 'ఆచార్యులకు సకలమూ విదితమే. ఆ మహానుభావుడు మిమ్మల్ని శిష్యునిగా స్వీకరించారు. అతి కొద్దిమందికి దక్కే అదృష్టం! అన్నీ మీకే అవగతం అవుతాయి. పదండి... ఆచార్యులు ఉపన్యాసమందిరంలో ఉన్నారు. మహాచీనం నుండి వచ్చిన 'హాన్' ప్రభువు దూతలట! అయినా పరవాలేదు మీరు వచ్చిన వెంటనే లోనికి తీసుకురమ్మన్నారు.'

మనస్సు తేలికై ఒకసారి రొమ్మునిండా ఊపిరి పీల్చుకొని, 'ఇంత పెద్ద నగరంలో ఆచార్యుని కలిసేందుకు దిక్కుతోచకున్న మాకు ఆపద్బాంధవుల్లా కలిసారు, కృతజ్ఞులం' అని మరల నమస్కరించి, 'స్వామీ, తప్పనుకోకపోతే, తమ పరిచయం?'

'ఆహ్! చెప్పడం మరిచాను. నా పేరు అనంత గుప్తుడు. వాస్తుశిల్పిని. ఈ పరిషత్తులో శిల్పశాస్త్రంలో పరిశోధనలు చేస్తున్నాను. మీరు మలచిన బుద్ధవిగ్రహం గురించి ఆచార్యులు సెలవిచ్చారు. అమోఘం. తమకు స్ఫూర్తి బుద్ధదేవుని కృపవల్లనే లభించిందని ఆచార్యుల అభిప్రాయం. మీ ఈ శిక్షణాకాలంలో నేను మీ సహాధ్యాయిని'.

'ఆహా, మహాభాగ్యం స్వామీ.'

'దేనికి మల్లన్న శ్రేష్ఠీ? తథాగతుని కటాక్షం అందుకున్న తమతో కలిసి శిక్ష గ్రహించటం నాది కదా భాగ్యం?'

✦ ✦ ✦

తెల్లని పాలరాయితో తాపడంచేసిన ఐదంతస్తుల మహాసౌధం, మధ్యాహ్నపు ఎండలో సానబెట్టిన వజ్రంలా కళ్ళు మిరుమిట్లు కొల్పుతోంది. దాని శిఖరంపై ఆచార్యుని మందిరం, పదహారు అడుగుల ఎత్తు స్తంభాలపై, అష్టభుజాకారంలో నిర్మించబడిన విశాలమైన చావిడి.

మనసుకి ఆహ్లాదం కలిగించే సువాసనలతో మృదు మందంగా వీచే గాలి. అన్ని మెట్లెక్కి వచ్చినా ఎటువంటి అలసటా తెలియలేదు. వర్తులాకారంలో నేలపై కాలి మడిమలపై కూర్చొని ఉన్న శిష్యులు, ఎక్కువ మంది విదేశీయులేమో, రకరకాల మేనిచ్ఛాయలు! ముందువరుసలో పదిమంది, నెమలివన్నె పట్టు దుస్తులూ, తలపై అదే పట్టుతో చేసిన త్రికోణాకారపు మకుటాలతో, చీనీయులేమో!

**ఆచార్య నాగార్జునుడు**

బహుముఖ ప్రజ్ఞ అనే పదానికి భారతీయ చరిత్రలో ఏకైక తార్కాణం, ఆచార్య నాగార్జునుడు.

నాగార్జునుని గురించి పూర్తిగా చెప్పాలంటే ఒక ఉద్గ్రంథమే అవుతుంది. క్లుప్తంగా చెప్పాలంటే, అతడు వైద్య, రసాయన, ఖనిజ, ఖగోళ, వృక్ష శాస్త్రజ్ఞుడే కాక మహాయాన బౌద్ధాన్ని సిద్ధాంతీకరించిన తర్కవేత్త. అరిస్టాటిల్ వంటి తత్వవేత్తలకి కూడా అతడి గంటం నుండి వెలువడిన అపారమైన రచనాపరంపర ముందు తలవొగ్గక తప్పదు.

అతడు నిర్ద్వంద్వంగా ఆంధ్రుడు. ప్రస్తుత జగ్గయ్యపేట పరిసరాల్లో కృష్ణా తీరంలోని వేదలి అనే గ్రామంలో పుట్టి, శ్రీపర్వతారామంలో తన విద్యావ్యాసంగాలు కొనసాగించాడు.

భారత వైద్యశాస్త్ర వాఙ్మయంలో అతడి ప్రశంసతో ప్రారంభించని గ్రంథంలేదు. సుశ్రుతుని శస్త్రవైద్య సంహితను సంకలనం చేసింది అతడే. ఆరోగ్యమంజరి అతడు రచించిన వైద్య గ్రంథాలలో ఒకటి. నేత్ర వ్యాధులకి అతడు నిర్దేశించిన చికిత్స చైనాలోనూ ఎంతో ప్రసిద్ధి కాంచింది. పాదరసం, సువర్ణం మొదలైన ఖనిజాల రహస్యాలు విశదీకరించే రసరత్నాకరం భారతీయ రసాయనశాస్త్రానికే ఆదిగ్రంథం. అతడి మానవాతీత శక్తులపై అనేక కథనాలు ప్రపంచపు నలుమూలలా వ్యాపించాయి. ప్రకృతిధర్మాలు ఔపాసన పట్టిన సిద్ధపురుషుడు.

ఇక బౌద్ధ మహాయానానికి అతడే మూల పురుషుడు. తర్కంలో, తత్వశాస్త్రంలో అతడి ప్రజ్ఞ అనితరసాధ్యం. అతడి మాధ్యమిక తత్వం, బౌద్ధ మతానికే కాక, ఆదిశంకరుని అద్వైతానికి కూడా ప్రామాణికం అయింది.

వారి మధ్య పాలరాతి అరుగుపై...

అద్భుతం!

అర్థనిమీలిత నేత్రాలతో, పద్మాసనంలో సన్నగాలికి రెపరెపలాడే కాషాయ వస్త్రాలతో... గాలిలో తేలుతూ, భూమికి నాలుగడుగుల ఎత్తున ఆచార్యదేవుడు... ధ్యాన సమాధిలోనున్న ఆచార్యుని ముఖంలో చలనంలేదు.

'వచ్చావా నాయనా? నీ కొరకే నిరీక్షిస్తున్నాను. అక్కడ ఆగు' పెదిమలు కదలకపోయినా మాట స్వచ్ఛంగా వినిపించింది.

మరుక్షణం...

కనులుమూసి తెరిచేంతలో మందిర మధ్యంలో అదృశ్యమై వారిముందు ప్రత్యక్షమైన ఆచార్యుని ముందు సాష్టాంగపడ్డాడు, మల్లన్న. రాముడు మాత్రం దిగ్భ్రమతో చేష్టలుడిగి అలాగే నిలబడిపోయాడు.

'దీర్ఘాయుష్మాన్ భవ' అని మల్లన్నను దీవించి, 'అనంతా, మల్లన్నను తీసుకువెళ్ళి, అతని స్థానం చూపించు. ఈలోగా ఈ రామునితో నాకు అత్యవసరమైన కార్యమొకటి ఉన్నది' అని రాముడితో,

'ఏమయ్యా నమ్మకంగా వేరొకరి కొరకని ఇచ్చిన పత్రాన్ని చదవడం తప్పుగాదూ? పద నీతో పని ఉంది' అని ముంజేతిపై తన చేతిని బిగించి, క్షణంలో ఎగిరి అరుగుపై తన పక్కనే కూర్చుండ చేసాడు.

దిగ్భ్రాంతినుండి తేరుకొని పరిసరాల్ని గ్రహించినంతనే, ఒక్క గంతులో అరుగుపైనుండి దూకి, ఆచార్యుని కాళ్ళపైబడి, మానవాతీతమైన భయం మనసును ముంచేయగా, 'సామీ... నన్నొగ్గు. తెలవక సేసా, తప్పు కాయి' ఆచార్యుని పాదాలను బిగిసి పట్టి గడగడ వణుక సాగాడు.

'లే' అని తలపై చేయుంచి, 'ఇకనైనా నా శిష్యుడు నాకిచ్చిన వర్తమానం ఏమిటో చెప్పు, చదివావుగా' అని చిరునవ్వుతో ప్రశ్నించాడు నాగార్జునుడు. శిష్యబృందం తమ ఎదుట ఆచార్యుడు ఆవిష్కరిస్తున్న వినోదంలోని గూఢ సత్యం ఏమిటా అని ఉత్కంఠతో ఎదురు చూడసాగారు.

జన్మతః వచ్చిన నైజమో, ఆచార్యుని స్పర్శ మహత్యమో, రాముని భయం క్షణంలో తీరింది. కళ్ళలో తొంగిచూసే తనదైన కొంటెదనంతో, 'సామీ ఇన్ని ఎరిగిన మీకు ఎరుక లేదా? బొడ్డు కోస్తే అచ్చరంలేని నేనెట్టా సదివేది?' అని అతివినయంగా తలవంచి ఎదురు ప్రశ్న వేసాడు.

'అబద్ధం! ఏవీ ఆ పత్రాలు? నీవు చదవగలవో లేదో చూస్తాను' అన్న ఆచార్యునకు తన అంగీలోని తాళపత్రాలను తీసి రెండుచేతులతో అందించబోయాడు.

'ఊహూ, తెరిచి నీవే చదువు'

పత్రాలనుంచిన పట్టువస్త్రాన్ని విప్పి వానివంక, ఏదో వెదుకుతున్నట్లు తదేకంగా చూసి, తలవిదిలించి, 'వీటిల్లో ఏమీ లేదు సామీ' అన్నాడు.

'అలాగా? సరే. ఆ పత్రాలను అనంతునకు ఇవ్వు', అని అనంతగుప్తుని వంక చూసి, 'అనంతా, నీవు చదివి వానిలో ఏముందో చెప్పు' అన్నాడు.

అనంతుడు ఆ పత్రాలను అందుకుని పరీక్షించి, 'వీటిలో ఏమీ లేదు స్వామీ' అని, పత్రాలను ఆచార్యుని చేతబెట్టాడు.

అంతటితో ఆచార్యుడు చిరునవ్వుతో శిష్యులందరిపైనా ఒకసారి దృష్టి సారించి, 'చూసారా... పరిషత్తులో పదునాలుగేండ్ల విద్యని అభ్యసించి సంస్కృత ప్రాకృతాలే గాక దేశీయమైన తెలుగు భాషను కూడా చదువగల అనంతగుప్తుడూ... పామరుడును, నాకు చదవటమే రాదు అనే ఈ రాముడూ... ఈ ప్రతాలను చూసి చెప్పిన తాత్పర్యం ఒకటే!' అని రాముడితో 'ఇప్పుడు చెప్పు రాముడూ, ఈ చదువుకున్న వారు గొప్పా? నీవు తక్కువా?'

'అట్టంటే ఎట్టా? ఏదైనా అచ్చురాళ్ళు ఉణ్టేగాదా ఆ చిన్నసామి సదవ గలిగేదీ? ఇదేం నాయం?' అన్న రామునితో,

'వీనిపై ఏ అక్షరాలూ లేవనేగా నీ అభిప్రాయం?' అని ఆ పత్రాలను అందరికీ కనిపించేలా చూపుతూ, 'సరే రాముడూ, ఆ మూలనున్న దీపాన్ని తీసుకురా' అనిన వెంటనే, ఎరుపు నలుపుల గళ్ళ పింగాణి ప్రమిదలోని జ్యోతిని తెచ్చి ఆచార్యుని ముందు పెట్టాడు.

ఆచార్యుడు తనచేతిలోని ఒక పత్రాన్ని ఆ దీపంపై సెగతగిలేట్లు మెల్లగా కదిలిస్తూ, 'ఇప్పుడు చూడండి' అని పత్రాన్ని శిష్యులకు చూపాడు. దీపపు వేడి తగిలిన వెంటనే ఆ పత్రంపై ప్రత్యక్షమైన అక్షరాలు చూసి ఆశ్చర్యపడుతున్న శిష్యులతో...

'ఇది ఒక ఉదాహరణ మాత్రమే... ఈ పత్రాలలో మనకు కావలసిన విషయం నిక్షిప్తమై ఉంది. తెలుసుకోనంత వరకూ, అది శూన్యమే! పండితుడికైనా, పామరుడికైనా... ఈ దీపం మనయందున్న జ్ఞానజ్యోతి. దాని స్పర్శచే మాత్రమే శూన్యం నుండి జ్ఞానం ఉద్భవిస్తుంది. అంటే జ్ఞానానికి జ్ఞానమే బీజం. ఆ బీజం నుండి పుట్టేది జ్ఞానమనే వృక్షం. వీనిలో ఏది ముందు? ఏది వెనుక... సమస్త ప్రాపంచిక జ్ఞానమూ ఒక చక్రం వంటిది... ఇదే ప్రతీత్యసముత్పాదం'

'కానీ ఆచార్యా?' అంటూ అనంతగుప్తుడు వినమ్రంగా నమస్కరించి ఆచార్యుని అనుజ్ఞ తీసుకోని, 'మనుష్య జన్మకు ధ్యేయం సంయక్సంబోధిత్వం కదా? పరిపూర్ణమైన జ్ఞానం అనగా ప్రజ్ఞాపారమితం సాధించినప్పుడే కదా ఆ నిర్వాణం సాధ్యం? ఒకసారి నిర్వాణమందిన పిమ్మట దానిని ఇతరులతో పంచుకోవటం సాధ్యం కాదు. అంటే, ఎంతటి అర్హతునకైనా వేరొక పరిపూర్ణ వ్యక్తినుండి పారమితత్వం గ్రహించుట అసాధ్యం! అంటే తథాగతుని వంటి మహాపురుషులకు తప్ప సామాన్యులకు నిర్వాణం అసాధ్యం... దీని అర్థం, ఎంతో దీక్షా పట్టుదలా ఉన్నవారికి మాత్రమే, బౌద్ధధర్మాన్ని ఆచరించడంవల్ల ప్రయోజనమా? అందుకే, జ్ఞాన, భక్తి, కర్మయోగాలలో ఏవొక్కదానితోనైనా మోక్షం అందవచ్చనే బ్రాహ్మణ వాదానికి పామర జానపదులలో అంత ఆకర్షణ!' అని తన సందేహాన్ని వ్యక్తం చేసాడు.

ఆ వాదనను శ్రద్ధగా వింటున్న బోయరాముడు, 'అయ్యయ్యో, అదెట్టా సామీ? ఎప్పుడో సత్తెకాలంలో రాజ్జంసేసిన రాములోరిని కొలిస్తే సాలు సొర్గానికి పోతావని గాదా, మా బాపన సామి జెప్పేది. మీ లెక్కనైతే మాబోటోల్లకు గతేంది? అద్సరే... తాతల కాలంలో మొగుడు నింద యేస్తే గదా మా మైసమ్మతల్లి సెరువుకట్లో దూకి సచ్చి యీదినాన అమ్మోరయ్యింది? మావూళ్ళో జొరమొచ్చినా, రోగవొచ్చినా ఆయమ్మే గదా తీరస్తాందీ?' అతని మాటలలోని ఆశ్రుత ఆచార్యునకు తప్ప అందరికీ నవ్వుతెప్పించింది.

కానీ ఆచార్యుడు మాత్రం, 'అతడు అన్నదానిలోని హాస్యాస్పదం ఏమీ లేదు. అశేషమైన పామర జనంలో ఉన్న ఈ నమ్మకంలో ఎంత నిజం, ఎంత అబద్ధం అన్నది తర్కించి లాభంలేదు. తథాగతుని బోధనలలోనూ త్రిపిటకాలలోనూ ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరం లేదు. ఈ జానపదులు బౌద్ధంవైపు మొగ్గుచూపాలంటే, మనం ఈ ప్రశ్నకు తగిన ప్రత్యుత్తరం ఇవ్వడం అత్యవసరం. తథాగతుడే మనకు దారిచూపాలి' అన్న మందలింపుకు, తలదించుకున్న శిష్యులను చూడక, కన్నులు మూసుకొని ఏదో ఆలోచించినవాడై, బుద్ధదేవుని తగిన ఉపదేశము కొరకు అర్థిస్తూ ఉండిపోయాడు.

చివరకు ఒక నిర్ణయానికి వచ్చి తలవూపి, 'రాముడూ, నీ ఆందోళన నాకు అవగతం అయింది. నేను చెప్పేది జాగ్రత్తగా విను... ఈ దీపాన్ని చూడు. ఈ జ్యోతి ఉన్నంత వరకే ఇది వెలుగునిస్తుంది. నిర్వాణం అంటే ఇది కొండెక్కడం... ఆరిపోయిన దానినుండి శక్తిని గ్రహించగలవా?' అన్న ఆచార్యుని మాటకు ఒక నిమిషం ఆలోచించి,

రాముడు తన ఎదురుగా ఉన్న దీపాన్ని చేతిలోకి తీసుకొని, ఏమో తలవూపుతూ తనలోతాను నవ్వుకొని, 'ఊఫ్ ఫ్' అని ఊది దీపాన్ని ఆర్పి, 'ఈ వత్తి కూసింత పట్టుకో, సిన్నసామీ' అని పక్కనే ఉన్న అనంతునితో అన్నాడు. వేరే ఆలోచించక అనంతుడు ఆపని చేసి, 'సుష్ ష్' అని కాలిన వేళ్ళను నోటబెట్టుకున్నాడు.

'చూసావా సామీ? ఆరిపోయినాకే గదా ఈ చిన్నసాములోరి సేయి గాలిన్ది? సాయం సేయాలనే ఆలోసెనే ఉండాలెగానీ, మనిసి పోయినాక కూడా సేయొచ్చు'

నిర్ఘాంతపోయిన ఆచార్యుడు కాసేపటికి కుదుటబడి లేచి, కళ్ళనీళ్ళు బొటబొట రాలగా, 'అగమ్యగోచరుడైన నన్ను కరుణించి, బోధిసత్త్వ ధర్మానికి సరియైన అర్థం నాకు స్ఫురింపచేయడానికి ఈ బోయవాని రూపంలో వచ్చావా దేవా?' అని ఎదుటనున్న రాముడిని తన్మయత్వంతో కౌగిలించాడు ఆచార్యదేవుడు.



# 35

'ఈ దినంతో నీ శిక్షణ పూర్తి అయింది, మల్లన్నా. ఇక నీకు ఆ బుద్ధదేవుడు ఇచ్చిన స్ఫూర్తికి నీ ప్రజ్ఞను జోడించి చేబట్టిన కార్యం ఎంత కఠినమైనా సఫలీకృతుడవు కాగలవు' అన్న ఆచార్యుని మాటలు వ్యర్థం కాలేదు. ఆనాడు తాను పూర్తిచేసిన పద్దెనిమిది అడుగుల సువర్ణ బుద్ధవిగ్రహం, వ్యాసపురిలో తాను మలచిన బుద్ధునికి ప్రతిరూపమే అయినా, అది శ్రీపర్వతంలో తాను ఆచార్యుని నుండి గ్రహించిన మతసంబంధమూ, ధాతు, రసాయన శాస్త్ర జ్ఞానానికీ; అనంతగుప్తాచార్యుని వద్ద నేర్చిన శిల్పశాస్త్రంలోని మెలకువలకూ, తార్కాణం.

ధాన్యకటకంలో తానుగడిపిన ఈ ఐదేళ్ళలో అటువంటి శిల్పాలెన్నో! అమరారామ మహాచైత్యానికి మహారాణి వాశిష్ఠీదేవి ఆజ్ఞ మేరకు పాలరాతి ఫలకాలతో తాపడం చేయడమేగాక, ఒక్కొక్క పలకపై శ్రీపర్వతాన తాను నేర్చిన బుద్ధచరిత్రలోని ఒక్కొక్క ఘట్టాన్నీ పొందుపర్చి, చైత్యపు ప్రదక్షిణపథాన్ని, ఆ మహాగ్రంథానికి సమానంగా తీర్చిదిద్దాడు.

'ఆచార్యులను చూసి ఐదేళ్ళయింది. మహాచైత్యానికి చేసిన మార్పులు వారు హర్షిస్తారో లేదో?'

'ఎందుకు మామయ్యా నీకా శంక? మహారాణికి ఎంతో నచ్చింది. మీ గురువులు అనంతగుప్తులు కూడా మెచ్చారు' అని ధైర్యం చెప్తూ, వెనుక నడుముపై చేతులాన్చుకుని పక్కనే నిలిచింది అతని అర్థాంగి, భ్రమరాంబ, గర్భిణి, ఇద్దరు పుత్రుల తరువాత అది మూడవ కాన్పు. పెద్దవాడు నాగసేనుడు మూడేండ్ల వాడు. చిన్నవాడు అనంతుడు ఇంకా చంటిబిడ్డ. ఇంతలోనే మళ్ళీ...

'ఈసారైనా నీలాంటి ఆడపిల్లని ఇయ్యవే. పెళ్ళాం కావాలని నీ చిన్న తమ్ముడు గోలపెడుతున్నాడు'

'వచ్చే పుష్యమాసానికి కదా? ఇంకా ఐదు నెలలుంది'.

'అవునే, ఈలోగా చైత్య నిర్మాణపు పని పూర్తిచేయాలి. తిష్యపౌర్ణిమ దాకానే గడువు. ఆచార్యుల సముఖంలోనే నూతన ప్రదక్షిణపథాన్ని తెరవాలని చక్రవర్తి కోరిక. నిన్ననే వార్త వచ్చింది... ఆహ్, ఆ వచ్చినవాడు చిన్నన్న మనిషి... చిన్నన్న ఒంటిచేత్తో నభవాహనుని ఆధీనంలో ఉన్న కనుమను పట్టాడట! మన సేనలు ఇప్పుడు కల్యాణిపురాన్ని ముట్టడించాయట... అయితే, నౌకాబలం లేనిదే క్షహరాట్టద్వీపాన్ని జయించడం కష్టమట. అది వారి చేతిలో ఉన్నంతవరకూ కల్యాణిరేవు మన స్వాధీనమైనా ఉపయోగం లేదన్నాడు'.

'మామయ్యా, మీ ఆచార్యదేవుని ధ్యేయం తప్పక సాకారమౌతుంది. మన శాతవాహన రథాశ్వాలు, పూర్వ, పశ్చిమ, దక్షిణ సముద్రాలలో దాహం తీర్చుకోగలవు. ఆ బుద్ధదేవుని నమ్మినవారికి బోధిసత్వులు ఎలా నిర్వాణానికి దారిచూపిస్తారో, అదే విధంగా, అపర బోధిసత్వుడు ఆచార్యులే వేలుబట్టి నడిపిస్తున్న ఈ శాతవాహన ప్రభువుకు ఎదురులేదు'.

'అరే విశ్వనాథశ్రేష్ఠి కూతురివైయుండి బోధిసత్వతత్వం వల్లెవేస్తున్నావే?' అంటూ పొదివిపట్టి దగ్గరకు తీసుకున్నాడు.



# 36

నభవాహనకటకం... నాలుగువేల అడుగుల ఎత్తున సహ్యాద్రి పర్వతాలలో సన్నని కనుమ దారి. ప్రతిష్ఠానం నుండి కల్యాణపురి రేవుకి వెళ్ళే రహదారికి ఇరువైపులా వందల అడుగుల ఎత్తైన పర్వతసానువులు. మధ్యలో బండి వెనుక బండి కట్టి తాళ్ళతో వెనక్కి లాగుతూ లోయలోకి దిగవలసిందే కానీ, ఏమాత్రం అప్రమత్తత వీడినా అపాయమే. ఇక తీరం నుండి పైకి వచ్చే బండ్లయితే, ఏనుగులతో లాగవలసిందే. అంత కష్టసాధ్యమైనా వేరే దారి లేదు.

నహపనకటకంలో శిస్తు వసూలుకు పది మంది శుల్కాధికారులు. రక్షణకు ఎల్లప్పుడూ ఇద్దరు దళపతులతో వందమంది కావలివాళ్ళ దళం. వీరుగాక బరువులు లాగేందుకు సుశిక్షితమైన ఏనుగులూ వాటిని కాచే మావటీలు. ఇక తిరగబడ్డ బండ్లూ, విరిగిన చక్రాలనూ బాగుచేసేందుకు వడ్రంగులూ కమ్మరులూ; పల్లకీలు మోసే బోయీలు, ఇతర పనివాళ్ళతో ఎప్పుడూ హడావుడిగా ఉండే చిన్న ఊరు.

పదివేల కాల్బలమూ, ఒక అశ్వికదళంతో వృషభదత్త మహారాజు కటకానికి ఆవలివైపు విడిది చేసాడు. వారిని దాటి తీరసీమలను చేరడం అసాధ్యం. లక్షకు పైగా కాల్బలమూ, ఉక్కు కవచాలతో వెయ్యి ఏనుగుల గజదళం ఉన్నా ఆ సన్నని మార్గంలో, బండరాళ్ళూ, అగ్ని యంత్రాలతో కటకాన్ని రక్షించే అతిస్వల్పమైన సైన్యాన్నయినా ఎదుర్కొనడం కష్టం. కటకం వృషభదత్తుని ఆధీనంలో ఉన్నంత వరకూ దాడిచేయడం ఆత్మహత్యా సదృశమే.

**నాణెఘాట్**

పూణె జిల్లాలో, పశ్చిమకనుమల్లో ఉన్న చిన్న పర్యాటక స్థలం.

ఒకప్పుడు, బొంబాయి వద్దగల శూర్పారక (నల్ సోపార), కల్యాణి రేవులని, డెక్కన్ పీఠభూమిపై నున్న దక్షిణదేశపు రాజధానులతో కలిపే ముఖ్య రహదారిపై ఉన్న చిన్న పట్టణం. శాతవాహనుల కాలంలోనే అది ఎంతో ప్రాముఖ్యం ఉన్న పర్వత కటకం.

శ్రీముఖ శాతవాహనుని కోడలు, మొదటి శ్రీ శాతకర్ణి రాణి, నాగనిక వేయించిన శిలాశాసనం అది నిరూపిస్తుంది.

'నాణె' అంటే నాణాలనీ, 'ఘాట్' అంటే కటకం (Mountain Pass) అనీ చరిత్రకారుల అభిప్రాయం. నాణాలు వసూలుచేసే Toll Gate కనుక ఆ పేరు వచ్చిందట. అయితే... ఆ చోట గుహలు తొలిపించి, వర్తకులకూ, యాత్రికులకూ సౌకర్యాలు కలుగచేసిన నాగనిక పేర 'నాగనికా కటకం' అనివుండవచ్చు కదా? అలాగే, గ్రీకు గ్రంథాల ప్రకారం ఆ ప్రాంతాన్ని పాలించిన 'నాంబెనస్' (నహపన) వలన నహపన కటకం అని కూడా ఉండవచ్చు కదా? ఏమో!

ఊరి మధ్యలో వర్తకుల వసతికొరకు పూర్వ శాతవాహన చక్రవర్తి శ్రీ శాతకర్ణిదేవునిచే కట్టించబడిన విశాలమైన సత్రం...

నాలుగు బండ్లు ఒక్కొక్కటిగా తాళ్ళతో కట్టి మెల్లగా దిగాయి.

తొండమండలపు మట్టిబొమ్మల శ్రేణి నుండి పరిచయపత్రాన్ని శుల్కాధికారికి సమర్పిస్తూ, 'సామీ, మా పెద్దశెట్టి ఇంకా ఇరవై బండ్లతో వెనుకగా వస్తున్నారు. వారు వచ్చేవరకూ, మాకు ఇక్కడే వసతి ఏర్పాట్లు ఏమైనా...?' కుచ్చు తలపాగ, గళ్ళ అంగీ, పైకి ఎగకట్టిన అడ్డపంచెతో సింగన్నదొర.

'బండికి ఇరవై పణాలు మార్గ రుసుం. ఇక బొమ్మకు పదికాసుల చొప్పున బండికి ఐదు పణాలూ, ఏనుగు సుంకం బండికి రెండు పణాలూ, రాత్రి జాగుకు ఒకటి. ఇక రెండు పణాలు మీకూ బండ్లవాళ్ళకూ విడిది, పడకా భోజనాలూ, పశువుల కొట్టానికీ, మేతకూ. అంటే అంతా కలిపి బండికి ముప్పై! పణాలు', అని లెక్క వివరించిన శుల్కాధికారి, 'ఈ నాలుగు బండ్లకేనా లేక వచ్చేవాటికి కూడా ఇప్పుడే చెల్లిస్తారా?' అని ప్రశ్నించాడు.

'బండికి ముప్పై పణాలా! ఇదెక్కడి న్యాయం దొరా? ఏదో బొమ్మల వ్యాపారం చేసుకునే వాళ్ళం. విలువకి రెండింతలు సుంకం అంటే మా వ్యాపారం సాగేదెట్లా దొరా?' అని శుల్కాధికారి కాళ్ళవేళ్ళాపడుతూ తన మారువేషానికి పూర్తిగా న్యాయం చేయసాగాడు సింగన్న.

'తక్కువ శుల్కం కట్టాలంటే భరుఖచ్ఛం పోయుండాల్సింది. ఇది క్షహారాట్ట ప్రభువుల నియమం' అన్నాడు కఠినంగా.

'అయ్యా, ఆ విషయం తెలీకేగదా ఇటు వచ్చాం. దయచేసి తమరే ఏదన్నా ఉపాయం సెలవీయండి. ధర్మప్రభువులు, మా పొట్టలు కొట్టకండి దొరా', అని ప్రాధేయపడ్డ సింగన్నను చూసి కాస్త మెత్తబడి,

'సరేనయ్యా శెట్టీ, నీ కష్టం చూస్తుంటే ఎందుకో జాలి కలుగుతుంది. ఏదైనా తగ్గిద్దామంటే, మహారాజు వృషభదత్తుని సైన్యాలు కొండ కిందే విడిచి ఉన్నాయి. అందునా అతడు నహపన క్షత్రపునికి స్వయానా అల్లుడు. మీరెవరైనా నోరుజారారంటే నా తల తెగుతుంది'.

'మహాప్రభువులు. మీరు కాస్త దయచూస్తే చాలు, మిగిలిన దానికి పూచికత్తు నాది. ఏంచేయాలో చెప్పండి స్వామీ', అని బొడ్డులోనుండి రెండు బంగారు నాణాలు అతని చేతబెట్టాడు.

అవి గ్రహించి అటూఇటూ ఒకసారి పరికించి ముందుకి వంగి రహస్యంగా, 'జాగ్రత్తగా విను శెట్టీ, ఉదయం రెండవ జాముకి దళాలు మారే సమయం. బండ్లలో ఉన్నవి ఉత్త కుండలని చెబుతాను. బండికి ఐదు పణాలు శిస్తు కడితేచాలు. కానీ...' అని తనలో తాను గుణించుకుని, 'పైన కావలి వాళ్ళకు కొంత సర్దాల్సి ఉంటుంది. ఇక నాతోబాటూ, అధికారులు పదిమంది– ఒక్కొక్కరికి పది పణాలనుకో. రక్షక దళపతికి కూడా ఏదో కొంచెం ముట్టజెబుతాను, దళాలు మారేటప్పుడు కాస్త జాప్యం జరిగితే బండ్లన్నీ దిగేందుకు అనుకూలంగా ఉంటుంది. ఇక నా విషయం నువ్వే ఆలోచించి నిర్ణయించుకో'

'మహాప్రభో, రెండు వందలయితే ఇచ్చుకోగలను. ఎవరికేమి ఇవ్వాలో అంతా తమ ఇష్టం. ఏదో విధంగా మీరే దారిచూపాలి' అంటూ చేతులెత్తి నమస్కరించాడు.

'ఇదిగో శెట్టీ, నాకు బేరాలు నచ్చవు. ఏదో జాలి తలచి సాయం చేయబోతే నాకే ముప్పు తెచ్చేట్లున్నావు. నువ్వే ఆలోచించు... ఇక్కడనుండి తగరపురి మీదుగా భరుఖచ్ఛం చేరాలంటే ఇంకో రెండు నెలలూ, ముప్పై యోజనాల దూరం. నీ మంచికే చెబుతున్నాను. ఆఖరి మాటగా మూడువందలు...

'ఇంతమంది కళ్ళుమూయాలంటే కొంత వ్యయం తప్పదు'.



పాతిక ఎడ్లబండ్లు. బండికి నలుగురు బల్లేలు ధరించిన కావలి భటులు. తోలు పట్ట కింద సశస్త్రులైన మరో ఐదుగురు యోధులు. మెల్లగా దిగుతున్న బండ్లు ఒక్కసారిగా అదుపు తప్పాయి. కనుమూసి తెరిచేలోగా కటకం వశమయింది. విరిగి పడిన బండ్లే దడికట్టి రక్షకదళాల మార్గానికి అడ్డుకట్టగా నిలిచాయి. వెనుకనే వచ్చిన గజసైన్యం, ఏనుగుకు నలుగురు మేటి విలుకాళ్ళతో, వృషభదత్తుని సేనలపై అమ్ములవాన కురిపించసాగింది.

పైనుంచి పడ్డ ఆంధ్ర గజసేనా ప్రభంజనం దెబ్బకు వృషభదత్తుని కళ్ళు బైర్లు కమ్మాయి. వాళ్ళు పైనా, తన సైన్యం క్రిందా! కారుమేఘాలలాంటి మదమత్తేభాలు. ఉరుముల్లాంటి వాటి ఘీంకారాలు. ఆకాశానికి చిల్లులు పడినట్లు బాణవర్షం. క్షణాల్లో తన సేనలు సగానికి పైగా హతులయ్యారు. ఓటమి కళ్ళెదుట కనబడుతుంటే, వేరే దారి లేక, బ్రతుకు జీవుడా అని కొద్దిపాటి అంగరక్షకులతో కల్యాణపురికి పలాయనం చేసాడు.



మహాంధ్ర సేనావాహినికి సర్వసైన్యాధ్యక్షుడు శ్రీ శాతకర్ణి చక్రవర్తి, నవ్వు ఆపుకునేందుకు వ్యర్థప్రయత్నం చేస్తూ సింగన్న భుజం తట్టి, 'అహోహోహ్! 'అంతమంది కళ్ళుమూయాలంటే మూడు వందల పణాలేనా!' మంచి బేరమే చేసావు సింగన్నా. సైన్యాధిపత్యం కంటే నువ్వు వ్యాపారంలో దిగితే మంచిదని నీ అన్న కొమరయ్యకు చెప్పాలి', అన్నాడు.

మరుదినమే శతసహస్రాధికమైన దేవసేనను నడిపిస్తున్న ఐరావతారూఢుడైన ఇంద్రునిలా శాతకర్ణి కల్యాణపురి దుర్గాన్ని ముట్టడించాడు.





# 37

'మినెర్వా అల్టిమా' నాలుగు అంతస్తుల రోమన్ యుద్ధనౌక.

బెరెనీస్ పట్టణం వదిలి ముప్పై రోజులయింది. ఓడ ముందు కొమ్ముపై నిలుచుని ఎదురుగా ముసురుతున్న నల్లని మబ్బుల వెనుక దోబూచులాడుతున్న బాలభానుని తదేకంగా చూస్తున్నాడు, సోమదేవుడు.

ఆరేళ్ళు...

స్వదేశాన్ని వదిలి మ్లేచ్ఛసాంగత్యంలో గడిపిన సమయాన్ని నెమరు వేసుకుంటూ పవిత్రమైన భరతభూమిపై తిరిగి కాలుమోపే ఆ సుఘఢియ కొరకు ఎదురుచూడటం అతని దినచర్య అయింది.

తన గురువు నాగార్జునునిచే నిర్దేశింపబడిన కార్యం దాదాపు సఫలమైనట్లే.

ఆ మహాశయుని దయవల్ల అతి తక్కువదైన ఈ జీవితకాలంలో ఇద్దరు చక్రవర్తులతో స్నేహం కుదిరింది...

ఎదురుగా మధ్యకి తెరిచి ఉన్న గ్రంధం...

ఎంతో కష్టపడి తన స్వహస్తాలతో ప్యాపైరస్ దొంతరలపై తిరగరాసిన నకలు. ప్లైనీ మహాశయునిచే క్రోడీకరింపబడిన 'హిస్టోరియా న్యాచురాలిస్'. ఆహా! అలెగ్జాండ్రియా పట్టణంలో తాను గడిపిన ఆ శీతాకాలంలో ఏర్పడిన సాన్నిహిత్యం? అతని సహాయం లేనిదే తన లక్ష్యం ఎన్నటికీ సిద్ధించేది కాదేమో? మైసీనంలోని అతనింటనే కదా, ఫ్లావియన్ సోదరులతో పరిచయం కలిగింది...

✦ ✦ ✦

మధ్యధరా సముద్రంలో నావికులకు దిక్కు తెలియాలంటే ధృవతార ఎంత ముఖ్యమో అలెగ్జాండ్రియా రేవుపట్టణంలోని దీపస్తంభం అంతే ముఖ్యం. రెండు వందల అడుగుల ఎత్తుగల అసమానమైన కట్టడం. దాని నీడన వెలిసిన మహా సంగ్రహాలయంలో లేని గ్రంధాలు లేవు. గ్రీకూ, ల్యాటిన్ భాషలలోనివే గాక ప్రపంచపు నలుమూలల నుండీ కొనివచ్చిన అనేక అపురూపమైన వస్తువుల సంపద. పాశ్చత్యుల సంస్కృతి గురించి తెలుసుకొనడమే లక్ష్యమయితే, ప్రపంచంలో అంతకంటే సౌకర్యమైన వసతి లేదు. తాను విద్యగరచిన శ్రీపర్వతానికి ఏ విషయంలోనూ తీసిపోదు.

శిశిరంలో మధ్యధరాసముద్రం దాటటం అపాయకరం. వేసవి కొరకు వేచిచూస్తూ అలెగ్జాండ్రియా మహానగరంలో గడిపిన ఆ ఆరు నెలలు ఆ దేశ విశేషాలను తెలుసుకునేందుకు తనకు ఎంతో

దోహదపడ్డాయి. ఎందరో ప్రముఖులు, విద్యా వేత్తలతో సాంగత్యం. వారిలో అతిముఖ్యుడు ప్లైనీ...

ఈజిప్టులో ప్రతి ఏటా సేకరించిన ధాన్యపు నిలువలను రోమానగరానికి చేరవేసే బాధ్యత అతనిదే. వివిధ ప్రాంతాల వస్తు, ఖనిజ, సాంస్కృతిక విశేషాల గూర్చి తాను ప్రత్యక్షంగా చూసినవీ, విన్నవీ అన్నింటినీ, పుస్తక రూపాన హిస్టోరియా న్యాచురాలిస్ అనే గ్రంథంగా పొందుపరిచాడు.

ప్రతిరోజు ఏవో చర్చలు; గ్రంథాగారంలో ఉదయం మొదలైతే, సాయంకాలం విందూ వినోదాల తరువాత గానీ తెమిలేవి కావు. యవనుల భాషలైన అట్టిక్, ల్యాటిన్లకూ, భారతీయ భాషలైన సంస్కృత ప్రాకృతాలకూ సాపత్యం ఎంత దగ్గరిదంటే, మొదటి నెలలోగా తనకి ల్యాటిన్లో మాట్లాడటమేగాక, సాంకేతిక విషయాలు కూడా చర్చించగల సామర్థ్యం అబ్బింది.

ప్లైనీ అతిథిగా అతని నావపై, సముద్రాన్ని దాటి, ఇటాలియా పశ్చిమతీరంలోని మైసీనం చేరేసరికి వేసవికాలం వచ్చేసింది. వేసవిని ఆనందించాలంటే ఆ కాంపానియా తీరంలోనే! అది ఎంతో ఆహ్లాద కరమైన ఋతువు, విందులూ, క్రీడలతో రోజూ ఒక కొత్త వినోదం. ప్లైనీ సౌధంలోని విశాలమైన భోజనాల చావిడిలో ఎల్లప్పుడూ అతి ప్రముఖులైన అతిథులు– సెనెటర్లూ, నౌకాదళాధికారులూ, సైన్యాధ్యక్షులూ.

**హిస్టోరియా న్యాచురాలిస్**

గయస్ ప్లైనియస్ సెకండస్ (క్రీశ. 23–79). చరిత్రకి ప్లైనీ మహాశయుడిగా చిరపరిచితు డైన రోమా పౌరుడు. చరిత్రకారుడు, ప్రకృతి శాస్త్రజ్ఞుడు, తత్వవేత్త, రోమన్ నావసేనా నాయకుడు, చక్రవర్తి వెస్పాసియనుకు ఆంతరంగిక మిత్రుడు. అతడు రచించిన అనేక గ్రంధాలలో 'హిస్టారియా న్యాచురాలిస్' అతి ముఖ్యమైనది. రోమన్ దృక్పథంలో భారత, తూర్పు దేశాల చరిత్ర తెలుసు కోవాలంటే అది మౌలికమైన గ్రంథం. నౌకాధ్యక్షునిగా, వర్తక ముఖ్యునిగా తాను విన్న కన్న అనేక దేశాల, ప్రదేశాల ప్రాకృతిక, సాంఘిక, ఆర్థిక, ఖనిజ, భౌగోళిక పరిస్థితుల పై అతడు సేకరించిన విషయాల గ్రంధ రూపమే... 'హిస్టోరియా న్యాచురాలిస్'.

వెస్పాసియన్ చక్రవర్తి తదనంతరం అతని కుమారుడు టైటస్ రాజ్యకాలంలో, ఇటలీలోని నేపుల్స్ తీరంలోని 'వెసూవియస్' అనే అగ్నిపర్వతం బద్దలయింది. ఆ విస్ఫోటానికి పాంపే, హెర్క్యూలియయానం నగరాలు విధ్వంసం అయ్యాయి. ఆ సమయంలో అతడు కాంపానియా తీరంలో ఒక మిత్రు రాలిని రక్షించే ప్రయత్నంచేస్తూ, అనుమాన స్పదమైన పరిస్థితులలో మరణించాడు. అతడి మరణానంతరమే ఆ గ్రంథం ప్రచురిత మయింది.

వారందరి మధ్య అగ్రపీఠంపై కైసర్ టైటస్. మొట్టమొదటి సంభాషణంలోనే అతని తిరస్కార భావం తనని ఆ దినం ఎంత నిరుత్సాహపరిచిందో...

'ఆహ్ సోన్దియోస్! నా స్నేహితుడు ప్లైనీ మీ గురించి ఎంతో గొప్పగా చెప్పాడు, మీ ఇండియా గురించి ఎన్నో విషయాలు తెలుసుకోవాలని నాకెంతో కుతూహలంగా ఉంది. అయితే, చక్రవర్తి అనారోగ్యం కారణంగా కాస్త వెనుకంజ వేయవలసి వస్తుంది కానీ, లేకుంటే ఈపాటికి బాక్ట్రియా పనిపట్టి ఉండేవాడిని'.

## ఫ్లావియన్ చక్రవర్తులు

జూలియస్ కైసరుతో ప్రారంభమైన జూలియో క్లాడియన్ వంశపు అధికారం క్రీశ. 69లో అంతమయింది. నీరో చక్రవర్తి ఆత్మహత్య తరువాత రోమన్ హత్యా రాజకీయాలు ఎప్పుడూ లేనంత దిగజారిపోయాయి. ఒకే సంవత్సరంలో నలుగురు చక్రవర్తులు పదవికి వచ్చారు. గల్బాని హత్యచేసి ఒథో అధికారం లోకి వచ్చాడు. అతడిని జయించి విటెల్లియస్ చక్రవర్తి అయ్యాడు.

అది బ్రిటన్ని జయించి, పాలస్తీనాలో యూదుల తిరుగుబాటును తన ఉక్కుపాదంతో అణిచిన రోమన్ సేనానాయకుడు, ఫ్లావియన్ వంశస్థుడూ అయిన వెస్పాసియన్‌కి నచ్చలేదు. డిసెంబర్ 69లో మొట్టమొదటి ఫ్లావియన్ చక్రవర్తిని రోమన్ సెనెట్ ఆమోదించింది. అటు అట్లాంటిక్ మహాసముద్రం నుంచి ఇటు అరేబియా సముద్రం దాకా విస్తరించిన ఫ్లావియన్ చక్రవర్తుల సామ్రాజ్యానికి ఇక ఎదురు లేకుండా పోయింది.

ఎనిమిదేళ్ళ వెస్పాసియన్ రాజ్యం తరువాత అతడి పెద్దకొడుకూ, యూదులపై యుద్ధంలో అతడి కుడిభుజమై, రోమన్ ప్రజలకు అత్యంత ప్రీతిపాత్రుడయిన టైటస్ రాజ్యానికి వచ్చాడు. అతడు రాజ్యంచేసిన రెండేళ్ళలో అనేక దుస్సంఘటనలు. వెసూవియస్ అగ్నిపర్వతపు విస్ఫోటం ఇటలీని గడగడలాడించింది. అగ్ని ప్రమాదంలో రోమా నగరం సగానికి పైగా ఆహుతి అయింది. అలెగ్జాండర్ తరువాత ప్రపంచాధినేత కావాలనుకున్న టైటస్‌కి రాజధాని వదిలేందుకు వీలు కాలేదు. దురదృష్టవశాత్తూ, విషాహారం కారణంగా టైటస్ మరణించాడు... ఐతేనేం... అతడి తమ్ముడు డొమీషియన్ రాజ్యంచేసిన 14 ఏళ్ళలో, (క్రీశ.81-96) ఇండియాతో రోమన్ వాణిజ్యం ఎన్నడూ లేనంతగా ముందంజ వేసింది.

'అంటే... జరూసాలెం నుండి తెచ్చిన సంపదకు బాక్ట్రియన్ సువర్ణాలు జతచేస్తారన మాట!' అంటూ వంతపలికాడు, ప్లైనీ.

'బాక్ట్రియాపై దండయాత్రా!'

'ప్రభూ, మీకీ విషయంలో ఎటువంటి సహకారమైనా అందించేందుకు మా దక్షిణాపథం సిద్ధంగా ఉంటుంది' అని తాను తన ఆత్రుతని వ్యక్తంచేసాడు. అప్పుడు తన ఊహా పథంలో వెలిగిన ఆశపై, చన్నీళ్ళు పోస్తూ,

'ఆహ్! అవునవును. స్కిథియన్లతో మీకున్న వైరం నాకు తెలిసినదే. అయితే, మీ ఇండియా పశ్చిమ తీరమంతా నా మిత్రుడు నాంబెనస్ ఆధీనంలో ఉండగా మీ సాదకార్నెస్ మాకు ఏ విధంగా సహాయపడగలడు? మీది వృధా ప్రయాస... అహ్అహ్, అందుకని మీ రాజు నిరాశ చెందనవసరం లేదు' అని ప్లైనీ వంకకు తిరిగి, 'ఏమంటావ్ గయస్ ప్లైనియస్, అలెగ్జాండర్ మధ్యలో వదిలిపెట్టిన పనిని ఎవరో ఒకరు పూర్తి చేయాలిగా? లేకుంటే మన రోమన్ స్త్రీల విలాస వస్తువులకే ఏటా కోటి సెస్టెర్సెస్ లోటు, అది ఇండియానుంచి దిగుమతులకు అవుతున్న ఖర్చు. దానినెలా భర్తీ చేయాలి?' అంటూ చేతిలోనున్న మధుపాత్రను విసిరివేస్తూ, 'అహహ్, పార్థియా పనిపట్టాక, మీ సాదకార్నెస్ విషయం చూడాల్సిందే కదా, సోద్దియోస్? అంతవరకూ మీరు రోమా నగరంలో ఎటువంటి ఇబ్బందీ లేకుండా ఉండవచ్చు.

'అయినా... మీరు ఎంతోకాలం వేచి ఉండవలసిన అవసరం ఉండదులేండి.'

అంటే... పశ్చిమ క్షత్రపుల సహాయంతో శాతకర్ణిపైనా, సమస్త భారతావనిపైనా యుద్ధం తప్పదనే కదా అతడి ఉద్దేశ్యం.

జీవితాంతం మరిచిపోలేని మాటలు!

ప్రత్యుత్తరం లేక మ్రాన్పడిపోయి, నిరాశా నిస్పృహలు అలుముకోగా, ఇక ఆచార్యునికి ఎలా ముఖం చూపాలా అని అలోచిస్తూ, ప్లైనీ నివాసంలోని గ్రంథాలయంవైపు మెల్లగా అడుగులేసాడు...

✦ ✦ ✦

నిశ్శబ్దంగా ఉన్న గ్రంథాలయంలో, ఒంటరిగా, ఉత్తరపు గవాక్షంవద్ద, సాయంకాలపు వెలుగులో ఏవో ప్యాపైరస్ దొంతరలను ఏకాగ్రతతో పరీక్షిస్తున్న ఒక వ్యక్తి తన వంక తలయెత్తి చూసాడు. ఉదారంగు అంచుగల టోగాలోని అతని హోదాని గుర్తించి తలవంచి నమస్కరించాడు.

'ఓహ్! ఇండియా నుండి వచ్చిన ప్లైనీ మహాశయుని అతిథి మీరేననుకుంటాను? మా ఇటాలియాలో మీకేమీ ఇబ్బంది లేదు కదా?' అని లేచి పలకరించిన ఆ వ్యక్తి ఎవరా అని ఆశ్చర్యపోతుండగా, అతడు తననుతానే పరిచయం చేసుకున్నాడు.

అతను వెస్పాసియన్ చక్రవర్తి చిన్న కొడుకు. డొమీషియన్.

ఒకే తల్లి బిడ్డలైనా వారిద్దరిలో ఎంత భేదం?

ఒకడు టైటస్, చక్రవర్తి వెస్పాసియన్ అడుగుజాడల్లో రోమన్ మహాసామ్రాజ్యానికి ఉత్తరాధికారి, జరూసాలేం నగరాన్ని పట్టి యూదుల తిరుగుబాటును అణిచి అశేషమైన సంపదను చేబట్టిన మహావీరుడు.

కానీ ఇతడు, చిన్నవాడు డొమీషియన్.

తన అన్న టైటస్ పలుకుబడి నీడలో, క్రియాశీల రాజకీయాలకు దూరంగా, విద్యా వ్యాసంగాలతో కాలంగడిపే, అతనిని పట్టించుకునే వారే లేరు.

✦ ✦ ✦

కానీ...

అతనే ఇప్పటి రోమా చక్రవర్తి!

'ఆ మహాసామ్రాజ్య పట్టం అతనిది అవుతుందని ఎవ్వరూ అనుకొని ఉండరు',

ఉహుహ్, అని తనలోతానే నవ్వుకున్నాడు సోమదేవుడు.

అయితేనేమి? తన మస్తిష్కంలో ఆరోజు ఆక్షణంలో మెదిలిన ఆలోచన, అప్పటి ఫ్లావియన్ చక్రవర్తులదే కాక రోమాప్రపంచపు భవిష్యమార్గాన్నే మార్చివేసింది. ఆహ్, విధి ఎంత విచిత్రం? తన లక్ష్యసాధనకి, ఆచార్య నాగార్జునుని ఆశీస్సుల మాహాత్మ్యమో ఏమో, ప్రకృతి కూడా తనకు తోడై నిలిచింది.

ఆరోజు ప్లైనీ గ్రంథాగారంలో అయిన పరిచయం, ఆ తరువాత జరిగిన మహత్తరమైన పరిణామాలకు తొలిమెట్టు అయింది...

✦



# 38

రోమా ప్రజలు అత్యంత క్రీడాభిమానులు. నగరమధ్యంలో వెస్పాసియన్ చక్రవర్తి నిర్మించిన ఫ్లావియన్ క్రీడాంగణం చూడాలేగానీ దాని గూర్చి చెప్పనలవికాదు. ఐదంతస్తుల వర్తులాకార కట్టడం. ఒకేసారి యాభై వేలమంది ప్రత్యక్షంగా వినోదాలను తిలకించవచ్చు.

ఆరోజు...

మొట్టమొదటి ఫ్లావియన్ క్రీడోత్సవాలను ప్రారంభించేందుకు చక్రవర్తి టైటస్ కైసర్ ఏ క్షణాన్నైనా రావచ్చు. హాస్యగాళ్ళ వికృతమైన చేష్టలకు జనం చేసే కేరింతల ధ్వని ఆంగణమంతా నిండింది.

క్రీడామైదానం మధ్యలో ఒక ఎత్తయిన కట్టడం?

**కొలోసియం**

రోమన్ వాస్తు కళలకీ, నిర్మాణ పటిమకీ అద్భుతమైన నిదర్శనం రోమ్ నగరమధ్యంలోని కొలోసియం. క్రీశ. 72లో ఫ్లావియన్ చక్రవర్తి వెస్పాసియన్ దీనికి పునాది వేసాడు. అతడి కుమారుడు టైటస్ దీనిని క్రీశ. 80లో ప్రారంభించాడు. ఫ్లావియన్ చక్రవర్తులచే నిర్మింపబడినది కనుక దీనిని ఫ్లావియన్ ఆంఫిథియేటర్ అని పిలిచేవారు. యాభై వేల ప్రేక్షకులు ఒకేసారి కూర్చొని వినోదాన్ని ఆనందించే విధంగా, ఐదు అంతస్తులలో నిర్మించారు. గ్లాడియేటర్ పందేలూ, ప్రముఖ యుద్ధాల పునఃప్రదర్శనలూ, క్రూరజంతువుల వేటలూ, మరణ దండనలే కాక ప్రాచీన దృశ్య నాటకాలు కూడా ఇక్కడ పౌరుల వినోదం కొరకు ప్రదర్శించేవారు.

ఈనాటికీ అది ప్రఖ్యాత పర్యాటక స్థలమై, వెర్రితలలు వేసిన రోమా పౌరుల వినోదానికీ, వారి రక్త పిపాసకీ చిహ్నంగా నిలిచిపోయింది.

'అది జెరూసాలెంలోని యూదుల దేవాలయం నకలు. సోదరుడు టైటస్ ఆధ్వర్యంలో యూదులపై సాధించిన విజయాన్ని ప్రజలకొరకు పునః ప్రదర్శించబోతున్నారు' తన సందేహాన్ని నివృత్తి చేసాడు డొమీషియన్. ఆరోజు తాను చక్రవర్తి సోదరునికి ప్రత్యేక అతిథి. చక్రవర్తి ఆంతరంగికులకై ప్రత్యేకింపబడిన ప్రదేశంలో అతని పక్కనే తన స్థానం.

ఆరుకొమ్ముల నక్షత్రపు ధ్వజం నీడలో అసంఖ్యాకమైన యూదు సైన్యం ఆ ఆలయానికి చుట్టూ రక్షణగా నిలిచి ఉంది. విదూషకులు నిష్క్రమించడంతో, ప్రేక్షకుల సద్దుమణిగింది. ఏమవుతుందా అన్న ఉత్కంఠతో అందరూ ఎదురు చూడసాగారు.

ఒక్కసారిగా దిక్కులు పిక్కటిల్లేలా భేరీనాదం.

కనుమూసి తెరిచేలోగా ఎక్కడనించి వచ్చారో... వేలకొలదీ రోమా లెజియన్లు యూదులను చుట్టుముట్టాయి. అంతలో వారి మధ్య సకల

శుభలక్షణాలూ గల యుద్ధాశ్వంపై రోమా సైన్యాధ్యక్షుడు.

అతడు వేషగాడు కాదు.

అక్షరాలా రోమన్ చక్రవర్తి, టైటస్!

అతనిని గుర్తించిన మరుక్షణమే, 'హెయిల్ కైసర్' అన్న నినాదాలు మిన్నుముట్టాయి. చక్రవర్తి సూచనతో యుద్ధం ప్రారంభమయింది.

అది యుద్ధం అనడం కంటే ఊచకోత అనడం ఉచితమేమో!'

రోమన్ సైనికుల చేతులలో ఉన్నవి నిజమైన ఆయుధాలే అని తెలుసుకోవడానికి తనకి ఎంతోసేపు పట్టలేదు. వాటి దెబ్బకు హతులయ్యే వాళ్ళ హాహాకారాలకు తోడుగా ప్రేక్షకుల జయజయ నినాదాలు. రక్తం ఏరులైంది. యూదు సైనికులుగా నిలిచిన వేషగాళ్ళ శవాలతో మైదానం నిండింది.

హింస! కడుపులు తెమిలి, కళ్ళు బైర్లు కమ్మేలా, వినోదం గంగవెర్రులెత్తడం అదేనేమో! యవనుల రక్తపిపాసకు పరాకాష్ఠ! ఇక చూడలేక కళ్ళుమూసుకున్న తన భుజం పట్టి లేపాడు డొమీషియన్. ప్రేక్షకులంతా ఉత్కర్షతో తమ మునివ్రేళ్ళపై నిలిచి ఎదురుచూస్తున్న పతాకఘట్టం రానేవచ్చింది.

బవిరి గడ్డాలతో, తలనుండి కాళ్ళవరకూ గల బంగారు తొడుగుతో బందీలుగా కొనిరాబడిన యూదుల మతగురువులు, నూట ఎనిమిది మంది. తన స్వహస్తాలతో ఒక్కొక్కరినీ పేరుపేరునా తన కరవాలానికి ఎరవేస్తూ, వారి మృతశరీరాలపై ఒక్కొక్క మెట్టూ ఎక్కుతూ, ఆ దేవాలయ శిఖరంవైపు సాగాడు, చక్రవర్తి టైటస్.

'హెయిల్ కైసర్'

'యూదులు నశించాలి'

'రోమా సెనెట్‌కూ ప్రజలకూ జై'

'జై ఫ్లావియస్ వెస్పేసియానస్ టైటస్ కైసర్'

అతడు వేసిన ఒక్కొక్క అడుగుకీ చెవులు చిల్లులుపడేలా జనంచేసే నినాదాలు.

డేవిడ్ నక్షత్రపు ధ్వజాన్ని ఒకచేత నేలకు విసిరివేస్తూ, మరోచేత SPQR అక్షరాలతో, సువర్ణమయమైన శ్వేత ధ్వజాన్ని ఆ దేవాలయ శిఖరంపై ప్రతిష్ఠించి దాని పక్కనే నిలిచాడు, రోమన్ చక్రవర్తి.

ఆ సమయంలో, తన పక్కనే ఉన్న అతని సోదరుని ముఖంలోని అసూయ ప్రస్ఫుటంగా కనిపించింది. వేరెవరైనా గమనించేలోగా అతని ముంజేయిపై తన చేతిని బిగిస్తూ, 'పరవాలేదు కైసర్, 'నన్ను ఎంతోకాలం ఎదురు చూడనివ్వనని కదా నీ సోదరుడు ఇచ్చిన వాగ్దానం?' అతను మరిచాడేమోగానీ, నేను మరవలేదు', తాను నర్మగర్భంగా నవ్వుతూ అన్న మాటలలోని అంతరార్థం గ్రహించి తలవూపాడు డొమీషియన్.

‘ఉదయాన్నే, రియటీ నుండి వర్తమానం వచ్చింది’.

‘ఎవరు? ఇండియానుండి మీతో వచ్చిన వంటవాడా?’

‘అవును. విందు సిద్ధంగా ఉందట! ఇక మీ అన్న సాబైన్ ప్రాంత పర్యటనే తరువాయి...’



వెళ్ళి రెండు సంవత్సరాలైనా, ఆ దేశపు వాతావరణం ఎందుకో తనకి వంటబట్టలేదు. అమ్మో! ఏమి చలి! అందునా, అది తెల్లవారుజాము, ఎదురుగా పాలటైన్ గుట్టపైనున్న రాజసౌధాలు మంచుతో కప్పబడి ఉన్నాయి. అది భారతీయ చాంద్రమానం ప్రకారం, తిష్య పౌర్ణిమ. ప్రజ్ఞాపారమితాదేవికి అత్యంత ప్రీతిపాత్రమైన దినం. డొమీషియన్ నివాసంలోని దేవి పూజాగృహంలో ఆరోజు ప్రత్యేక పూజలకు అన్నీ సిద్ధంగా ఉన్నాయి. తాను వెళ్ళడమే ఆలస్యం. కాషాయపు రంగులో తనకై ప్రత్యేకంగా నేయించబడ్డ ఉన్ని శాలువాను మరింత గట్టిగా చుట్టుకుని, డొమీషియన్ నివాసం వైపు వేగంగా అడుగులేయసాగాడు.

‘ఎందుకో స్నేహితుడు ప్లైనీ నుండి ఎటువంటి వర్తమానమూ లేదు’.

అతడి ధాన్యపు నౌకలు ఆపాటికి హెర్క్యులియానం రేవు చేరే ఉండాలి. క్రీడల అనంతరం కలిసినప్పుడు అతని మాటలలోని అంతరార్థం తనను భయపెట్టిన మాట నిజం, ‘సోన్డియోస్, నిన్ను ఫ్లావియన్ సోదరులకు పరిచయం చేసి నేనేమీ తప్పుచేయలేదు కదా? ఎందుకో డొమీషియన్తో నీ సాన్నిహిత్యం చూస్తుంటే నీవు మా రోమా రాజకీయాలలో తల దూరుస్తున్నావేమో అనిపిస్తుంది. నీ పాత స్నేహితులని కూడా పట్టించుకోను నీకు సమయం దొరకడంలేదు. ఏమిటో విశేషం?’

‘అదేంలేదు నేస్తం, డొమీషియన్ గూర్చి నీకు తెలిసిందే కదా? ధార్మిక విషయాల్లో అతనికి ఆసక్తి ఎక్కువ. ఏదో మా భారతీయ సంస్కృతి గురించీ, బౌద్ధతత్వం గురించీ చర్చిస్తూ కాలం వెళ్ళబుచ్చడమే గానీ, బిక్షువునీ విదేశీయుణ్ణీ, మీ మహాసామ్రాజ్యపు విషయాల్లో నేనెక్కడ జోక్యం చేసుకోగలను?’ అంటూ సర్దిచెప్పినప్పటికీ,

‘ఏమో? నిన్ను ఇక్కడకు తెచ్చి అందరికీ పరిచయం చేసింది నేను. అందుకు నా సాటివాళ్ళ వద్ద ఎటువంటి తలవంపులూ రావనే ఆశిస్తాను’ అన్న అతని ఆఖరి మాటలలో ఏదో గుప్తార్థం తొంగి చూసింది.

‘రియటీ పథకాన్ని’ అతడు ఊహించి ఉండిఉంటాడా?

అదెలా సాధ్యం?

రియటీలోని ఫ్లావియన్ విలాస గృహంలో చక్రవర్తిని విషాహారంతో తుదముట్టించి, డొమీషియన్ని రాజును చేసే పథకం, తనకూ, చేరదేశం నుండి వచ్చిన వంటవాడికీ తప్ప వేరే ఎవరికీ తెలియడానికి వీల్లేదు.

‘అయినా ఏదో శంక’.

ఒకవేళ అదే నిజమై, ప్లైనీ కాంపానియాలో పర్యటిస్తున్న చక్రవర్తిని కలిసి తన అనుమానాన్ని కనుక వివరించి ఉండి ఉంటే? ఇంకేముంది? అంతకాలం చేసినదంతా బూడిదలో పోసిన పన్నీరే అయివుండేది! అంతేకాదు, తన ప్రాణానికే ముప్పు. అదేగనుక తెలిసుంటే, డొమీషియన్ను మాత్రం విడిచి పెట్టేవాడా? అసంభవం. సోదరుడని కూడా క్షమించివుండడు.

ఎందుకయినా మంచిదని, డొమీషియన్ను ఆ దినం హెచ్చరించడం స్నేహితుడు ప్లైనీ ప్రాణానికే ముప్పు అయింది.

'తొందరపడ్డానా?'

కానీ గత్యంతరం లేదు. ఆచార్యుని ఆదేశానుసారం, తన లక్ష్యం సాధించేందుకు, ఎంత అనుచితమైనా...

చెమ్మగిల్లిన కళ్ళు పైపంచె అంచుతో తుడుచుకుంటూ, తూర్పు ఆకాశంలో అప్పుడే విడుతున్న మబ్బుతెరవైపు ఆశగా దృష్టి సారించాడు.



డొమీషియన్ నూతన గృహం. ఉద్యాన వనంలో ఆలివ్ చెట్ల నీడలో పాలరాతి మందిరం. అది మినర్వా దేవికై ప్రత్యేకంగా నిర్మింపబడిన పూజాగృహం.

మినర్వా– ఆమె ప్రజ్ఞా వివేకాలకు అధిదేవత.

శూలపాణియై యుద్ధాధిదేవతయైన దుర్గా దేవివలె నిలిచియున్న ఆ దేవత ప్రతిమ ముందు అత్యంత దీక్షతో పద్మాసనం వేసుకొని కూర్చొని ఉన్న ఫ్లావియస్ వెస్పాసియానస్ డొమీషియన్ కైసర్, తన రాక గమనించి లేచి, కుడిచేతిని జయధ్వజ ముద్రలో తీర్చి నమస్కరిస్తూ,

'ఆహ్, సోన్దియోస్ మీకొరకే నిరీక్షిస్తున్నాను. ఇది ఎనిమిదవ రోజు. ఈరోజుతో నా వ్రతం పూర్తి అవుతుంది. తమరు చెప్పినవిధంగా దేవి అనుగ్రహంతో నా కోరిక నెరవేరుతుందని ఆశిస్తాను.'

'తప్పకుండా కైసర్, మీ కోరిక తీరే తరుణం ఎంతో దూరం లేదు. ప్రజ్ఞాపారమితాదేవిని ఇంత శ్రద్ధతో ఆరాధించినందుకు ఫలితం అతి త్వరలో మీకే కనిపించగలదు'.

**మినెర్వా**

విద్య, వివేకం, కవిత్వం, వైద్యం, మంత్రం, సంగీతమే కాక చేనేత మొదలైన హస్తకళలకు కూడా అధిదేవత మినెర్వా. క్రీశ. 2వ శతాబ్దానికి ముందు ఆమె 'ఎత్రుస్కా' ప్రాంతానికి మాత్రమే పరిమితం. కానీ... డొమీషియన్ చక్రవర్తి అయిన తరువాత ఆమె గ్రీకు యుద్ధాధిదేవత 'అథీనా'కు సమానంగా నిలిచింది. పాలటైన్ కొండపై, చక్రవర్తి గృహంలో ఆమెకి ఆలయం కట్టించి పూజించాడట. జనవరి నెల మధ్యలో, భారతీయ చాంద్రమానాన్నిబట్టి పుష్యమాసంలో రోమన్ ప్రజలు ఆమె పర్వదినం జరుపు కుంటారు.

బౌద్ధ మహాయానంలో ప్రజ్ఞాపారమితా దేవికీ, మినెర్వాకీ ఉన్న సాపత్యం అంతా ఇంతా కాదు.

డొమీషియన్ ముఖం ఒకవైపూ, శూలపాణి యైన మినర్వా మరోవైపూ ఉండే బంగారు నాణాలు రోమన్ సామ్రాజ్యం అంతటా ముద్రించబడ్డాయి.

'ఏమో సోన్డియోస్, నాకయితే ఎటువంటి సూచనా కనపడటంలేదు. సోదరుడు టైటస్ ఇంకా కంపానియా తీరంలోనే ఉన్నాడు. ఇప్పట్లో సబైన్ ప్రదేశాలకి వెళ్ళే ఉద్దేశ్యం లేదట. కాలం గడిచేకొలదీ, మన గుట్టు రట్టవుతుందేమో అనే భయం'.

'నిజమే... కాదనను. ఈ సమయంలోనే కాస్త క్షాంతి అవసరం. ఇది నీకు ఒక పరీక్షగా గ్రహించు. సంయక్సంబోధిత్వం సాధించాలంటే బోధిసత్త్వయానంలో ఆరు మార్గాలు. వానిలో అత్యంత కష్టమైనది క్షాంతిపారమితం. ధ్యాన, దాన, శీల, వీర్యాలు రాజపురుషులైన మీకు సులభసాధ్యాలే. ఇక విశిష్టమైన ప్రజ్ఞాపారమితం దేవి దయవల్ల మీకు తప్పక సిద్ధిస్తుంది. శంక వీడి మినర్వా మాతపై మనస్సు లగ్నం చేయండి'.

'ఆ ధైర్యంతోనే ఉన్నాను. మీరు చెప్పిన విధంగా జరిగితే, మాట ఇచ్చిన ప్రకారం రోమా సామ్రాజ్య శక్తినంతా మీ లక్ష్యసాధనకు తోడ్పడజేయగలను'.

'నేను రోమా ప్రభువు స్నేహాన్ని అర్థింపవచ్చిన బిక్షువును మాత్రమే, కైసర్. తమరి ప్రభుత్వం, మన ఉభయ దేశాల మధ్య స్నేహ వాణిజ్య సంబంధాలు ఇరువురికి లాభదాయకంగా మెరుగు పర్చగలదనే నమ్మకమే, నా ఈ ప్రయత్నానికి కారణం. మినర్వాదేవి సాక్షిగా చేసిన మన ఈ ఒప్పందం తప్పక నెరవేరుతుంది'.

'అదే నా శంక సోన్డియోస్, మీ దక్షిణాపథంతో నేరుగా వాణిజ్యం చేయాలంటే, విశాలమైన ఆసియా, పారశీకం, పార్థియా దేశాలు జయించి రోమానుండి మీ దేశం వరకూ రహదారి నిర్మించడం ఈ స్వల్ప సమయంలో సాధ్యమా? దేవి ఎదుట మాటయిచ్చాను గానీ, తీర్చకుంటే ఆమె క్రోధానికి గురి అవుతానేమోననే బెంగ' అని సంశయిస్తున్న డొమీషియన్తో...

హిప్పాలస్ నావికుని యాత్ర గురించి ఆదినమే వివరించాడు తాను.

'మీరీ విషయంలో శంకించనవసరం లేదు కైసర్, గ్రీకు నావికుడు హిప్పాలస్ మీకు తెలుసు కదా? ఈజిప్టులోని ఎర్రసముద్రపు రేవులనుండి నేరుగా ఆంధ్రతీరమందలి కల్యాణీపట్టణానికి, మధ్యలో తీరం తాకకుండా ప్రయాణించి వచ్చాడు. అంటే, రేవు రుసుములూ, సముద్రపు దొంగల బెడదేలేదు. దిగుమతులకు ఇప్పుడు రోమాలో చెల్లిస్తున్న ధరలో సగానికి పైగా కలిసివచ్చినట్లే! బాక్ట్రియా ద్వారా చీనిపట్టు రావాలంటే ఎన్నో ఇబ్బందులు, మార్గమంతా బందిపోట్లూ, ఎప్పుడేయుద్ధం ముంచుకొస్తుందో అన్న అనిశ్చిత పరిస్థితులు. హిప్పాలస్ కనిపెట్టిన మార్గం రోమా వ్యాపారాభివృద్ధికి మినర్వాదేవి వరమే అనుకోవచ్చు'.

'కానీ బెరెనీస్ నుండి ఇండియాకి సముద్రమధ్య మార్గం అన్ని కాలాలలో సాధ్యం కాదని కదా ప్లైనీ సెలవిచ్చాడు?' అని తన అనుమానం వ్యక్తం చేసాడు.

'నిజమే, జూలియన్ మాసం నుండి మూడు నెలల పశ్చిమపు గాలులు సముద్రం మీదుగా వీస్తాయి. అవి ఈజిప్టు నుండి దక్షిణాపథానికి వెళ్ళే నావలకు ఎంతో అనుకూలం. మప్పై రోజులలో సముద్రయానం పూర్తిచేయవచ్చు. అదే తీర మార్గంలో అయితే, స్కిథియన్ల ప్రభావంలో ఉన్న

రేవులు తాకుతూ ప్రయాణానికి కనీసం మూడు నెలలు పడుతుంది. ఇక వెనుకకి వచ్చేందుకు చలికాలం అనువైనది. సముద్రపు గాలులు తూర్పు పడమరలుగా వీస్తూ నావికులకు సహాయ పడుతాయి' అన్న తన వాదనలోని యదార్థాన్ని గుర్తించి,

'బాగానేఉంది కానీ, ఈజిప్టు నుండి చీనా దేశం వరకూ సముద్రయానం అంటే ఎంతటి నావికులకైనా సాధ్యం కాదేమో?' అన్న ఆనాటి అతని సందేహాన్ని నివృత్తి చేస్తూ,

'అవసరమేముంది? తూర్పు సాగరంలోని చంపా, కాంభోజ, యవ, సువర్ణ, మాణిక్యవర ద్వీపాలలోని స్థిరమయిన రాజ్యాలన్నీ ఆంధ్ర వణిక్పతులే స్థాపించారు. చీని చీనాంబరాలే కాక, మిరియాలూ, సుగంధ ద్రవ్యాలూ అన్నీ ధాన్యకటకం నుండి, రాజమార్గాల ద్వారా కల్యాణీపురానికి సగం ధరకే రాగలవు. నేరుగా వచ్చే రోమా వర్తకులకు, రేవు సుంకాలలో పూర్తి రాయితీ కూడా కల్పించ గలం. ఆలోచించు కైసర్, హిప్పాలస్ కనుగొన్న మార్గం ద్వారా ఇండియా చీనా దేశాలతో వర్తకం మీకు ఎంతో లాభసాటి కాగలదు. అది సాధ్య పడాలంటే దక్షిణాపథంతో సరాసరి వ్యాపార సంబంధాలు తప్పనిసరి.'

తన వాదనలో బలముంది. పైగా ఇండియాతో సరాసరి వ్యాపారం వల్ల రోమాకి వ్యూహాత్మకమైన ప్రయోజనాలు ఎన్నో!

'ఉహ్, దానివలన పార్థియన్ల ప్రాబల్యం కూడా క్షీణింపజేయవచ్చు. ఇది తప్పక ఆలోచించవలసిందే. సరే సోర్డియోస్ మనమనుకున్నది జరిగి నేనే కనుక చక్రవర్తిని అయితే, ఈ హిప్పాలస్ నాయకత్వంలోనే ఒక నావసేనను నీ పరంచేస్తాను...



### మాన్సూన్

ఋతుపవనాల గురించి భారతీయులకి ప్రాచీన కాలంనుంచే తెలుసు. కానీ ఐరోపా వాసులకి వాటి విషయం హిప్పాలస్ అనే నావికుడు క్రీశ. 78లో పరిచయం చేసాడు. ఈ పరిజ్ఞానం రాక ముందు, ఐరోపా వర్తక నౌకలు పర్షియా సింధుశాఖ ద్వారా, ఓమాన్, బెలుచిస్థాన్, ప్రస్తుత పాకిస్తాన్ తీరాన్ని అనుసరించి గుజరాతులోని భరుఖఛ్ఛానికి, ఆ తరువాత నేటి ముంబాయి సమీపంలోని కల్యాణీ, శూర్పారక రేవులకీ వచ్చేవి.

క్రీశ. 40కి, ఈజిప్టు రోమన్ సామ్రాజ్యంలో అంతర్లీనం అయింది. ఎర్రసముద్రపు రేవు పట్టణాలు రోమ్ వశమయ్యాయి. ఋతు పవనాల పరిజ్ఞానంతో అక్కడి బెరెనీస్, అర్సినో రేవులనుండి అరేబియా సముద్రాన్ని దాటి ఇండియా దక్షిణాపథంలోని కల్యాణికి నెలరోజులలోగా చేరే సౌకర్యం కలిగింది. సముద్రపు దొంగల భయం లేదు, రేవు సుంకాలు లేవు.

కృష్ణానదిపైన ఉన్న 'ఎఫిటెరియోన్' పట్టణం తూర్పు తీరంలో అతి ముఖ్యమైన రేవు, అని క్రీశ 60–80ల మధ్య రచించబడిన 'పెరిప్లస్ మారిస్ ఎరిత్రే' అనే గ్రంధం చెబుతుంది. అదే నేటి భట్టిప్రోలు. చైనా, వియెత్నాం, కంబోడియా, మలేసియా, బర్మా దేశాల వర్తకపు సరుకులు భట్టిప్రోలు ద్వారా, ఆంధ్రదేశం వచ్చి, అక్కడి నుండి భూమార్గాన శాతవాహనుల రాజ్యంలో ప్రయాణించి, నేటి ముంబాయి వద్ద కల్యాణి రేవుకి చేరి, అక్కడ నుండి ఈజిప్టు ద్వారా రోమ్ నగరం చేరేవి. ఎడారుల ద్వారా ప్రయాణించే 'గ్రాండ్ సిల్క్ రూట్' కంటే ఈ సముద్ర మార్గం మేలయింది. ఆంధ్రదేశం తూర్పు, పడమరలకి వారధి అయింది.

‘ఇక ఎంతో దూరంలేదు, సోన్డియోస్. క్రితంసారి ముప్పైనాలుగు రోజుల్లో ముసిరిస్ చేరాం. ఈసారి మనం తూర్పు–ఈశాన్యదిశలో ప్రయాణించాం. ఒకటి రెండు రోజుల్లో నేల తగిలినా ఆశ్చర్యం లేదు’ చేతిలో ఉన్న జంట పావురాలను గాలిలో ఎగరవేస్తూ, ‘ఇవి తిరిగిరావనే ఆశిద్దాం’ అన్నాడు నౌకాదళపతి, హిప్పాలస్.

అతని మాటలకు ప్రస్తుతంలోకి వస్తూ, ‘ఐదేళ్ళ తరువాత స్వదేశం చూడబోతున్నాను, హిప్పాలస్. ఈ లోగా ఎన్నెన్ని మార్పులొచ్చాయో?’ అన్నాడు సోమదేవుడు.

‘అవును, పశ్చిమతీరం ఇప్పుడు క్షహరాట్ట క్షత్రపుడు, నాంబెనస్ ఆధీనంలో ఉంది. ఏ క్షణాన్నైనా వాళ్ళ తెప్పకట్లని చూడవచ్చు. దక్షిణతీరం తాకిన నావలన్నింటినీ బలవంతంగా బారిగాజా పట్టణానికి తరలిస్తున్నారని సమాచారం.’

‘అది చిన్నచిన్న వర్తకపు నావలతో సాధ్యమేమో కానీ, మన వంద యుద్ధనౌకల నావసేనను సముద్ర మధ్యంలో ఎదిరించే ధైర్యమా?’

‘ఎంతకాలమని సముద్రంపైన ఉండగలం? భూమిపైన ఒక సురక్షిత స్థావరం నెలకొల్పకపోతే ఎలా?’

‘అందుకే కదా క్వింటస్ సెర్టోరియస్ ఆధీనంలోని ఏడవ రోమన్ లెజియన్ను చక్రవర్తి మనతో పంపింది. ఆ విషయం ఆలోచించే డొమీషియన్ సామ్రాట్టును భూసేన సహాయం అర్థించాను. మీరు ఏ భయం లేకుండా కల్యాణీపురి రేవుకి నావలను నడిపించండి. కొంకణ తీరంలోని ‘కూర’ మహారథులు శాతవాహన సామంతులే. ఒకసారి రేవు మన ఆధీనంలోకి వస్తే చాలు. దాని రక్షణ విషయం నాదీ బాధ్యత’

‘మీ ధైర్యం నేనెరిగినదే, సోన్డియోస్, కానీ క్షహరాట్ట మూక మీద పడితే, ఎంత సుశిక్షితులైనా, ఒక లెజియన్ అంటే ఐదువేలమంది సైనికులు, ఎంతో కాలం నిలువలేరు. మీ సాడకార్నెస్ సహాయం వెంటనే రాకపోతే మన ఉనికికే ముప్పు. అప్రమత్తంగా ఉంటే నష్టంలేదు.’

‘నభవాహనుడు మనపైబడే అవసరం లేదు. ఫ్లావియన్ ప్రభువులు ఇంకా పశ్చిమ క్షత్రపులకు మిత్రులే అని కదా అతని అభిప్రాయం. చక్రవర్తి డొమీషియన్ తన అన్న టైటస్ విధానానికి వ్యతిరేకంగా క్షహరాట్టులపై వైరం పూనుతాడని ఎట్టి పరిస్థితిలో వాళ్ళకి తెలిసే అవకాశం లేదు. అప్పటివరకూ, మీరు కల్యాణిలోని క్షత్రప ప్రతినిధికి అతిథులుగానే ఉండవచ్చు. ఈలోగా నేను ప్రతిష్ఠానం చేరి మన ఒప్పందం విషయం మా ఆచార్యులకూ, శాతకర్ణి చక్రవర్తికీ నివేదిస్తాను. కల్యాణి నుండి ప్రతిష్ఠానం ఎంత? పదిరోజుల ప్రయాణం. నెలతిరగకుండా శాతవాహన సైన్యాలు కల్యాణిలో ఉంటాయి.’



# 39

**క**ల్యాణీపురి. ఆంధ్రీనది పశ్చిమసముద్రంలో కలిసేచోట, ఏడు ద్వీపాలచే చుట్టబడిన ఉప్పునీటి కయ్యపై ఓడల రాక పోకలకు అనుకూలంగా, గాలివానలకూ, సముద్రపు పోటుకూ అతీతంగా ప్రకృతిచే కల్పింపబడ్డ సురక్షితమైన రేవు.

పట్టణానికి కాపుగా క్షహరాట్టపుర ద్వీపం.

'సహాయం అందేవరకూ తమరు ఇక్కడ ఉండటమే శ్రేయస్కరం. శాతవాహన సైన్యం కల్యాణీ, సూర్పారక పట్టణాలను చుట్టుముట్టి ఉంది. వారి గజసేన తాకిడికి ప్రాకారాలు ఎంతోకాలం నిలువలేవు. దీవిలోనైతే మీరు సురక్షితంగా ఉండవచ్చు', అని మహాక్షత్రపుడు నభవాహనుని అల్లుడు వృషభదత్తునికి నచ్చజెప్పసాగాడు అపరాంత మహారథి, శివకూర ప్రభువు. శాతవాహనులకు ఎన్నో తరాలుగా సామంతులైయున్న కూర వంశస్థుడు, నేడు క్షహరాట్టుల ప్రాభవం పెరగడంతో స్వతంత్రుడయ్యాడు... 'వృషభదత్తుడు అక్కడే ఉంటే అల్లుడిని రక్షించుకోవడానికైనా నభవాహనుని సహాయం అందే అవకాశం ఉంది'.

'ప్రయోజనం లేదు. మేఘవాహన నాగదత్తుని కళింగ సేనలు శాలివాహనునికి సహాయంగా నర్మదా తీరాన మోహరించి ఉన్నాయని వార్త. ఉజ్జయిని నుండి మన సేనలు వచ్చేందుకు వీలులేదు. ఇక సముద్ర మార్గమే దారి. కల్యాణిపట్టణం వారి వశమైననూ పరవాలేదు, నేను వెంటనే సౌరాష్ట్రం చేరటమొక్కటే సరియైనది' అని వృషభదత్తుడు తన నిశ్చయాన్ని వెలిబుచ్చాడు, 'వెంటనే ఉన్నంతలో ఒక నౌకాదళాన్ని సిద్ధపర్చండి, తెప్పకట్లయినా సరే. రేవు ఉదయమే ప్రయాణం' అంటూ సముద్రముఖంగా చూసాడు.

'అతడిని వెళ్ళనిచ్చినట్లయితే తన బ్రతుకు రెంటికీ చెడిన రేవడి కావటం తప్పదు. ఒకవేళ ఇతనిని ఇక్కడే బంధించి శాతకర్ణికి అప్పగిస్తే, క్షమాభిక్ష దొరకవచ్చునేమో?' అని యోచిస్తూ, ఆకస్మాత్తుగా రేగిన కలకలాన్ని గమనించి పశ్చిమదిశగా చూసాడు, శివకూర ప్రభువు.

అలుముకుంటున్న సంధ్యచీకట్ల మధ్య ఆకాశాపు నుదుటబెట్టిన సింధూరపు బొట్టులా ప్రకాశిస్తున్న సూర్యబింబంపై సముద్రపు అంచున ఓలలాడుతూ ఐదంతస్తుల మహాసౌధంలా ప్రత్యక్షమయిన యవన నౌకను చూడగానే అతనిలోని ఆశ సముద్రకెరటంలా ఉవ్వెత్తున ఎగిసింది.



ఫ్లావియన్ నావసేన క్షహరాటపురి ద్వీపం చుట్టూ విడిసింది. వృషభదత్తుని ఆనందానికి అంతులేదు. ఐదువేల మంది సుశిక్షితులైన రోమా యోధులు. వారికి తోడు, ఎటువంటి దాడినైనా ఎదుర్కొనగల వంద యుద్ధనౌకలు. ఇక కల్యాణిపురిని రక్షించుకోవడం సునిశ్చితం. శాలివాహనుడు తోకముడిచి తిరుగుముఖం పట్టవలసిందే!

ఉత్సాహానందాలతో విందు; అపరాంత తీరపు వారకాంతలూ, రోమానుండి కొనివచ్చిన ద్రాక్షపు మధువులూ వారి ఆహ్లాదాన్ని ద్విగుణీకృతం చేయగా, ముఖ్యులైన అతిథులకు తగిన మర్యాదలు చేయడంలో మునిగిపోయాడు. కూర ప్రభువు.

'ముప్పై దినాల సముద్రయానం, యూసొడాటస్! సైన్యాలకు రెండు దినాల విశ్రాంతి అవసరం. ఇంత సైన్యం, నౌకాబలం ఎదురుగా ఉండగా ఎంతటి శత్రువయినా సాహసం చేయడు. రెండు దినాలు ఆగి పూర్తి యుద్ధతంత్రంతో శత్రువును ఎదుర్కొనడం ఉచితం. ఏమంటావ్?' అని వృషభదత్తుని ప్రశ్నించాడు క్వింటస్ సెర్టోరియస్.

'ఐతే, రోమా సైన్యం ద్వీపంలో కంటే కల్యాణి పురిలో ఉంటే మంచిదేమో? మన సేనలనుకూడా దాడికి సమాయత్తం చేసేందుకు వీలౌతుంది. పైగా దగ్గరనుండి శత్రువు బలాబలాలు అంచనా వేయటానికి అదును కదా?' అని సలహా ఇచ్చాడు శివకూర మహారథి. 'రోమా యోధులు తనదైన కల్యాణిలో ఉంటే శాతకర్ణిని ఎదరించకుండా వృషభదత్తునితో సముద్ర మార్గాన పలాయనం పట్టే అవకాశాలు తక్కువ'. తన రాజ్యాన్ని ఆంధ్రసైన్యాల నుండి రక్షించుకోవటమే అతని ఉద్దేశ్యం, దానికి రోమా సేనల సహాయం అత్యవసరం.

'అద్భుతమైన యోచన', అని భుజం తడుతూ, 'నౌకాదళం కూడా ఆ పక్కనే విడిస్తే, అది సాడకార్నస్ సైన్యాలకు అవరోధంగా పనిచేస్తుంది. ఇక్కడ ద్వీపంలో మనమెలాగూ సురక్షితులమే! రేపు ఉదయమే నావలు ఆవక్కకు నడిపిద్దాం.

### ఎలెఫెంటా

ఏడు ద్వీపాల సమూహమే ప్రస్తుత ముంబాయి నగరం. ఈ ద్వీపాలకీ, ఖండాంతర భూమికీ మధ్య సర్వతోభద్రం, సహజం అయిన రేవు, బాంబే హార్బర్. ప్రాచీన కాలంలో, ఎంతో ప్రాముఖ్యం కల్గిన కల్యాణిరేవుపట్టణం ఇక్కడే ఉంది. పశ్చిమ కనుమల్లో పుట్టి ఆ రేవు వద్ద సముద్రంలో కలిసే కోయినానది లోయని ఆంధ్రావ్యాలీ అనే పిలుస్తారు. ఆ కాలంలో ఆ రేవుపై ఆధిపత్యం కొరకు క్షహరాట్టులకీ, శాతవాహనులకీ మధ్య అనేక యుద్ధాలు జరిగాయి. గౌతమీ పుత్ర శాతకర్ణి, పశ్చిమ క్షహరాట్టుడు 'నహపన' అల్లుడైన 'ఉసవదత' (వృషభదత్త)పై విజయం సాధించి, అపరాంత తీరాన్ని (కొంకణ్) ఆధీనం చేసుకున్నాడు.

ఆ హార్బరులో శత్రుదుర్భేధ్యమైన జలదుర్గం నేడు 'ఎలిఫెంటా' అని పిలువబడే దీవి. శాతవాహనుల తరువాతి కాలంలోని అశేష శిల్ప సంపద ఇప్పటికీ పర్యాటకులని ఆకర్షిస్తుంది.

ఆ దీవిపైనున్న గ్రామాన్ని 'ఘారాపూర్' అంటారు. క్షహరాట్టపురి కాలానుగుణంగా అలా మారిందేమో? ముంబాయిలోని 'గేట్వే ఆఫ్ ఇండియా' నుండి MTDC వారు నడిపే బోట్లు ప్రతి అరగంటకి ఉంటాయి. ఘరాపూర్ గ్రామంలో రాత్రి వసతికి లాడ్జీలూ, హోమ్-స్టే సౌకర్యాలూ కూడా ఉన్నాయి.

యూసొడాటస్ ఇక్కడే క్షేమంగా ఉండటం మంచిది, మీరు మాత్రం మాతో వస్తే చాలు. సమ్మతమేనా, సిబోక్యూరస్?'

'అఖండమైన ఆలోచన కువింద శత్రారీ!' అని తన చేతిలోని మధుపాత్రను ఎత్తి, 'ఇది శత్రువినాశనానికి' అంటూ ఒక్క గుక్కలో తన గొంతులో పోసుకున్నాడు.

'నిశ్చయంగా' అని వంతపాడి, 'ఇంకో విషయం... మాతో కూడి ప్రయాణిస్తున్న బౌద్ధ శ్రమణుడు సోన్దియోస్. వారికి కొల్లియానీపోలిస్ వీడటానికి మీ అనుమతి ఇస్తేచాలు... ఏదో ధర్మబోధలు చేసుకునే సోఫిస్టు! అపాయమేమీ లేదు. అందుకు మా హామీ.'

'మీరంతగా చెప్పాలా? సర్వసైన్యాధ్యక్షులు. అన్ని నిర్ణయాలూ ఇక మీవే!'



కల్యాణపురి వెలుపల మహానగరంలా విడిసిన ఆంధ్ర సైన్య కటకంలో సర్వసేనాధ్యక్షుడు, గౌతమీపుత్ర శ్రీ శాతకర్ణి చక్రవర్తి ఆజ్ఞమేరకు మహారాజ స్కంధావారం ప్రవేశించాడు, గజాసేనాధ్యక్షుడూ, అసహాయ శూరుడూ, నహపనఘట్ట పరిగ్రాహకుడూ, కొండపురి కొమరయ్యగారి, సింగన్న రట్టకుడి.

ఏదో గూఢాలోచనలో ఉన్న చక్రవర్తి సముఖంలోని బౌద్ధాచార్యుని చూసి, ఎక్కడో చూసినట్లున్నదే ఎవరా? అని ఆలోచిస్తుండగా, 'సింగనదొరా, వీరు నాగార్జునాచార్యునివద్ద మాతో కూడి శిక్ష గరిపిన మా సహాధ్యాయి, సోమదేవులు' అన్న చక్రవర్తి పరిచయవాక్యంతో గుర్తుపట్టి,

'తమరు ధర్మదేవామాత్యుని పుత్రులు కదూ? అని ఎదురుగా వచ్చి పలకరించి, 'నన్ను గుర్తించారా? కొండపురి కొమరయ్యశ్రేష్ఠి సోదరుడను, సింగన్నను' అని నమస్కరించాడు.

'ఆహా! మరువగలనా? ఆనాడు మీయింట ఆతిథ్యం జీవితంలో మరువలేను. అదే మా మాతాపితరులతో నేను గడిపిన ఆఖరి దినం. ఇంతకాలమూ వారి గురించే నా విచారం'.

'మీకే విచారమూ అవసరం లేదు. అందరూ క్షేమమే. మీ తండ్రిగారు ఇంకా కొండపురిలోనే అమాత్యులుగా ఉన్నారు. తల్లిగారూ క్షేమమే, మీ గురించిన బెంగ తప్ప! మీరు అనుమతిస్తే ఇప్పుడే వార్తాహరుని వారివద్దకు పంపిస్తాను. మీ క్షేమసమాచారం తెలిస్తే చాలా సంతోషిస్తారు. ఇంకో విషయం, ఇప్పుడు మనం బంధువులం. మా అన్నగారి కూతురుతో మీ సోదరునకు గత సంవత్సరమే ఉద్వాహం అయింది. వారిపుడు శాతకర్ణి చక్రవర్తి దయవల్ల విజయేంద్రపురంలో అమాత్యులుగా ఉన్నారు'.

'భుజంపైనుండి గంపెడు భారం దిగినట్లుంది. మీ మేలు మరువలేను. ఇక కల్యాణిపురిని విడిపించిన వెంటనే మా తలీతండ్రులనూ, ఆచార్యులనూ సందర్శించడమే తరువాయి'

'ఇప్పుడున్న పరిస్థితులల్లో అది కష్టసాధ్యం అనిపిస్తుంది సోమదేవా. మన వేగుల సమాచారాన్ని బట్టి పదివేలకు పైగా యవనయోధులు ఈ ఉదయమే కల్యాణిలో కాలుబెట్టారు. నభవాహనునికి

సహాయంగా రోమా సామ్రాట్టు పంపిన సేనలని వార్త. పశ్చిమ సముద్రపు రేవులపై యవన క్షహరాట్టుల ఆధిపత్యాన్ని ఛేదించడం ఇక దుర్లభమేనేమో?' నిరాశా జనకమైన అతనిమాటలకు ఏమాత్రమూ చలింపని సోమదేవుని చిరునవ్వులకు ఆశ్చర్యపడుతూ, చక్రవర్తి వంక ప్రశ్నార్థకంగా చూసాడు. అర్థవంతమైన దరహాసచంద్రికలు శాతకర్ణి ముఖంలో ప్రతిబింబించగా విషయము అర్థముగాక విస్తుపోతున్న సింగన్నతో...

'రోమా సైన్యం కల్యాణిపురిలో ఉన్నది నిజమే సింగన్నదొరా. కానీ అవి వచ్చినది, నభవాహనుని సహాయార్థం కాదు, డొమీషియన్ వెస్పాసియానస్ కైసర్ చక్రవర్తి, మన దక్షిణాపథపతీ, శాతవాహన చక్రవర్తీయైన శ్రీ గౌతమీ పుత్ర శాతకర్ణితో స్నేహ సంబంధాలు ఆశించి, తమ పరస్పర మిత్రుడినైన నాతో పంపిన అపారమయిన నావసేనా, క్వింటస్ సెర్టోరియస్ దళపతి ఆధీనంలోని ఏడవ ఈజిప్టు లెజియన్', అని చెరగని చిరునవ్వుతో లాంఛనబద్ధంగా వివరిస్తుండగా, ఇక నువ్వు పట్టలేని చక్రవర్తి...

'ఆహహహ్! వచ్చినది తమ సహాయానికేనన్న భ్రాంతితో కల్యాణిపట్టణాన్ని రోమా సేనాధిపతికి అప్పగించాడట! ద్రోహి. ఆ విశ్వాసహీనుడైన 'కూర'కుక్క', అని వానిని తలచినంతనే క్రోధం ఒక్కసారిగా పెల్లుబికి, 'ఆ పాపి తలచెండును పశ్చిమ సముద్రంలోకి ఎగజిమ్మి, వాని కళేబరాన్ని గాడిదలతో అపరాంతమంతా ఈడ్పించిన గానీ, ఈ ద్రోహచింతనగల మహారథులకు గుణపాఠం అవదు', అని దిగ్గున లేచి, 'ఇక మిమ్ములను పిలిపించిన అసలు విషయం...

వైజయంతీ, మహిషమండలమూ, మలయగిరి సీమలలోనున్న గజసేనలను సమాయత్త పరిచి, ఉజ్జయినికి వెంటనే కదిలించండి. మేము ఈ సేనలకు తోడుగా, ప్రతిష్ఠానమునందలి మూడు లక్షల కాల్బలమూ, రథ తురగ బలాలతో వెడలగలం. అతని అల్లుడు వృషభదత్తుని తలగొట్టి ఆ నభవాహనునికి బహుమతిగా ఇవ్వటానికి ఇదే మంచి తరుణం. నాగడుదొర కళింగసేనలు ఇప్పటికే నర్మదవద్ద కాసి ఉన్నాయి. ఇక ఈ యవన నావసేన భరుఖచ్చాన్ని పట్టి అటు పడమరనుండి ఉజ్జయినిని తాకగలవు. మా గురుదేవులు ఆచార్య నాగర్జునుని ఆశయం నెరవేర్చుటే మా ధ్యేయం', అంటూ ఎదుటనున్న బల్లను పిడికిట గుద్ది, 'ఇక మీరు తక్షణం బయలుదేరండి', అని వెనుదిరిగి సోమదేవునితో,

'మిత్రమా, మీరు ఆచార్యునితో నా మాటగా చెప్పండి. వారి వ్యూహరచనా చాతుర్యం వల్ల అడకత్తెరలో పోకచెక్కవలె చిక్కిన నభవాహనుని క్షహరాట్ట కులాన్ని నిశ్శేషం చేసి, పూర్వాపరదక్షిణ సముద్రాల నీటితో ఆచార్యదేవుని పాదాలు కడగటానికి, రానున్న పుష్యపౌర్ణిమకు ధాన్యకటకానికి వచ్చేందుకు ఈ శిష్యపరమాణువు వారి అనుమతి కోరాడని మనవిచేయండి'



# 40

పుష్యపౌర్ణిమకు సిద్ధమవవలసిన చైత్యప్రాకార నిర్మాణపు పనులేగాక, ఆఖరి నిముషంలో శ్రీపర్వత పరిషత్తు నుండీ, ఇంకా దేశం నలుమూలలనుండీ వేలకొలదిగా వస్తున్న ఆచార్యుని శిష్యగణానికి వసతి వ్యవస్థల పనుల్లో తలనమునకలవుతూ, అప్పుడే ఇంటికి వచ్చిన భర్తతో, 'మావయ్యా, ఎంతసేపయ్యింది వచ్చి?... ఆహ్, చెప్పడం మరిచాను, ఇందాకే నాన్నగారు వచ్చివెళ్ళారు. ఎవరో విశ్వనాథసుతుడట, అమరావతీ ద్వీపం మహాభోజుడట!' అంటూ ఎదురువచ్చి, 'ఇదిగాక ఇంకెన్ని అమరావతులో? అయినా.. అమరావతేమిటీ ద్వీపమేమిటి? కానీ మావయ్యా, మాణిక్యవరపు వర్తకనౌక ద్వారా వర్తమానమట... శంకించజాలం అన్నారు. నాన్నగారి దర్శనార్థియై తిష్యపౌర్ణిమకు మనవూరు వస్తున్నాడట... ఏమో... నాన్నగారికి అంతుబట్టక, నీకేమన్నా తెలుసేమో అడగమన్నారు.'

'ప్చ్, ఏమో? అమరావతి ద్వీపమంటే మలయద్వీపానికి అవతలి తట్టు... మహాచీనిసముద్రంలో. ఎప్పుడో రెండేళ్ళ కిందట ఒక బుద్ధప్రతిమను కాబోలు, కాంభోజం ద్వారా పంపినట్లు గుర్తు. అంతకు మించి నాకేమీ తెలియదని చెప్పు' అన్నాడు విసుగ్గా.

'అదేదో నువ్వే చెప్పు. అదేమి పనో, మీరిద్దరూ క్షణంకూడా ఇంటిపట్టున ఉండటంలేదు. భోజనం కూడా సరిగా చేయడంలేదు... అమ్మది కూడా అదే విచారం'.

అంతలో అటుగా వచ్చిన అచ్చమ్మ, 'ఏం నాయనా ఇప్పటికి తీరికయిందా? ఇలా ఒళ్ళు ఎరగకుండా తిరిగితే ఆరోగ్యాలు పాడవగలవు. అమ్మాయి అసలే వట్టిమనిషి కాదు. కాస్తంత పక్కనే ఉంటే దానికీ కొంచెం స్థిమితంగా ఉంటుంది', అని నిష్టూరాలు పోతూనే, 'అమ్మాయ్... నీవెళ్ళి కాస్త నడుం వాల్చు. నేను మల్లన్న భోజనాల సంగతి చూస్తాను', అని దాసీలను కేకలేస్తు పనిలోపడింది.

చేతులు కడుక్కొని భోజనానికి కూర్చున్నాడు, మల్లన్న.

అది విశాలమైన చావిడి. పక్కకి వంద అడుగుల చదరంగా మండువా. రెండు అంతస్తులతో వంద గదుల భవంతి. బావమరుదుల నివాసం అక్కడే. కృష్ణార్జునులలా వారిది ఒకే మాట. అమరారామానికి దక్షిణంగా కొండ కింద, సస్యశ్యామలమైన పంటపొలాల మధ్య గ్రామం. చుట్టూ మద్దితోపు. ఆకాశాన్నంటుతూ పది అడుగుల చుట్టుకొలతగల పెద్ద మద్ది చెట్టు ఆ ఊరికి ఆనవాలు.

నగరానికి దిగువన కృష్ణాతీరంలో శిలావర్ధంకుల రేవు. సుదూరమైన శ్రీపర్వత సీమనుండి తెప్పకట్లపై వచ్చే గండశిలలను నిర్మాణానికి అనువైన విధంగా మలిచేపని అక్కడే. అంతేగాక

ధాన్యకటకపు శిల్పాలు దక్షిణాపథంలోనే గాక ప్రాగ్సాగర ద్వీపాలలో కూడా ఎంతో ప్రఖ్యాతి గడించాయి. ఇక్కడి శిల్పాలు తెప్పలపై పిత్రుధపురం చేరి అక్కడనుండి సముద్రనౌకలలో యవ మలయ సువర్ణ కాంభోజ సీమలకు ప్రయాణమవుతాయి.

ప్రస్తుతానికి, ఆచార్యుని ఆదేశానుసారం, అసంఖ్యాకంగా తయారయిన శిల్పాలు, రేవుపైన ఒక కోసు విస్తీర్ణంలో నిలిచి ఉన్నాయి. పద్మాసనస్థితుడై ధ్యానదీక్షలోనున్న బుద్ధప్రతిమలూ, పది అడుగుల ఎత్తున నిలిచి తన కరుణార్ద్రమైన దృక్కులతో ప్రపంచాన్ని కలయజూసే తథాగతుని రూపాలేగాక, అవలోకితేశ్వరాది బోధిసత్త్వ స్వరూపాలూ, పునరాగమనానికి నిరీక్షిస్తున్న మైత్రేయ బుద్ధుని ప్రతిరూపాలూ. వీటన్నింటికీ మిన్నగా అత్యంత ప్రశస్తిగాంచిన ప్రజ్ఞాపారమితాదేవి శిల్పాలతో రేవు నిండి పోయింది. అవన్నీ అమ్ముడయితే శ్రేణికి లక్షల పణాల ఆదాయం.

వచ్చే పుష్యపౌర్ణిమ మహాయాన బౌద్ధానికే అతి విశిష్టమైనది.

ఆచార్యులచే ధర్మచక్రం మరొకమారు పరివర్తింప బడనుంది.

వారణాసి వద్ద హరిణవనంలో బుద్ధదేవునిచే మొదటిమారు కదిలిన బౌద్ధధర్మం, ఇప్పుడు నాగార్జునాచార్యునిచే బోధిసత్త్వధర్మంగా మరొక ధర్మచక్రపరివర్తనం జరగనుంది.

'ఈ మహాద్భుతం చూడడానికి లోకంలోనున్న ప్రతి మహాయాన బౌద్ధాచార్యుడూ ధాన్యకటకంలో దిగబడబోతున్నాడు. వారికి తగిన వసతీ ఆరామాలు సమకూర్చేపని మనదే కదా? నా సంగతి అలా ఉంచు. పాపం బావకైతే, అటు చైత్యనిర్మాణం పనులూ, ఇటు నిగమాధ్యక్షుడిగా నగరాన్ని గడువులోగా సిద్ధం చేయడంలో తల మునకలు అవుతున్నాడు. రోజుకొక కొత్త సమస్య! ఇటు నువ్వయినా కాస్త సూటిపోటి మాటలతో విసిగించక కాస్త జాగ్రత్తగా చూసుకోవే', అని అక్కను మందలించాడు.

'ఇంతలో నేను ఏమన్నాననీ?' అని మూతివిరుస్తూ, 'ఆయన పడే ఆరాటం చూస్తే నాకు మాత్రం విచారం కాదూ? ఏదో కాస్త సమయానికి కూడూ నిద్రా ఉంటే బాగుంటుందని కానీ', అని గుణుస్తూ, 'అలా వయ్యారాలు ఒలక బొయ్యక అబ్బాయికి కొంచెం నెయ్యి పొయ్యవే' అని యవనదేశం నుండి కొనివచ్చిన దాసీపై తన ఉక్రోషాన్ని చూపింది అచ్చమాంబ.

'సరేలే, ఉరిమి ఉరిమి మంగళం మీద పడ్డట్లు దాని మీద ఎందుకు నీ ప్రతాపం? నీవన్న మాట నిజమే. ఈ సమయంలో భ్రమరంతో ఉండటమే సమంజసం. కాని ఏం చేయనే? చక్రవర్తి పెట్టిన గడువు! తప్పదు. ఇంతకీ ఎలా ఉందే దానికి? నేను అడిగితే అంతా బాగానే ఉందని దాటవేస్తుంది.'

'ఏమోరా? మూడో కాన్పు, మరీ ఒకదాని వెంట ఒకటి... అసలే చిన్నముండ! ఆచారిని అడిగితే కవలలేమో అంటాడు. మొదటి రెండు ప్రసవాలూ సుఖంగానే జరిగాయి, అయినా, ఈసారి ఎందుకో భయంగా ఉందిరా'.

ఆ మాటలు విన్న మల్లన్నకి అన్నం సహించలేదు. వెండి పళ్ళెంలో చేతులు కడిగి, 'అదెక్కడ? పద చూద్దాం', అని అక్క చెయ్యి అందుకుని తన పడకటిండ్లవైపు కదిలాడు. మల్లే సంపెగ పొదల

మధ్య నిర్మలమైన సరస్సు. దానిని ఆనుకొని మాలతీ తీగెల పందిరి. పందిరి కింద మెల్లగా ఊగే ఉయ్యాలబల్లపై, కాళ్ళు ఎత్తైన గడపైబెట్టి పండుకొని ఉంది, భ్రమరం. మల్లన్న అటు రావడం చూసిన దాసి, కాళ్ళు వత్తడం ఆపి లేచి నిలుచుంది.

లేపవద్దని కళ్ళతోనే సైగచేసి, పక్కనే చేరి, ఆమె కాళ్ళు వత్తసాగాడు. కొంచెం ఉబ్బిన పాదాలవంక ఆందోళనగా చూస్తున్న మల్లన్నతో, 'నీరు చేరినట్లుందిరా. వైద్యులు అదేదో వాత ప్రకోపం అని కషాయం ఇచ్చారు. ఈ సమయంలో మామూలే, భయపడకు', అంటున్న తల్లి మాట విని కన్నులు తెరిచి, ఎదురుగా ఉన్న భర్తను చూసి లేవబోయింది.

భుజంపై చేయుంచి వారిస్తూ, 'ఏమే భ్రమరం చెప్పనేలేదు? అక్క చెబితేగానీ తెలియలేదు. ఎంత పనైనా నీకంటే ఎక్కువటే?' అని చేతిని నుదుటి పైనుంచాడు కళ్ళలో నీళ్ళు తిరుగుతుండగా.

'నాకిప్పుడు ఏమయిందనీ? వైద్యులు ఏమీ భయంలేదన్నారు. ఇదేమన్నా మొదటి కాన్పా? అమ్మది ఉత్తుత్తి ఆర్భాటం. నా సంగతి ఆలోచించకు, మహారాజుకి ఇచ్చిన మాటపై ధ్యానం ఉంచు. తిష్యమాసంలోగా నీ కూతుర్ని నీ చేతిలో పెడతాను, సరా?'



'అమాత్యులు శివదేవుల ఇంట సమావేశమట! ఈ అర్థరాత్రి సభలేమిటో? భోజనం కానించి బయలుదేరుదాం త్వరగా తయారవ్', అంటూ విసవిసా లోనికి వచ్చాడు విశ్వనాథుడు.

'అరే, నాకేమీ వర్తమానం లేదే? ఇప్పుడేమి మునిగిపోయిందో?'

ఉయ్యాలబల్లపైనున్న అల్లునితో వెటకారంగా, 'వారికేం తెలుసు? తమరు ఇక్కడ భార్యామణి సేవలో తల మునకలు అవుతున్నారనీ... మల్లన్నదొరకి విన్నవించమని నాతో మొరబెట్టుకుంటే ఇలా మీ అత్యవసర సమావేశానికి ఆటంకం కలిగించాను. దొరగారు క్షమించి అక్కగారిని పంపిస్తే, నా ముఖాన్న కాస్త అన్నం పడేస్తుంది', అని భార్యతో, 'దేవిగారు కాస్త త్వరగా దయచేస్తే కృతార్థులమవుతాం' అని మాట ముగిసేలోపే, చేతిలోని తలపాగా దాసీ వంక విసిరి, తన గదుల వైపు దారి తీసాడు.

'చూసావురా... ఇదీ వరస', అని తమ్మునితో అంటూ లేచిన తల్లితో...

'ఊరుకోవే నువ్వు మరీనూ! ఎంత పని వత్తిడిలో ఉన్నారో? నేనూ వస్తాను పద. అందరం పక్కనుంటే నాన్నగారికి కూడా బాగుంటుంది', అని తల్లికి సర్దిచెబుతూ భర్తతో సహా వెంట బయలుదేరింది.





# 41

అమావాస్య, రాత్రి రెండవ జాము. సద్దు ఏమాత్రమూ తగ్గలేదు. ఈ పక్షం గడిస్తే ధర్మచక్ర పరివర్తన మహా పర్వదినం. ఇప్పటికే వచ్చిన బౌద్ధ బిక్షువులతో పూర్వశైల ఆరామమూ, అవరశైలమూ నిండి పోయాయి. నది ఆవల వజ్రకటకం చుట్టూ తాత్కాలిక వసతి కొరకు వర్షారామాలు వెలిసాయి. ఇక నగరంలో కిటకిటలాడే జనం, ఒక్క సత్రమూ కాళీలేదు. వివిధ నిర్మాణపు పనులకై వచ్చిన వడ్రంగులూ, కమ్మరులూ, కుమ్మరులూ, చర్మకారులూ వారి వారి శ్రేణులు ఏర్పరిచిన వాడలలో విడిసారు– చేతినిండా పని, చేయగలవాడికి చేసినంత! పగలూ రాత్రీ ఒకటై, కమ్మరుల కొలిములకూ, వడ్రంగుల సుత్తులకూ విశ్రాంతి అనేది లేదు.

శిలాఫలకాల తాపడం పూర్తి అయి రెండు సంవత్సరాలు అయింది. అంత కాలం ఇసుకచే కప్పబడి ఉన్న మహాచైత్యం, గత రెండేళ్ళుగా నేత్రానందకరంగా దర్శనమిస్తుంది. నూట ఇరవై అడుగుల ఎత్తు! అంతెత్తుకు శిలలను ఎత్తటం సామాన్య యంత్రాలవల్ల అయేపని కాదు. ఇటుక రాళ్ళతో ఏనాడో కట్టిన చైత్యానికి ఒక వరుసలో శిలలు తాపడంచేసి, ఆ తరువాత చుట్టూ ఇసుక పేర్చి, దానిపై రెండవ వరుస శిలలను పైకెత్తుతూ; అవి తాపించిన పిమ్మట మరింత ఇసుకా, ఆపై మూడవ వరుస... ఈ విధంగా మూడేళ్ళ తరువాత శిఖరం చేరేసరికి, చైత్యమంతా ఇసుకచే కప్పబడి, చుట్టూ పది నివర్తనాల ఇసుక దిన్నె ఏర్పడింది. తాపడం అయిన పిమ్మట ఆ ఇసుకను తోడటానికే ఆరు నెలలు పట్టింది.

ఆ తరువాతే, చైత్యం చుట్టూ ప్రదక్షిణపథ నిర్మాణం పన్నెండు అడుగుల నిడివి గల వర్తులాకార పథానికి ఇరువైపులా నిలువెత్తు ప్రాకారాలపై కనులకు విందు చేసే శిల్పరచన! ఒకవైపు తథాగతుని జీవిత విశేషాలను కనులకు కట్టేట్లు చిత్రిస్తే, మరో వైపు జానపద జీవన ఇతివృత్తాలు పొందుపరచబడ్డాయి. ఆ మహాచైత్య పునర్నిర్మాణంలో వాస్తుకళ అనంతగుప్తునిదైతే, శిల్పరచన మల్లన్నది. పదివేల శిలావర్ధంకుల పర్యవేక్షణ మాత్రం విశ్వనాథ శ్రేష్ఠిది.

పొగమంచు తెరల మధ్య కాగడాల వెలుగులో ఒక బ్రహ్మాండమైన ముత్యంలా ప్రకాశిస్తున్న చైత్యాన్ని చూస్తూ, అమాత్యుని ఇంటివైపు కదిలారు బావమరుదులు.



శివదేవభట్టు విశ్వామిత్ర గోత్రుడూ, నియోగి, తరతరాలుగా శాతవాహనకుల ప్రభువుల సేవలో విశిష్టమైన పదవులు చేబట్టి ప్రస్తుతానికి వంశానుక్రమంగా ఆంధ్రరాజ్యానికి ప్రధానామాత్యులైనారు.

శ్రీముఖ శాతవాహనుని నుండి నేటి వరకూ ఆంధ్రప్రభువులచే ధర్మబద్ధమైన పరిపాలన చేయించటమే ధ్యేయమైన వారి కుటుంబీకులంటే రాజవంశానికీ, అందునా రాజమాత గౌతమీదేవికి ఎనలేని గౌరవం.

కానీ... ఆరోజు పరస్పర విరుద్ధమైన ఆలోచనలతో ప్రధానామాత్యుని అంతరంగం స్థిమితంగా లేదు.

గత కొన్నేళ్ళుగా ఆచార్య నాగార్జునుని పుణ్యమా అని బౌద్ధం మితిమీరింది. పుట్టుకతో బ్రాహ్మణుడైనా ఆ మహాత్ముడు వర్ణాశ్రమధర్మానికి కట్టుబడడు. దానికి తోడు, చక్రవర్తి శాతకర్ణి అతని ప్రియశిష్యుడు. నేటి మహాంధ్ర సామ్రాజ్య విస్తరణకి ఆ ఆచార్యుని తోడ్పాటూ, దూరదృష్టియే కారణమని ఒప్పుకొనక తప్పదు. అయినా... ఈ మహాయాన బౌద్ధ ప్రభంజనంలో వైదిక ధర్మమే అంతరించి పోతుందేమోనన్న భయం. యుగధర్మాన్ని అనుసరించి ఆ ఆదిదేవుడే, బుద్ధదేవుడై అవతరించాడు అనుకుంటే, ఆ మహాత్ముని బోధనలను అనుసరించి ఇక యజ్ఞ యాగాదులను త్యజించ వలసిందే! ఊహూ... అది తన అస్తిత్వానికే విరుద్ధం, పూర్వీకులు తనపై ఉంచిన బాధ్యతను విడనాడటమే.

దానికి తోడు దినదిన ప్రవర్ధమానమవుతున్న వాణిజ్యంతో, గృహపతులు వ్యవసాయాన్ని వదిలి పట్టణాలకు తరలి పోవడంవల్ల, గ్రామాలలో సంప్రదాయకమైన ఆర్షధర్మం ఆచరించేవారే కరువయ్యారు. కాలధర్మం అని సరిపెట్టు కుందామంటే, అశోక మౌర్యుని కాలంలో ఆటవిక జీవనాన్ని వదిలి, వ్యవసాయాది వృత్తులని చేబట్టిన కళింగ నాగజాతి ఇప్పుడు మహానది నుండి పినాకిని వరకూ విస్తరించింది. యుద్ధంలో

### స్తూపం

ఇప్పటి వరకూ కనుగొన్న స్తూపాల శిథిలాలన్నీ పట్టణాలకీ, కోటలకీ దగ్గరగా కాస్త ఎత్తయిన ప్రదేశాలలోనో, నదీతీరంలోనో, మనసుకు ఆహ్లాదం కలిగించే ప్రదేశాలలో నిర్మించబడ్డాయి.

ఇవి బుద్ధుని, లేక మరెవరైనా ముఖ్య వ్యక్తి భౌతిక అవశేషాలపై కట్టబడిన వర్తులాకార కట్టడాలు. మొదట మూలస్థానంలో అవశేషాలు నిక్షిప్తంచేసి చుట్టూ గుండ్రంగా మేధి (సిలిండరు) నిర్మిస్తారు. దానిపైన అర్ధగోళాకారపు అండం (డోము)తో స్తూపపు రూపం ప్రాథమికంగా పూర్తయినట్లే. తరువాత వివిధ అలంకారాలు, ప్రాముఖ్యానికి తగ్గట్లు సమకూర్చుతారు. వీటిలో ముఖ్యమైనవి చుట్టూ ప్రదక్షిణ పథం, ఆరాధనకి వీలుగా ఆయకవేదికలూ, ప్రాకారాలూ, ద్వారాలూ, ఇక శిల్పాలు తీర్చిన శిలాఫలకాలతో తాపడం చేయడం, చుట్టూ, తోరణాలూ, ఆయక స్తంభాలూ, నిలువెత్తు ప్రతిమలూ ఆయా స్తూపాల గొప్పతనానికి తార్కాణాలు. స్తూపాలపై విశేషదినాలలో దీపాలు వెలిగించే ఆనవాయితీ ఉండేది. స్తూపాలకు ఎర్రరంగు వేయడం కూడా చేసేవాళ్ళు.

మొదట్లో స్తూపాలనే చైత్యాలనేవారు. తరువాత చిన్న స్తూపాల చుట్టూనో, లేక బౌద్ధ ప్రతిమ చుట్టూనో గోడలతో ఒక పూజామందిరం నిర్మించి వాటిని చైత్యం అనసాగారు. మొక్కు బడులు తీర్చుకునేందుకు చిన్న చిన్న గుళ్ళు కట్టే ఆచారంకూడా ఉండేది.

ఇక భిక్షువులు నివసించేందుకు గదులతో కూడిన గృహసముదాయాలని విహారాలు అనేవారు. చుట్టూ తోటలూ, ప్రార్థనకీ, సమావేశాలకీ, వ్యాయామానికీ సదుపాయాలున్న విహారాలని, ఆరామాలు అంటారు. పట్టణాలకి సమీపంగా, తాత్కాలికంగా వర్షాకాలంలో విడిదిచేసిన తోటలని వర్షారామాలు అనే పద్ధతి ఉంది.

ఓడి బానిసలుగా వలస వచ్చిన ఈ నాగ జానపదులు, ఇంతకు పదింతలై, కృష్ణకు దక్షిణాన గల దేశాలంతా ప్రాకి, ఇపుడు పల్లవకానికే ప్రభువులైనారు. వారిలో ఆర్ష వ్యవహారాలలో ఆసక్తి శూన్యం. కళింగ నాగదేవుని కుమార్తె, మహారాణి వాశిష్ఠీదేవి నేడు వారికి కులదైవమే!

మహారాణి పర్యవేక్షణలో, ఆచార్య నాగార్జునుని ఆధ్వర్యంలో జరుగుతున్న అమరారామ చైత్యపు పునర్నిర్మాణం ఈ నాగజాతీయుల్ని విశేషంగా ఉత్తేజపర్చింది. లక్షలకొలదీ జానపదులు తండోపతండాలుగా ఈ పుష్యపౌర్ణిమకు రాజధానికి రానున్నారు. మహారాణి వాశిష్ఠీదేవి తలపెట్టిన ఈ కార్యం పరోక్షంగా బౌద్ధాన్ని బలపరుస్తుంది. ఆచార్యుని ప్రబోధానికి లోబడి ఈ జనం వైదిక యాజమాన్య ధర్మాన్ని విడిచే ప్రమాదం పొంచి ఉంది.

ఏదో విధంగా దీనిని నివారించడమే తన కర్తవ్యం!

ఈ విధంగా యోచిస్తూ సభాగృహానికి వచ్చిన అమాత్యుడు శివదేవునికి నమస్కరిస్తూ ఎదురు నిలిచారు, నిగమాధ్యక్షుడు విశ్వనాథ శ్రేష్ఠీ, అతని అల్లుడు శిల్పాచార్యుడు, మల్లన్న శ్రేష్ఠీ.

'సమయానికి వచ్చారు. ఏం విస్సన్న శెట్టీ? చైత్యనిర్మాణ కార్యక్రమం ఎలా సాగుతోంది?'

'తమ దయ, అమాత్యా, ఏదో సమావేశం అన్నారు?'

'ఆహా! సమావేశమే. కానీ ఇక్కడ కాదు. కోటలో. మహారాణీ మందిరంలో...'

'ఈ సమయంలో... అంతఃసౌధంలోనా? ఏదో అత్యవసరమైన సమస్య కావచ్చు?' అని తన ఆత్రుతను వెలిబుచ్చాడు, మల్లన్న.

'ఆహ్! సమస్యలు ఏమన్నా కొత్తా? పదండి... ఏ సమస్యకైనా ఉపాయం ఉండకబోదు. మనం ఉన్నది అందుకేగా...'

'మహామంత్రీ... ఒక చిన్న సందేహం', అంటూ అడ్డుపలికాడు మల్లన్న.

'అడుగు, మల్లన్నా, నాకు తెలిసినదయితే చెప్పగలను. ఈ తిష్యపౌర్ణిమ విషయమైతే మాత్రం నన్ను అడగవద్దు. అది మీ నిగమసభ భాధ్యత. దానికి ముందూ వెనకా అంతా మహారాణియే. ఇప్పటికే చక్రవర్తి జైత్రయాత్రకై, గత ఐదేళ్ళగా దేశంలో వ్యావహారిక యంత్రాంగమంతా తలమునకలౌతుంది. ఈ రొంపిలోకి మాత్రం నేను దిగను', అంటూ, ఆ అత్యవసర సభలోని ఆంతర్యం గురించి అతన్ని పీడిస్తున్న శంకను అసంకల్పితంగా వ్యక్తంచేసాడు, శివదేవుడు.

'ఆహాహ్, అదికాదు అమాత్యా, చక్రవర్తి జైత్రయాత్ర గురించే నా ప్రశ్న. ఎలా సాగుతుందో అని... మీకైతే ఎరుక ఉంటుంది కదా?'

'ఈ పౌర్ణిమలోగా వారు యుద్ధం ముగించుకొని రాజధాని వస్తారో రారో అనేకదా మల్లన్నా, నీ అనుమానం?'

'అయ్యయ్యో... చక్రవర్తి ఆచార్యునికి ఇచ్చిన మాటనే శంకించే పాటి వాడనా?' అని లెంపలు వేసుకుంటూ, 'కానీ... ఎంతైనా యుద్ధం కదా? మీ నుండి తెలుసుకుందామనీ...'

‘నిజమే మల్లన్నా, మొన్నటిదాకా నాకూ అనుమానమే... కానీ ఇప్పుడా భయంలేదు. నభవాహనుడు నర్మద వద్ద సంకుల సమరంలో పూర్తిగా పరాజితుడై ఉజ్జయినిలో దాక్కున్నాడు. మన సేనలు ఆరు లక్షలకు పైగా ఆ పట్టణాన్ని ముట్టడించి ఉన్నాయి. విజయం... ఇవాళో రేపో, అంతే. ఏ క్షణాన్నయినా వర్తమానం రావచ్చు’.

‘ఆ తథాగతుని కృపవల్ల అదే జరిగితే, చైత్యానికి ఛత్రప్రతిష్ఠ చేయిస్తాను, ఏమంటావ్ బావా?’

‘అదేం మల్లన్నా? శైవుడవైయుండి, చక్రవర్తి విజయానికి బుద్ధదేవుని కారణభూతుని చేస్తున్నావ్? మహాదేవునికీ విజయంలో ఏ పాత్రా లేదా?’

‘అయ్యయ్యో, అలాగంటే ఎలా అమాత్యా? ఆ బుద్ధదేవుణ్ణి మహాశివుని ప్రతిరూపంగానే కదా కొలుస్తున్నాం?’

‘అదెట్లాగయ్యా? జరిగింది యుద్ధం... అందులో విజయం యుద్ధాధిదేవుడైన కార్తికేయునిది కానీ శాంతి కాముకుడైన బుద్ధునిది అంటే ఎలా?’

‘మీ వాదన నిజమే. కానీ ఈ విజయానికి ప్రోత్సాహం మా గురుదేవులు నాగార్జునులది కదా? మరి వారు బౌద్ధులే?’

‘అయితేనేం? ఆ మహాత్ముని పేరులోనే వీరం తాండవిస్తుంది. నాగ-అర్జునుడు! అటు నాగ శబ్దంలోని కార్తికేయుడు, ఇటు అర్జున శబ్దంలో శస్త్రోపజీవుడైన భరత వీరుడు. ఏమో? ఈ విజయం మహాదేవుని సంకల్పమేనేమో?’



‘రాజకీయ వ్యవహారాలలో తలమునకలౌతున్న మీకు ఈ విధంగా అంతరాయం కలిగించినందుకు క్షమించండి, అమాత్యా’, అని మహారాణి వాశిష్ఠీదేవి, బుడిబుడి నడకల పెద్దకుమారుని వేలు పట్టుకుని, చంకలో చంటివానితో అంతఃపుర సభామంటపం ప్రవేశించింది. పెద్దవాడు శ్రీపులోముడు మూడేళ్ళవాడు. ఇక నాలుగేళ్ళలో ఉపనయనం, యువరాజు పట్టాభిషేకం. కళింగ ఆంధ్ర వంశాలకు అసలు సిసలయిన వారసుడు. సువిశాల భరతఖండాన్ని ఏకఛత్రం కింద పాలించవలసిన భావి చక్రవర్తి. ఇక చిన్నవాడు యజ్ఞశ్రీ శాతకర్ణి, ఇంకా నెలల కందు.

బాలింతరాలి పాలిండ్లు తెచ్చిన నిండుతనంతో అపర గౌరీదేవిలా ప్రకాశిస్తున్న అసామాన్య సౌందర్యరాశి. వేలకువేల పరిచారికలున్నా, రాజకీయ వ్యవహారాలతో సమయం తెమలక పోయినా, బిడ్డల పెంపకాన్ని ఒక క్షణంకూడా నిర్లక్ష్యం చేయని మాతృమూర్తి. అది ఆంధ్ర రాణులకు స్వాభావికం. బిడ్డల రక్షణ విషయంలో వాళ్ళు శివంగులే. రాకుమారులతో తన ఆసనాన్ని అలంకరించిన వాశిష్ఠీదేవి సౌందర్యాన్ని కళ్ళార్పకుండా చూస్తూ అలాగే ఉండిపోయాడు, మల్లన్న.

‘ఏం మహాశిల్పీ? ఏదో తదేకంలో మిమ్మల్ని మీరే మర్చిపోయారు? తమ ఆలోచనలను మాతో పంచుకుంటే ధన్యులమవుతాం’, అన్న మహారాణి మృదువాక్కులకు వాస్తవానికి వస్తూ,

'క్షమించు తల్లీ, కుమారస్వామీ గణపతులతో ఉమాదేవిలా ఉన్న మిమ్మల్ని వీరమూర్తి శాతకర్ణి చక్రవర్తి పక్కనే ఊహిస్తూ ఉండిపోయాను... నాదొక చిన్న మనవి తల్లీ... చైత్యపు ఈశాన్య ప్రాకారంపై, ఆదిదంపతులలా మీ ప్రతిరూపాలు కుమార సమేతంగా చిత్రించేందుకు అనుజ్ఞ ఇస్తే...'

'అదేమి పోలిక మల్లన్న శ్రేష్ఠీ? బౌద్ధక్షేత్రంలో మహాదేవుని చిత్రాలా?'

'అందులో తప్పేముంది, మహారాణీ!' అంటూ, తన మనస్సు వెల్లడించడానికి అదే మంచి అదును అని గ్రహించిన శివదేవుడు, 'ఇది బౌద్ధక్షేత్రమన్నది నిజమే. కానీ దేశం సనాతన బ్రాహ్మణ్యధర్మానికి ఆలవాలం. మన చక్రవర్తి ఏకబ్రాహ్మణుడు! సర్వ ధర్మాలనూ సమదృష్టితో చూసే సంప్రదాయం తమ శాతవాహనులది. అశేషంగా తరలివస్తున్న తమ ప్రజలకు సరియైన సంకేతాన్ని ఇచ్చేందుకు నాదొక సలహా...' అంటూ మధ్యలో ఆగిపోయాడు.

'సందిగ్ధం ఎందుకు మహామంత్రీ, ఆజ్ఞాపించండి. తమరు గురుతుల్యులు, తమమాట శాతవాహనకులానికి శిరోధార్యం'.

'కృతజ్ఞుణ్ణి మహారాణీ, ఈ అశేష ప్రజానీకం ముందు యుద్ధవిజయాన్ని పురస్కరించుకొని మీ రాజదంపతులు వాజపేయ మహాయాగాన్ని నిర్వర్తిస్తే... అటు బౌద్ధం, ఇటు బ్రాహ్మణ్యం, ధర్మ సామరస్యాన్ని చాటినట్లు ఉంటుంది.'

'బాగానే ఉంది. కానీ, ఇంత స్వల్ప సమయంలో...?'

'ఆ విషయం నాకు వదలండి. పౌర్ణమి గడిచిన విదియనాడు ప్రశస్తమైన ముహూర్తం. దశమినాటికి భూ, సువర్ణ, గోదానాలతో యాగం పూర్తిచేయవచ్చు', అన్న శివదేవుని సలహాతో ఏకీభవించినట్లు తలాడించి, ఒక క్షణం యోచించి,

'సరే, అత్తగారితో సంప్రదించి రేపటికి వారి నిర్ణయాన్ని తెలుపుతాను'.

తన ప్రయత్నం సఫలమైనందుకు తృప్తిగా ఊపిరిపీలుస్తూ, 'సంతోషం, ఇక ఈ సమావేశానికి గల కారణం వివరిస్తే...'

'ఆహ్, ఈ ధర్మసంశయంలో అసలు విషయం మరిచాను', అని చిరునవ్వు నవ్వుతూ...

ఇది నాగార్జునాచార్యుని ఆహ్వానబద్ధులై విచ్చేస్తున్న ప్రముఖుల రక్షణ విషయమై తమతో చర్చింప వలసిందని ప్రభువులనుండి వర్తమానం. సామ్రాజ్యంలోని మహాభోజ మహారథులంతా నగర ప్రముఖుల ఇండ్లలోనే విడిది ఏర్పాట్లు చేయవలసిందని వారి సలహా. వారివారి సౌధాలను విదేశాలనుండి వచ్చే రాజులకూ వారి కుటుంబీకులకూ ప్రత్యేకించవలసింది. ఆయా సౌధాల ప్రాకారాలనూ, రక్షణ వ్యవస్థనూ దండనాయకులతో సహా పర్యవేక్షించి తగిన నిర్మాణాలు వెంటనే చేబట్టాలని నిగమసభకూ, శిలావద్ధంకి శ్రేణికీ ఆదేశం.

ముఖ్యంగా పురుషపురం నుండి కుషాణ షా దేవపుత్ర సదష్కణ భీమత్రాతకు మా తండ్రిగారి సౌధంలో విడిది ఏర్పాట్లు. వారి మూలబలమేగాక రక్షణ నిమిత్తం వెయ్యిమంది సాయుధులైన

యోధులకూ, పరిచారక జనానికీ అక్కడే తాత్కాలిక విడిది ఏర్పాట్లు గావించవలసింది. ఈ విషయంలో ఎటువంటి లోటుకూ ఆస్కారం ఉండరాదు', అని విశ్వనాథుని వంక చూస్తూ, 'ఇక పూర్వసాగరదేశాల రాజులు అనేకమంది. ఐతే... అమరావతి ద్వీప ప్రభువుకు మాత్రం ఎటువంటి ప్రత్యేకమైన వసతీ వద్దట. విశ్వనాథ శ్రేష్ఠి ఇంటనే బసచేస్తారట. మీకు తెలుసనుకుంటాను?'

'ఇది నాకైతే ఏమాత్రం అంతుబట్టకుంది మహారాణీ! ఆ మహారాజు ఎవరో? నా ఇంటనే ఎందుకో?'

'అన్నీ తమకే అవగతం అవుతాయి. మరో విషయం. కొండపురి మహాభోజులేగాక అపరాంతసీమ ప్రభువులకు కూడా మీ ఇంటనే వసతి. కొంత అసౌకర్యమయినా తప్పదు', నర్మగర్భంగా నవ్వుతూ.

'కొండపురి వారి విషయం విదితమే తల్లీ, వారు నా బావమరుదులే. కానీ ఈ అపరాంతపు ప్రభువూ?'

'ఆహ్, చెప్పడం మరిచాను, విశ్వనాథ! నీ బావమరిది సింగరట్టకుడిని ప్రభువులు అపరాంతసీమకు మహాభోజుడుగానే కాక లక్ష సైన్యంతో సామంత ప్రభువుగా పశ్చిమ తీర సీమలకు రక్షకుడిగా నియమించారు. జైత్రయాత్రలో సాధించిన అశేష ధనరాసులను నాలుగు వందల ఏనుగులపై ఎక్కించి స్వయంగా రాజధానికి తీసుకు వస్తున్నాడు. వజ్రకటకపు టంకశాలలో నభవాహనుని లక్ష పణాల నాణాలపై, శాతవాహన ధ్వజాన్ని ముద్రించి, చక్రవర్తి ఆగమనానికి నిరీక్షించమని వారికి ఆదేశం'.

ఆనందంతో కనుల నీరుతిరుగగా మ్రాన్పడిపోయిన బావమరుదులను ఉపేక్షించి, అమాత్యునితో,

'మహామంత్రీ, ఇక మీ యాగానంతరం అవసరమయ్యే భూరి దానాలకు కావలసినంత ద్రవ్యం, ఏమంటారు?'





# 42

ఆరు కోసులు సాగిన జన ప్రవాహం. చతురంగ బలాల నాయక వీరులూ, యుద్ధసమయంలో అసామాన్యమైన శౌర్యం కానబర్చిన మహాయోధులూ; తమతమ రథ గజ తురగ వాహనాలపై ముందు నడవగా, విజయస్కంధావారం నుండి వెడలిన శోభయాత్ర, కృష్ణమ్మ అవతలి వడ్డున వజ్రకటకాన్ని చేరింది. ఇక శతాధికంగా అలంకరించిన తెప్పకట్లపై నది దాటడమే తరువాయి.

ముందుగా సింగన్న రట్టకుడి రక్షణలో క్షహరాట్ట సీమలనుండి పరిగ్రహించిన ధనరాసులు– ఇరవై తెప్పలపై కోట్లకొలదీ బంగారు వెండి నాణాలు, కుప్పలు పోసిన వజ్రవైఢూర్యాలు– కనులు మిరుమిట్లు కొలిపేలా కదిలాయి. వాని వెనుక ఉజ్జయనీ సింహాసనం, ఏనాడో విక్రమాదిత్యునికి దేవేంద్రుడు సమర్పించాడట! విక్రమశక సంవత్సర క్రమం అంతమైనందుకు సూచనగా, తలకిందులుగా నిలపబడింది. దాని వెనుక అలంకార రహితమైన తెప్పపై, విరిగిన ఖడ్గాలూ, చినిగిన ఛత్ర చామరాలూ, విజితుడైన నభవాహనుని సమస్త రాజలాంఛనాలూ చిందర వందరగా కుప్పబోయబడి ఉన్నాయి. వాటిని ధాన్యకటకపు వెలుపల ఛండాలులు సంచరించే దారిలో మట్టిలో కలుపవలెనని చక్రవర్తి ఆదేశం. ఇక దాస్యశృంఖలాలలో క్షహరాట్ట క్షత్రపుని అంతఃపుర వాసులైన దేశదేశాల సుందరీమణులు. ఇవి జైత్రయాత్రలో సాధించిన అపూర్వ సంపదలోని ఒకచిన్న భాగం మాత్రమే. వస్తు వాహనాలూ, రథ గజ తురగ బలాలూ అప్పటికే వేర్వేరు స్కంధావారాలకు అప్పగించబడ్డాయి.

జనుల జయజయధ్వానాలు మిన్నుముడుతుండగా మహాంధ్ర సామ్రాజంలోని రాజప్రతినిధుల వేర్వేరు తెప్పకట్లు... ఉచిత లాంఛనాలూ, మహారాజ కట్నాలతో బయలుదేరాయి. దక్షిణాపథంలోని ఆంధ్ర రాజ్యాలు వెరసి ముప్పై ఆరు. వానిలో ధాన్యకటకపు సమీపాన గల కుదురెవటం, ఇంద్రకీలం, పిథృథం, ధనదపురం, యజ్ఞవటం; ఆంధ్రప్రభువుల పూర్వ రాజధానియైన శ్రీకాకుళం; పశ్చిమ రాజధానియైన ప్రతిష్ఠానపురి చుట్టూ గల, నాసికం, పౌధన్యం, నరసల, తగర, కోసలపట్టణ విషయాలు చక్రవర్తిచే నియమింపబడిన అమాత్యుల పాలనలోనే ఉన్నాయి. మిగిలిన నగరాల మహాభోజులూ, మహారథులూ, చక్రవర్తిచే నియమితులైనా... అధికారుల, నిగమసభల పర్యవేక్షణలో ఆయా ప్రదేశాలను ఎంతోకొంత స్వతంత్ర ప్రతిపత్తి కలిగి పాలిస్తారు.

అటువంటివారిలో కొండపురి కొమరన్న రట్టకుడి ఒకడు. ఛత్ర చామర లాంఛనాలతో, తాను స్వహస్తాలతో చేసి ఇచ్చిన శిలాధ్వజం ముందు, ముషికనది లోయలోని గనుల నుండి వచ్చిన జాతి

వజ్రాల రాశి పక్క నిలిచిన తన పెద్దన్నని తనతోటి నిగమసభ్యులకు వేలెత్తి చూపాడు, మల్లన్న. అంతటి ఆనంద సమయంలో తన భార్య వెంటలేదనే చింత, అతనిని బాధించసాగింది. నిండు చూలాలు. ప్రసవ సమయం ఇప్పటికే మించిపోయింది. కష్టమవుతుందేమోనన్న అక్క పలుకు అతని మనస్సును ఏ మూలో తొలుస్తూనే ఉంది. కానీ... గురువాక్యం! రాజాజ్ఞ! ఈ చైత్య ఆవిష్కరణ సమయంలో తాను ఇక్కడ ఉండడం తప్పదు.

'ఎంత త్వరగా కార్యక్రమం పూర్తయితే అంత త్వరగా ఇంట వాలాలి'.

కాలు నిలవక కదం తొక్కుతున్న మల్లన్నతో, 'అవిగో, సామంతప్రభువుల ప్రభలు. ఆహా! ఒకదాని మించి ఒకటి! మహోత్సవంగా ఉన్నాయి' అని అల్లుని ముఖంలోని చింత గమనించి, 'ఏరా అదోలా ఉన్నావ్? అమ్మాయి గురించేనా ఆలోచన? నీ అక్క ఉందిగా, చూసుకుంటుందిలే. అలా దేభ్యంలా ముఖం పెట్టక, కాస్త చిరునవ్వు తెచ్చుకో' అన్న బావ మందలింపుకు మరింత కుంగిపోతూ,

'ఏమో బావా, నాకయితే ఇక్కడ ఉండాలి అనిపించడంలేదు. భ్రమరం ఎలా ఉందో?'

'ఇప్పుడు మనమేమీ చేయలేము. వైద్యులు ఉన్నారు. అచ్చమ్మ ఉంది. స్థిమితం! ప్రదక్షిణ పథంలో చక్రవర్తి పక్కనే ఉండాలని కదా మహారాణి ఆదేశం? నీవు కాకపోతే ఆ శిల్పాల గురించి ఎవరు ప్రభువులకు వివరిస్తారు... అదిగో చూడు, చోళీయుల ప్రభ...'

ఒకదాని వెంట ఒకటిగా... చోళ, పాండ్య, చేర, మహిషమండల, మలయ, శేత, కళభ్ర, కదంబ, గోవర్ధన, కల్యాణ, అపరాంత, అభీర, అనూప, సౌరాష్ట్ర, మాళవ, కోసల దేశాధిపతుల ప్రభలు... భేరీ భాంకారాలతో, నట్టువాంగనల నాట్య ప్రదర్శనలతో నది దాటి రాసాగాయి. చక్రవర్తి ప్రతినిధిగా భాండాగారికుడు ఒక్కొక్క తెప్పనూ కుడిచేత తాకి, వారి వారి వార్షిక కప్పం స్వీకరించిన పిమ్మట ప్రముఖుల కొరకు నిర్దేశించిన ప్రదేశంలో ఆసీనులు కాసాగారు.

అంతలో...

నిర్మలమైన ఆకాశం ఒక్కసారిగా పెళ్ళుమంది.

ధూమకేతువుల్లా మబ్బులు కమ్మాయి. ఉరుములూ! మెరుపులూ! నోట నిప్పులు చిమ్ముతూ మహోగ్ర సర్పరాజం! దిక్కులు పిక్కటిల్లేలా భేరీ నాదం!

చైత్యం చుట్టూ కూడిన జనం ఒక్కసారిగా భయాందోళనలతో నలుదిక్కులా పరిగెత్తారు. ఆకస్మికంగా ఇదేమి ఉత్పాతం?

చీకట్లు అలుముకున్న ఆకాశంలో కనులు మిరుమిట్లు గొలిపే కాంతి పుంజం! మధ్యందిన మార్తాండునిలా ప్రత్యక్షమైన బుద్ధదేవుని ప్రతిరూపం ఆకాశాన్ని నిండింది.

చెవులు తూట్లుపొడిచే నిశ్శబ్దం!

వేయి గళాలు ఒక్కసారే గొంతువిప్పినట్లు...

బుద్ధం శరణం గచ్ఛామి

ధర్మం శరణం గచ్ఛామి

సంఘం శరణం గచ్ఛామి

అనే నినాదాలు ఆకాశాన్ని నిండాయి.

మరునిమేషంలో ఏమవుతుందో తెలియని ఉత్కంఠ!

మంచు కరిగినట్లు, గ్రహణం వీడినట్లూ... నిర్మలమైన ఆకాశం. కృష్ణమ్మ గలగలలు తప్ప వేరే శబ్దం లేదు. లక్షలాది జనంలో ఊపిరి కూడా ఆడనంత ఆతృత..

ధూ......మ్!

అది తూర్పు సముద్ర దేశాల ప్రతినిధులది అనేందుకు దాని రూపురేఖలే నిదర్శనం. మహాచీనంలో నిర్మించిన ఆ నౌక నదీ మధ్యంలో ప్రత్యక్షమైన మరుక్షణమే...

పూర్వ సాగర ద్వీప రక్షాధురీణా...!

మలయ కాంభోజ ధరణీ త్రాతా...!

అయోధియా పుర సంస్థాపనార్యా...!

అమరావతీ దేశ రమా వల్లభా...!

సమర రాఘవా! అభినవ గాంగేయా!

విశ్వనాథ సుతా! శాతవాహన భృత్యా!

రామా!

అనే నినాదాలు ఆకాశాన్నంటాయి.

ఇక్ష్వాకు కులమణి థాయి భూపతీ, కౌండిన్య గోత్రస్థ విష్ణు కాంభోజుడూ, సువర్ణ ద్వీపపతి శ్రీవిజయసదా, మలయ ద్వీపపతి ఐరావతుండూ, మాణిక్యవరపతి ఆంధ్రమణి వల్లభుడూ, యవపురాధీశుడు ఆనందగోత్ర మహాబలుల మధ్య...

రజత ఛత్రమూ, సువర్ణమయ మలయ ధ్వజంతో, రత్న మణిమయ కిరీటధారులయిన నృత్యాంగనలచే పరివేష్టితుడైన అమరావతీ ద్వీపాధిపతి, విశ్వనాథుని సుతుడు, రామవర్మ భూపాలుడు, మూడంతస్తుల నావశిఖరంపై దర్శనమిచ్చాడు.

అతడు...

శాతకర్ణి ప్రభువుకు నమ్మిన బంటు.

పూర్వ సాగర ద్వీపాలలో ఆంధ్ర సార్వభౌమాధికార ప్రతినిధి.

నాగార్జునాచార్యుని ప్రియ శిష్యుడు.

ఆంధ్ర నాగకుల శిఖామణి!



ప్రాగ్సాగర దేశాల్లో
ఆంధ్ర రాజ్యాలు
(క్రీశ. 1వ శతాబ్దం)
కల్యాణి- బొంబాయి
ప్రతిష్ఠానం
తగర-తేర్
కోటిలింగాల
భట్టిప్రోలు - పిటుండరియోన్
ఘంటసాల-కాంటకోస్సిలీ
కొండాపూర్
మహాలంక-మలెంగ్కా
నాగార్జునికొండ
చిత్రతోళం - పూరి
చక్రతీర్థం-చత్రపూర్
కళింగపట్టణం
విశాఖ
అంతర్వేది-అల్లోసైగినీ
కౌద్దూర - గూడూరు
ముత్తుకూరు- మైసోలియా
పల్లక-పల్లవకం-పదౌక్
మన్నేరు-మునార్పా
కంచి
మామల్లపురం
ముసిరి
ఆంధ్రమణి
(అండమాన్)
మాణిక్కవరం
(నికోబార్)
త్రిలింగ
(మియాన్మార్)
పురం
(ప్రోం)
సువర్ణలోక
(సువన్ కలక్)
అయోధియా
కాకుళ
(థాయిలాండ్)
అమరావతి
(వియత్నాం, లావోస్)
విజయ
చంప-కాంభోజ
(కంపూచియా)
కౌథరా-కొద్దూర
పాండుర
క్వాంగ్-టాంగ్
(కాన్టన్)
పటణి
కచ
పులో చందోల్
సింహపురి
(సింగపూర్)
కోటి
ఆంధ్రల
పలెంబాంగ్
కళింగ
మహాలంక
(మగెలాంగ్)
శైభోగ
బాలి

**ఆగ్నేయాసియా - ఆంధ్ర రాజ్యాలు**

మహానది నుండి కాంచీపురం వరకూ ఉన్న తూర్పుతీరంలో అతి ముఖ్యమైన రేవు పట్టణాలు కృష్ణా గోదావరీ తీరప్రదేశంలో ఉన్నాయి. 'ఎఫిటెరియోన్' వాటిలో అతి ముఖ్యమైనది అని పెరిప్లస్ చెబుతుంది. ఇంకా కొన్టకోస్సిలా (ఘంటశాల), కొడ్డూరా (గూడూరు), అల్లోగ్జైని (అదుర్రు), మైసోలియా (ముత్తుకూరు), ఇలా ఈ రేవులన్నీ ఆంధ్రతీరంలోవే.

ఇక ఆగ్నేయాసియాలోని ఊర్ల, దేశాల పాత పేర్లు చూస్తే, ఆ ప్రాంతపు ఆంధ్రుల ఆధిపత్యం ఎలాంటిదో తెలుస్తుంది.

బర్మా పేరు త్రిలింగం. అక్కడి రాజ వంశాన్ని తైలెంగులు అంటారు. తైలెంగ్ వారి భాష. థాయిలాండులోని సింధుశాఖ ప్రాంతానికి ఒకప్పటి పేరు కాకుళ రాజ్యం. ఇక మలేసియాలోని పాలెంబాంగ్ ప్రాంతపు ఒకప్పటి పేరు ఆంధల. బలోంగ్కా (మాలంక), సవన్‌కలక్ (సువర్ణలోక) శిధిలాలలో దొరికిన బుద్ధ ప్రతిమలు అమరావతి శైలివే.

ఇండొనేసియాలోని జావా ద్వీపంలో బోరుబదూర్ మహాస్తూపం ఉన్న ప్రాంతం పేరు మగెలాంగ్ (మహాలంక), ఇక అండమాన్ నికోబార్ ద్వీపాల పూర్వ నామాలు ఆంధ్రమణి– మనక్కవరం.

అంతెందుకు? వియెత్నాం, లావోస్ దేశాల ఒకప్పటి పేరు అమరావతి రాజ్యం. అక్కడి పట్టణాల పేర్లు– విజయ, పాండుర, కౌధూర. అన్నీ కృష్ణాతీరంలోని ప్రాచీన పట్టణాల పేర్లే.

పేర్లలోనే కాదు మత సంస్కృతులలో కూడా, ప్రాచీన ఆంధ్ర దేశానికీ, ఆగ్నేయ ఆసియాకీ చాలా గట్టి సంబంధం ఉంది.

నావ రేవును తాకినంతనే... ఒక్కసారిగా అంతెత్తునుండి ఉరికి, నేల తాకిన మరుక్షణమే చిరుతపులి వలె పరుగిడుతూ, దిగ్భ్రమతో నోట మాటరాని విశ్వనాథ శ్రేష్ఠి కాళ్ళపై బడ్డాడు.

ఐదేళ్ళ క్రితం... గురుదేవుని కోర్కెపై తన బంటు రాముడిని శ్రీపర్వతంలో వదలివచ్చిన మల్లన్న ఆశ్చర్యం ఇంతా అంతా కాదు. ఈ అమరావతీ ద్వీపాధీశుడు మన బోయరాముడా? కలా? నిజమా?

'ఏం చిన్దొరా? ఆనాడు ఆచార్యులు అడిగినంతనే నన్ను అప్పగించినావ్', అన్న మాటలతో తెలివి వచ్చిన మల్లన్న, 'బానిసను అనేకదా? పెద్దొరకి మాటయినా చెప్పలేదు' అంటున్న రాముడిని గాఢంగా కౌగలించుకొని, ఆనందభాష్పాలు కనులనిండగా, 'బోడి బిక్కువయ్యావు అనుకున్ననురా... రాముడూ... మారాజువయ్యావే?' అని కాళ్ళ సత్తువ సన్నగిల్లగా అలాగే ప్రాగ్నగర ద్వీపాధిపతి రామవర్మ మహాభోజుని భుజంపై వాలిపోయాడు.



# 43

శాలివాహన శకం. ఆరవ సంవత్సరం. పుష్య పౌర్ణమి పర్వదినం.

చైత్యపు తూర్పు ద్వారపు ఆయకస్తంభాలు. అవి దాటేందుకు ఆచార్యుని అనుమతి కొరకు వేచి ఉన్న చక్రవర్తులూ, ఇతర ప్రముఖులూ...

ఒక పక్క సమస్త తుషార సీమలకు అధిపతి కుషాణ సదష్కణ షాహీ, మరో పక్క దక్షిణాపథపతి గౌతమీ పుత్ర శ్రీ శాతకర్ణి. వెనుక సామంత దేశాధిపతులూ, మహాచీనపు హాన్ సామ్రాట్టు సోదరుడు యాన్ రాకుమారుడూ, రోమా చక్రవర్తి డొమీషియన్ ప్రతినిథి, ప్రో-ప్రీటర్, క్వింటస్ సెర్టోరియస్, ఇంకా, పూర్వ సాగర ద్వీపాధిపతులూ...

ముహూర్తం మించిపోతుంది!

ఆచార్యుల జాడలేదు?

మల్లన్నకి ఆదుర్దా పెరిగిపోతుంది. భ్రమరమెలా ఉందో? గురుదేవుల ఆలశ్యం దేనికో?

అంతలో...

రోమా దేశపు యవన సేనాపతి, కువింద శాస్త్రారితో మాట్లాడుతూ తన వైపే చూస్తున్న బౌద్ధాచార్యుడు.

'ముఖం ఎక్కడో చూసినట్లుందే?'

ఆహ్! ఆనాడు రామునికి తాళపత్రాలు ఇచ్చిన సోమదేవుడు కాదు కదా? అవును అతడే! తనవంకే వస్తున్నాడు...

'వందనాలు స్వామీ, చిరకాల దర్శనం.'

'ఆహ్, మల్లన్నదొరా... గుర్తించరేమో అనుకున్నాను', అని పక్కన ఉన్న అతని సహాధ్యాయి, చిన్ననాటి నేస్తం అయిన శాతకర్ణి చక్రవర్తి వంక తిరిగి నవ్వుతూ, 'ప్రభూ, ఈ మహాశయుడే ఆచార్యుని ఆలశ్యానికి కారణం. ఏమీ తెలియనట్టు, చూసారా... ముఖంలోని అమాయకత్వం?'

'అవునవును... ఈ మహాచైత్యాన్ని మా సీమకు అనుగ్రహించిన మహాశిల్పి. తెలియకేం? మా దేవేరి వీరి శిల్ప రచనా చాతుర్యాన్ని పొగడని క్షణంలేదు'.

## అమరావతి స్తూపం - ఉఛ్ఛ దశ

అమరావతి స్తూప శిల్పకళ శాతవాహనుల కాలంలో ఉచ్ఛదశకి చేరింది. ఆచార్య నాగర్జునుని ప్రోత్సాహంతో శాతవాహనులు చైత్యాన్ని పునరుద్ధరించి అభివృద్ధి పరిచి ప్రాకారాన్ని ఆనాటి వైభవానికి అద్దం పట్టే అద్భుతమైన శిల్పాలతో పునర్నిర్మించారు. గౌతమీ పుత్రుని వారసుల కాలంలో కూడా స్తూపాన్ని అభివృద్ధి చేసిన నిదర్శనాలు– పులోమావి, యజ్ఞశ్రీ, శివశ్రీ శాతకర్ణుల శిలాశాసనాలు.

మహోన్నతస్థాయికి ఎదిగిన ఆంధ్ర శిల్పం, దేశ విదేశాల బౌద్ధ శిల్పానికి వరవడి అయింది. అమరావతి శైలి శిల్పాలు జావా, సుమాత్రా, బర్మా, మలయాలలోనే కాక, చైనా, కంబోడియా, వియెత్నాం, శ్రీలంకలలో కూడా కనిపిస్తాయి. కంబోడియా, జావాలలో దొరికిన బుద్ధుని కాంశ్య విగ్రహాలు, అమరావతి శిల్పాన్ని పోలి ఉంటాయి. అవి, కృష్ణాతీరం నుండే ఎగుమతి అయివుండ వచ్చని శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

‘అందుకనేనేమో శాతకర్ణి ప్రభువు ఈ శిల్పికి అంత అమూల్యమైన ప్రతిఫలం ముట్ట చెప్పారు?’

వారనే మాటలలో గూఢార్థం ఏమాత్రమూ అర్థం కాక మొహం తేలవేసిన మల్లన్న అవస్త చూసిన చక్రవర్తి మరింతగా నవ్వుతూ, ‘అవునవును సోమదేవా బుద్ధదేవునికే తన శిల్పరచనతో ప్రాణంపోసిన అపర బ్రహ్మ, వారికి మహారాణిని మంత్రసానిని చేయడం ఏపాటికి?’

‘అంతేనా? విశ్వానికే తలమానికమైన రసాయన శాస్త్రవేత్తా, మహత్తర సిద్ధవైద్యుడూ అయిన, ఆచార్య నాగార్జునుడిచే తన భార్యకు పురుడు పోయించడం... మీలాంటి చక్రవర్తులకు కూడా సాధ్యం కాదేమో?’

కొంత కొంతగా విషయం అవగతమవుతున్న కొలదీ, మల్లన్న ఆతృత మరీ పెరగసాగింది. అది గ్రహించిన సోమదేవుడు, ‘భయం లేదు మల్లన్నా, బౌద్ధం, బ్రాహ్మణ్యంలా కవలలు. అదృష్టవశాత్తూ, ఆచార్యులే విషయం తెలుసుకొని దగ్గరుండి శస్త్రవైద్యం ద్వారా కాన్పుచేసారు. తల్లీ పిల్లలూ క్షేమం. ఇక నిశ్చింతగా మీరీ మహోత్సవంలో పాలుపంచుకోవచ్చు’.

మనసుకు అందని ఉద్వేగంతో, ఆనందాశృవులతో మసకబారిన కనులతో అమరారామ మహాచైత్యాన్ని చూస్తూ అలాగే నిశ్చేష్టుడై నిలిచిపోయాడు, ఆ శిల్పి.



# 44

## అమరావతి స్తూపం వద్ద, క్రీ.శ. 1987

'అంత గొప్ప నాగరికతను ప్రతిబింబించే మన వాస్తుసంపద, మనవద్ద లేకుండా... ఎక్కడో ఇంగ్లాండులో? ప్చ్' అంటూ నిట్టూర్చాను.

'ఆహ్, ఉంటే మాత్రం నీవు ఏం ఉద్ధరించబోయావులే? ఎంతసేపూ... తిన్నామా? తాగామా? సినిమా చూసామా? తప్ప వేరే జ్ఞానం లేని నీలాంటి వాళ్ళు ఉంటారనే కదా, అవి ఇంగ్లాండుకి పంపించారు. అక్కడ బ్రిటిష్ మ్యూజియంలో అయితే ప్రతిరోజూ వేలకొలదీ పర్యాటకులు, కనీసం చూసేవాళ్ళయినా ఉన్నారు', అన్నాడు రమేష్.

ఆ క్షణంలో నాకు నిజమే అనిపించింది. కోపం కూడా వచ్చింది.

ఉక్రోషం!

అది రమేష్ చేసిన ఎగతాళికో, లేక నేను కూడా మన దేశ చరిత్రపైనా సంస్కృతిపైనా ఏమాత్రం అవగాహన లేని మూర్ఖుడినే అనే భావం నాలో కలగడం వల్లనో తెలియదు. అది రమేష్ పైన చూపిస్తూ, 'అయితే ఇక్కడికి ఎందుకు తీసుకొచ్చావురా? ఈ మట్టి దిబ్బ చూడటానికా? జీవితంలో ఎప్పుడో లండన్ పోకపోము. అక్కడే అమరావతిని చూడవచ్చు' అన్నాను విసురుగా.

'ఆహహ్హా', అని ఉపేంద్ర విరగబడి నవ్వుతూ, 'నీ మొహానికి లండన్ దాకా ఎందుకులేరా? చెప్పు, నువ్వు మద్రాసుకు నెలకు ఎన్నిసార్లు వెళతావు?' నవ్వు దిగమింగుకుంటూ సీరియస్‌గా అడగాలని వాడు చేసే ప్రయత్నాలైతే ఫలించలేదు.

'ఏం? ఎందుకు? నెలకి పదిరోజులు అక్కడే ఉంటాను. మా రీజనల్ ఆఫీసు అక్కడే', అన్నాను.

'మద్రాసులో ఏమేం చూసావురా? చెప్పు', ఉపేంద్ర ప్రశ్నలో ఆంతర్యం అర్థం కాలేదు. కానీ ఎందుకో అది మన సంస్కృతికే సంబంధించినది అని మాత్రం ఊహించాను.

'ఆల్మోస్ట్ ఎవిరిథింగ్... ఏం?' నా మనస్సు అర్జెంటుగా ఆన్సరు కోసం వెదకసాగింది. 'ఆహ్! మహాబ్స్, పాండీ... ఇంకా...'

'ఆ ఆ! కానివ్వు. వీడిసంగతి తెలుసు కదరా? సందు దొరికితే ECR రోడ్డు ఎక్కుతాడు', అంటూ అడ్డమొచ్చిన రమేష్, 'చెప్పరా నీ లిస్టు, ECR లో ఉన్న బార్లు, డిస్కోలూ', అని మళ్ళీ నవ్వసాగాడు.

'సరే ECR వదిలెయ్యి. సిటీలో ఏమి చూసావురా?' అన్నాడు ఉపేంద్ర, ఆపుకోలేకుండా నవ్వుతున్న రమేష్‌ని వారిస్తూ.

'పోరా, ఆవూళ్ళో ఏముంది? సినిమాలూ, హోటళ్ళూ తప్ప. అంతగా అయితే గుళ్ళూ గోపురాలూ తిరగాలి. ఈ వయసులో... ఐ హేవ్ బెటర్ థింగ్స్ టు డూ', అన్నాను.

'ఓకే ఓకే. అసలు విషయానికి వద్దాం. మద్రాసులో మ్యూజియం ఎప్పుడైనా చూసావా?'

'ఊహూ... ఎక్కడా? ఎగ్మోరులో కదా. ఆ... బయటనుంచి చూసాను', అప్పటికి ఇక నా కోపం అణుచుకోలేక, 'అయితే ఏంటంట? అయినా మద్రాసుకీ మన ఈ అమరావతికీ ఏమిటి సంబంధం?' ఆల్‌మోస్ట్ అరిచాననుకుంటా.

'విను. ఈ అమరావతి శిల్పాలలో సగం లండన్ బ్రిటిష్ మ్యూజియంలో ఉంటే, మిగిలిన సగం మద్రాసు మ్యూజియంలో ఉన్నాయి'.

'ఎందుకు? అయినా మనోళ్ళకి అదేం పోయేకాలంరా? ఆ ఇంగ్లీషోళ్ళు పట్టుకు పోయారంటే సరే... ఇక్కడే ఉంచవచ్చుగా? అక్కడెక్కడో మ్యూజియంలో దేనికి?' అంతవరకూ ఉన్న కోపం దిగిపోయింది. తెలుసుకోవాలన్న జిజ్ఞాస పెరిగింది. 'ఈ సారి మద్రాసులో మ్యూజియంకి వెళ్ళి చూడాలి', అనుకుంటూ, ఉపేంద్రని అడిగాను.

'చెప్తా విను', అని మొదలుపెట్టాడు, ఉపేంద్ర.



# 45

## ఫోర్ట్ సెంట్ జార్జి, మద్రాస్, క్రీ.శ. 1881

రైడింగ్ బూట్లు, ఖాకీ ప్యాంటు, తెల్లని బుష్ కోటు, తలపై థెర్మోకోల్ సన్ హ్యాట్. కూం నదిపై కొత్తగా కట్టిన బ్రిడ్జి దాటాడు క్యాప్టన్ హెన్రీ కోల్. సాయంకాలపు సముద్రపు గాలి, అందమయిన కూం నది. పచ్చని మైదానాలు. ప్రెసిడెన్సీ కాలేజి వైపు గుర్రాన్ని నడిపించాడు.

ఎంత త్వరగా పని ముగించుకుని సిమ్లాకి పారిపోతే అంత మంచిది.

డిసెంబరు... జనవరి...

'ఈ రెండు నెలలు తప్ప సౌత్ ఇండియాలో పని చేయడం కష్టం. రెండు నెలల్లో ఎంత చేయగలం? అక్కడ ఢిల్లీ ఆగ్రాలలో విపరీతమైన పని ఉంది. ఆగ్రాలో పురాతన శిల్పాల ప్లాస్టర్ మోల్డులు చేసే కార్ఖానా వచ్చే సంవత్సరానికి రెడీ అవుతుంది. మార్చినెల తరువాత ప్రయాణం కష్టం'.

'ఈ శ్రీరంగం గొడవ సెక్రెటరీ ఆఫ్ స్టేట్ వరకూ పోయింది. ఆ దేవాలయాన్ని రెలిజియస్ ట్రస్టుకి అప్పగించి చాలా తప్పుచేసారు. ఈ సివిల్ సర్వెంట్లకి దూరదృష్టి లేదు. 'సౌత్ ఇండియాలో మాన్యుమెంట్స్ అన్నింట్లో హిందూ పూజలూ పునస్కారాలూ! వాటిని నిలిపివేస్తే కానీ ఆ పురాతన కట్టడాలను రక్షించలేము' అనే కదా నా రిపోర్ట్? 'క్యూరేటర్ ఆఫ్ ఏన్షియెంట్ మాన్యుమెంట్స్‌గా అది నా బాధ్యత! దట్ కనింగ్హామ్! నేను అనవసర విషయాలలో తలదూర్చాను అంటాడా? ఎంత ఆర్కియాలజికల్ సర్వేకి డైరెక్టర్ జెనరల్ అయితే మాత్రం? ఇంతవరకూ మద్రాస్ ప్రెసిడెన్సీ వైపు వచ్చిందే లేదు. ఇక్కడి వాస్తవాలు అతనికేమి తెలుసు?'

'యూ ఆర్ రైట్, క్యాప్టన్', అని తలవూపాడు రాబర్ట్ స్యూవెల్, ఆర్కియాలజికల్ సర్వే సూపరింటెండెంటుగా కొత్తగా పదవీ బాధ్యతలు స్వీకరించిన మద్రాసు క్యాడర్ సివిల్ సర్వెంట్. బళ్ళారి జిల్లాలో హోస్పేట దగ్గర విజయనగర రాజుల పాత రాజధాని శిధిలాలను ప్రపంచానికి పరిచయంచేసిన ప్రఖ్యాతి అతనిదే. 'కానీ... లోకల్ హిందూల సెంటిమెంట్లని కూడా గౌరవించడం మన బాధ్యత. ఈ మద్రాస్ ప్రెసిడెన్సీలో మాత్రమే, కొన్ని వేల హిందూ దేవాలయాలు ఉన్నాయి. వాటి నన్నింటినీ పరిరక్షించడం మన డిపార్టుమెంటుకి సాధ్యమా? కాస్త పట్టూ విడుపూ ఉంటే నష్టం లేదు కదా?' అని సర్దిచెప్పబోయాడు.

'ఇటీజ్ ఎ కాంప్రమైజ్. ప్రతి ఒక్క విషయంలో ఏదో ఒక అడ్డంకి... లోకల్ సెంటిమెంట్, బడ్జెట్ లోటు, వాతావరణం, ల్యాండ్ డెవలప్‌మెంట్, ప్రాపర్టీ లా... ఇలా ప్రతిదానికీ తలవంచుతూ

## సాంచీ స్తూపం

అశోకుడు, బుద్ధుని అవశేషాలను 84 వేల కలశాలలో భద్రపరిచి, కలశానికి ఒక స్తూపంగా దేశమంతా కట్టించాడట! కాలక్రమేణా, కాపాడే నాథుడులేక ఆ స్తూపాలన్నీ శిథిలాలయి మట్టిలో కప్పబడిపోయాయి. అయితే మన అదృష్టవశాత్తూ, సాంచీ స్తూపాలు మాత్రం కాలగమనాన్నీ, ప్రకృతి వైపరీత్యాలనీ జయించి యథాతథంగా నిలిచాయి. పాటలీపుత్రం నుండి పశ్చిమ సముద్రతీరపు రేవు పట్టణాలకు వెళ్ళే రాజమార్గంలో విదిశ ఒక మహాపట్టణం. ఆ ఊరికి ఉత్తరాన సాంచి కొండపై మూడు స్తూపాలను 1815 లో జెనరల్ టాయ్లర్ గుర్తించాడు. చుట్టూ పెరిగిన చిట్టడివే రక్షణగా, 6 శతాబ్దాలు మానవ సంచారానికి దూరంగా, భద్రంగా నిలిచి ఉన్న ఆ స్తూపం ఒక్కసారిగా పురావస్తు శాస్త్రజ్ఞులు, నిధి నిక్షేపాలకై వెదికే 'ట్రెజర్ హంటర్స్' వాతబడింది.

1822 లో క్యాప్టన్ జాన్సన్ అనే మహానుభావుడు, భోపాల్ సంస్థానంలో రాజకీయ ఏజెంట్, పెద్ద స్తూపాన్ని నిట్టనిలువుగా తవ్వడంవల్ల స్తూపం చుట్టూ ప్రాకారమే కాక పశ్చిమ తోరణం పూర్తిగా కూలిపోయింది. అలెగ్జాండర్ కనింగ్హామ్, క్యాప్టన్ మెయ్సీలు కూడా తవ్వకాలు జరిపి అవశేషాల కలశాల కోసం గాలించారు. వీళ్ళే కాక స్థానికులు కూడా తమవంతు అందిపుచ్చుకుని, శతాబ్దాలుగా యధాతథంగా నిలిచిన స్తూపాల్ని అర్ధ శతాబ్దంలో శిథిలావస్థకి తెచ్చారు. ఎంతవరకంటే, అక్కడి స్థానిక జమీందారు, ఎంతో తెలివిగా, కొండపైన పనికిరాకుండా పడి ఉన్న అశోకుని స్తంభాన్ని ముక్కలుచేసి, చెరుకు గానుగకి ఉపయోగించాడట! 1881లో మేజర్ హెన్రీ కోల్ ఆ స్తూపాన్ని పునరుద్ధరించి, మనకి దక్కించాడు.

పోతే, భావి తరాలకు ఏమీ మిగలదు. మన ప్రాచీన సంస్కృతి మ్యూజియంలకే పరిమితమవుతుంది', అన్నాడు హెన్రీ కోల్. అతడు సౌత్ కెన్సింగ్టన్ మ్యూజియం సంస్థాపకుడైన, సర్ హెన్రీ కోల్ కుమారుడు... యువకుడు, వేడి రక్తం!

'నేను మీతో ఏకీభవిస్తాను, అది ఇప్పుడు పనికిరాక పడివున్న శిథిలాల విషయంలో ఎంతో ముఖ్యం. ఫర్ ఎక్జాంపుల్, హంపిలోని శిథిలాలు... వాటిని మ్యూజియంలకి తరలిస్తే ఒకప్పటి ఆ మహానగర ప్రాముఖ్యం నాశనం అవుతుంది. అందుకని వాటిని అలాగే వదిలివేయలేము. ఉన్నచోటే నిలిపి పరిరక్షించడం ఎంత కష్టసాధ్యమైనా, అది మన బాధ్యత. ఐతే, హిందూ దేవాలయాల విషయంలో అంత అర్జెన్సీ లేదు. లివింగ్ టెంపుల్స్ మే బి లెఫ్ట్ టూ ది వర్షిపర్స్. ఆ విధంగానైనా అవి ఉన్నచోటనే ఉంటాయి', అన్నాడు స్యూవెల్, అతనిని శాంతింపజేస్తూ.

'మీరు చెప్పేది వినడానికి బాగానే ఉంది. కానీ వాస్తవం మరో విధం. బౌద్ధగయ దేవాలయం విషయంలో ఏమయింది? ప్రాచీన కట్టడానికీ, ఇప్పుడు కట్టిన నూతన దేవాలయానికీ ఏమాత్రం సాపత్యం లేదు. పురాతన వాస్తుని పూర్తిగా నాశనం చేసి ఆ ప్రదేశంలో కొత్త కట్టడాన్ని నిలిపారు. రేపు ఈ దక్షిణాది దేవాలయాల్లో అదే విధంగా అవదని గ్యారంటీ ఏది?'

'దాని గురించి అంత ఆందోళన అనవసరం, క్యాప్టన్. సౌత్ ఇండియాలోని దేవాలయాలకి ప్రెసిడెన్సీ పర్యవేక్షణలో ట్రస్ట్ బోర్డులు ఏర్పాటు చేసి, వాటి 'బై-లా'లలో ఆగమ శాస్త్రానికి విరుద్ధంగా ఎటువంటి నిర్మాణాలూ చేపట్టరాదని శాసిస్తే చాలు. హిందూ సంప్రదాయంలో దేవాలయ నిర్మాణ శైలిని పరిరక్షించేందుకు తగినన్ని రూల్స్ అండ్ రెగ్యులేషన్స్ నిక్షిప్తమై ఉన్నాయి. ఇక మన డిపార్టుమెంటు శిథిలావస్తలో ఉన్న కట్టడాల పరిరక్షణపై కాన్సంట్రేట్ చేయడం మంచిది'.

'ఆహ్! శిథిలాలు... ఎక్కడున్నాయి మిస్టర్ రాబర్ట్? తవ్వకాల్లో బయటపడిన ప్రతి స్థలంలో, ముఖ్యమైన శిల్పాలూ, శాసనాలూ ఇప్పటికే మ్యూజియంలలో చేరాయి. ఇక మిగిలింది ఇటిక రాళ్ళూ, పనికిమాలిన మట్టి గూళ్ళూ... 'రెచెడ్ బ్రిక్ హొవెల్స్!' అని తన ఎదురుగా ఉన్న ఫైలును స్యూవెల్ ముందుకు తోస్తూ, 'కృష్ణా జిల్లా కలెక్టర్, హార్సుఫాల్ రిపోర్టు చూసారా?' అని అడిగాడు క్యాప్టన్ కోల్.

'హార్సుఫాల్ ఈజ్ యాన్ ఇడియట్! ఆ రిపోర్టును మీరు పట్టించుకోకండి. అమరావతి గురించి నాకు తెలిసినంత చాలా కొద్ది మందికి తెలుసు...' అని చెప్పసాగాడు, రాబర్ట్ స్యూవెల్.

'పురాతన శాస్త్రంలో నా ఇంట్రెస్టు అమరావతిలోనే మొదలయింది...



'అప్పుడు నేను మంగళగిరిలో అసిస్టెంటు కలెక్టరుగా ఉన్న రోజులు...

మీ తండ్రిగారి పుణ్యాన, అమరావతి శిల్పాలు ప్యారిస్ నగరంలో ప్రదర్శించబడటం జరిగింది. ఒక్కసారిగా ఆ స్తూపం గురించి ప్రపంచమంతా సంచలనం... సెక్రెటరీ ఆఫ్ స్టేట్ నుండి ఉత్తర్వులూ, గవర్నర్ జెనరల్, లార్డ్ మేయో నుండి ఆదేశాలు. అప్పటి కృష్ణా జిల్లా కలెక్టరు జే ఏ సీ బాస్వెల్. వారి వెంట మొదటిసారి అమరావతి చూసాను. ఆ గ్రామం చుట్టుపక్కల ఉన్న బౌద్ధమతానికి సంబంధించిన శిథిలాలను పరిశీలించి బోర్డ్ ఆఫ్ రెవెన్యూకి ఒక రిపోర్ట్ పంపాము. ఆ స్తూపం పూర్తిగా పరిశీలించాలని ఎందుకో నాలో ఆకాంక్ష... కానీ అప్పటికి పురాతత్వ శాస్త్రంలో నాకు అనుభవం శూన్యం. తవ్వకాలు జరిపి దొరికిన శిలలను అదే స్థానంలో ఉంచి, వాటిపై నివేదిక తయారుచేసేందుకు అనుమతికోరుతూ, అందుకు ప్రభుత్వం నుండి ధన సహాయానికి అర్జీ పెట్టాను'.

'అవును, నాకు గుర్తే! అప్పుడే మీ గురించి మొదటిసారిగా విన్నాను. 1871 వేసవిలో అనుకుంటా? లండనులో. సెక్రెటరీ ఆఫ్ స్టేట్ నుండి కబురు వస్తే మా తండ్రి గారికి తోడుగా వెళ్ళాను. ఏదైనా ఆచరణీయమైన ప్లాన్ ఉంటే ప్రభుత్వ సహకారానికి ఎటువంటి ఇబ్బందీ లేదు, కానీ ఆ పథకాన్ని కార్యాచరణలో పెట్టేది ఎవరు? అనే ఆ కమిటిలో తర్జన భర్జన'.

'ఓహ్? నాకు ఈ విషయం తెలియదు. ఎవరెవరున్నారో?'

'ఇంకెవరు? మై ఫాథర్; ఫెర్గుసన్ అండ్ సర్ వాల్టర్ ఎలియట్. ఆహ్! రాయల్ ఏష్యాటిక్ సొసైటీ లైబ్రేరియన్, పేరు గుర్తు రావడం లేదు... రోస్ట్ అనుకుంటాను'.

'యెస్, విలియం రోస్ట్. శాసనాల ఫాసిమైల్ నకళ్ళ విశ్లేషణ కొరకు కొన్ని వారికి పంపాను. పురాతన లిపులు చదవడంలో మంచి దిట్ట! ఇంతకూ వాళ్ళ నిర్ణయం ఏమిటో?'

'మై ఫాథర్ హాడ్ సజెస్టెడ్ ఫెర్గుసన్. ఐతే అతడు నా వల్లకాదు అని బర్గెస్ పేరు సూచించాడు. కానీ బర్గెస్ అప్పటికే బాంబే ప్రెసిడెన్సీ సర్వే బాధ్యతలు స్వీకరించడంతో వేరే గత్యంతరం లేక జిల్లా కలెక్టర్ బాస్వెల్‌కి ఆ బాధ్యత అప్పగించారు'.

'అయితే... నా పేరు ఎలా ప్రస్తావనకు వచ్చింది, క్యాప్టన్?'

'నోనో, ఇట్ వాజ్ నెవర్ అండర్ కన్సిడరేషన్. అనుభవం లేదని పక్కన పెట్టారు', అని చిరునవ్వు

నవ్వి, 'ఇక ఎలియట్ అయితే ఎవరన్నా మంచి PWD ఆఫీసరుకు ఆ బాధ్యతని ఇవ్వవలసిందిగా సూచించాడు. కానీ ఇండియాలోని ఆఫీసర్ల కన్నా లండనులో తర్ఫీదు పొందిన వారు అయితే మంచిదని ఫెర్గుసన్ అభిప్రాయం. అది ఎలియట్, ఫెర్గుసన్‌ల మధ్య వాగ్వాదానికి దారితీసింది'.

'ఎందుకో?'

'ఇంకెందుకు? ఇండియాలో అమెచ్యూర్ ప్రభుత్వాధికార్ల నిర్లక్ష్యమే ఇప్పటి పరిస్థితికి కారణమని ఫెర్గుసన్ అభిప్రాయం. ఇక సర్ వాల్టర్ ఊరుకుంటాడా? మద్రాసులో ఉన్నంత వరకూ ఆ శిలలను జాగ్రత్తగానే కాపాడాం. ఇక్కడ లండనుకి వచ్చాకే అవి నిర్లక్షానికి లోనయ్యాయి అంటారు. మరి ఎటూ తేల్చని కమిటీ, నిర్ణయాన్ని మేజర్ జెనరల్ కనింగ్హామ్‌కి వదిలేసింది'.

'యాజ్ యూజ్యువల్, ఆయన వద్దనుండి జవాబు రావడానికి ఐదేళ్ళు పట్టి ఉంటుంది, అంతేకదా? ఆఖరికి ఎవరూ దొరకక ఆ పని నాకే అప్పగించారు. అయితే, దానికి లక్ష ఆంక్షలూ! విడిగా పడి ఉన్న రాళ్ళని ఒక షెడ్డులో భద్రపరిచి, లోకల్ మునసబు సహాయంతో కాపలాకి ఒక ప్యూనుని నియమించి వచ్చాను. నెలకి ఐదు రూపాయలు జీతం. స్తూపం చుట్టూ ఒక గోడని నిర్మించేందుకు కూడా సూచించాను. ఈలోగా ఇంగ్లాండు వెళ్ళవలసి వచ్చింది'.

'మీ కాంపౌండు వాల్ ప్రపోజల్ని బర్గెస్ తిరస్కరించాడు. ఆయనే కదా మీరు వచ్చేవరకూ సౌత్ ఇండియా సర్వేకి ఇన్‌చార్జ్. గోడవల్ల లాభం కంటే నష్టమే ఎక్కువట! అది పనికిమాలిన తెలుగు కుర్రవాళ్ళకి అనవసరమైన టెంప్టేషన్, గోడ దూకి అల్లరి పనులకి పాల్పడుతారట! నౌ... దట్ యూ ఆర్ హియర్, వీ కెన్ సీ సమ్ ప్రోగ్రెస్', అని తల పైకెత్తి ముఖద్వారంపైనున్న రంగుటద్దపు వెన్టిలేటర్ వంక దీర్ఘంగా చూస్తూ,

'లెటజ్ హోప్, క్యాప్టన్. మీ అమరావతి ప్రోగ్రాం ఎప్పుడు? మీ ప్రపోజల్ ఏదైనా సరే, నా సపోర్ట్ మీకు ఎల్లప్పుడూ ఉంటుంది'.



### తండ్రికి తగ్గ తనయుడు

18వ శతాబ్దపు రెండో సగంలో ఇంగ్లాండులో ఒక్కసారిగా భారతీయ కళలమీద శ్రద్ధ పుట్టుకొచ్చింది. దీనికి కారణం పారిశ్రామిక విప్లవం వల్ల పెరిగిపోయిన నగరాలు కళ్ళకు కంటకాలుగా తయారవడంతో, నిర్మాణ పద్ధతులలో మార్పులు చేసి, ఫ్యాక్టరీలనీ, కర్మాగారాలనీ కంటికింపుగా కొత్త కొత్త రీతులలో అందంగా తీర్చిదిద్దాలనే ధృఢసంకల్పం. సర్ H H కోల్ యొక్క ఈ సంకల్పం ఒక ఉద్యమంగా మారింది. ఓవెన్ జోన్స్, రిచర్డ్ రెడ్గ్రేవ్, మాథ్యూ డిగ్బీ వ్యాట్ మొదలైన ప్రముఖులు అతనితో కలిసారు. ప్రిన్స్ ఆల్బర్ట్ అండ దొరికింది. ఇంకేం? సౌత్ కెన్సింగ్టన్ మ్యూజియం స్థాపించబడింది. 1851 లో లండనులో మొట్టమొదటి పారిశ్రామిక డిజైన్ ఎగ్జిబిషన్. భారతీయ వాస్తు కళలూ, హస్తకళలూ పరిశ్రమల నిర్మాణ పద్ధతులకి జోడించడం మొదలయింది. 1867లో ప్యారిస్ నగరంలో అమరావతి శిల్పాల ప్రదర్శన అతడి ప్రోద్బలం వలనే జరిగింది.

అతని కుమారుడే మేజర్ హెన్రీ కోల్. శిధిలమయిన ప్రాచీన భారతీయ సంస్కృతికి అద్దంపట్టే కట్టడాలను అవి ఉన్నచోటనే పునర్నిర్మించి సంరక్షించాలనే అతడి ధృఢ దీక్ష. 1880 లలో కన్సర్వేటర్ ఆఫ్ ఏన్షియెంట్ మాన్యుమెంట్సుగా ఇండియాలో అనేక కట్టడాలను పునరుద్ధరించాడు. అప్పుడప్పుడే నిర్మించబడుతున్న భారత రైలు మార్గాలు, బాధ్యత తీసుకున్న వెంటనే దేశమంతా సుడిగాలిలా పర్యటించేందుకు సాయపడ్డాయి. అయితే అమరావతి విషయంలో మాత్రం అతడి ప్రయత్నాలేవీ ఫలించలేదు.

# 46

గుండ్లకమ్మ నదిపై రైలు బ్రిడ్జి పని చురుకుగా సాగుతుంది. ఇంకొన్నాళ్ళలో మద్రాసు నుండి బెజవాడకి రైలు కోచిలో పోవచ్చేమో. కానీ ప్రస్తుతానికి ఒంగోలు స్టేషనే ఆఖరు ఇక ముందుకు వెళ్ళాలంటే లార్డ్ బకింగ్హామ్ నిర్మించిన కాలువ మార్గమే దిక్కు.

ఇరువైపులా ఉప్పుమడులు. పన్నెండు రైస్ బోట్లలో డెబ్బై మంది సిబ్బంది. ఆర్టిస్టులూ, డ్రాఫ్ట్సమెన్లూ, స్టోన్ వర్కర్లు, ప్లాస్టర్ మోల్డులు తయారుచేసేవాళ్ళూ... ఇక ఒక పడవ నిండా ఫోటోగ్రాఫిక్ ఎక్విప్మెంట్– కెమేరాలూ, ప్లేట్లూ తదితర సరంజామా...

హైలెస్సా హైలెస్సా అని పల్లెపదాలు పాడుతూ జట్లు జట్లుగా పడవలు లాగే పల్లెవాళ్ళు. కప్పుతో ఎదురొచ్చాడు, కాసీం సాయబు, మద్రాసులో సర్వే డిపార్టుమెంటులో ప్యూను. అద్భుతమైన వంటవాడు. బట్లర్ ఇంగ్లీషు బ్రహ్మాండంగా మాట్లాడగలడు. అతడి స్వంత ఊరు అక్కడికి దగ్గరే, చినగంజాం.

'వెల్ వెల్, ఖాసిం. మీ విలేజ్ ఇంకా ఎంత దూరం? నైట్ హాల్ట్ అక్కడేగా? ఇంటికి వెళుతున్నావా?'

'యెస్సార్. దొరగారు ఓయెస్సంటే, ఐ గో చిటికెలో ఎండు కమ్ము'.

'ఆల్రైట్. బట్ నో డిలేస్'

'నో సార్. నో డిలే. సత్తెపెమాణంగా... ప్రామిస్సు', అని తలపై చేయుంచి, 'సార్, ఒక స్మాలు అర్జీ...' అని వినయంగా తల గోక్కుంటూ నిలుచున్నాడు.

'గో ఎహెడ్. ఏమిటో చెప్పు.'

'సార్. మై విలేజ్ వన్ దర్గా... పీరు సాయెబు దర్గా యెస్. దర్గా పక్కనే వన్ బిగ్గ్ దిబ్బ ఉంది సార్. మెనీ మెనీ స్టోన్. పాలరాయి స్టోన్ సార్. కాలేజీ మ్యూజియం లాగా, మై ఫాదర్ ఇంట్లో బోల్డు కాపర్స్ సార్. ఓల్డు నాణాలు. దొరగారు సరేనంటే తోల్కబోయి చూపిస్తా సార్'

'సరే ఉదయాన్నే వెళ్దాం. ఎక్కడన్నావ్?'

'ఎంతో దూరం నై సార్' అని ఎగిరి గంతేసి, 'రేవు నుంచి టూ ఫర్లాంగ్ సార్. బోగందాని దిబ్బ అంటార్ సార్'



ఉబుసుపోకకి చినగంజాం గ్రామానికి వెళ్ళడంవల్ల మూడు అతిపెద్ద టోప్స్ గుర్తించడం జరిగింది. బోగందాని దిబ్బ. చాకలిదాని దిబ్బ. రెండు పురాతన స్తూపాల ఆనవాళ్ళు. ఖాసింసాహెబ్ ఇంట్లో దొరికిన నాణాలలో శాతవాహనులవీ, పల్లవుల కాలానివే కాక కొన్ని రోమన్ సెస్టెర్సెస్ కూడా ఉన్నాయి. గ్రామానికి మైలు దూరంలో పెదగంజాం అనే మరొక గ్రామం. మరో పెద్ద స్తూపం ఉన్న గుర్తులు. ప్రిలిమినరీ రిపోర్టు తయారీకి మూడు రోజులు అక్కడే గడపవలసి వచ్చింది.

అమరావతి చేరేసరికి డిసెంబరు ఇరవై. ఇక నాలుగు రోజులలో పని ముగించుకుంటే క్రిస్టమస్‌కి గుంటూరులో ఉండవచ్చు.

'ఐ వాంట్ ఏ స్టేటస్ రిపోర్ట్ బై టుమారో', అని అసిస్టెంట్లను నియోగించి, నది వైపు నడవసాగాడు, క్యాప్టన్ హెన్రీ కోల్.

'నది వద్దున మరికొన్ని శిలలు ఉన్నాయి సార్', అని రేవు వైపు చూపించాడు, మునసబు మల్లారెడ్డి.

వెంటనే తన చేతిలో ఉన్న ఫైలులోని మ్యాపుని పరీక్షించి, 'ధరణికోట ఖిలా తప్ప ఆ వంక ఏవీ లేవే?' అన్నాడు కోల్.

'ఆహా... అటుకాదు సార్ తూర్పు వైపు. ఇక్కడి శిలలే, రాబర్ట్ దొరగారు మద్రాసు పంపేందుకు రేవుకు చేర్పించారు. ఐదేళ్ళగా అవి అక్కడే ఉన్నాయి. చుట్టూ ముళ్ళకంచె అయితే వేసాము కానీ... ప్రతియేటా వరదలకి కొట్టుకు పోతుంది. మళ్ళీ వేయించాలంటే కూలీ ఖర్చులు', అని అసలు సమస్యని వెల్లడించాడు మల్లారెడ్డి.

నూటడెబ్భైకి పైగా అపురూపమైన శిల్పాలు నది వద్దున పడివున్నాయి. ప్రతియేటా వరదనీట మునగడంవల్ల నల్లని నాచు పేరుకుపోయింది. మేటవేసిన ఇసుకలో సగానికి కూరుకుపోయి, ఎటువంటి రక్షణా లేకుండా ఉన్న ఆ శిల్పాలను చూసిన హెన్రీ కోల్ హృదయం ఉడికిపోయింది.



బొంబాయి విక్టోరియా టెర్మినస్ రైల్వే స్టేషనుకి ఎదురుగా ఉన్న జంషేడ్జి జీజీభాయి భవనంలోని బాంబే స్కూల్ ఆఫ్ ఆర్ట్స్.

'నదివద్దున ఉన్న శిల్పాలు కాక, గత సంవత్సరం మీచేత వెలికితీయబడిన శిలలు మరో రెండు వందలు స్తూపం చుట్టూ, అవి దొరికిన ప్రదేశాలకి దగ్గరగా నిలబెట్టబడి ఉన్నాయి, మిస్టర్ బర్గెస్. ఇక షెడ్డులో ఉన్నవి మరో నలభై. మొత్తం నాలుగు వందలకు పైనే', అని తన రిపోర్టును వివరించాడు, మేజర్ హెన్రీ కోల్.

'యెస్ యెస్ నాకు తెలుసు', అని తలవూపాడు జేమ్స్ బర్గెస్, ప్రముఖ ఆర్కిటెక్టు, బాంబే స్కూల్ ఆఫ్ ఆర్టుకి ప్రిన్సిపాలే కాక, ప్రస్తుతం బాంబే ప్రెసిడెన్సీ ఆర్కియాలజీ సర్వేకి డైరెక్టరు. 'వాటిని వెంటనే మద్రాసుకు తరలించడమే తగిన పని. అక్కడే ఉంచితే మరింత నిర్లక్ష్యానికి గురికాగలవు, ఏమంటారు?'

'నో మిస్టర్ బర్గెస్. ఆ విధంగా చేయడం ఆ స్థలం యొక్క ప్రాముఖ్యాన్ని నాశనం చేయడమే. వాటిని కాంక్రీటు ఉపయోగించి దొరికిన స్థలంలోనే నిలపడం సమంజసం, ఆలోచించండి', అని ప్రాధేయపడుతూ, 'మీరు రికమెండ్ చేస్తే చాలు, వైస్రాయ్ విల్ అగ్రీ. అన్ని శిలలు అక్కడనుండి మద్రాసు తరలించడం కన్నా ఈవిధంగా ఖర్చు కూడా కలిసివస్తుంది'.

'ఖర్చు గురించికాదు, మేజర్ కోల్', అని చేతిలో ఉన్న బ్రైయర్ పైపులో పొగాకు దట్టిస్తూ, 'ఐ డోంట్ సీ ఎనీ రీజన్, ఆ శిలలు ఆ మారుమూల ప్రదేశంలో ఉంచడంవల్ల లాభం? మద్రాసులో అయితే అందరికీ అందుబాటులో ఉంటాయి' అని తలయెత్తి హెన్రీ కోల్ ముఖంలోని నిరుత్సాహాన్ని గమనించి, భ్రుకుటి ముడివేసి కాసేపు ఆలోచించి,

'ఆల్రైట్ మేజర్, ఈ విషయాన్ని జెనరల్ కనింగ్హామ్ తేల్చి చెప్పాల్సిందే. వారికే రిఫర్ చేద్దాం. ఆఫ్టరాల్, హీ ఈజ్ ది డైరెక్టర్ జెనరల్, ఏమంటారు?' అని నిర్ణయాన్ని వాయిదా వేసాడు.





# 47

## అమరావతి స్తూపం, క్రీ.శ. 1987

'ప్రిజర్వ్ నాట్ రిస్టోర్...

'అని కనింగ్హామ్ దొరగారి ఫైనల్ నిర్ణయం. ఆ విధంగా నాలుగు వందల పైచిలుకు శిలలు మద్రాసు మ్యూజియం చేరాయి. నీవు ఇప్పుడు చూస్తూన్న ఒకటీ అరా రాంబాబుగారు చెప్పినట్లు, స్వతంత్రం వచ్చిన తరువాత జరిపిన తవ్వకాలూ, పరిశోధనలలో బయటపడినవి, అర్థం అయిందా? అని నా వంక చూసాడు ఉపేంద్ర.

ఆ మహాస్తూపపు ప్రస్తుత పరిస్థితి గమనించడంవల్లనో లేక పొగ కళ్ళలోకి రావడం వల్లనో నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. చేతిలో ఉన్న సిగరెట్టును నేలకి విసిరికొట్టి, 'వై కాంట్ దిస్ గవర్నమెంట్ డూ సంథింగ్? ప్రత్యేక రాష్ట్రం వచ్చి ముప్పై ఏళ్ళు గడిచాయ్. ఆ శిలలు వెనక్కి తెప్పించి ఈ స్తూపాన్ని పునరుద్ధరించవచ్చుగా?' అన్నాను.

'అబ్బో... వీడికి చాలా ఆవేశం వచ్చిందిరా!' అని బిగ్గరగా నవ్వుతూ, 'ఏ ప్రభుత్వమైనా స్పందించాలంటే ముందుగా దానికి అనుగుణంగా బలమైన ప్రజాభిప్రాయం రావాలిరా. రోజూ లక్ష సమస్యలతో సతమతమయ్యే ప్రజలకి ఈ స్తూపం విషయం ఎలా పట్టేది?' అన్నాడు రమేష్.

'సామాన్య ప్రజల విషయం సరే, ఈ మన సో కాల్డ్ విద్యావంతులూ, మేధావుల విషయం ఏమిటి? ప్రతి విషయంలో ఉపన్యాసాలకి రెడీ. మన ఆంధ్ర సంస్కృతి విషయంలో కొంచెం...'

నా మాటలకు అడ్డువస్తూ, 'ఏమిట్రా మన సంస్కృతి? నిన్నటి వరకూ ఈ స్తూపం ఇక్కడ ఉన్న విషయమే నీకు తెలీదు. నీవూ విద్యావంతుడివేగా? పుట్టి పెరిగింది ఈ రాష్ట్రంలోనేగా? నౌ, బికాజ్ యూ హాడ్ సీన్ దిస్ టుడే, ఏదో మేధావిలా పోజు పెడుతున్నావ్. డూ యూ నో హౌ మచ్ ఆఫ్ అవర్ హెరిటేజ్ ఈజ్ అన్డర్ షీయర్ నెగ్లెక్ట్? పక్క రాష్ట్రాలను చూసైనా మనకి బుద్ధి రాదు. ఒక్క చారిత్రాత్మక కట్టడాల విషయమే కాదు, మన జానపద వృత్తికళలు, సంప్రదాయక లలితకళలు... అంతెందుకు... కర్నాటక సంగీతంలో సగానికి పైగా కృతులు తెలుగులోనే. కానీ మన విద్వాంసులకు ఈ రాష్ట్రంలో ప్రజాదరణ లేదు. 'బాలమురళీకృష్ణ ఈజ్ ఎ తమిళియన్' అని మన భావం. ఎప్పుడో ఒక ఎన్టీఆర్ చెబితేనో, లేక ఏ విశ్వనాథ్, బాపూనో సినిమాలో చూపిస్తేనో ఓహో అలాగా అని

ఆశ్చర్యపోయి అక్కడే వదిలేస్తాం', అంటున్న ఉపేంద్రలో అంత ఉద్రేకాన్ని నేను ఇదివరకు ఎప్పుడూ చూడలేదు.

'అందాకా ఎందుకురా? ఈవెన్ తిండి విషయంలో చూడు, పెళ్ళికి వెళ్ళినా ఫ్రైడ్ రైసూ, వెజిటబుల్ కుర్మా, ఒక్క పండగైనా అందరం కలిసి సంప్రదాయకంగా చేస్తామా? ఛీ... అయినా మనని అనుకుని ఏం లాభంలే? ఇది మనకి వారసత్వంగా వస్తున్న నిర్లక్ష్యం. టోటల్ ఇన్డిఫరెన్స్ టు ట్రెడిషన్. ఎ కంట్రీ ఆఫ్ ఐకనోక్లాస్ట్స్!' అని వంత పలికాడు, రమేష్.

ఎందుకో వాళ్ళ ఆరోపణలన్నీ నాపైనే అన్న ఫీలింగ్. అదో రకమైన ఉక్రోషం. గిల్టును కప్పిబుచ్చుకోవడానికి చూపే కోపం కావచ్చు. 'హౌ కెన్ యూ జెనరలైజ్? అందరూ అలాగేనంటే ఎట్లా? డాక్టర్లూ, ఇంజనీర్లూ, ఎంబీయేలూ అని ఎగబడుతున్నామంటే, దట్ ఈజ్ ది నీడ్ ఆఫ్ ది అవర్. కాలానికి అనుగుణంగా మనని మనం మలుచుకోవడంలో తప్పేమిటి? ప్రాబబ్లీ, వీ ఆర్ మోర్ అడాప్టిబుల్ దాన్ అదర్స్!'

'బాగా చెప్పావురా!', భుజం తట్టాడు రమేష్. 'అందుకేనేమో, కొత్తొక వింత, పాతొక రోత అన్నట్లు, ఆంధ్రదేశంలో బుద్ధిజమ్ ఆనవాళ్ళు కూడా లేకుండా తుడిచేసాం'.

'అది అన్యాయం', అని అడ్డుచెబుతూ ఉపేంద్ర, 'బౌద్ధమతం ఒక్క ఆంధ్రదేశంలోనే కాదు మొత్తం ఉపఖండంలో అంతా పతనమయింది. దానికి మన వేలాంవెర్రి మాత్రమే కాదు, ఆ మతంలో పెరిగిన కొన్ని స్వాభావిక వైరుధ్యాలే కారణం. ఈ ప్రాంతంలో బౌద్ధానికి ఉన్న ఆదరణ ఒక్కసారిగా ఏమీ అదృశ్యమైపోలేదు. కాలానుగుణంగా హిందూ వ్యవస్థ ప్రజల అవసరాలని అనుసరించి తనను తాను పటిష్ఠం చేసుకుంటూపోతే, బౌద్ధ శ్రమణుల సన్యాస దీక్ష వారిని ప్రజా జీవన విధానానికి దూరం చేసింది. దానికి తోడు వాణిజ్యం కుంటుపడి, ధనసహాయం లేకపోయేసరికి భిక్షు వ్యవస్థలో కొన్ని విపరీతమైన అలవాట్లు చోటుచేసుకున్నాయి. బౌద్ధ స్తూపాలు శిధిలాలై, లంజదిబ్బలూ, బోగందాని దిబ్బలూ అని పేర్లు తెచ్చుకున్నాయి'.

ఉపేంద్ర చెప్పింది నాకప్పుడు అర్థం కాలేదు. 'అంటే బుద్ధిజమ్ ఇండియాలో పూర్తిగా తుడిచిపెట్టుకు పోయిందా? డూ యూ మీన్ టు సే... దేశంలో బుద్ధిస్టులు లేరా?' అని అడిగాను.

'ఈసారి ఆశ్చర్యపోవడం వాళ్ళ వంతు అయింది. అయినా ఉపేంద్ర మాటలలో ఏమాత్రమూ ఎగతాళి ధ్వనించలేదు. 'నిజమేరా, ప్రపంచంలో సగానికి పైగా జనాభా ఉన్న తూర్పు ఆసియా దేశాలలో ఇంకా ప్రజ్వలంగా వెలిగే బౌద్ధధర్మం, తన పుట్టిన దేశంలో మాత్రం తుడిచిపెట్టుకు పోయింది. హిందూ కులవ్యవస్థకి వ్యతిరేకంగా బాబాసాహెబ్ అంబేద్కర్ ప్రారంభించిన ఉద్యమంలో భాగంగా పునరుజ్జీవం పొందిన నియో–బుద్ధిజమ్ ఆచరించే కొద్దిమందీ, టిబెట్ నుండి కాందశీకులై వచ్చి ఇక్కడ స్థిరనివాసం ఏర్పరుచుకున్న వాళ్ళూ, కాశ్మీరులోని లధాక్, హిమాచలప్రదేశ్‌లోనూ, ఈశాన్య భారతదేశంలో, చెదురుమదురుగా మిగిలిన కొన్ని బౌద్ధసంఘాలు తప్ప వేరే బౌద్ధులు

ఇండియాలో లేరు. వీరిలో అత్యధికులు ఈ శతాబ్దంలో వచ్చినవాళ్ళే...', అని నా సందేహానికి జవాబిస్తున్న అతని మాటలకి అడ్డువస్తూ...

'నీకో విషయం తెలుసా? కనీసం ఐదు శతాబ్దాల కాలం... అంటే క్రీస్తు శకం పద్నాల్గో శతాబ్దం నుంచీ, ఇంగ్లీషు చరిత్రకారులు, గతాన్ని తవ్వి తిరిగి మనకి చెప్పేదాకా, బౌద్ధమతం అని ఒకటి ఉండేదని కూడా మన దేశస్థులకి తెలియదు', అన్నాడు రమేష్.

వాళ్ళు చెప్పినది జీర్ణించుకోవడానికి నాకు కాసేపు పట్టింది. 'అయితే... అంత వైభవంగా వెలిగిన బౌద్ధమతం ఎప్పుడు మాయమయింది?' అని ఉపేంద్రని అడిగాను.

'ఏడవ శతాబ్దంలోనే మన దేశంలో బౌద్ధం క్షీణదశలో ఉంది. ఆ తరువాత వీరశైవం, వీరవైష్ణవం విజృంభించడంతో, ఆ మిగిలిన కాస్తో కూస్తో కూడా తుడిచిపెట్టుకు పోయింది. అనేక బౌద్ధారామాలు హిందూ దేవాలయాలుగా మారాయి. బుద్ధుడు, విష్ణువు యొక్క తొమ్మిదో అవతారంగా మారాడు. ఎక్కడో ఎత్తైన కొండల్లో, ద్వీపాల్లో తప్ప ఆ మతాన్ని ఆచరించేవాళ్ళు మిగలలేదు. ఇక మధ్య ఆసియాలో అయితే, ఇస్లాం ధాటికి, ఏ ఒక్క మతమూ తట్టుకోలేక పోయింది', అని చెప్పడం మొదలెట్టాడు, ఉపేంద్ర.





హ్యూయెన్ త్సాంగ్ పర్యాటన
కాలంలో భారత దేశం
(క్రీశ. 637-640)
పుష్యభూతి
కన్యాకుబ్జం
కామరూప
ప్రాగ్జోతిష
గుజ్జర
(కు-చె-లో)
పాటలీపుత్రం
తలశిఖ
నాలందా
గౌడ
కర్ణసువర్ణ
ఉజ్జయిని
నర్మద
మహాకోసల
(మొ-హ-కౌ-సా-లో)
ఓఢ్ర
(వు-తు)
ఆంధ్ర
(ఆన్-త-లో)
చాళుక్య పులకేశి సామ్రాజ్యం
ధాన్యకటకం
(T'e-na-ka-chek-aa)
కళింగ
(క-లెన్గ్-క)
కనగానపురి
బాదామి
వేంగి
పిష్టపురం
కొల్లేరు సరస్సు
శ్రీపర్వత
భ్రమరగిరి
కుద్ధూరవాడ
పల్లవకం
స్కంధగిరి
రేనాడు
ఆంధ్ర పల్లవుల రాజ్యాలు
కదంబ
బాణ
చోడ
(చు-లి-యా)
కంచి
మామల్లపురం
కథలో ప్రస్తావించిన పట్టణాలు
హర్షవర్ధనుని సామ్రాజ్యం ఎల్లలు
పాండ్య
మదురై
సింహళ



48

## లూయోంగ్ నగరం, మధ్య చైనా, క్రీ.శ. 620

'నేటినుంచీ నీ పేరు హ్యూ-యున్. బాగుందా ఐ–చెన్?' దేవాలయంలో నుండి బయటికి అడుగుపెట్టాడో లేదో, స్నేహితుని తలపైన ఉన్న పొడవైన పట్టు టోపి తీసి అతని నున్నని గుండుపై ఆప్యాయంగా చరుస్తూ అడిగాడు పియెన్–చీ. ఇద్దరూ చిన్ననాటి నుంచీ సహాధ్యాయులు. హుయ్–చాంగ్ ఆరామంలో కలిసి చదువుకున్నారు.

వెనక్కి తిరిగి చూసాడు, ఐ–చెన్. ఐదు శతాబ్దాల కిందట హాన్ చక్రవర్తి మింగ్ కట్టించిన బౌద్ధ ఆలయం. శాక్యముని బుద్ధుని జన్మస్థానమైన 'తెన్–గ్యు' దేశంనుండి వచ్చిన కశ్యప మాతంగ పురుషుడు తన బోధనలతో చక్రవర్తిని ప్రభావితుని చేసి అప్పటికి ఐదువందలయాభై సంవత్సరాలయింది. శాక్యముని సువర్ణదేహంతో కలలో కనిపించి ఆదేశించిన విధంగా ఆ చక్రవర్తి రూపకల్పన చేసిన శ్వేతాశ్వ దేవాలయం అది.

లూయోంగ్ నగరం లూయ్ నదికి ఉత్తరానగల చైనాదేశపు పూర్వ రాజధాని. ప్రస్తుత రాజధాని చాంగ్–ఆన్ అక్కడికి ఎంతోదూరం లేదు. 'పద, లీ–షిమిన్ కూడా నీ కొత్త అవతారం చూస్తాడు. రాచనగరికి వెళ్ళి సాయంకాలానికి వచ్చేద్దాం', అన్నాడు పియెన్–చీ.

'లేదు, పియెన్. ముందుగా నా తండ్రి తరువాత తండ్రి, మా పెద్దన్నకు ఈ విషయం చెప్పాలి. ఇంకెవరైనా ఆ తరువాతే', అన్నాడు, ఐ–చెన్.

'అరే! బౌద్ధం స్వీకరించినా నీ పురాతన కోంగ్ సూత్రాలు వదలలేదే! లీ– షిమిన్ మన బాల్య స్నేహితుడే కాదు మధ్యరాజ్యానికి కాబోయే చక్రవర్తి కూడా. అధికారాన్ని గౌరవించాలనే కదా కోంగ్ఫ్యూజియన్ ఆచారం? పరవాలేదు, పద'

**కన్ఫ్యూజియనిజం**

కన్ఫ్యూజియనిజం అంటే ఒక మతం అని చెప్పలేం. పౌరుల గుణ శీలాలు నిర్దేశించే ఒక శాస్త్రం మాత్రమే అనుకోవచ్చు. అది చైనాలో క్రీపూ. 6వ శతాబ్దంలో ఒక గురువు చేసిన ఉపదేశం. ఆ మహాత్ముడి పేరు 'కాంగ్'. ఇక 'ఫ్యూజి' అంటే గురువు. కాంగ్ – ఫ్యూజీ ఉపదేశించిన సూత్రాలను మనం కన్ఫ్యూజియనిజం అంటాం. ఆ సూత్రాల సారం వృద్ధులను, పెద్దలనూ, అధికారాన్నీ గౌరవించడమే. ఉపదేశాలలో మౌలికమైన సూత్రాలు మూడు – రెన్, యీ, లి. వాటి అర్థం, మానవత, ధర్మాన్ని నిర్వర్తించడం, వినయం. ఒక విధంగా చూస్తే అన్ని మతాల సారాంశమూ అదే!

‘ఓహో? అంటే నీ ఉద్దేశ్యంలో కోంగ్ సూత్రాలకీ, శాక్యముని బోధనలకీ సామరస్యమే లేదంటావా? కోంగ్–ఫ్యూజీ నిర్దేశించిన మార్గాలు ఏవో చెప్పు?’ అని కనుబొమ్మలు ముడివేసి అడిగాడు, ఐ–చెన్. ఒక్క అంగలో మూడడుగుల ఎత్తున్న అరుగుపైకి ఎక్కి, అక్కడి ప్రాచీన బుద్ధవిగ్రహం ముందు కూర్చొని, స్నేహితుడికి చేయి అందించాడు.

ఐ–చెన్ మంచి పొడగరి. క్రమశిక్షణతో వచ్చిన బలమైన శరీరం. అతని ఉచ్ఛవంశాన్ని సూచించే దంతపు వన్నె మేని ఛాయ. దేహధారుఢ్యానికి సరిపడే మేధాసంపత్తి. ఏకసంధగ్రాహి! ఒకసారి వింటే ఇక జీవితంలో మరువని జ్ఞాపకశక్తి. పిత్రార్జితంగా వచ్చిన కోంగ్ఫ్యూజియన్ నియమాల్లో ఎంత గౌరవం ఉందో, స్వయం ప్రేరితమైన బౌద్ధంలో కూడా అతడికి అంతే గౌరవం. అతని బుద్ధికుశలతనూ, జిజ్ఞాసనూ గుర్తించిన ఆచార్యుడు ఝెన్–షాన్గో అతి తక్కువ వయస్సులోనే ధర్మదీక్షని ఇచ్చాడు.

‘సరే మిత్రమా... ఓహో మన్నించండి ఇప్పుడు తమరిని హ్యూ–యెన్–త్సాంగ్ ఆచార్యా అని పిలవాలేమో?’ అని నవ్వుతూ, చేయందుకుని పైకెక్కి, ‘మావంటి సామాన్యులకు తెలిసిన కోంగ్ఫ్యూజియన్ సూత్రాలు మూడు. అవి ‘రెన్’, ‘యి’, ‘లి’. వాటికీ బౌద్ధానికీ ఉన్న సంబంధం ఏమిటో... ఇక మీరే వివరించాలి’, అని తలవంచి ఒంటిచేత నమస్కరిస్తూ ఎదుట కూలబడ్డాడు, పియెన్–చీ.

ఆరామంలోని గ్రంధాలయంలో అనేక పుస్తకాలు ఉన్నాయి. అవి ‘తెన్–గ్యు’ దేశపు గ్రాంధిక లిపిలో ఉన్నాయి. ఆ భాషను స్థానికులు ‘పాళి’ అంటారట. ఏవో కొన్ని అనువాదాలు తప్ప వాటిని చదవగలిగే వాడే లేదు. వచ్చినంత వరకూ అప్పటికే కంఠస్తం చేసాడు, ఐ–చెన్. ‘బౌద్ధం నిర్దేశించే మానవత అంటే పరులపట్ల, ముఖ్యంగా మనకంటే తక్కువ

### త్యెన్ ఝూ లేక త్యెన్ గ్యు

క్రీశ. 3వ శతాబ్దిలో చైనాలో రచించబడిన ‘లిహోవ్లున్’ అనే గ్రంధంలోని ఉదంతం... హాన్ సామ్రాజ్యపు (చైనా) చక్రవర్తి మింగ్ (క్రీశ. 55–75) కు ఒక కల వచ్చింది. అందులో సువర్ణ దేహంతో, సూర్యుని తేజస్సుతో వెలిగే ఒక మనిషి అతడి మందిరపు గవాక్షం ముందు ఎగురుతూ కనిపించాడట. అతడెవరో తెలియక చైనా దేశంలోనే అత్యంత మేధావియైన ‘యి’ ఆచార్యుని పిలిపించి విచారిస్తే, ‘దక్షిణ దిశగా వెళితే సముద్రాలకి అవతల ‘త్యెన్–గ్యు’ అనే దేశం ఉంది. అక్కడ సువర్ణ దేహంతో మెరిసే ఒక దేవుడు ఉన్నాడు. ‘డావో’ అంటే నిజమైన మార్గాన్ని దర్శించిన వాడు అతడొకడే. మీకు స్వప్నంలో కనిపించినది అతడే’, అని చెప్పాడట.

దానితో చక్రవర్తి ఒక దూతని త్యెన్–గ్యు దేశానికి పంపాడట.

ఆ దూత బుద్ధుని ఉపదేశాలను కొన్ని తెల్లని గుర్రాల మీద తెచ్చాడట. అతనితో పాటూ, కశ్యప మాతంగుడూ, ధర్మరక్షుడూ అనే ఇద్దరు బౌద్ధ ఆచార్యులను కూడా తెచ్చాడట. వారి ఉపదేశాలు విని ప్రభావితుడైన మింగ్, రాజధాని ‘లూయోంగ్’ నగరంలో శ్వేతాశ్వ దేవాలయం నిర్మించాడట. ఆ విధంగా శాతవాహనుల పాలనలోని కృష్ణాతీరం నుండి బౌద్ధమతం చైనాకీ పాకింది.

కొందరు త్యెన్–గ్యు కాదు త్యెన్–ఝూ, అంటే ఆఫ్ఘనిస్తాన్ ప్రాంతం అని వాదిస్తారు. అలా చూసినా, చైనీయులు విదేశీ ద్వీపాలని ‘ఝూ’ అని పిలిచేవాళ్ళు. కనుక సముద్రాంతరమైన దక్షిణదేశమే త్యెన్–ఝూ లేదా త్యెన్–గ్యు, కానీ వాయవ్య దేశం కాదు.

స్థాయిలో ఉన్నవారిపట్ల, ఇతర జీవాలపట్ల దయకలిగి ఉండమనే కదా? దానికీ 'రెన్' సూత్రాలకీ తేడా ఏమిటి? చెప్పు, పియెన్.'

'నిజమే, ఐ–చెన్. ఇక 'యి' సూత్రానికి అర్థం ధర్మం తప్పకుండా నడవమనే కదా? అలాగే 'లి' సూత్రాలు తమ స్థాయికి తగిన వినయ సంస్కారాలని నిర్దేశిస్తాయి. అంటే... మన పురాతన కోంగ్ సూత్రాలకీ, నీవు ఇంత కష్టపడి గ్రహించిన బౌద్ధ సూత్రాలకీ ఏమీ తేడా లేదు... అయ్యయ్యో... నీవు ఇంతకాలం వెచ్చించిన సమయం అంతా వృధా అయినట్లే... అహహా', అని చప్పట్లు చరుస్తూ, 'మిత్రుడు, డైజోంగ్ చెప్పినట్లు ఈ కాషాయపు దుస్తులు విసర్జించి ఏదైనా మంచి రాజోద్యోగం చేపట్టు. అందరం ఆనందిస్తాం' అన్నాడు పియెన్–చీ, నవ్వులాటగా.

మిత్రుని మాటలకు ఐ–చెన్ నుండి సమాధానం లేదు. అవి రేకెత్తించిన ఆలోచనలలో మునిగి అలాగే ముభావంగా ఉండిపోయాడు. అతడు అన్న మాటలలో నిజం లేకపోలేదు. ఒక్క వినయపిటకం మాత్రమే బౌద్ధం అనుకుంటే అది ఆచరించడంలో అర్థం లేదు. కానీ హుయ్–చాంగ్ ఆరామంలోని త్రిపిటకాల అనువాదాలు అన్నీ అసంపూర్ణాలే. ఆ శాక్యముని చరించిన 'యిన్–తూ' భూమిలో మాత్రమే తన ప్రశ్నలకి సరియైన సమాధానాలు దొరకగలవు. 'ఆ 'డ్రాగన్–వీరుడు', 'నాగ–అర్జున' మహాపురుషుని జన్మస్థలమైన 'తెన్–గ్యు' దేశంలో మహాయాన బౌద్ధంలోని గూఢ సత్యాలు విడమర్చి చెప్పగల ఆచార్యులు ఉండకపోరు'.

'తన బౌద్ధదీక్షకి లక్ష్యసిద్ధి, ఆ పశ్చిమ దేశాలలో ప్రయాణించి, స్వయంగా ఆ మహాపురుషుల బోధనలను గ్రహించడమే... లేకుంటే ఈజీవితానికి అర్థంలేదు'.

అలా... ఆవిధంగా నాటుకున్న బీజం నానాటికీ వృద్ధిచెంది గత పది సంవత్సరాలలో పశ్చిమదేశ యాత్ర చేయాలనే ఉద్దేశ్యం అతనిలో గాఢమై, మహావృక్షం అయింది.



**డాంగ్ డైజోంగ్**

డాంగ్ చక్రవర్తి డైజోంగ్ (క్రీశ. 626–649) కి, మౌర్య సామ్రాట్టు అశోకునికి చాలా దగ్గర పోలికలు కనిపిస్తాయి. ఇద్దరూ, అతి చిన్నతనంలోనే సైన్యాలు నడిపిన నాయకులు. సోదరులను చంపి పదవికి వచ్చినవారే. సామ్రాజ్యాలను సహజమైన ఎల్లల వరకూ విస్తరింపజేసినవాళ్ళే. యుద్ధానంతరం, బౌద్ధమతం గ్రహించినవారే. తమతమ దేశాలలోనే కాక బౌద్ధాన్ని నలుదిక్కులా వ్యాపింపజేసినవారే.

రాజ్యాధికారానికి ముందు అతడి అసలు పేరు, లీ–షిమిన్. క్రీశ. 621లో, పదునెనిమి దేళ్ళ వయసులోనే సైన్యాధక్షుడై తన తండ్రికి కుడిభుజంగా నిలిచాడు. కానీ, రాజ్యం కోసం తన అన్నలను చంపి తండ్రిని పదవీచ్యుతుని చేసాడు. క్రీశ. 626లో అధికారంలోకి వస్తూనే మధ్య ఆసియాలోని గోక్‌టర్క్ జాతులపై అఖండ విజయం సాధించాడు. పద్నాలుగేళ్ళు చైనా అంతటా సుస్థిర శాంతి నెలకొల్పాడు.

తన స్నేహితుడు హ్యూయెన్ త్సాంగ్ తన పశ్చిమదేశ యాత్రలనుండి తిరిగివచ్చిన వెంటనే, అతడు తన ఆజ్ఞకు విరుద్ధంగా చైనా విడిచిన విషయం మనస్సులో ఉంచుకోకుండా, అతడిని అఖండ స్వాగత సత్కారాలతో గౌరవించాడు. అతడు తెచ్చిన బౌద్ధ సాహిత్యాన్నంతా, చైనా భాషలో గ్రంథీకరించేందుకు, కావలసిన సిబ్బందీ, సదుపాయాలూ ఇచ్చి సహకరించాడు.

చెన్–హే గ్రామంలో, తన తండ్రి హ్యూయ్–చెన్ సమాధికి వందనాలు ఆచరించి అంతరిక్షంలో చరించే అతని భౌతిక, అభౌతిక ఆత్మలనుండి ప్రయాణానికి అనుమతి గ్రహించి ఇంటికి చేరాడు, హ్యూయెన్ త్సాంగ్. తన ప్రయాణం విషయం అతి రహస్యం. తన స్నేహితుడు పియెన్–చీకి తప్ప వేరెవ్వరికీ తెలియదు.

అది ఇంటి ముందు తాను చిన్నతనంలో నాటిన పైన్ వృక్షం.

ప్రేమగా దాని మొదలును స్పృశిస్తూ, 'ఏం నేస్తం, నేను పశ్చిమదేశాలన్నీ చుట్టి వచ్చేందుకు ఎన్నో యేళ్ళు పట్టవచ్చు. నేను వచ్చేవరకూ నాకోసం ఎదురు చూస్తావా?' అని ఆ వృక్షాన్ని అడిగాడు. నది మీదుగా వీసిన చల్లని గాలి వల్లనో లేక అతని మాటలకు సమాధానంగానో, అవునన్నట్లు తలవూపింది ఆ వృక్షం.

'అంతలో అతని రాకకోసం ఇంటివద్దనే వేచిఉన్న పియెన్–చీ, 'ఆహ్ వచ్చావా? నేను ఎంతచెప్పినా నీవు నీ నిశ్చయం మార్చుకోనట్లే కదా?'

'అవును. రేపే ప్రయాణం. అంతా సిద్ధంగా ఉంది', అన్నాడు హ్యూయెన్.

'ఆహా... ఎందుకు సిద్ధంగా ఉండదు? చూస్తూనే ఉన్నాను, నీ ప్రయాణానికి కావలసిన సరంజామా అంతా... నడవడానికి రెండు కాళ్ళూ, దారి చూపేందుకు రెండు కళ్ళూ', అని ఎద్దేవా చేస్తూనే, 'కానీ మిత్రమా, పరిస్థితులే నీకు అనుకూలించేలా లేవు. మధ్యరాజ్యం చూస్తే అన్నివైపులా దిగ్బంధనంలో ఉన్నట్లుంది. మలక్కా ద్వీపాలను అరేబియాదేశపు కురేషియా జాతులు ఆక్రమించాయట. క్వాంగ్టాంగ్ తీరంలో వర్తక నౌకల రాకపోకలే లేవు. నా మాటవిని ఇప్పటికి ప్రయాణం విరమించుకుంటే మంచిది. ఏదో విధంగా డైజోంగ్ చక్రవర్తికి సర్దిచెప్పి అతడి ప్రతినిధిగానే నీవు ఈ యాత్రచేసే ఏర్పాట్లు చేద్దాం... ఎంతైనా మన చిన్ననాటి మిత్రుడు, నేను ఒప్పిస్తాను, సరేనా?'

'సాధ్యం కాదు, పియెన్. లీ–షిమిన్ నేను వెళ్ళడానికి ససేమిరా అనుమతించదు. జియాలీ ఖాన్ యొక్క గోక్–టర్క్ మూకలపై యుద్ధం ఒక నెపం మాత్రమే. నన్ను 'చాంగ్–ఆన్'లో అతని కొలువులో ఉంచడమే మన చక్రవర్తి ఉద్దేశ్యం. అతనికి తెలిసేలోగా గోబీ ఎడారి దాటాలి. అదొక్కటే మార్గం'.

'నీకేమన్నా మతిపోయిందా?' అతని మిత్రుని క్షేమం గురించిన ఆందోళన వల్ల వచ్చిన కోపాన్ని అణుచుకోలేక పోయాడు, పియెన్–చీ. 'అసలే

**సి-యు-కి**

భారత ఉపఖండపు ప్రాచీన చరిత్ర తెలుసుకోవాలంటే, అతి మౌలికమైన గ్రంథం, 'డ–డాంగ్–సి–యు–కి (*Dà Táng Xiyù Ji*) అంటే అర్థం, 'మహా డాంగ్ కాలపు పశ్చిమ ప్రాంతాల విశేషాలు'. ఇవి హ్యూయెన్ త్సాంగ్, తన యాత్రలో, నేటి, పశ్చిమ చైనా,టిబెట్, ఉజ్బెకిస్తాన్, కజకిస్తాన్, తుర్క్మనిస్తాన్, ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, ఇండియా, బంగ్లాదేశ్, నేపాల్, బహుశా శ్రీలంక దేశాలన్నీ పద్నాలుగేళ్ళలో చుట్టి, ఆ దేశాలలో అతడు సేకరించిన విషయాలే ఈ గ్రంథం. క్రీశ. 629లో బయలుదేరి క్రీశ. 645 లో తిరిగి తన స్వదేశం చేరుకున్నాడు. అతడి ప్రయాణంలో ఉద్దేశ్యం బుద్ధ జన్మస్థానమైన ఇండియాలో, బౌద్ధాచార్యులని దర్శించి మహాయాన బౌద్ధాన్ని గురించి ఉపదేశాలు గ్రహించడమే.

> **పైన్ వృక్షం**
> హ్యూయెన్ త్సాంగ్ జీవితం గురించి అనేక అద్భుతమైన కథలు ఉన్నాయి. వాటిలో ఒకటి అతడి ఊరిలో ఉన్న పైన్ వృక్షం కథ. అతడు పశ్చిమ దిశగా ప్రయాణించినన్ని రోజులూ అది ఆపక్కకి వంగి ఉండిందట. పన్నెండేళ్ళ తరువాత, అతడు తిరుగు ప్రయాణం ఆరంభించగానే అది తూర్పు వైపుకి వంగిందట. అది చూసిన షెన్-హే పురప్రజలకి ఆ 'గ్రేట్ త్రిపిటక మాస్టర్' తిరిగి స్వదేశానికి వస్తున్నాడని తెలిసిందట.

అనాగరిక దేశాలు, దారిదొంగలు, దానికి తోడు యుద్ధం. ఎడారి ప్రయాణం చేసేందుకు నీకు తోడు లేదు. మందీ మార్బలం లేవు. ఒంటరిగా వెళ్ళడం ఆత్మహత్యా సదృశం, ఐ-చెన్. కాస్త ఆలోచించు.'

'ఇక ఆలోచించేందుకు ఏమీ మిగులలేదు మిత్రమా. ఈ ప్రయాణం శాక్యముని ప్రేరేపించడం వల్లనే జరుగుతోంది. ఎటువంటి అడ్డంకులూ రావు, నాకు ఆ నమ్మకం ఉంది. నీది అనవసరమైన ఆందోళన. ఆ బుద్ధదేవుడు నడిచిన భూమిలో ఆ మహాపురుషుని బోధనల గురించి అధ్యయనం చేసి ఆ పవిత్ర గ్రంథాలను మధ్యరాజ్యంలో అందరికీ అందుబాటులోకి తెచ్చేవరకూ నాకు ఎటువంటి ఆపదా రాదు, చూస్తుండు', అని పక్కనే ఉన్న వృక్షాన్ని తట్టి, 'అంతవరకూ నా మిత్రుడు ఈ పైన్ వృక్షాన్ని జాగ్రత్తగా చూసుకో. నా ఆత్మలో కొంత దీనిలో విడిచి వెళ్తున్నాను. ఇదే నా క్షేమసమాచారం నీకు తెలుపగలదు', అని ఆ చెట్టుని ఆలింగనం చేసుకున్నాడు.

'సరే... నీ నిర్ణయం అదే అయితే... కాస్త ఆలస్యం అయినా క్వాంగ్టాంగ్ నుండి సముద్రయానమయితే , సమయమూ కలిసివస్తుంది కదా?'

'మిత్రమా మిత్రమా మిత్రమా! నీకు ఎన్ని సార్లు చెప్పినా, నీ ఆందోళన వల్ల అసలు నా ప్రయాణంలోని ఉద్దేశ్యాన్ని మరుస్తున్నావ్... నేను తిరిగివచ్చిన తరువాత, పశ్చిమ దిశలో నేను కాలుమోపిన ప్రాంతాల విశేషాలన్నీ పూసగుచ్చి నట్లు నీకే చెబుతాను, సరేనా? ఆ 'సి-యు-కి'ని గ్రంధీకరించే పని కూడా నీకే అప్పజెపుతాను. అప్పుడన్నా భూమార్గంలో ప్రయాణించేందుకు నేను తీసుకున్న ఈ నిర్ణయంతో ఏకీభవించగలవు', అని స్నేహితుడి అనుమతికై నిరీక్షించకుండా పశ్చిమదిశగా చాంగ్-ఆన్ నగరం వైపు కదిలాడు, హ్యూయెన్ త్సాంగ్.

ఆ మహాప్రస్థానానికి వీడ్కోలు చెబుతున్నట్లుగా సూదివలె నిటారుగా ఉండే పైన్ వృక్షం పడమటి వైపుకు వంగి వీడ్కోలు పలికింది.



# 49

**వే**చి ఉన్న కొలదీ బజరంగి మదిలో ఆందోళన పెరగసాగింది.

తెల్లవారు జామునే ఆచార్యుని ప్రత్యేక చైత్యంవద్దకు రమ్మని ఆదేశం. సూర్యోదయమై రెండు ఘడియలయింది. పరమాచార్యుని ప్రాతఃకాల వ్యాయామానికి సమయం అప్పటికే చాలా మించిపోయింది. కానీ ఎందుకో వారింకా జ్ఞానముద్ర వీడలేదట. జ్యేష్ఠమాసం! ఇంకా జాగుచేస్తే ఎండ తీవ్రం కాగలదు. ఆచార్యుని శిష్యబృందం కూడా ఏమీ తెలియని అయోమయ స్థితిలో ఉన్నారు. పద్మపాణి అవలోకితేశ్వరుని బంగారు ప్రతిమముందు నిలిపిన అఖండజ్యోతిని తదేకంగా చూస్తూ ఏదో అలౌకికమైన ధ్యానంలో ఉన్నారట? ఏమిటో?

ఏదో స్తబ్దత?

విరగకాసిన పండ్లతో మావి కొమ్మలు నేలకి వంగిపోయాయి. ఆచార్యుని ధ్యానదీక్షకి తనవంతు సామరస్యం ప్రకటిస్తున్నట్లు ప్రకృతి కూడా ఎటువంటి స్పందనా లేకుండా బిగుసుకుపోయింది. చిటారు రెమ్మలు ఊగేపాటి గాలి కూడా లేదు. విద్యాలయం చుట్టూ విస్తరించి ఉన్న మహాసరోవరంలోని నీరు అలలు లేకుండా నిశ్చలంగా ఉంది. తమ కిలకిలారావాలతో రోజు కలకలం సృష్టించే శుకపికసందోహం కూడా కానరాదు. కోయిలల కుహూకుహూరవాలు లేవు. ఎర్రని కనకాంబరాలని తమ ఝూంకారాలతో నిద్రలేపే తుమ్మెదల సమూహాలెందుకో మూగవోయాయి. ఘటికలలో ఉదయాన్నే ఆచార్య నాగార్జునుని సుహృల్లేఖ పాఠాలను ఉచ్ఛస్వరాలలో వల్లెవేసే బాలబాలికలు కూడా నిశ్శబ్దంగా ఏవో తాళపత్రాలలో తమ తలలు ముంచారు. ఘడియ ఘడియకూ మోగే మహాచైత్యపు ఘంతారావం ఆనాడెందుకో మోగలేదు. శ్రమణుల నోట పలికే త్రిరత్నాలు కూడా సంజ్ఞలకే నిమిత్తం అయ్యాయి.

బజరంగికి ఎందుకో కాళ్ళు నిలవడంలేదు.

శకునాలు మాత్రం శుభాన్నే సూచిస్తున్నాయి... తన దృష్టికి రానిది, ఏదైనా వైపరీత్యం?

అతని కళ్ళు నలుదిక్కులా వెదకసాగాయి.

ఆచార్యులు తనను ఇంత ప్రొద్దున్నే పిలిపించడానికి కారణం? కన్యాకుబ్జం నుండి వచ్చి ఇంకా నెలయైనా కాలేదు... 'మళ్ళీ ఏమైనా ప్రయాణమా?'

ఈ మండువేసవిలోనా? 'ఊహూ'.

'మరి ఇంకేదైనా ఆపద? ఆ మహాసామ్రాట్టు హర్షవర్ధనుని రాజ్యానికి శత్రుభయమా? అసాధ్యం!'

ఆ ద్రోహి గౌడ శశాంకుని అణిచివేసిన పిమ్మట... అటు కపీశం నుండి కామరూపం వరకూ, ఇటూ హిమలయాల నుండి వింధ్యాచలాల వరకూ విస్తరించిన ఉత్తరదేశంలో ఆ చక్రవర్తి వంక తేరిపారజూసే ధైర్యం ఎవరికి?

ఒకవేళ...దక్షిణాపథపతి చాళుక్యుడు ఏమైనా సాహసించాడా? అహహ్... ఆ పులకేశికి ఉత్తరదిక్కు వంక కన్నెత్తి చూసే అవకాశం లేదు. ఆంధ్రపల్లవుల నుండి వెన్ను కాసుకోవడానికే సమయం చాలదు. 'మరి?'

అని అతనిలో ఉత్పన్నమవుతున్న ప్రశ్నలకు సమాధానం దొరకలేదు.

బజరంగి నాలందా మహా విద్యాలయానికి రక్షక దళాధ్యక్షునిగా బాధ్యతలు స్వీకరించి నాలుగేళ్ళు గడిచాయి. అనేక మహా సంగ్రామాలలో హర్షవర్ధనుని కుడిభుజంగా ఆ చక్రవర్తి అంగరక్షకుడిగా తన శౌర్యప్రతాపాలు చూపెట్టిన ఆ మహావీరుడికి, ఈ ఆశ్రమ రక్షణ అంటే నల్లేరుమీద బండి నడకే. బౌద్ధం స్వీకరించిన పిమ్మట, పరమాచార్యులు శీలభద్రుని ఆహ్వానం మేరకు రాజోద్యోగం త్యజించి, ఈ ఆశ్రమరక్షణ విధి స్వీకరించాడు. పదివేలకు పైగా విద్యార్థులున్నా, అందరూ శాంత స్వభావులైన బౌద్ధ శ్రమణులు. ప్రపంచపు నలుమూలల నుండీ వచ్చే ఈ విద్యార్థుల పూర్వాపరాల వివరాలు సేకరించి భద్రపరచడమే, వందకుపైగా ఉన్న అతని దళానికి ముఖ్యవిధి.

ఎప్పుడో కానీ వారి ఆయుధాలకు పని పడదు... అదీ ప్రయాణాలలోనే.

అయినా బిక్షువులు! వారిని కొడితే ఏమి వస్తుంది? బూడిద తప్ప! ఎంతటి కరుకు బందిపోట్లయినా ఈ బిక్షుబృందాలను అడ్డగించరు. సామాన్య బిక్షువులైతే ఎటువంటి రక్షణా లేకుండానే ప్రయాణిస్తారు.

అయితే... ఆచార్యుల విషయం వేరు.

ఆచార్యుని మనసులో తలచిందే తడవుగా శీలభద్రాచార్యుడు చైత్యద్వారం వద్ద ప్రత్యక్ష మయ్యాడు. బజరంగికి వెంటరమ్మని సైగచేస్తూ హుటాహుటిని సరోవరం వైపు నడవసాగాడు. పరుగు పరుగున కొండదిగుతూ వారిని అనుసరించాడు., బజరంగి.

**నాలందా**

బౌద్ధ గయకి 80 కిమీ. దూరంలో రాజ గృహానికి వెళ్ళే దారిలో ఉందని హ్యూయెన్ త్సాంగ్ చెప్పిన దానిని బట్టి, కనింగ్హామ్, నాలందాను బీహార్ రాష్ట్రంలోని బడాగావ్ వద్ద శిధిలాలుగా గుర్తించాడు. పెద్ద మామిడి తోటని ఆనుకుని ఉన్న సరోవరాన్ని ఏలే నాగరాజు, నాలందుడనే వాడి పేర ఆ ఊరికి నాలందా అని పేరు వచ్చిందని ఒక కథనం. ఐతే, ఇంద్రనీలాలవంటి నీలి సరస్సు, చుట్టూ కనక పుష్పాలతో కనువిందు చేసే ప్రదేశంలో అనేక బౌద్ధారామాలు. ఎడతెగక దాన ధర్మాలు చేసిన రాజుల ప్రతీకగా నిలిచాయనీ, 'న-ఆలం-ద' అంటే 'తనివితీరకుండా దానం చేయడం' వల్ల ఈ ప్రదేశానికి నాలందా అని పేరు వచ్చిందని హ్యూయెన్‌త్సాంగ్ రాసాడు.

అతడు ఈ విశ్వవిద్యాలయంలో, రెండేళ్ళ పాటూ ఉండి శీలభద్ర భంత వద్ద త్రిపిటకాలు అధ్యయనం చేసాడు.

నిర్మలమైన సరోవరం. ఆచార్యునికి స్వాగతం పలికిన సన్నని తెమ్మెర. నీలిరంగు అలలపై తలలు వంచి ఆచార్యునికి వందనమాచరించే ఎఱ్ఱని కలువపూలు. మావి చెట్ల నీడలో వారిద్దరూ తప్ప వేరెవ్వరూ లేరు.

'ఒక ప్రత్యేకమైన కార్యం, బజరంగీ... అది నీ ద్వారానే నెరవేరగలదు. అది తథాగతుని ఆదేశమే అనుకో...' అని సంధిగ్ధ స్థితిలో ఆగిపోయాడు ఆచార్యుడు.

'ఆజ్ఞాపించండి ఆచార్యా. ఈ నా జీవితం అపర బోధిసత్త్వులయిన తమ సేవకే అంకితం. నిస్సందేహంగా సెలవివ్వండి', అని మరో ఆలోచన లేకుండా సమాధానం ఇచ్చాడు, బజరంగి.

'నీ దీక్షాదక్షత నాకు విదితమే. కానీ నీనుంచి ఇప్పుడు నేను ఆశించేది స్వల్పమైనది కాదు. నీ జీవిత శేషమంతా అదే కార్యానికి వినియోగించ వలసి ఉంటుంది. అదీ ఇక్కడ కాదు...'

'సంశయించకండి ఆచార్యా', ఆ కార్యం ఏమిటా అన్న సందేహాన్ని పక్కకి నెడుతూ, 'ఎంతో ఆవశ్యకమైంది కాకుంటే తమరు ఇంతగా విచారించరు. పైగా బుద్ధదేవుని ఆదేశం అని సెలవిచ్చారు. నా శాయశక్తులూ వ్యయమైనా తమరి ఆదేశాన్ని శిరసావహిస్తాను. ఆ తథాగతునిపై ఆన! వాగ్దానం చేస్తున్నాను గురుదేవా', అని చేతులు మోడ్చి ఆచార్యుని ముందు తలవంచాడు, బజరంగి.

అతని శిరస్సు నిమిరి, భుజాలు పట్టి, గాఢంగా ఆలింగనం చేసుకొని, 'నాకు తెలుసు, బజరంగీ. నీవు కారణజన్ముడివి. ఈ తథాగతునిచే స్వయంగా ధర్మదీక్ష స్వీకరించిన అర్హతుడవు. ఈ భరతఖండంలో కొడిగట్టుతున్న బౌద్ధ ధర్మ జ్యోతిని పూర్వదేశాలలో పునరుజ్జీవితం చేసే మహాయజ్ఞంలో నీ కర్తవ్యం నిర్వహించేందుకు పునర్జన్మ ఎత్తిన అంగుళ్యమాలివి. ఒక్కసారి కనులు మూసుకో', అని తన బొటనువేలును అతని నుదుటి పైన ఉంచి, 'ఇదిగో జ్ఞానదృష్టితో నీ గతాన్ని చూడు. నీకే విదితం అవుతుంది', అన్నాడు శీలభద్రుడు.

బుద్ధచరిత్రనూ, ఆ తథాగతుని బోధనలనూ, మహాయాన బోధిసత్వ ధర్మాన్నీ తనలో జీర్ణించుకున్న బజరంగికీ, అంగుళ్యమాలి చరిత్ర తెలియనిది కాదు. క్రూరునిగా జన్మనెత్తి బుద్ధదేవునిచే ఉద్ధరింపబడిన ఆ అంగుళ్యమాలి, గత జన్మంలో తానేనన్న ఎరుక అతని మస్తిష్కాన్ని మెరుపులా తాకింది. ఆ తథాగతుని అనుగ్రహపాత్రుడను అన్న జ్ఞానం అతనిలో ఏమూలల్లోనో దాగిన శంకలను పటాపంచలు చేసింది. ఉత్సాహం మింటికి ఎగసింది. నిర్భయంగా తన కర్తవ్యం నిర్వహించగలననే విశ్వాసం అతని హృదయమంతా నిండింది. కనుల నీళ్ళు నిండగా, గుండె దడ చెవులలో మార్మోగగా, 'ఆనతి ఇవ్వండి, గురుదేవా, ధర్మ నిర్వహణకు ఈ శిష్యుడు సిద్ధంగా ఉన్నాడు' అని ఆచార్యుని ఎదుట సాగిలపడ్డాడు.





# 50

మధ్యరాజ్యపు సరిహద్దు పట్టణమైన లియాంగ్-చావ్ నగరంలో కుట్టించిన దుస్తులు, గత ఆరు సంవత్సరాల సుదీర్ఘ ప్రయాణంలో శిథిలావస్తకు చేరాయి. పాటలీపుత్రంలో ఎంతో శ్రమకోర్చి చైనా సంప్రదాయక శైలిలో కొత్తగా కుట్టించిన 'హాన్-ఫూ'... నడుము చుట్టూ తెల్లని పట్టీ, దానినుండి వ్రేలాడే రుమాలూ- అన్నీ సన్నని నూలు వస్త్రంతోనే. ఈ వేసవి కాలానికి ఎంతో అనువైనవి.

పడవపై నుండి గట్టునఉన్న శిథిలాల వంక దృష్టి సారించాడు, హ్యూయెన్ త్సాంగ్. ఒకప్పుడు జంబూద్వీపాని కంతటికీ కేంద్రబిందువైన కుసుమపురి నగరం. బౌద్ధసూత్రాలను ప్రపంచపు నలుదిక్కులకీ పరిచయం చేసిన అశోక చక్రవర్తి రాజధాని. 'అదిగో ఆ పక్కకి నడుపు' అని 'ఖరిబోలి' భాషలో పడవవానిని ఆదేశించాడు. చైనాలో, చెంగ్డూలోని ఆరామంలో నేర్చిన సంస్కృతానికి తోడు ఈ దేశంలోని అనేక పామర భాషలలో ప్రావీణ్యం సంపాదించాడు. కన్యాకుబ్జ ప్రాంతంలోని ప్రజలు మాట్లడే ఖరీబోలి భాష ఉత్తర భారతదేశంలో దాదాపు అందరికీ అర్థమవుతుంది.

'వద్దు స్వామీ, అపాయం. ఆ పక్కకి పోయి తిరిగి వచ్చిన వాళ్ళెవ్వరూ లేరు. అందునా సంధ్యా సమయం దెయ్యాలు తిరిగే వేళ', అని అటు వెళ్ళేందుకు ఎటువంటి ప్రయత్నం చేయకుండా, 'అల్లదిగో...ఆ దిబ్బ చూసారా? అక్కడ ఒకప్పుడు అశోక మారాజు చెరసాల ఉండేదట! ఆ నరకంలో ఎంతమందిని చిత్రవధ చేసాడో! వాళ్ళంతా దెయ్యాలై ఇప్పటికీ తిరుగుతుంటారు. మనిషి కనిపిస్తే వదలరు', అని పడవను మెల్లగా వెనుకకి తిప్పాడు.

'ఎందుకోయ్, అంత భయం? గత ఆరేళ్ళగా ఎంతో దూరం ప్రయాణించాను. ఎన్నో దేశాలు చూసాను. ఎడారులూ, మంచు కొండలూ, మహానదులూ, కీకారణ్యాలూ... ఇలాంటి పుకార్లకు జంకి ఉంటే అదంతా సాధ్యమయ్యేదా? పరవాలేదు పద. చీకటి పడేలోగా వచ్చేద్దాం'

**మంకీ**

హ్యూయెన్ త్సాంగ్ యాత్రల గురించి అనేక కథలు ప్రాచుర్యంలో ఉన్నాయి. వాటిలో ఒకటి 'మంకీ' కథ. బుద్ధుని శిష్యులు కొందరు మరుజన్మనెత్తి అతడిని ప్రయాణాలలో సదా వెన్నుకాచి ఉండేవారని నమ్మేవాళ్ళు. అలాంటి కథలలో ఒక పాత్ర 'మంకీ'. ఆ త్రిపిటక ఆచార్యుడికి అంగరక్షకుడిగా అతడిని ఎన్నోసార్లు రక్షించింది. చైనా, జపాన్ భాషలలోని ప్రఖ్యాత నవలలూ, డ్రాగన్ బాల్ 'మాంగా' కామిక్స్‌లోని 'సేయన్' పాత్రలకి కూడా ఇదే ప్రేరణ.

ఐతే, హ్యూయెన్ త్సాంగ్ గ్రంధాలలో, భారతీయ పేర్లని చైనాలోకి యధాతథంగా తర్జుమా చేయడం జరిగింది. ఎలాగంటే నాగార్జునునిలో 'నాగ' శబ్దాన్ని డ్రాగన్ అనీ, 'అర్జున' శబ్దాన్ని వీరుడనో, లేక అర్జున వృక్షం ఉంది కనుక చెట్టు అనో మార్చేసి నాగార్జునుని డ్రాగన్ వీరుడనో, లేక డ్రాగన్ చెట్టనో పిలిచారు. అలాగే, 'మంకీ'కి మూలపదం కూడా ఏ హనుమంతుడో, ఆంజనేయులో, బజరంగబలో అవడానికి చాలా ఆస్కారం ఉంది.

'నా వల్లకాదు, స్వామీ... తమరికేమి, ఇల్లూ వాకిలీ లేని సన్యాసులు. అయినా, అదేమన్నా కాస్తో కూస్తో అనుకున్నారా? నది ఒడ్డున యోజనం నిడివి గల కోట. ఈ పక్కనుండి మొదలుపెడితే ఆ వైపు వెళ్ళేందుకు రెండు రోజులు పట్టవచ్చు. నా మాటవిని ఆ సాహసం విరమించుకోండి. ఇప్పటికే చాలా జాగయ్యింది. రేవు కనీసం రెండు కోసులుంటుంది. అని నదికి ఆవలి వంక ఉన్న పట్టణం వైపు చూపించాడు.

పాటలీపుత్రం వద్ద గంగానది చాలా విశాలంగా ప్రవహిస్తుంది. సోణా నది సంగమం వద్ద దాని వెడల్పు కనీసం నాలుగు కోసులు ఉంటుంది.

'నిజమేనోయ్. చాలాదూరం వచ్చేసాం. నీవన్నట్లు ఉదయాన్నే వెళితే ఆ పాత కోటని పూర్తిగా దర్శించే అవకాశం ఉంటుంది. వీలైతే రేపు తెల్లవారుతూనే పడవ కట్టు. ప్రాచీన గ్రంథాలలో చదవడమే కానీ ఆ మహానగరం చూసిన వాళ్ళు లేరు. అవి ఎంతవరకూ నిజమో స్వయంగా పరిశోధిస్తే బాగుంటుంది.'

'అది నా వల్ల అయ్యే పనికాదు, స్వామీ. ఈ ఊరిలో నాకు తెలిసి ఆ సాహసం ఎవ్వరూ చెయ్యరు. తమరు ఇంకా పట్టుబడితే...' అని కాసేపు తలగోక్కుని, 'ఒకసారి రాజావారిని కూడా అడిగి వారి అనుమతితో... తగినంత రక్షణతో... వెళితే మంచిది. తమ క్షేమం కోరి ఇస్తున్న సలహా... తమరు మరో విధంగా అనుకోకండి', అని వేగంగా పోటేస్తూ పడవను నడిపించసాగాడు.



'బజరంగీ, ఈ హ్యుయెన్ త్సాంగ్ ఒక మహాపురుషుడు. బౌద్ధమతాన్ని చైనా రాజ్యంలోనే కాక సకల పూర్వ దేశాలలో ప్రతిష్ఠితం చేసే ఉద్దేశ్యంతో జన్మించిన ప్రత్యేక బుద్ధుడు. ఆ మహాప్రయత్నాన్ని భగ్నం చేసేందుకు మారుడు ఎల్లప్పుడూ కాచుకునే ఉంటాడు. వాని అనుచర గణాలు ఎప్పుడు ఏవిధంగా దాడి చేస్తారో చెప్పడం కష్టం. అతనిని అనుసరిస్తూ, అన్ని వేళలా కంటికి రెప్పలా కాపాడుతూ ఆ మహాపురుషుడిని డాంగ్ చక్రవర్తి నీడకి చేర్చడమే ఇక నీ జీవిత ధ్యేయం'.

'ఇదిగో... ఈ అఖండ జ్వాలను చూడు. ఇది మహాపురుషుని క్షేమానికి నిదర్శనం', అంటూ ఆచార్యుడు తన ధ్యాన చైత్యంలో వెలుగుతున్న దీపాన్ని చూపాడు– నూనె లేదు, వత్తి లేదు, నిశ్చలంగా గాలిలో వెలుగుతున్న మంత్ర జ్యోతి. చేతులు జోడించి ఆ దీపం వంకే తదేకంగా చూసాడు, బజరంగి. ఏదో అనిర్వచనీయమైన శక్తి ఆ దీపం నుండి వెలువడి అతని మనస్సుని తాకింది.

ఆచార్యుని ముఖంలో చిరునవ్వు ప్రత్యక్షమయింది. 'తథాగతుని ఆశీర్వాదం నీకు తోడై నిలుస్తుంది, బజరంగీ. నీ పయనానికి సమయం ఆసన్నమయింది. ఈ జ్యోతి ప్రతిరూపం నీ మనసులో ఉంచుకో. క్లిష్టసమయంలో అది నీకు దారి చూపగలదు'.

'పయనమా?'

'అవును. అత్యావశ్యంగా నీకు ఈ విషయాన్ని వివరించినది అందుకే. నిన్నటి సాయంకాలం నుండి ఎందుకో... ఎప్పుడూ నిశ్చలంగా ఉండే జ్యోతి రెపరెపలాడ సాగింది. ఆ మహాపురుషునికి ఏదో ఆపద రానున్నదనే శంక నా మనస్సుని తొలుస్తుంది. తక్షణమే నీవు పాటలీపుత్రం వెళ్ళి అక్కడ బసచేసి ఉన్న హ్యుయెన్ త్సాంగ్ మహాపురుషుని పరివారంతో సహా ఇక్కడికి తీసుకు రావాలి'.

శీలభద్రుని ఆదేశం ప్రకారం రెండు యోజనాలు నాలుగు గఢియల్లో ఆఘమేఘాలలో ప్రయాణించి మధ్యాహ్నానికి పాటలీపుత్రం చేరిన వెంటనే మహాయాన బౌద్ధారామమైన కుక్కుటారామంలో హ్యుయెన్ త్సాంగ్ శ్రమణుని కొరకు విచారించాడు, బజరంగి.

అతని పరివారం అంతా ఆ ఆరామంలోనే ఉన్నారు. ఒంటరిగా బయటికి ఎక్కడికి వెళ్ళాడో... ఎవరికీ తెలియదు.

'ప్రాతఃకాల వ్యాయామానికి రాలేదు. మామూలుగా భోజనాలు కావించి వారిని చూద్దామని వారి బసకు వెళ్ళాము. అంతా మామూలుగానే ఉంది. ఎక్కడి వస్తువులు అక్కడ సర్దినట్లు ఉన్నాయి. రాత సామాగ్రి అంతా వాటి వాటి పేటికలలో భద్రంగా ఉన్నాయి. పరులెవ్వరూ వచ్చిన ఆనవాళ్ళు లేవు. బహుశా వ్యాహ్యాళికి వెళ్ళారేమో. వారికి ఒంటరిగా వెళ్ళడం అలవాటే. సాయంకాలానికల్లా వచ్చేస్తారు. భయపడనవసరం లేదు', అని సర్దిచెప్పబోయాడు, కల్యాణుడు. అతడు హ్యుయెన్ త్సాంగ్ పరివారంలోని లేఖకుడు. సంస్కృత, పాళీ భాషలే కాక, మధ్య చీనా మాండరిన్ భాషలో కూడా ప్రావీణ్యం ఉంది. తాష్కంధ నగరంలో తురుష్కుల ఖాఖాన్ ద్వారా నియుక్తుడై హ్యుయెన్ త్సాంగ్ వెంట జంబూద్వీపానికి వచ్చాడు.

కానీ...

'ఎప్పుడూ నిశ్చలంగా ఉండే జ్యోతి రెపరెపలాడ సాగింది. ఆ మహాపురుషునికి ఏదో ఆపద రానున్నదనే శంక నా మనస్సుని తొలుస్తుంది' అన్న ఆచార్యుల పలుకులు అతని చెవుల్లో ప్రతిధ్వనించాయి.

తనతో వచ్చిన పదిహేనుమంది సాయుధులైన అశ్వికులను తలో దిక్కున ఆ మహాపురుషుని వెతికేందుకు నియోగించి, తాను మాత్రం విహారంలో ధ్యానముద్ర గ్రహించి, తన మనసును ఆచార్యుడు ఉపదేశించిన విధంగా ఆ అఖండజ్యోతిపై కేంద్రీకరించాడు.

**పాటలీపుత్రం**

క్రీశ. 635లో హ్యుయెన్ త్సాంగ్ చూసిన మగధ రాజ్యానికీ, ఒకప్పుడు వైభవోపేతంగా భారత ఉపఖండానికి కేంద్రమై, అలెక్జాండర్‌నే గడగడలాడించిన మగధకీ నక్కకీ నాగలోకానికీ ఉన్నంత తేడా కనిపిస్తుంది. కోటలన్నీ పాడుపడి ఉన్నాయట. పాడి పంటలైతే సుభిక్షమే కానీ, వర్షాకాలం ఆరంభమైతే, ఒకప్పుడు దేశం నలుమూలలనుండి వచ్చే రాజ మార్గాలకి కేంద్రం అయిన మగధ రాజధానికి ప్రయాణానికి పడవలే దారి నదికి అవతల ఉన్న శిధిలాలకు కుసుమపురి అని పేరు. అదే అశోకుని కాలంలో భారత రాజధాని. అప్పటికే నిర్మానుష్యమైన ఆ శిధిలాలను పరిశీలించి వివరంగా తన గ్రంధంలో పొందుపర్చాడు, హ్యుయెన్ త్సాంగ్.

కొన్ని గఢియలు అలాగే గడిచాయి. అతని మనోనేత్రంలోని జ్యోతి ప్రతిరూపంలో ఎటువంటి అలజడీ లేదు. అంటే... ప్రస్తుతానికి ఆ మహా పురుషునికి ఎటువంటి ఆపదా లేదు, అని మనస్సుని సర్ది పెట్టుకునే సమయానికి సూర్యాస్తమయం అయింది.

కనులు తెరిచినంతనే... ఎదురుగా పరుగెత్తి వస్తున్న భిక్షువు!

ఎగదన్నుతున్న ఆయాసాన్ని అణుచుకుంటూ, 'తలశిఖ ఆరామం నుండి వర్తమానం... ఆచార్యులు ప్రజ్ఞాభద్రుల వద్ద నుండి... చైనా శ్రమణుని బందిపోట్లు బంధించారట...'



# 51

'స్వామీ, ఇక బయలుదేరుదామా?' అడిగాడు, ఆదిత్యసేనుడు.

తన బంధవిముక్తికి వాళ్ళకు చెల్లించాల్సిన రుసుం లక్ష వెండి ముద్రలట!'

పడవవాని మాట పెడచెవిన పెట్టి ఒంటరిగా చేసిన సాహసమే ఈ పరిస్థితి తెచ్చింది. ఇప్పుడు తాను ఈ బందిపోట్లకు బందీని. కాందిశీకులై, అడవులబట్టి తిరిగే బందిపోట్లయినా, తన ఆతిథ్యానికి మాత్రం ఏలోటూ చేయడంలేదు. 'తానిప్పుడు వాళ్ళకి పదివేల బంగారు కాసుల విలువచేసే సరుకు, మరి'. తన ప్రార్థనలకూ, రచనా వ్యాసంగానికీ, వ్యాయామానికీ ఎటువంటి లోపమూ లేదు, అనుకుంటూ, ఆదిత్యసేనుని వైపు చూసాడు, హ్యుయెన్ త్సాంగ్.

బందిపోటయినా, అతని ముఖవర్చస్సు చూస్తే ఉచ్చవంశస్థుడని సులభంగా గ్రహించవచ్చు. విద్యావంతుడూ, సంస్కారవంతుడూ. అతని ప్రాపంచిక జ్ఞానం నగరవాసులలో కూడా అరుదే. అతడి వెంట, కుసుమపురి కంధరపు పశ్చిమ ద్వారం వద్ద గల మహాచైత్యపు శిధిలాలను పరిశీలించడంలో రోజంతా గడిచి పోయింది.

ఆదిత్యసేనుడు ఆ బందిపోట్లకి నాయకుడు. ఒకప్పటి గౌడరాజు శశాంకుని సైన్యంలో అశ్వదళపతి. దక్షిణాపథం నుండి ఏనాడో వలసవచ్చిన మహావీరుడు. మిగిలినవారూ అంతే. తమ క్షాత్ర వీర్యాలను పణంగా పెట్టి యుద్ధాలలో అడిగిన రాజుకు, తగిన వేతనానికి సహాయం అందిస్తూ జీవనం గడిపే శస్త్రైక జీవులు.

వీరభోజ్యంలో వారి భాగం హారతి కర్పూరంలా ఎప్పుడో ఆవిరై పోయింది. హర్షుని జైత్రయాత్ర తరువాత గత ఐదేండ్లగా ఉత్తరాదిలో యుద్ధం లేదు.

శాంతి!

జీవనోపాధికై కర్షక వృత్తి చేబట్టడం వారి నైజం కాదు. వారికి తెలిసింది ఒకటే విద్య. ఆయుధం పట్టడం. గౌడ, ఓఢ్ర, కామరూప, కోసల, మాళవ, గాంధారాలు ఒక్కొక్కరిదీ ఒక్కొక్క దేశం, ఒక్కొక్క భాష.

అయితేనేం?

గొంతుకి కత్తి పెట్టి బెదిరించడానికి ఏ భాష అయితేనేం?

దారి కాసి దోచుకోవడమే వారి వృత్తి.

వాణిజ్యం, నగర జీవనం అస్తమిస్తున్న ఆ చీకటి యుగంలో పాడుబడిన కంధరాలకి కొదువలేదు. అవే వారికి ఆశ్రయాలు.

కానీ...

పాపం, ఇలా ఎంతకాలం?

తననుండి వారికి లభించే రుసుముతోనన్నా వాళ్ళ కష్టాలు గట్టెకుతాయేమో? లక్ష ముద్రలంటే పదివేల బంగారు కాసులు! ఆదిత్యసేనుని జట్టు సభ్యులు ఇరవైమంది. పెడదారి పట్టినా ఆరితేరిన వీరులు. ఆయుధాలు సమకూర్చుకొని దక్షిణాపథానికి పోవడమే వాళ్ళ ఉద్దేశ్యమట... అక్కడయితే వాళ్ళకి పనికి కొదువలేదట. కర్నాట, కళింగ, ఆంధ్ర, ద్రవిడ దేశాలలో ఊరికొక రాజు, రోజుకో యుద్ధం.

'పద ఆదిత్యసేనా, నీ ద్వారా ఈ ప్రదేశం చూసే అదృష్టం దక్కింది', అని స్తూపం వెలుపల ఏ పూజలూ లేక పడి ఉన్న తథాగతుని అడుగుల గుర్తులకు మరోసారి నమస్కరించి, వెనుదిరిగాడు, హ్యుయెన్ త్సాంగ్. ఆ అమూల్యమైన పాద చిహ్నాలను నగరానికి తరలించక ఈ విధంగా విస్మరించడం అతని మనస్సుని కలచివేసింది. ఏదోవిధంగా ఆ శిలను పెకిలించి ప్రజల మధ్యకు చేర్చాలనే కోరిక అతనిని ఆవరించింది. అదే ఉద్దేశ్యాన్ని ఆదిత్యసేనునికి వివరించాడు.

'సాధ్యం కాదు స్వామీ. ఇంతకు ముందు కూడా ఎందరో ప్రయత్నించారట. ఇవి బుద్ధదేవుడు తన మహాపరినిర్వాణానికి ముందు ఈ నగరం వీడుతూ వెనుదిరిగి చూసినప్పుడు పడిన పాదాల గుర్తులు. ఇక్కడి నుండి తరలిస్తే అవి అదృశ్యం అవుతాయి. ఇదే కాదు. ఈ శిధిలాలలో మరెన్నో వింతలు ఉన్నాయి. అదిగో ఆ కనిపించే తోపు, అన్నీ ఉసిరిక చెట్లే. అది అశోక మహారాజు తన ఆఖరి రోజులు గడిపిన ఆమ్లక వనం. చూస్తారా?' అని వేలెత్తి చూపాడు.

'తప్పకుండా... నీ వద్ద బందీగా ఉన్నంత కాలం, ఇక నీవే నా గురువు. నీ పరిజ్ఞానం అసామాన్యం, ఆదిత్యసేనా... పద చూపించు', అని ఆవంక అడుగులేయసాగాడు.

'ఇప్పుడు కాదు స్వామీ. సూర్యాస్తమయం అవుతుంది. మేమూ... పలాయనంలో ఉన్న బందిపోట్లం. దీపాలు పెట్టే అవకాశం లేదు. రేపు ఉదయం తప్పక తీసుకు వెళ్తాను', అని వారించాడు, ఆదిత్యసేనుడు.



'తలశిఖ ఇక్కడకు నైఋతి దిశలో మూడు యోజనాలు. నది దాటాలి. అంటే... ఆ బందిపోట్ల స్థావరం నదికి ఆవలి పక్క ఎక్కడో ఉండి ఉండాలి', అని తన ఆలోచనను బహిర్గతం చేసాడు, బజరంగి.

'హ్యుయెన్ మహాశయుడు నది దాటి అవతలి పక్కకు ఎందుకు వెళ్ళి ఉంటారు? అందులో ఒంటరిగా?' అని సందేహాన్ని వ్యక్తపరిచాడు కల్యాణుడు.

‘నదికి ఆవలి వంక ఏమీ లేదే? పాడుబడ్డ పాత నగరపు శిథిలాలు తప్ప… ఊహూ… అటు వెళ్ళేందుకు ఆస్కారం లేదు’, అన్నాడు కుక్కుటారామపు గృహపతి. తారనాథుడు కుక్కుటారామం వెయ్యికి పైగా శ్రమణులకే కాక, అనేకమంది భిక్షు స్త్రీలకూ నిలయం. మగధ ప్రదేశం అంతటిలో వారి సౌందర్యం సుప్రసిద్ధం. సాయంకాలం అయ్యేసరికి పాటలీపుత్రపు వీధులు విటులతో, మద్యపాన ప్రియులతో నిండిపోతాయి. మగధ ప్రాబల్యం అడుగంటినా, వాణిజ్యం పతనమైనా, ఎప్పుడో కొండెక్కాల్సిన పాటలీపుత్ర ప్రాభవ జ్యోతి, ఈ ఆరామం వల్లనే ఇంకా మిణుక్కు మిణుక్కుమంటుంది.

నదివద్దున సైకత వనం, రాత్రి రెండవజాము గంటలు మ్రోగుతున్నా, గ్రీష్మ తాపం తగ్గలేదు. వాయుదేవుడు ఉగ్గబట్టినట్లు, ఏ మాత్రం గాలిలేదు. పరిచారికలు వీసే విసినెకర్రలే ఏదో కొంచెం ఊరట.

‘నిజమే… ఆ వంక ఏమీ లేదు. కానీ, బందిపోట్లు అతడిని పట్టణంలోనే బంధించి రహస్యంగా నది దాటించేందుకు దారిలేదు. నది నిండా మత్స్యకారులు, రహదారి పడవలూ…’, అని పైకి ఆలోచిస్తూ, ‘ఆహ్, నిన్న రాత్రి కూడా వారెందుకో చాలా ఆలశ్యంగా వసతికి వచ్చారు… వారికి తన దినచర్యను ప్రతి రాత్రీ తన ‘సి–యు–కీ’లో సంక్షిప్తంగా లిఖించడం అలవాటు. అది చూస్తే మనకు వారెక్కడికి వెళ్ళారో సూచన దొరకవచ్చు. ఇప్పుడే వెళ్ళి చూస్తాను’, అని లేచి విడిది వంకకు హడావుడిగా పరుగెత్తాడు, కల్యాణుడు.

‘ఏమీ లాభం లేదు. ముందుగా ఆ లక్ష ముద్రలూ ఎలా ప్రోగు చేయాలో ఆలోచించండి. బంధ విముక్తికి రుసుం చెల్లించడం ఒక్కటే మార్గం’, అన్నాడు తారనాథుడు.

‘ఆ విషయంలో మీకు ఏ చింతా అవసరం లేదు. నాలందా విద్యాలయం తరపున నేను పత్రం రాసి ఇస్తాను. మీరు పైకం సిద్ధం చేస్తేచాలు’, అన్నాడు బజరంగి, తన చేతి అంగుళీయకం మీద ఉన్న విద్యాలయపు అధికార ముద్రికను చూపుతూ.

‘అయ్యో… నా చేతనయితే తప్పక చేసే వాడిని. ఆరామంలో నిధులు శూన్యం. మద్యశాలలూ, వసతి గృహాల నుండి వచ్చే ఆదాయం అంటారా, అది భిక్షువుల భోజనాదికాలకే చాలవు. ఎవరైనా వర్తక శ్రేష్ఠిని అర్థించాల్సిందే. అయినా కష్టకాలం. నూటికి ముప్పై లేకుండా వడ్డీకి ఎవరూ ఇవ్వరు’, అన్నాడు రాబోయే లాభాన్ని అంచనా వేస్తూ.

‘పరవాలేదు. వెంటనే సిద్ధం చేయండి’, అన్న బజరంగి మాట వినగానే, తారనాథుని ముఖం వెయ్యి దీపాల కాంతితో వెలిగిపోయింది.

పక్కనే నిలిచిన పరిచారికతో, ‘ఏమే, ఎంతసేపు దిక్కులు చూస్తావ్? అతిథులను గౌరవించడం తెలియదా? వెంటనే నాలందా దళపతులకు భోజనాలు సిద్ధంచేసి, వారి అవసరాలు ఏమైనా సరే తక్షణం నెరవేర్చమని సంగక్కకి చెప్పు. ఊం! త్వరగా’, అని పురమాయించాడు

‘ఆ అవసరం లేదు. ఈ అర్ధరాత్రికే నది దాటాలి. వెన్నెల రాత్రి. తెల్లవారేసరికి తిలశిఖ చేరడమే మా ఉద్దేశ్యం. పైకం సిద్ధపర్చడానికి ఈ సమయం చాలనుకుంటాను’, అన్నాడు, బజరంగి.



అది ముప్పై అడుగుల ఎత్తు స్తంభం. అశోకునిదే, సందేహం లేదు. స్తంభం చుట్టూ ఏదో ప్రాచీన లిపిలో... ఏవో అక్షరాలు?

'అది యక్షుల భాష. మానవమాత్రులకు అర్థం కాదు. బుద్ధదేవుని అస్తికలను అజాతశత్రువనే మహారాజు, ఎనభై నాలుగు వేల కలశాలలో భద్రం చేసాడట. వాటిని అశోకుడు ఈ క్షుద్రదేవతలకు ఇచ్చి దేశం నలుమూలలా, కోటి మంది ప్రజలు ఉన్న ప్రతి పట్టణంలో స్తూపాలు నిర్మింపజేసాడు. ఆ అద్భుత కార్యం ఒకే రోజులో జరగాలని ఆదేశించాడట. అది సాధించేందుకు అశోకుని గురువు, ఉపగుప్త మహాపురుషుడు సూర్యుడిని స్తంభింపజేసాడట. ఆ కథే అన్ని అశోకుని స్తంభాలమీదా వాళ్ళ భాషలో లిఖించారట!' అని వివరించాడు ఆదిత్యసేనుడు.

'ఓహో! గొప్ప కథే! అంటే ఆ కాలంలో అన్ని కోట్లమంది ఈ దేశంలో నివసించేవారు అన్నమాట?' అన్నాడు హ్యుయెన్ త్సాంగ్ వ్యంగ్యంగా.

'మరి అందులో అనుమానించడానికి ఏముంది స్వామీ? ఆ యుగంలో కరువులు లేవు, రోగాలు లేవు, యుద్ధం లేదు. ప్రజలకి ఏ భయమూ చింతా లేదు. మనుష్యులు వేల సంవత్సరాలు జీవించేవారు. వందలకొలదీ సంతానం. ఈ కలికాలం కాదు కదా!'

'అవునవును. అంటే ఆ కనబడే ఐదు స్తూపాలలో కూడా ఆ తథాగతుని అవశేషాలు నిక్షిప్తమై ఉన్నాయా?' అని ఎదురుగా వరుసలో సగానికిపైగా మట్టిలో కూరుకుపోయి శిధిలావస్తలో ఉన్న స్తూపాలను చూపాడు.

అటు చూసిన వెంటనే తలతిప్పుకుంటూ, 'అటు చూడకండి స్వామీ. అపశకునం. అవి స్తూపాలు కావు. ధననంద చక్రవర్తి తన సంపదనంతా సువర్ణ రత్న రాసులుగా మార్చి వాటిలో దాచాడట. ఏవో పైశాచిక శక్తులు వాటిని కాపాడుతుంటాయట! గౌడ మహారాజు శశాంకుడు వాటిని గురించి విని వాటిని తవ్వాలనుకున్నాడు. ఆ ఆలోచన వచ్చిన మరుక్షణమే, అతడు హర్షుడి సేనల వాతపడి చిత్రవధకి గురి అయ్యాడు. అంతా సర్వనాశనం. అదే మా దురదృష్టానికి నాంది...' అంటుండగానే ఎటునుండి వచ్చారో...

పదిమంది శస్త్రధారులైన అశ్వికులు.

కనులు మూసి తెరిచేలోగా హ్యుయెన్ త్సాంగ్ చుట్టూ రక్షణ వలయంగా చుట్టుముట్టారు. మరో ఇద్దరు ఆదిత్యసేనుని రెక్కలు విరిచి పట్టారు. వారి నాయకుడేమో... తళతళ మెరిసే చంద్రహాస ఖడ్గాన్ని అతని గొంతుపై ఆనించి, 'చెప్పు, మిగిలినవాళ్ళెక్కడ?' అని అడిగాడు. వెంట్రుకను సగానికి చీల్చే పదునుగల ఖడ్గం! ఆదిత్యసేనుని కంఠం నుండి, రక్తం బొట్లు బొట్లుగా రాలసాగింది.

ఆహా! వచ్చేసింది. తన మరణముహూర్తం!

ఇంతకాలం శత్రుసైన్యాలమధ్య వీరవిహారం చేసినప్పుడు రాలేదు.

బందిపోటై కోటగుమ్మటాలపైనున్న సైనికులకూ, శ్రేణీ రక్షకభటులకూ సవాళ్ళు విసురుతూ స్వైరవిహారం చేస్తునప్పుడు రాలేదు.

ఆయుధ రహితుడై, ఈ శిధిలాలలో, అగంతుకుల చేతిలో, అనామకుడై చావాలేమో?

ఎందుకో... భయంతో అతని శరీరం కంపించ లేదు.

కంఠాన్ని ఆనిన చంద్రహాస ఖడ్గం, ఎన్నో ఏళ్ళు ఊరించిన పిమ్మట చెంత చేరిన ప్రేయసి వేసిన వరమాలలా తోచింది.

చావంటే అతనికి ఎన్నడూ భయం లేదు. అతనికి తెలుసు... అది ఒక్కటే అతని నీచ జీవనానికి పరిష్కారం. తానున్న పరిస్థితి నుండి విముక్తి. కనులు ఒకసారి మూసాడు, శ్వాసలో ఎన్నడూ అనుభవించని ఏదో అపూర్వ పరిమళం!

అతని ముఖంపై చిరునవ్వు తొంగిచూసింది.

కళ్ళు తెరిచి మృత్యువు ముఖంలోకి తేరిపార చూసాడు.

'నీవు... ఆదిత్యసేనుడవు కదూ? చాళుక్య దళపతి, ఆదిత్యసేనుడవు కదూ?' మృత్యువు భ్రుకుటి ముడివేసి ప్రశ్నించింది.



# 52

వేంగీనగర నడిబొడ్డులో కథ వినేందుకు పోగైన జనానికి, కనుల పంటగా, వీనుల విందుగా, పాడటం ఆరంభించింది ఆ కళింగపు నాట్యగత్తె, 'వేంగీ పురి ప్రజలకు వేవేల వందనాలు. తూరుపు సీమ వాళ్ళం. ఆట పాటలు చూసి ఆనందించండి. పల్లవనాటి పరపతి పెరిగేట్లు ధర్మం చేస్తే ధన్యులమవుతాం'.

'ఓహో చిలక! ఏం పాట పాడేవో అయ్యలకు జెప్పవే', అనే వంతల సైదోడుగా, వయ్యారాలు ఒలకబోస్తూ పాట అందుకుంది.

'రాములోరీ కతా రంజుగా చెబుతాను
ప్రహలాదు చరితరా సెతురంగ సెబుతాను
గౌతముని జాతకం గలగలా జెబుతాను
మాబారతపు పోరు మిన్నగా చెబుతాను'

'ఓసోస్, ఆ పురాణాల్ మనకెందుకే? ఏదన్నా కొత్త కద చెప్పవే, చిలక. అయ్యలు ఆనందిస్తారు, అమ్మలు వాయనాలిస్తారు'.

'కొత్త కథా? కరువు భూతం దెబ్బకి, కడుపు చేతబట్టుకుని ఈ ఊరొచ్చాము. ఏ కథ చెప్పేదిరోరన్న?'

'మన కష్టాలే కథగా చెబితే, ధర్మ ప్రభువుల గుండెలు కరిగేను. శిబి చక్రవర్తికే దానగుణం నేర్పే మారాజుల సీమ, ఈ ఆంధ్రదేశం, అందుకోవే పాట'.

'సరే నీ వంత కలుపు, ఊ... హూ......' అని తంబూర మీటుతూ,

'కళింగ సీమకు కాలకూటమై
పిష్ఠపురానికి పీడ గ్రహమై
సాధుజనాలకు యమ సంకటమై
పంట భూములకు కరి కాటకమై
వచ్చాడయ్యో... అయ్యో... ఓ... ఓ...
వచ్చాడయ్యో మహరాజు
మా దేశ ప్రెజలకూ యమరాజు'

'ఎవరే ఆ మారాజు...'

'ఇంకెవరూ...

సోలంకోడికి తోబుట్టంట

ఆ లంకోడికి సరి జట్టంట

విష్ణుకుండినుడి రామరాజ్యమూ

ఇసుమంతయినా కనబడదంట'

'ఆహా... ఏం చెప్పావే చిలకా... ఆ మహారాజు ప్రభలు వర్ణించవే

చిట్టిరాజు...

ఓహోయ్

పోట్టిరాజు...

ఓహోయ్

మరుగుజ్జురాజు...

ఓహోహోయ్

చిరుబొజ్జరాజు...

ఓహోయ్,

ఈ విధంగా సాగుతున్న పాటకి జనం విరగబడి నవ్వసాగారు. భూమికి మూడడుగులు ఉండని మరుగుజ్జు విష్ణువర్ధనునిపై వ్యతిరేకత తెలుగునాట బడబాగ్నిలా పెల్లుబుకుతుంది. అతని రూపం గుర్తువచ్చి ఆదిత్యసేనునికీ నవ్వు ఆగలేదు.

బజరంగి పుణ్యాన హ్యుయెన్ త్సాంగ్ మహాశయుని అంగరక్షకునిగా చేరి, నాలందాలో బయలుదేరి, గౌడ, కామరూప దేశాలను చుట్టి, దక్షిణాముఖంగా కళింగం చేరారు.

కళింగం ఇంకా తేరుకోలేదు.

పులకేశి జైత్రయాత్ర వల్ల ఏర్పడిన గాయం ఇంకా మాయలేదు. యుద్ధంలో హతుల, క్షతగాత్రుల సంఖ్య అపారం. చిత్రతోళం, కళింగనగరం, వైశాఖపురి మొదలైన రేవులలో మునుపటి శోభలేదు. వాణిజ్యం పూర్తిగా క్షీణించిపోయింది. గ్రామాలలో కాడి పట్టి వ్యవసాయం చేసే పురుషులే కరువు. దానికి తోడు, చాళుక్య పులకేశికి కట్టవలసిన కప్పపు భారం...

'గోదారమ్మ తల్లి గొల్లుమన్నాది...',

చిలక పాట ఇంకా సాగుతూనే ఉంది.

అవును, పులకేశి సృష్టించిన భీభత్సానికి తోడు ఆ గోదావరితల్లి కూడా అలిగిందేమో, మూలిగే నక్కపై తాటిపండులా, గత ఏడేళ్ళగా నదికి వరదలేదు. కరువు రాక్షసి కోరలలో చిక్కిన కళింగ

ప్రజలు వలస పోసాగారు. ఏ వంక చూసినా ఈతిబాధలూ, ఎముకల గూళ్ళుగా మిగిలిన ప్రజలూ. కుబ్జ విష్ణువర్ధనుని అధికారం కూడా పూర్తిగా క్షీణించింది. అరాచకం ప్రబలిపోయింది.

ఆ పరిస్థితులలో తమ ప్రయాణాన్ని కొనసాగించేందుకు, నాయకుడు, బజరంగి ససేమిరా అన్నాడు. హ్యుయెన్ త్సాంగ్ మహాశయుని ఒప్పించి కళింగ రాజధానియైన పిష్ఠపురం చేరకుండానే వెనుదిరిగి, కోసలదేశం మీదుగా ఆంధ్ర రాజధానికి చేరడానికి ఒక ఏడాది పట్టింది.

ఇక ఆ మహాశయుని లక్ష్యం నాగార్జున పురుషుని నిజస్థలమైన ధాన్యకటకం దర్శించటమే. అక్కడ భావవివేకాచార్యుని వద్ద మాధ్యమిక సూక్ష్మాలను గ్రహించడంతో వారి జంబూద్వీప పర్యటన పరిసమాప్తమయినట్లే.

ఆలోచనలలో పడి, పాట హటాత్తుగా ఆగిన విషయమే గమనించలేదు.

అంతలో, నీళ్ళు నిండిన కనులతో... అంతవరకూ ఆట పాటలతో అందరినీ మైమరిపించిన చిలకమ్మ ముఖం ఆదిత్యసేనుని ఎదురుగా కనిపించింది.

'అశ్వదళవాయి ఆదిత్యసేనులకు ఈ చిలకమ్మ అభివాదాలు', అని గద్గదమౌతున్న స్వరంతో అతన్ని పలకరించింది.



తన మంగ!

తనకిక లేదనుకున్న తన మంగ.

ఈనాడు...

అంతసేపూ తన ఎదుటనే ఉన్నా తన మంగను తాను గుర్తించనేలేదు.

అదొక గతజన్మ జ్ఞాపకం. ఒక గడిచిపోయిన మధుర స్వప్నం!

మసకబారిన కళ్ళతో ఆమెనే చూస్తూ ఉండిపోయాడు. కలా? నిజమా? అతని మనోఫలకంపై ఆమె జ్ఞాపకాలు గిర్రున తిరిగాయి.

వాతాపి నగరంలో...



# 53

అప్పుడు తనది పదిహేడేళ్ళ కోర వయసు.

చాళుక్య సైన్యంలో చేరేందుకు, ఎవరికీ చెప్పకుండా, ఒంటరిగా కోట వదిలి, రెండు నెలలు, అడవులూ కొండలూ దాటి ఆ మహానగరం చేరాడు. హర్షవర్ధనుని దక్షిణదేశ దండయాత్రని అరికట్టేందుకు, చాళుక్య పులకేశి ఇచ్చిన పిలుపందుకుని అసంఖ్యాకంగా అతడి జట్టు చేరిన దక్షిణాపథపు యువ యోధులలో తానూ ఒక్కడు.

బొడ్డున కట్టిన బంగారు కాసులు, మార్గమధ్యంలోనే అయిపోయాయి. అంబు వేటుకి వేట పడకపోతే, పండ్లూ, దుంపలూ, అవీ లేని రేగడిలో కృష్ణమ్మ నీళ్ళే. చేపలు పట్టే పల్లెవాళ్ళనీ, ఊరికి దూరంగా ఉన్న తోటకాపులనీ బ్రతిమాలో, బెదిరించో కడుపు నింపుకుంటూ, ఎట్టకేలకు వాతాపి చేరాడు.

పది యోజనాల విస్తీర్ణం గల మహాపట్టణం. చుట్టూ రాళ్ళూ, కొండలూ. మలప్రభానది వంపులో ఒదిగిన అభేద్యమైన దుర్గం.

ఊరు కొత్త.

చేతిలో చిల్లిగవ్వ లేదు.

తానెవరో చెప్పి సాయమడిగితే ఎవరైనా వెంటనే ఆతిథ్యం ఇవ్వకపోరు. కానీ ముఖం చెల్లదు.

తన తోడుగా వచ్చిన పంచకల్యాణికి, పచ్చిక తప్ప సరియైన దాణా లేదు. సైన్య సమీకరణ శిబిరం ఊరికి రెండు యోజనాల దూరంగా అయ్యావోలు దుర్గం వద్ద. బొడ్డున ఉన్న పిడిబాకును అమ్మితే వచ్చిన ఆఖరి రాగి ముద్రతో గుర్రానికి ఉలవలు పెట్టి, నీరసంగా కోట ఉత్తర ద్వారంవైపు నడవసాగాడు.

మిట్టమధ్యాహ్నం. నిప్పులు చెరిగే ఎండ.

ఎక్కడనుండో వీణా నాదం?

భ్రమ.

ఈ మండుటెండలో సంగీతమా?

**బాదామి**

క్రీశ. 6వ శతాబ్దం నుండీ దక్కన్ పీఠభూమిని రెండు శతాబ్దాలు పాలించిన చాళుక్యుల రాజధాని.

మలప్రభానది ఒంపులో సురక్షితమైన దుర్గం. చుట్టూ కొండలు వాటిని తొలిచి కట్టిన ఆలయాలు, జైనులవీ, వైష్ణవులవీ, శైవులవీ. రాజులు వైష్ణవులైనా అన్ని మతాలకూ ప్రాముఖ్యాన్ని ఇచ్చారు. గుహల వాస్తు విజయవాడలోని సీతానగరం, ఉండవల్లీ, పశ్చిమ గోదావరిలోని గుంటుపల్లి గుహల మూసలోనిదే. శిల్పకళలోనే కాదు, నాటి సాంస్కృతిక జీవనంపైన కూడా ఆంధ్ర ప్రాంతపు ప్రభావం ఎంతో ఉంది. కన్నడ సాహిత్యానికి ఆదికవిగా కీర్తించబడే పంపడు గుండ్లకమ్మ తీరంలోని కమ్మనాటికి చెందిన వాడే. అంతేగాక త్రిరత్నాలలో మరొకడైన పొన్నడు వేంగీపురి నుండి బాదామికి వలస పోయిన తెలుగువాడే. దక్షిణాపథంలో వైష్ణవ శైవ ఆలయాల నిర్మాణాలు ఈ కాలంలోనే ఊపందుకున్నాయి. ఒక్క ఐహోలులోనే వందల కొలదీ కట్టడాలు ప్రాచీనాంధ్రశైలిలో మనవాళ్ళ శిల్ప వాస్తు ప్రతిభని ఈనాటికీ చాటుతూ నిలిచి ఉన్నాయి. చాళుక్య కళావైభవం ఇక్కడికే పరిమితం కాక మిగిలిన కర్నాటక, తమిళనాడు, మహారాష్ట్ర, ఆంధ్ర ప్రదేశ్‌లలో కూడా కనిపిస్తుంది.

ఉత్తర కర్నాటకలో బాదామీ, ఐహోలు, పట్టడకల్లు కాంప్లెక్స్ ఇప్పుడొక ప్రఖ్యాతి గాంచిన పర్యాటక కేంద్రం.

ఘుమ ఘుమలాడే నేతి వాసన. తల తిప్పి చూసేందుకు కూడా ఓపిక లేదు. కళ్ళు బైర్లు కమ్మసాగాయి.

దాహం.

ఏదో గలగలా పారే నీటి సవ్వడి? నగరం మధ్యలో సెలయేరా? 'సూర్యతాపానికి మనస్సు అదుపు తప్పుతుందిరా' అని గుర్రం మెడపై తడుతూ ముందుకి సాగబోయాడు. తల అడ్డంగా ఆడిస్తూ మెల్లగా సకిలించి, పక్కదారికి లాగింది, అతడికి మిగిలిన ఒకే ఒక నేస్తం. తడబడే కాళ్ళతో దానిని అనుసరించాడు.

కాళ్ళకింద మెత్తని పచ్చిక. తలయెత్తి చూసాడు. మల్లే, సంపెగ పొదలు. నీడనిచ్చే మావి చెట్లు. సూర్యకిరణాలను కళ్ళు మిరుమిట్లు గొలిపేలా ప్రతిబింబిస్తున్న సరోవరం. ఎర్రని నిలువెత్తు రాతి బండ పైనుండి దుమికే కృత్రిమ జలపాతం. పూపొదల మధ్య జలజల పారుతున్న సెలయేరు. జాజి పందిరి నీడలో అరుగుపై కూర్చొని వీణ మీటుతున్న సరస్వతీ దేవి ప్రతిరూపాన్ని చూస్తున్న తన కళ్ళు మసకబారి పోయాయి.

✦ ✦ ✦

ఆమె పేరు మంగమ్మ. రాజనర్తకి రంగమాంబ గారాల పట్టి. ఇంకా కన్నెరికం తీరని బంగారు బొమ్మ.

ఆమె తల్లి చాళుక్య ప్రభువు మంగళేశుని నీడలో సమస్త రాజ లాంఛనాలతో గౌరవింపబడి, కులానికే తలమానికమైన అపూర్వ ప్రజ్ఞాశాలి. ఆమె నాట్యం చూసేందుకు రంభా తిలోత్తమా వంటి దేవ వేశ్యలే భువికి దిగివస్తారని ప్రతీతి. కులానికి దేవదాసీ అయినా, చక్రవర్తి మంగళేశుని తప్ప వేరొక పురుషుని కన్నెత్తి చూడని విమలశీలి. పినతండ్రి మంగళేశుని వధించి రాజ్యాధికారాన్ని చేబట్టిన ప్రస్తుత చాళుక్య ప్రభువు పులకేశి కూడా ఆమె గౌరవాలకు ఏమాత్రమూ తక్కువ చేయలేదు.

నదీతీరంలో రంగుటద్దాల సౌధం, విశాలమైన స్వైరవనం మాత్రమే కాక, ఆమె ఆస్తులు రాజ్యం నలుమూలలా లెక్కకు లేనన్ని. వైష్ణవ దేవాలయాలకు ఆమె ఇచ్చిన విరాళాలు అపారం. వాతాపి నగరపు ఉత్తర ద్వారాన్ని ఆనుకుని కొండకొమ్ముపై, మంగళేశుడు నిర్మించిన ఆలయం కొరకు స్వంత ఖర్చుతో కొండను తొలిపించి ఆమె కట్టించిన దశావతార మంటపాలు, ఆమె భక్తికీ, ధర్మదీక్షకూ తార్కాణాలు

ఆమె ఆస్తిపాస్తులపై, వ్యవహారాలపై పెత్తనం అంతా ఆమె అన్న లకుమయ్యది. చెల్లెలు అంటే అమితమైన ప్రేమ, మేనకోడలు మంగమ్మకి అతడు తండ్రితో సమానం. వందకు పైగా నర్తకీమణులూ, పరిచారికలూ గల ఆ గృహానికి అతడొక్కడే మగదిక్కు.

'ఏమ్మా, మంగా? ఆ అబ్బాయి ఇప్పుడు ఎలా ఉన్నాడు?' అంటూ లోనికి వచ్చాడు లకుమయ్య.

'పరవాలేదు మామయ్యా. ఎప్పుడు తిన్నాడో, పాపం, ఉదయందాకా అపస్మారకంగానే ఉన్నాడు. ఉగ్గు గిన్నెతో చెరకురసం పట్టించాను. ఇప్పుడిప్పుడే కొంచెం మనుషుల్లోకి వస్తున్నాడు. ఏ ఊరి వాడో?'

'కుర్రాణ్ణి చూస్తే పెద్దింటి వాడిలా తోస్తుంది. అతని గుర్రం మంచి ఉత్తమజాతిదట, మన అశ్వశాల బిట్టప్ప చెప్పాడు. అబ్బాయి ఎండకి కమిలి నల్లబడ్డా సుకుమారుడే. ఏ తల్లి బిడ్డో? దొడ్డమ్మతో చెప్పి అతని శరీరాన్ని తడిబట్టలతో తుడవమను. కాస్త తేరుకుంటాడు', అని మేనకోడలిని ఎగాదిగా చూసి, 'ఊ... ఇంతకూ నీ సంగతేమిటి? తెల్లవార్లూ అతనికి సేవ చేస్తూ నీ విషయం మర్చిపోయినట్లున్నావ్. అన్నమైనా తిన్నావా లేదా? పద భోంచేద్దువు గాని', అని మంగమ్మ చేయందుకుని చావిట్లోకి నడిచాడు, లకుమయ్య.

కొద్దికొద్దిగా వస్తున్న తెలివిలో, ఆ మామా కోడళ్ళ సంభాషణ విన్నాడు, తాను. ఆ పెద్దమనిషి ఊహించింది నిజమే. ఈపాటికి తనకోసం దేశమంతా వెదుకుతుంటారు...

ఇప్పటికే తండ్రి ఆజ్ఞ వల్ల కాంచీపురంలోని ఘటికలో నాలుగేళ్ళు వ్యర్థం అయ్యాయి. ఇంకా రెండేళ్ళట! తరువాత కంచిలో ఆ తాగుబోతు మహామల్లుని సంస్థానంలో ఊడిగమట! సభలో ఆసనానికి అతుక్కుని, పూటకింత తింటూ ఆ కంచి రాజు ప్రశస్తులు పాడటం తన వల్ల కాదు. నాగవంశ వీరుల రక్తం తనలోనూ ప్రవహిస్తుంది. తన శౌర్యాన్ని పణంగా పెట్టి రాజ్యాలు జయించగల శక్తి తనలో ఉంది.

తానెవరో తెలిస్తే... వీళ్ళు తప్పకుండా తన తండ్రికి తెలియజేస్తారు. ములకరాష్ట్రం, రేనాడు, అశ్మకం, కర్మరాష్ట్రం... ఇలా ప్రతి పల్లవ భూపతీ తన తండ్రికి బంధువే.

తాను ఎవరో తెలిసిన తక్షణమే బంధించి అయినాసరే తన తండ్రికి అప్పగిస్తారు. వీళ్ళకి తెలియకుండా రహస్యంగా ఉంచడమే మంచిది, అని ఆలోచిస్తూ సొమ్మసిల్లి నిద్రలోకి జారుకున్నాడు.



ఆ విధంగా ఆ చిన్నారి సేవలతో తేరుకుంటూ యాదృచ్ఛికంగా తనకు తానే పెట్టుకున్న పేరు, ఆదిత్యసేనుడు.

రాజనర్తకి రంగమాంబ మాటంటే సామ్రాజ్యం అంతటా చెల్లుతుంది. ఆమె పరివారంలోని కెంపవ్వసాని... దండనాయకుడు, పెదబేతరాయుడికి అత్యంత ప్రియురాలు. ఏకాంతంలో, అతడు మారు చెప్పేందుకు అవకాశంలేని సమయంలో, ఆమె, రంగమాంబ కోరికను తెలియజేసింది. అంతే... వారం తిరగకుండా...

'అశ్వదళవాయి ఆదిత్యసేనులకు ఈ సేవకురాలి అభివాదాలు', అని పకపకా నవ్వుతూ, చేతిలోని నియామకపత్రాన్ని అందివ్వకుండా ఊరిస్తూ తోటంతా పరుగిడసాగింది, మంగ.

'ఏయ్ మంగా, ఆగు. ఏదీ ఒకసారి నన్ను చూడనీ', అని వెంటబడ్డాడు.

'చూడటానికి ఏముంది మహావీరా? మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరురాయగండ, త్రిసముద్ర వలయిత దక్షిణాపథపతి, చాళుక్య కులాంబుధి పూర్ణచంద్ర, శ్రీశ్రీశ్రీ పులకేశి చక్రవర్తి... ఆంధ్ర పల్లవనాటి మహావీరుడూ, అశ్వ చాలన ధురీణుడూ, దుష్ట తురగ రేఖా రేవంతుడూ అయిన శ్రీ ఆదిత్యసేన రట్టకుడిని, తమ మూలసేనలో అశ్వదళవాయిగా నియోగిస్తూ పంపిన రాజపత్రం', అని ముంగాలి వేళ్ళపై నిలిచి, చేయెత్తి, ఎక్కుపెట్టిన విల్లులా వెనక్కి వంగింది.

ఎడమచేత ఆమె నడుమును చుట్టి, కుడిచేతిని చాచి ఆ లేఖను అందుకోబోయాడు. ఆ క్షణంలో ఆమె లేత దేహంనుండి వెలువడిన ఏదో అనిర్వచనీయమైన పరిమళం తనని తాకింది. పత్రం అందుకునే ప్రయత్నం మాని తలదించి విప్పారిన ఆమె కళ్ళలోకి చూసాడు. తోటంతా పరుగెత్తిన శ్రమవల్లనో లేక తొలి కౌగిలింత వల్ల కలిగిన ఉత్తేజమో, ఆమె శ్వాస ఎగదన్నగా, అరతెరిచిన అధరాలు తన నూనూగు చుబుకానికి తగిలాయి.

అదే వారిరువురి మధ్య స్నేహం, ప్రేమగా మారిన ముహూర్తం.

వాతాపి నగరంలో గడిపిన ఆ ఆరు నెలలూ తన జీవితంలో మరిచిపోలేని మధుర క్షణాలు. ప్రతిదినం ఒక మధురానుభూతి, ఒకరికొకరు చేసుకున్న మూగబాసలు. జీవితం అంతా కలిసి బ్రతకాలనే ఆశ.

కానీ...

ఆమె వేశ్య కులజాత. వృత్తి ధర్మాన్ని చేబట్టడం తప్పదు. తాను ఊరూ, పేరూ విడిచి ఆయుధాన్ని నమ్ముకున్న ద్రిమ్మరి. ఏదో ఒక దినాన్న చక్రవర్తి సౌధంనుండి ఆదేశం రాకపోదు, ఆమె తన కన్నెతనాన్ని వీడి ఆమె తల్లిని అనుసరించక తప్పదు...

'ఇక్కడ ఇష్టాయిష్టాల ప్రశక్తి లేదు, అన్నయ్యా. వచ్చే మార్గశిరానికి అమ్మాయి కెన్నెరికానికి సిద్ధం చేయమని, రాజమాత చెప్పనే చెప్పింది. పులకేశి కుమారుడు ఈ శరన్మాసపు దండయాత్రనుంచి వచ్చిన వెంటనే వార్త రావచ్చు', అని తన నిర్ణయాన్ని తెలిపింది రంగమ్మ.

‘ఛీ... సిగ్గులేకుండా అదేంపని? అమ్మాయి తండ్రి మంగళేశ మహారాజేనని నీకు తెలుసు. నీకే ఏమటి? లోకమంతా తెలుసు. ఇక ఎర్రయ దాని పినతండ్రి బిడ్డ. చిన్నప్పటి నుండి తోటలో కలిసి ఆడుకున్న అన్నా చెల్లెళ్ళు. వాళ్ళమధ్య... ఊహూ. ఊహించడానికే కంపరంగా ఉంది’, అని ఛీత్కరించాడు లకుమయ్య.

‘అలా అని మహారాణి ఆజ్ఞని తిరస్కరించడానికి వీలవుతుందా, అన్నయ్యా? నీది అనవసరమైన శంక గానీ, ఎర్రయ ఇప్పుడు చిన్నప్పటి కుర్రాడా? లాట, అపరాంత, గాంగ, అలూప సీమలను జయించిన మహావీరుడు, పులకేశి చక్రవర్తి. అతడిని ప్రశ్నించే ధైర్యం మహారాజులకే లేదు. లోకం ఏమనుకుంటే అనుకోనీ. అయినా.. మనం చేసేదానిలో తప్పేముంది? ఇది వృత్తిధర్మం. దేవుడు చల్లగా చూడటంవల్ల మనం చక్రవర్తుల నీడన బ్రతుకుతున్నాం. తరతరాలుగా పెంచుకున్న ఈ వైభవాన్ని ఇప్పుడు కాలదన్నలేము కదా?’ అని తన అన్నని శాంతపర్చే ప్రయత్నం చేసింది.

‘అది కాదు, రంగా. అమ్మాయిని చూడు... బంగారు తల్లి. తరతరాలుగా వెనకేసిన ఆస్తులు ఉన్నాయి. దాన్ని ఈ రొంపిలోకి దింపేకన్నా... నేను ఏర్పాటు చేస్తాను. ఏ కంచికో కాశికో పోయి ఉన్నదానితో మర్యాదగా బతకవచ్చు. ఈ వైభవాలు ఇవాళ ఉంటాయి, రేపు పోతాయి. నీకు అసలు అమ్మాయే పుట్టలేదనుకో, ఏం చేసేదానివి?’

‘తప్పు కాదూ, అన్నయ్యా?’ అని లెంపలేసుకుంటూ, ‘వృత్తి ధర్మాన్ని విడిస్తే, అటు ఏడు తరాలూ, ఇటు ఏడు తరాలూ నరకానికి పోతాయి. అయినా... ఇందులో అమ్మాయికి వచ్చిన కష్టమేమిటి? చక్రవర్తి నీడలో మహారాణిలా ఉంటుంది. ఈ వైభవం, పలుకుబడీ, ఆస్తిపాస్తులూ వదిలి ఎక్కడో అనామకుల్లా తలదాచుకునే ఖర్మ దానికెందుకు? నీకు దానిమీద ఉన్న వాత్సల్యంతో అంటున్నావు కానీ, మన కులానికి వావి వరుసలు అంటవులే...’

‘అదికాదే’, అంటూ ఆమె వాదనకి అడ్డుకట్ట వేస్తూ, ‘ఆ పల్నాటి అబ్బాయి, ఆదిత్యసేనునిని చూడు. ఇద్దరూ కలిసి ఉంటే చూడ్డానికి ముచ్చటగా ఉంది. కులమూ, కులధర్మమూ అంటావు కానీ... మన అమ్మాయి సంతోషం గురించి...’ తన పేరు ప్రస్తావనకి వచ్చిన వెంటనే పక్కగదిలోంచి ఆ సంభాషణ వింటూ తన చెవులు మరికాస్త రిక్కించాడు.

‘అందుకనీ... దాని ఇష్టానికి, అన్నీ వదిలేసుకుంటామా? మనమీద ఆధారపడి బతికేవాళ్ళ సంగతేమిటి? అయినా దానికి ఆ అబ్బాయి అంత ఇష్టమైతే అప్పుడప్పుడూ వస్తూ పోతూ ఉంటాడు. అంతేగానీ, మహారాజు మాట కాదని ఇక్కడే కాదు, దేశంలో ఏ మూలకి పోయినా బతకగలమా?’ అన్న రంగమాంబ మాటలు విన్న ఆ క్షణంలోనే తాను నిర్ణయించుకున్నాడు.

పెళ్ళంటూ చేసుకుంటే మంగమ్మతోనే... పారిపోయి అయినా సరే!





# 54

నర్మదానదీ తీరం. లక్ష కాల్బలం. నది ఒడ్డున ఒక యోజనం విస్తీర్ణంలో విడిసి ఉంది. దాని వెనుక, ఎత్తైన కొండపై చక్రవర్తి పులకేశి శిబిరం. కొండచుట్టూ, నాలుగువేల అశ్వబలంతో చక్రవర్తిని సదా రక్షించే మూలసైన్యం.

నదికి అవతల స్థానేశ్వరపురి రాజు హర్షవర్ధన పుష్యభూతి సైన్యం. తన సోదరిని చెరబట్టిన మాళవ భూపతి దేవగుప్తుని తుదముట్టించి, విజయోత్సాహంతో నర్మదకి ఉత్తరాన విడిచింది. అతడి బలం, అసంఖ్యామైన గజసైన్యం.

కార్తీక మాసం. వర్షాలు తగ్గుముఖం పట్టి నెలనాళ్ళయినా నర్మద ఇంకా లోతుగానే ప్రహిస్తుంది. ఎవరూ నది దాటే సాహసం చేయరు. శత్రువు కళ్ళముందు, తాడిలోతున పారే నదిని దాటడం ఆత్మహత్యా సదృశమే.

ఎవరు ముందు?

'ఈ రాత్రికే... రెండవ జాముకే ప్రయాణం. సిద్ధంగా ఉండమని అందరు దళవాయిలకు ఆదేశం', అని తన చెవిలో ఊదాడు వార్తాహరుడు.

అర్థరాత్రి, రహస్యంగా పులకేశి మూలసైన్యం తూర్పుదిశగా నది వైపుకి కదిలింది. వేలకొలదీ అంబులపొదులు నది వద్దనే సురక్షితం చేసి, వారి వెనుకే కదిలారు, సుశిక్షితులైన పదివేల మేటి విలుకాండ్లు. వాళ్ళ వెన్ను కాస్తూ నాలుగువేల అశ్వసైన్యపు దక్షిణ పార్శ్వంలో తన దళంతో ముందుకు సాగాడు తాను.

తాము వెళ్ళిన ఒక గఢియకు ఆకస్మాత్తుగా శిబిరంలో భేరీనాదాలు మిన్నుముట్టాయి. అది ఇంకా రాత్రి నాల్గవ జాము.

కాగడాల వెలుగులో చాళుక్య సైన్యంలో కలకలానికి కారణం ఏమిటో నది అవతల విడిసి ఉన్న హర్షవర్ధనుని వేగులకు అవగతం అయ్యేసరికి, సూర్యోదయం అయింది. చూస్తే చాళుక్య శిబిరం అదృశ్యమయింది.

శత్రువుకు వెన్నుజూపి నర్మదకు దక్షిణంగా అప్పటికే అర యోజనం దూరం ప్రయాణించింది చాళుక్య సైన్యం. హర్షవర్ధనుని శిబిరంలో జయజయ ధ్వానాలు. ఊహించినట్లే, దక్షిణాత్యులను వెన్నాడి వాతాపిని పట్టడానికి ఇదే మంచి అదను అనుకొని ఉంటాడు.

నర్మదా జలాలను బురద మయం చేస్తూ వెయ్యి ఏనుగులతో నదిని దాటాడు హర్షుడు. వెనుకనే పడవలూ తెప్పల మీద మిగిలిన సైన్యం నదిలో దిగసాగింది. అప్పటికే ఉరకలు వేసే ఉత్సాహంతో నదీ తీరాన్ని దాటి కోసు దూరం ముందుకు సాగింది హర్షుని గజసైన్యం. అప్పుడు, చాళుక్య సైన్యం ఆగి వెనక్కి తిరిగింది.

వ్యూహం ఫలించింది.

చక్రవర్తి పులకేశి సింహనాదం చేస్తూ ముందు ఉరుకగా, వెనుక పక్కనుంచి అతడి అశ్వసైన్యం హర్షుని ఏనుగులకూ నదికి మధ్య అడ్డు నిలిచింది. ఆ వెనుకనే విలుకాళ్ళు నదీ తీరం చేరి, నది దాటేందుకు ప్రయత్నిస్తున్న హర్షుని సైన్యాలను తమ అంబుల వానతో నిలువరించారు. అంతలో... ఎక్కడినుండి ప్రత్యక్షమయ్యారో, ఎల్లప్పుడూ పెదబేతరాయుడి వెంట ఉండే బ్రహ్మరాక్షసుల వంటి పదివేల రట్టకుడులు. ముష్టిఘాతాలతో ఏనుగు కుంభస్థలాలను పగులగొట్టగల అపర భీమసేనులు. శూలాలతో హర్షవర్ధనుని ఏనుగులపై దాడిచేసారు.

హర్షుని పరిస్థితి ముందు నుయ్యా వెనుక గొయ్యా అన్నట్లయింది. క్షణానికొక మదగజం కూలసాగింది. దిక్కు తోచక కొద్దిమంది అంగరక్షకులతో పశ్చిమ దిశగా తప్పించుకొన సాగాడు.

**చాళుక్యుల జన్మస్థానం**

రాజేంద్రచోడుని శాసనంలో చాళుక్యుల జన్మస్థానం వేంగీ రాష్ట్రమే అని స్పష్టంగా ఉంది. కానీ చరిత్రకారుల అభిప్రాయాలు దీనికి భిన్నంగా ఉన్నాయి. మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఇంకా వాయవ్య సరిహద్దు ప్రాంతాల వారేమో అని కొందరు అంటే, కాదు వాళ్ళు 'ఐదు వేలిర్' లలోని వాళ్ళేమో అని మరికొందరు.

నాగార్జునికొండలో 3వ శతాబ్దానికి చెందిన శాసనంలో 'చలికి' లేదా కొండచలికి అనే పదం కనిపిస్తుంది. వీళ్ళు శాతవాహనులకూ, ఆ తరువాత ఇక్ష్వాకులకూ సామంతులుగా శ్రీపర్వత ప్రదేశంలోని వాళ్ళు. గ్రీక్ నావికుడు టోలెమీ రచించిన జాగ్రఫీ (క్రీశ. 130) మైసోలియా పరిసరాల్లో సాలెకనోయ్ అనే జాతి వాళ్ళు ఉండేవాళ్ళని చెబుతుంది మైసోలియా అంటే నేటి ముత్తుకూరు, మచిలీపట్నం ప్రాంతమే.

చాళుక్య అనేది సంస్కృత పదం కాదు. సాలుకి, చాలుకి, చులికి వంటి పదాల రూపాంతరమే. శాతవాహనుల తరువాత (క్రీశ 260) వేంగీ ప్రదేశాన్ని పాలించిన శాలంకాయనులదీ, ఆ తరువాత వచ్చిన చాళుక్యులదీ ఒకటే మూలం కావచ్చు. శాతవాహన నామానికి కూడా సద, సాత, శాలి అనే రూపాంతరాలు కనిపిస్తాయి. పై ఆధారాలనుబట్టి చాళుక్యుల జన్మస్థానం కృష్ణాతీర ప్రాంతమేనని ఊహించవచ్చు.

చూసిన మరుక్షణమే, వేరే ఆలోచన చేయకుండా తాను తన గుర్రాన్ని ఆ వైపుకి ఉరికించాడు.

అది గ్రహించిన తన దళం, తనకోసం ప్రాణం ఇచ్చేందుకైనా వెనుకాడని ఇరవైమంది యువకులు, తమ అశ్వాలతో తనని అనుసరించారు.

హర్షుని అంగరక్షకుల అంబుల వర్షానికి వెరవకుండా, తన దళం వారిని చుట్టుముట్టింది.



యుద్ధం ముగిసింది.

ప్రాణభిక్ష పెట్టిన చాళుక్య చక్రవర్తికి, నర్మద దాటనని మాటయిచ్చి, కన్యాకుబ్జానికి తిరుగుముఖం పట్టాడు, శ్రీహర్షుడు.

తనకిచ్చిన లక్ష వెండి ద్రమ్మాల పారితోషక పత్రం కంటే సకల సైన్యాధ్యక్షుల ముందు చక్రవర్తి స్వయంగా, తన భుజాన్ని తట్టి అభినందించినపుడు కలిగిన ఆనందోత్సాహాలు, తన నెచ్చెలి మంగతో పంచుకునేందుకు, ఆఘమేఘాలపై తన పంచకల్యాణిని ఉరికిస్తూ, వాతాపి చేరాడు.

ఉత్తర ద్వారం దాటినంతనే...

తనకి ఎదురైన దృశ్యం ఇన్నేళ్ళయినా పీడకలగా వెన్నంటుతూనే ఉంది.

ఉత్తరపు వాడకే తలమానికమైన రంగమాంబ ఏడంతస్తుల సౌధం పునాదులతో సహా నేలమట్టమయింది. తాను మంగమ్మను మొదటిసారిగా చూసిన స్వైరవనం స్థానంలో కొత్తగా నాటిన చెరుకు తోట వెలిసింది.

రాజమాత ఆగ్రహం రంగమాంబను పరివారంతో సహా చిత్రవధచేసి ఉప్పు పాతర వేసిన వార్త తనని బ్రతికున్న శవంగా మార్చేసింది. అగమ్యగోచరంగా ఆ ఊరు విడిచి, ఏ దేశాలు తిరిగాడో తనకే తెలియదు.



# 55

'నీకోసం ఎంతో కాలం విచారించాం. యుద్ధానంతరం తిరిగివచ్చిన నీవు ఎక్కడికి పోయావో ఎవరికీ తెలియదు. మామయ్య మనుషులను పంపి ఎన్నో ఊళ్ళలో గాలింపించాడు. ఫలితం లేకపోయింది', ఒడిలో తలవాల్చి బేలగా దుఃఖిస్తున్న ఆదిత్యసేనుని తల నిమురుతూ అన్నది, మంగమ్మ.

వేంగికి నైఋతి దిశగా కొండపై దిన్నాగాచార్యుడు నివసించిన మహాసాంఘిక ఆరామం. పరివారంతో సహా కొండపైనే హ్యూయెన్ త్సాంగ్ విడిది.

ఆదిత్యసేనుని కథ విని, ఇన్నాళ్ళ తరువాత దైవేచ్ఛగా జరిగిన వారి సమాగమానికి సంతోషించని వాళ్ళు లేరు. అందరి మనస్సులలో ఒకటే ప్రశ్న. అంత హటాత్తుగా చాళుక్య మహారాణికి వారిపై కలిగిన క్రోధానికి కారణం ఏమిటా, అని.

కానీ అడిగేందుకు సంశయం. అడిగి, అప్పుడప్పుడే తేరుకుంటున్న మిత్రుడు ఆదిత్యసేనుని మరలా ఆ జ్ఞాపకాల లోయలోకి తోయడం ఎందుకు? అనుకుంటూ...

'ఆరోజు నర్మదా తీరంలో ఈ ఆదిత్యసేనుడే కనుక అడ్డుపడకుంటే హర్షవర్ధన సామ్రాట్టుని నది దాటించి ఉండే వాళ్ళం. ఆ పులకేశి కథ మరోలా ఉండి ఉండేది. కానీ, ఎక్కడనుండి వచ్చాడోనమ్మా నీ ప్రియుడు, పద్మవ్యూహంలోకి జొరబడే అభిమన్యుడిలా మాపై విరుచుకు పడ్డాడు. వీనికి తోడు ఇతడి జట్టులోని రాక్షసులు', అన్నాడు బజరంగి నవ్వుతూ.

అతని మాటలకు తలెత్తి చూసాడు ఆదిత్యసేనుడు. ఆనాడు నర్మద యుద్ధంలో హర్షుని అంగరక్షకునిగా బజరంగి చూపిన తెగువ కూడా సామాన్యం కాదు. 'నువ్వే కనుక ప్రాణాలకు తెగించి నా ఈటె పోటుకి నీ భుజం అడ్డుపెట్టకపోతే, ఆ చక్రవర్తి ప్రాణాలు అక్కడే హరించి ఉండేవాడిని', అని ప్రత్యుత్తరం ఇచ్చాడు ఆదిత్యసేనుడు. యుద్ధం గురించిన ప్రస్తావన అతన్ని తిరిగి మనుష్యుల్లోకి తెచ్చింది.

శస్త్రైక జీవులైన ఆ వీరుల వాగ్వాదం వింటూ చిరునవ్వు నవ్వాడు లకుమయ్య. 'అవునయ్యా, నీ వీరత్వం గురించి వాతాపి నగరమంతా చెప్పుకున్నారు. కానీ నీవెక్కడా కానరావు. ఆఖరికి చాళుక్య సామ్రాజ్య రక్షణకై పునరవతరించిన ఆదిత్యుడవే అని నమ్మి, ఉత్తర ద్వారం వద్ద నీపేర వీరగల్లు నిలిపి, సూర్యదేవునికి దేవాలయంకూడా నిర్మించారు. ఇక పులకేశి అయితే యుద్ధానంతరం తనకు కలిగిన బిడ్డకు విక్రమాదిత్యుడని నీ పేరే పెట్టాడు', అని ఆదిత్యసేనుని భుజం తట్టాడు, లకుమయ్య.

వృద్ధుడైనా లకుమయ్య ముఖంలో ముసలితనపు ఛాయలు రవంతైనా కానరావు. గోరింట రంగు వేసిన అతని జుట్టు ఎర్రగా మెరుస్తుంది. ముఖంలో ఎప్పటిలాగే సౌజన్యం. మంగమ్మ ప్రత్యక్షమైన క్షణంనుండీ తన చుట్టూ ఉన్న ప్రపంచాన్నే మరిచిపోయిన ఆదిత్యసేనుడు ఆమె మేనమామను మొదటిసారిగా చూసాడు. గుర్తించిన మరుక్షణమే, అతని కళ్ళలో మళ్ళీ నీళ్ళుతిరిగాయి. అంగీ అంచుతో కనులు తుడుచుకొని, లకుమయ్య పాదాలకు నమస్కరించాడు, ఆదిత్యసేనుడు.

పితృసమానుడైన లకుమయ్యకు, ఇక లేదనుకున్న తన మంగను క్షేమంగా తనవద్దకు చేర్చినందుకు, కృతజ్ఞత చెప్పమన్నది మనసు. కానీ నోరు పెగలదు. ఏవో అర్థరహితమైన గద్గద స్వరాలు తప్ప మాట వెలువడలేదు. అర్థం చేసుకున్న లకుమయ్య అతనిని లేవనెత్తి హృదయానికి హత్తుకుంటూ, 'నిన్నూ మంగనూ కలపాలన్న నా కల ఇన్నాళ్ళకు తీరింది అబ్బాయ్. ఇక నిరర్థకమేమో అనుకుంటున్న సమయానికి... ఇక నా జీవితంలో వేరే ఆశ లేదు', అన్నాడు హాయిగా ఊపిరి తీస్తూ, 'ఇదిగో ఇరవై సంవత్సరాలలో నీవు వస్తావనే నమ్మకం ఒక్క క్షణం కూడా తప్పకుండా నిరీక్షించింది. నా బంగారుతల్లి తపస్సు ఈనాటికి ఫలించింది', అని పక్కకు వచ్చి నిలిచిన మంగమ్మను పొదివి పట్టి దగ్గరకు తీసుకుంటూ, వారిరువురి చేతులూ కలిపాడు.

'శుభంభూయాత్', అని శుద్ధ సంస్కృతంలో అంటూ దగ్గరకు వచ్చి, 'తథాగతుని ఆశీర్వాదం మీకు ఎల్లప్పుడూ ఉంటుంది', అని వారి శిరస్సులపై చేయుంచి దీవించాడు, హ్యుయెన్ త్సాంగ్ ఆచార్యుడు.



# 56

ప్రేమ! పగ!

సీసపు కాసును పైకి ఎగరేస్తూ తనలో తానే అనుకుంది, మంగమ్మ. ఆ పైకెగిరిన నాణెంలాగే తనలోనూ రెండు ముఖాలు. చేతిలో పడ్డ బిళ్ళపై దృష్టి పెట్టినా ఆమె మనసు మరెక్కడో ఉంది. అది పిష్ఠపురపు టంకశాలలో ముద్రించిన నాణెం. ఒకవైపు చాళుక్య వరాహంపై ఉదయిస్తున్న ఆదిత్యుని చిహ్నం. రెండవ వైపు ఆ రాక్షసుడు బిట్టరసు, విష్ణువర్ధనుడి బొమ్మ.

'ఇంత కాలానికి మన ప్రేమ సఫలమయింది', అని ఆదిత్యసేనుని భుజంపై వాలి, 'ఇక నీవు తీర్చవలసింది నా పగ', అన్నది మంగమ్మ.

ఆమె చేతిలోని నాణాన్ని అందుకొని, 'అవును మంగా, మనం కలిసినప్పటినుంచీ అడగాలి అనుకుంటూ, జాప్యం చేసాను. ఆనాడు నేను విజయోత్సాహంతో వాతాపికి వచ్చాను. చేతిలో పులకేశి ఇచ్చిన లక్ష నాణాల పారితోషక పత్రం. నీ మేనమామను కలిసి నీ చేతిని అడగాలని ఎంత ఆత్రంగా వచ్చానో? జరిగిందేమిటో? తలా ఒక రకంగా చెప్పారు. వినేందుకు నా మనస్సు నా ఆధీనంలో లేదు. జీవచ్ఛవంలా ఆ ఊరు వదిలాను', అని నాణెంపై నున్న విష్ణువర్ధనుని బొమ్మను పరీక్షగా చూసి, 'దానికి అంతటకూ కారణం ఈ దుర్మార్గుడా?' అన్నాడు.

'అవును. ఈ రాక్షసుడే. పులకేశి సైన్యంతో నువ్వు నర్మదా తీరానికి దండు వెడలిన మరుదినమే, రాజమాత నుండి వర్తమానం వచ్చింది. ఈ కుబ్జ విష్ణువర్ధనునికి నేను కావాలట. మామయ్య నన్ను రాత్రికి రాత్రే మలప్రభ దాటించి, దొమ్మరి వాళ్ళ సాయంతో రేనాటికి తీసుకువచ్చాడు. అమ్మ మాత్రం వాతాపిలోనే ఉండిపోయింది', అని నీళ్ళు నిండిన కళ్ళతో, ఇరవై ఏళ్ళుగా తనలో దాచుకున్న నిజాన్ని తన ప్రియుని ముందుంచింది, మంగమ్మ.

'కట్టుగుడ్డలతో వాతాపి వదిలి, పిష్ఠపురంలో జనాశ్రయుని ఆశ్రయానికి చేరితే, దురదృష్టం అక్కడకీ వెంటాడింది. పులకేశి సైన్యాలతో దక్షిణ కోసలం జయించి కళింగంపైన పడ్డాడు. ఆంధ్రదేశంలో ఆ చాళుక్యుని ఎదిరించే నాథుడే లేడు'.

'ఉన్నారెందుకు? పల్లెకి ఒక పనికిమాలిన పల్లవ రాజు', అని నిట్టూర్చాడు.

గోదావరి నుండి కంచి వరకూ గల తూర్పు తీరదేశంలో ముప్పైఆరు రాజులూ, రాజ్యాలూ. పేరుకు అందరూ పల్లవులే, నాగవంశ వీరులే. కానీ ఐకమత్యం శూన్యం. వారిలో వారు తగువులు పడుతూ, చాళుక్యునికి దాసోహం అన్నారు. జనాశ్రయుని తుదముట్టించి, ఆ పవిత్ర విష్ణుకుండిన సింహాసనంపై తన మరుగుజ్జు తమ్ముడిని కూర్చోపెట్టాడు, పులకేశి'.

'ఆ విధంగానన్నా పక్కలో బల్లెం లాంటి ఆ దుర్మార్గుడిని వదలించుకునే ప్రయత్నమేమో?' అని నవ్వాడు, ఆదిత్యసేనుడు.

నీళ్ళు నిండిన కళ్ళతో తన ప్రియుని మోవి వైపు తలెత్తి చూస్తూ, 'అంతే, ఆ రాక్షసుని కంటపడే ధైర్యం లేక రాత్రికి రాత్రే కళింగం కూడా వీడవలసి వచ్చింది. నిలువ నీడ లేక దేశద్రిమ్మరుల్లా ఆడి పాడి పొట్టపోసుకుంటూ, వాడి రాక్షస కృత్యాలు ఇలా ప్రజలకు కథలుకథలుగా వివరిస్తూ పదహారేళ్ళు... పదహారేళ్ళు ఈ ఆంధ్ర పల్లవుల రాజ్యాలంతా రోజుకొక ఊరు, పూటకొక గూడుగా తిరగాల్సి వచ్చింది'.

'ఊ... కానీ, ఈ ప్రజలను మాత్రం జాగృతులను చేసినందువల్ల ప్రయోజనం?' అని కనులు మూసుకొని నిట్టూర్పు విడుస్తూ, 'మంగా, నీ పగ తీరాలంటే, ఆంధ్ర పల్లవులని అందరినీ ఒక తాటిపై నడిపించగల నాయకుడు కావాలి. వీళ్ళందరిలో కాస్తో కూస్తో బలమున్న రాజ్యం కాంచీపురం. మొన్నటివరకూ... మత్త విలాసాలలో కాలం గడిపి, దేశం నిర్వీర్యం అవుతున్నా పట్టని మహేంద్రవర్మ. అతని కుమారుడు నరసింహుడు... పేరుకు మహామల్లుడే కానీ అతని పక్కలో బల్లెంలా జయంతవర్మ పాండ్యుడు. వానికి తోడు బాణ విషయపు చోడభూపతి. ఇక అతడు కంచి వదిలే ప్రశ్నే లేదు' అని తన ప్రియురాలు చుబుకం పట్టి పైకెత్తి తలపై మూర్ధిల్లుతూ, 'నీ పగ తీరేందుకు ఒకటే మార్గం. మనం వెంటనే ధాన్యకటకానికి వెళ్ళాలి', అన్నాడు.

ప్రాణప్రదంగా ప్రేమించిన తన ప్రియుని సమాగమం కొరకు ఈ ముక్కోటి దేవుళ్ళను ఎంతగా వేడుకుందో, అంతే తీవ్రంగా ఆ చాళుక్య ప్రభంజనాన్ని అరికట్టి తన ధ్యేయం నెరవేర్చగల నాయకుని కొరకు ప్రార్థించింది. ఆ రెండు కోర్కెలకూ ఒకటే జవాబు అన్న విషయం ఆమె ఇంకా గ్రహించలేదు.



ఆంధ్ర దేశంలో బౌద్ధం మరీ హీనస్థితిలో ఉంది. లక్ష గడపల వేంగీపురంలో, లెక్కకు వెయ్యిమంది బౌద్ధ శ్రమణులు కూడా లేరు. వాళ్ళూ, చెట్టుకొకటీ, పుట్టకొకటీ అన్నట్టుగా ఉన్న చైత్యాలలో జీవనం సాగిస్తున్నారు. ఒకప్పుడు దిన్నాగాచార్యుడు న్యాయసిద్ధాంతాలను ఆవిష్కరించిన ఆరామంలో ఇప్పుడు వందమంది భిక్షువులు కూడా లేరు. మద్యపానం, అస్వభావికమై వెర్రితలలు వేసిన శృంగారపు చేష్టలు, మంత్ర తంత్రాలలో నమ్మకం. కడుపు కక్కుర్తికై ఎంతటి హీనకార్యానికైనా దిగజారే భిక్షువులు.

'ఇక్కడ ఉండి కాలయాపన చేయడం అనవసరం, స్వామీ. ఎంత త్వరగా ఈ దేశం వదిలి ధాన్యకటకం చేరితే అంత మంచిది', అన్నాడు, బజరంగి.

'ఇక ఈ దక్షిణాపథంలో నా లక్ష్యానికి సహకరించగల బౌద్ధ ఆచార్యులు ఉంటారనే నా ఆశ నశించింది, మిత్రమా. నాగార్జున పురుషుని జన్మస్థలమనీ, మా మధ్యరాజ్యమైన చైనాదేశానికి బౌద్ధాన్ని పరిచయం చేసిన 'తెన్-గ్యూ' దేశమనీ, మహాయాన బౌద్ధానికి మూలస్తంభాలైన, మాధ్యమిక, యోగాచార సూత్రాలను నాకు ఉపదేశించే గురువులు ఇక్కడ దొరుకుతారని ఆశపడ్డాను. ఈ భారత యాత్రలో నేను గ్రహించినంత గ్రహించాను. ఇక వెనుదిరిగి, ఇంతవరకూ సమీకరించిన గ్రంధాలతో చాంగ్-ఆన్ నగరం చేరడమే ఉచితమేమో?' అన్నాడు నిరాశగా, హ్యుయెన్ త్సాంగ్.

'మీరన్నది నిజమే స్వామీ. కానీ ఇంతవరకూ వచ్చాము. ధాన్యకటకం ఇక్కడనుండి ఇరవై కోసులు, అంటే మీ లెక్కలో రెండు వందల 'లీ' మాత్రమే. నాలుగు రోజుల ప్రయాణం. అందునా ధాన్యకటకపు మహారాజు, మహేంద్రవర్మ మీకు ఆహ్వానం పంపించారు. అక్కడ నాగార్జునాచార్యుడు నిర్మించిన స్తూపం దర్శించి, కంచికి ప్రయాణం అవవచ్చు', అన్నాడు బజరంగి.

'ధాన్యకటకంలో, నన్నిప్పుడు గుర్తిస్తారంటావా, మంగా?' అని మెల్లగా ఆమె చెవిలో అడిగాడు, వారి సంభాషణ వింటున్న ఆదిత్యసేనుడు.

'ఇరవై యేళ్ళ తరువాత నేను గుర్తించగా లేనిది, స్వంత వాళ్ళు గుర్తించలేరా? మీ దేశాటనం వల్ల ఒక్కగానొక్క కొడుకుని దూరం చేసుకున్న మీ తలితండ్రుల బాధ నేను అర్థం చేసుకోగలను. అనుభవంపై చెబుతున్నాను', అన్నది అంతే మెల్లగా, మంగమ్మ.

'అవును మంగా, నా తెంపరితనం వల్ల ఇంతమందిని కష్టపెట్టాను. మీ మామయ్యకు చెప్పు, రేపు మనం కూడా బయలుదేరుదాము', అన్నాడు, ఆదిత్యసేనుడు. ధాన్యకటకం అతడి స్వస్థలం అన్న విషయం, మంగమ్మకు తప్ప వేరెవ్వరికీ తెలియదు. ఇంతకాలం రహస్యంగా ఉంచిన అతని పుట్టు పూర్వోత్తరాలు ఎవరికీ చెప్పవలసి రాలేదు. కానీ తన ప్రాణసమానమైన మంగమ్మ వద్ద మాత్రం దాచవలసిన అవసరం లేదు.

'సరే, బజరంగీ రేపు ఉదయమే బయలు దేరుదాము', అనిన హ్యుయెన్ త్సాంగ్, ఒకరి చెవులలో ఒకరు గుసగుసలాడుకుంటున్న మంగమ్మా, ఆదిత్యసేనులతో, 'ఏం, ఆదిత్యసేనా ఇక నీ విషయం? ఇక్కడే మీకు వీడ్కోలు పలకాలేమో?' అన్నాడు.

ప్రత్యుత్తరం ఇచ్చేలోగా అతని ముంజేతిని తన వేళ్ళతో నొక్కుతూ ఆపి, 'అన్ని విషయాలూ ధాన్యకటకంలోనే, స్వామీ. మేమూ మీతో కూడా వస్తాము. తమకేమీ అభ్యంతరం లేకపోతే', అన్నది మంగమ్మ.

### వేంగీపురి

ప్రాచీన యుగంలో మధ్యాంధ్ర దేశాన్ని వేంగీరాష్ట్రం అనేవాళ్ళు. అంటే ఇప్పటి తూర్పు పశ్చిమ గోదావరులు, కృష్ణా, గుంటూరు జిల్లాలు. శాతవాహన సామంతులైన శాలంకాయనులూ, ఆ తరువాత విష్ణుకుండినులూ ఈ ప్రాంతాన్ని పాలించారు. 3వ శతాబ్దంలో, సముద్రగుప్తుని దక్షిణదేశాల దండయాత్ర కాలంలో వేంగీపురి ఒక ముఖ్య పట్టణం.

అయితే, తూర్పుచాళుక్యుల కాలంనుంచీ ప్రాంతం వేంగి దేశమయినా, రాజధాని మాత్రం పిఠాపురం, బెజవాడ, ఆ తరువాత రాజమండ్రీ నగరాలకు మారింది. కాలక్రమేణా వేంగీపురి ప్రాముఖ్యం క్షీణించసాగింది.

ఏలూరు పట్టణానికి పది కిలోమీటర్ల దూరంలో పెదవేగి, చినవేగి అనే రెండు గ్రామాలున్నాయి. వాటికి ఐదు కిలోమీటర్లలో దెందులూరు అనే గ్రామంవద్ద ఒకప్పటి వేంగీపురి శిథిలాలూ, మైళ్ళకొలదీ విస్తరించిన పురాతన నిర్మాణాల ఆనవాళ్ళూ కనిపిస్తాయి. ఇప్పటికీ పురాతన వస్తువులూ, రోమన్ నాణాలూ అక్కడక్కడా దొరుకుతాయి.

*'వేంగిరాజుల పాద పవిత్ర చిహ్నా*
*గర్భితమ్మైన యీ భూమిఖండమందు*
*నశ్రువులు జార్రు జీవచ్ఛవాంధ్రజనులు'*

కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ ఈ ప్రాంతాన్ని దర్శించి, కనుమరుగైన తెలుగు ప్రాభవాన్ని తలుచుకుంటూ ఆ వేంగీక్షేత్రంలో *'ఇట వేగీశుల పాద చిహ్నములు లేవే, లేవుపో...'* అని తన ఆవేదనని కలంద్వారా చిందించాడు.





# 57

వజ్రకంచిక రేవు.

మున్నేరు నది కృష్ణవేణిలో సంగమించే స్థలం. కృష్ణకి అవతల ధాన్యకటకం. హ్యుయెన్ త్సాంగ్ పరివారం – లేఖకులూ, బిక్షువులూ, అనువాదకులూ, వ్యాకరణ పండితులూ, ఇంకా బజరంగి రక్షకదళంతో కలిపి వందమందికి పైనే. వారికి తోడు, లకుమయ్య నాట్య బృందం ఇరవై మంది. గుర్రాలూ, బండ్లూ, పల్లకీలూ. ఇవిగాక పాతిక కంచర గాడిదలపై ఆచార్యుడు సేకరించిన ప్రాచీన గ్రంధాలు. బండ్లవాళ్ళు, బోయీలు ఇతర పనివాళ్ళూ.

రేవులో ఉన్న బల్లకట్లు రెండే.

అందరూ నది దాటాలంటే ఒక రోజు చాలదు. ముందుగా స్వల్ప పరివారంతో ఆచార్యుడు ఎక్కిన బల్ల కదిలింది. వారికి తోడుగా పదిమంది వీరులతో బజరంగి, వాళ్ళ వెనుకే లకుమయ్య బృందంతో మంగమ్మా, ఆదిత్యసేనులు.

బలకట్టు రేవు తాకిన మరుక్షణమే, రక్షక భటులేమో? ఈటెలూ, కత్తులూ ఝుళిపిస్తూ వారిని చుట్టుముట్టారు. వందకు పైచిలుకే. 'బల్లకు నూరు కాసులు. రుసుం కట్టి ముందుకు కదలండి' అని హ్యుయెన్ త్సాంగును అడ్డగించారు.

'ఆగండి. వీరు మహారాజు ఆహ్వానంపై వచ్చిన మహాచీనపు ఆచార్యులు. అడ్డు తొలిగి దారినివ్వండి' అని బజరంగి ముందుకొచ్చాడు.

'ఇక్కడ ఏ ఆహ్వానమూ చెల్లదు. ఇది మల్లయ్య దండనాయకుని దళం. ఈ రేవు పన్ను మాది. మేమేమి చెబితే అదే శాసనం. సామాన్యులకైతే బల్లకి వందే. మహారాజు అతిథులు కాబట్టి పన్ను రెట్టింపు. కట్టకుంటే కోటలో కాలు మోపలేరు', అంటూ ఆచార్యుని వెనక్కి తోసాడు, వాళ్ళ నాయకుడేమో... కారు నలుపు దేహంపై తెల్లని బవిరి గడ్డం, దుస్తులు కొంచెం మాసినా, దళవాయి పదవిని సూచిస్తున్నాయి.

'ఆహా... ఏంటయ్యా ఆ చొరవ? మర్యాద లేకుండా... మహారాజుతో పిర్యాదు చేయాల్సి వస్తుంది. ఆయన ఎవరనుకున్నావు?' అంటూ అడ్డం వచ్చాడు, బజరంగి, ఉబికి వస్తున్న కోపాన్ని అణుచుకొని శాంతంగా నచ్చచెప్పేందుకు ప్రయత్నం చేస్తూ.

'ఓహో... ఇలాంటి బోడి సన్నాసులని చాలమందినే చూసాంలేవయ్యా. మా దేశానికి పీడలా

పట్టారు. వీళ్ళకి ఆ ముసలి రాజు వత్తాసు. అయినా మంచం పట్టి, నేడో రేపో అంటున్న ఆ రాజు ఏం చేస్తాడు? పో, పిర్యాదు చేస్తావా? ముందు ఐదువేల పణాలు కట్టి కదులు, లేకుంటే మీ దుస్తులు వలిచి మమ్మల్నే తీసుకొమ్మన్నావా? పిర్యాదు చేస్తాడట... పిర్యాదు... అని అనుచరులవైపు తలతిప్పిన మరుక్షణం అది తెగి కృష్ణలో పడింది.

ఎక్కడనుండి వచ్చాడో ఆదిత్యసేనుడు, వొరలోంచి సర్రున జారిన అతని కరవాలం అదే వేగంతో వాని మెడని తాకింది.

గొంతు నరాలలోంచి ఎగచిమ్మిన రక్తం చూడలేక కళ్ళుమూసుకున్న హ్యూయెన్ త్సాంగ్ మరలా వాటిని తెరిచేసరికి రేవంతా మృత కళేబరాలతో నిండింది.

బజరంగి దళం, ఒక్కొక్కడు పదిమంది పెట్టు. యాభైమందికి పైగా ఆగంతకులు నేలకొరిగారు. మిగిలినవాళ్ళు ఊరివైపు పిక్కబలం చూపారు.



బల్లకట్లు రేవుకి వంద అడుగుల దూరంలో తేలియాడుతున్నాయి.

కోట ద్వారం రేవుకి ఎంతో దూరం లేదు. దూరం నుంచి రేవులో జరిగిన ఘోరాన్ని చూసిన కావలి భటులు కోట ద్వారం మూసి, లోనికి పరిగెత్తారు. బజరంగి వద్దని వారిస్తున్నా వినక, అతడిని ఆచార్యునికి రక్షణగా ఉంచి, ముగ్గురే ముగ్గురు అనుచరులు తోడురాగా కోట ద్వారం వైపు కదిలాడు, ఆదిత్యసేనుడు.

ద్వారంపైన వేలాడుతున్న గొలుసుని కణకణలాడించాడు.

ఇరవై సంవత్సరాల తరువాత తన గృహంలోకి మరలా అడుగు పెట్టబోతున్నాడు.

ద్వారానికి ఉన్న కిటికీ తెరుచుకుంది. గడగడ వణకుతూ అందులో తల పెట్టి, ఎవరన్నట్లుగా చూసాడొక భటుడు.

అతని వంక చిరునవ్వు నవ్వుతూ,

'యువరాజు, ముక్కంటి కాడువెట్టి ఇంటికి తిరిగి వచ్చాడని లోపల చెప్పు' అని నిర్భయంగా నిలుచున్నాడు, ఆదిత్యసేనుడనే నామంతో ఇన్నాళ్ళూ పిలువబడుతున్న, రాజకుమారుడు, త్రిలోచన పల్లవుడు.



యువరాజు ముక్కంటి తిరిగి వచ్చాడన్న వార్త కార్చిచ్చులా దేశమంతా ప్రబలింది. అతడే విజయాదిత్యుడనీ, ఉత్తర పథాధీశుడు శ్రీ హర్షుడిని ఒంటిచేత పట్టినవాడు ఒక పల్లవ వీరుడే అన్న విషయం ఆంధ్ర పల్లవ యువకుల గుండెలు గర్వంతో ఉబ్బేలా చేసింది. ధాన్యకటకంలో తన తండ్రికి ఎదురుతిరిగిన మల్లయ రట్టకుడి దళాలను రెండు దినాలలో పూర్తిగా అణిచివేసాడన్న వార్తతో అతడి వీరత్వంపై విశ్వాసం వారిలో మరింత పెరిగింది.

మహారాజు చినమహేంద్రవర్మ ఆనందం అయితే అంతా ఇంత కాదు. తనతో కొడిగట్టుతుంది అనుకున్న ధాన్యకటక పల్లవ రాజ వంశం, తన కుమారుని రాకతో ప్రజ్వలంగా వెలుగుతుంది.

'ఇక నాకే భయమూ లేదు, నాయనా', అన్నాడు చినమహేంద్రుడు. ఇంతకాలానికి తిరిగి వచ్చిన తన కొడుకుని చూసిన క్షణమే అతని అనారోగ్యం పటాపంచలు అయింది. 'ఇక నీవు రావనీ, నాకు వారసుడు లేడన్న కారణంగా ప్రతి పల్లవ రాజు కన్నూ మన ధాన్యకటకం పైనే. నీ వేలువిడిచిన పినతండ్రి పల్లవపురం రాష్ట్రభూపతి ఉగ్రవర్మ తన తనయుడు, బుద్ధవర్మని దత్తత తీసుకొమ్మని వత్తిడి. మంచివాడే. కానీ, నీవు వస్తావని ఎక్కడో ఆశ. ఆచార్యులు భావవివేకులు, కలకాలాలూ గుర్తుంచుకునే మహా వీరుడవు అవుతావని, నీవు పుట్టినప్పుడు చెప్పిన మాటను నేను ఇప్పటికీ మరవలేదు', అని కుమారుని శిరస్సు నిమిరాడు. సాయంకాలం, అమరారామపు స్తూపంపై నూనె దీపాలు పెట్టే వేళ. ప్రదక్షిణ పథంపై నడుస్తూ తన వారసునితో దేశ వ్యవహారాల గురించి చెప్పసాగాడు.

'మంచి ఆలోచనే, నాయనగారూ, కానీ, పల్లవకం, ధాన్యకటకం ఏకమైతే, కంచి ప్రాధాన్యతకి నష్టం వాటిల్లదా?' అని తన సందేహాన్ని వ్యక్తపరిచాడు, ముక్కంటి.

'అందుకే కదా... మరి నా తదనంతరం మన ధాన్యకటకాన్ని వేంగి రాష్ట్రానికి కలిపితే, తూర్పున చాళుక్యులను ఎదిరించడం సులభం అవుతుందని కాంచీపురపు నరసింహదేవుని సలహా. కానీ అంత ధైర్యం ఎవరికి?' అని నిట్టూర్చాడు.

'అదే జరిగితే, పులకేశి ఉపేక్షిస్తాడా? మరలా తూర్పు సీమలపై దండెత్తడూ?'

'నిజం నిజం. ఆ తొక్కిసలాటలో తమ రాజ్యాలకేమి ముప్పు వస్తుందో అని, మన పశ్చిమాన ఉన్న కుంతల, పులింద, అశ్మక రాష్ట్రాల పల్లవ ప్రభువులకీ, దక్షిణాన రేనాటి రాజులకీ భయం. అదే కనుక అయితే, ఆంధ్ర దేశంలో పల్లవులు మనడం కష్టమే'.

'మనం ఈ విధంగా ఒకరితో ఒకరు తగువు పడుతూ కూర్చుంటే, నాయనగారూ, ఇప్పుడు కాకున్నా ఇంకొన్నాళ్ళకైనా అదే ఫలితం కదా?'

'కానీ నాయనా, ఈ కలగూరగంపని కలిపేదెవ్వడు?'

'ఇది కలగూరగంప ఎలా అవుతుంది నాయనగారూ? అందరం ఒక జాతి వాళ్ళం. ఆ ఆంధ్ర వల్లభుడు శాలివాహనుని వారసులమైన నాగవంశపు పల్లవులం. ఒక కొమ్మ రెమ్మలమే. ఎందుకు సాధ్యం కాదు?'

వెనక్కి తిరిగి తన కుమారుని కళ్ళ లోతుల్లోకి చూస్తూ, కనుబొమలు ముడివేసాడు, చినమహేంద్రవర్మ.

అవును, ఈ పల్లవ లోకాన్ని ఒక త్రాటిపై తేగల సాహసమూ, నాయకత్వ పటిమా, ఆ కార్యం సాధించగలనన్న విశ్వాసమూ, ఆ కళ్ళలో అతనికి కనిపించాయి.



# 58

'నా ఆహ్వానాన్ని మన్నించడమే కాక నా పుత్రుని తిరిగి నావద్దకు తెచ్చి ఇచ్చిన మీకు ఈ ధాన్యకటకం ఎల్లప్పుడూ ఋణపడి ఉంటుంది స్వామీ', అని హ్యుయెన్ త్సాంగుకు నమస్కరించి, 'తమరు ఇక్కడ ఉండగానే, వచ్చే వైశాఖ మాసంలో ఈ మహాస్తూపంపై శతసహస్ర జ్యోతులు వెలిగించి, ఆ బుద్ధదేవునికి నా ధన్యవాదాలు తెలపాలని నా ఉద్దేశ్యం', అన్నాడు మహారాజు, చినమహేంద్రవర్మ.

'ఇంకా వర్ష ఋతువైనా రాలేదు. బుద్ధపౌర్ణిమ ఇంకా పదినెలలు ఉంది. వీలు కాదేమో, రాజా. మా ఉద్దేశ్యం, వర్షాలకు ముందే పల్లవకానికి వెళ్ళి, అక్కడనుండి సముద్రమార్గాన స్వదేశం చేరే ప్రయత్నం చేయాలి', అన్నాడు, హ్యుయెన్ త్సాంగ్.

'నిరాకరించకండి, స్వామీ. అయినా, తక్షణమే వర్షాలు ఆరంభమయ్యే లోపల కంచికి చేరాలంటే సాధ్యం కాదు. వచ్చే వైశాఖం లోపల తూర్పు సముద్రంలో ప్రయాణం చేయడం అంత క్షేమం కాదు, గాలి వానలు ఎప్పుడొస్తాయో చెప్పలేము. అందునా శ్రావణమాసం తరువాత మలయద్వీపాలకు పోయే నావలు దొరకవు. మీరు ఇక్కడే ఉంటే, తమ నేతృత్వంలో మహాస్తూపానికి మునుపటి వైభవం తిరిగివచ్చేలా ప్రాకారాన్ని పునర్నిర్మిద్దామని నా ఉద్దేశ్యం', అని బ్రతిమిలాడాడు.

'అంతేగాక స్వామీ, భావవివేక పురుషులు, తాము రచించిన సాంఖ్యా, న్యాయ సిద్ధాంత కోశాలను, ఇక్కడికి దగ్గరలోనే... అదిగో చూడండి, ఆ కొండ' అని దక్షిణదిశగా వేలెత్తి చూపుతూ, 'అక్కడ తమ శిష్యుల వద్ద భద్రపరిచారట', అని ముక్కంటి కూడా తన తండ్రికి తోడై ఆచార్యుని అర్ధిస్తూ, 'తమరు ఇక్కడ ఉంటే, ఆ గ్రంధాలను కూడా పరిశీలించవచ్చు. మీ సమయం కూడా వృధా అవదు', అన్నాడు.

'అవును, స్వామీ', అని తన మిత్రునికి వంత పలుకుతూ, బజరంగి, 'నేనూ విన్నాను. అదిగో, ఆ కోట బురుజులు చూసారా? దానిని 'రక్కసి కోట' అంటారట. ఒకప్పుడు అది తథాగతుడు విడిది చేసిన వర్షారామం అట. భావవివేక పురుషుడు అక్కడే సమాధి గ్రహించారట. ఆ కనిపించే బండ చూసారా? అది ఆ మహాపురుషుడు మంత్రించి విసిరిన ఆవగింజ. అక్కడి ఆరామంలో అభిదమ్మకోశాన్ని ఔపాసన పట్టిన ఆచార్యులు ఇద్దరు ఉన్నారు. ఒక సంవత్సరమే కదా? మన మిత్రుడు ఆదిత్యసేనుని సింహాసనంపై చూడాలనే ఆశ నాకూ ఉంది', అని తలవంచి తన కోరికను తెలిపాడు.

‘ఇంత మంది మిత్రులూ, శ్రేయోభిలాషుల కోరికను నేనెలా కాదనను? సరే’ అంటూ, స్తూపం వైపు కదిలాడు, హ్యుయెన్ త్సాంగ్.

స్తూపపు వెలుపలి ప్రాకారం పూర్తిగా మట్టిలో కప్పబడిపోయింది. వాటి కింద స్తంభాలు కనుపించక పోయినా, ఏనాడో, ఆచార్య నాగార్జునుని కాలంలో స్తంభాలపై ప్రతిష్టించిన జంటసింహాలు మాత్రం తూర్పు ద్వారానికి ఇరువైపులా ఇంకా భూమిపైనే నిలిచి ఉన్నాయి.

‘మహాస్తూపాన్ని కడిగించి రంగువేయించి, ఇటుక రాళ్ళతో ప్రాకారాన్ని కట్టించాలని మా ఉద్దేశ్యం స్వామీ’ అని ఆచార్యునితో అన్నాడు. రాజు, చుట్టూ శిధిలమై పడి ఉన్న, మొక్కుబడులు తీర్చేవాళ్ళు కట్టించిన చిన్న చిన్న చైత్యాలను పునరుద్ధరించడం అసాధ్యం. ఆ ఇటుకలనే ప్రాకారానికి ఉపయోగిస్తే మంచిదేమో అని తనలో తాను అనుకుంటూ.

‘పూర్వశైల ఆరామంలో ఇంకా పదివేల బిక్కులు ఉన్నారు. వారికి ఇక్కడే నివాసయోగ్యమైన విహారం కట్టించి, తగిన ఆదాయ సదుపాయాలు కలుగజేస్తే, ఈ స్తూపం బాగోగులు మరో పది కాలాలు...’ అంటూ, వాళ్ళవైపు హడావుడిగా పరుగెత్తినట్లు వస్తున్న అమాత్యుని చూసి మాటలు మధ్యలోనే నిలిపివేసాడు, ముక్కంటి.



‘వేంగి నుండి దుర్వార్త ప్రభూ...’ అని దూరంనుండి ప్రకటించి మహారాజుని సమీపించాడు. పండితుడూ, సోమయాజీ, పరమ శివభక్తుడూ అయిన సోమదేవామాత్యుడు. తరతరాలుగా ధాన్యకటక సంస్థానంలో అమాత్య పదవిని నెరపిన వంశం. రాష్ట్రంలో పదునాల్గు శివాలయాల నిర్మాణం కావించి వాని నిర్వహణకు లక్షాధిక హలాలు దానమిచ్చిన ధర్మాత్ముడు.

తన్ని వస్తున్న ఆయాసాన్ని నిగ్రహిస్తూ, ‘వేంగీ పురం చాళుక్యుని వశమైనదట. కుబ్జవిష్ణువు యొక్క తదుపరి లక్ష్యం కొల్లేటి విషయమేనని మన చారుల వార్త’ అన్నాడు.

‘కద్దూరవాడ కనుక వారి వశమైతే మనకిక రక్షణ లేదు’ వెంటనే సహాయం పంపకపోతే...’ అంటున్న ముక్కంటిని మధ్యలోనే అడ్డుకుని,

‘ఎవరికి సహాయం? ఆ మాధవవర్మకా? విశ్వాసహీనుడు. గత పదేళ్ళుగా పితృధం, శ్రీకాకుళ విషయాలనుండి మనకు రావలసిన కప్పం నిలిపివేసాడు. ఇంద్రకీలాద్రి వద్ద నదిని అడ్డగించి మనవైపు వచ్చే వర్తకపు ఓడలను కూడా దారి మరలించాడు’, అన్నాడు చినమహేంద్రవర్మ.

‘అవును యువరాజా, నాయనగారు చెప్పేది నిజం. మన సాయం అర్థించేందుకు వారికి ముఖం చెల్లదు. పిలువని పేరంటానికి మనమెళ్ళి భంగ పడటమే కాదు, ఆ చాళుక్య మహారాజు కూడా మనని తప్పుబట్టవచ్చు’, అన్నాడు సోమదేవమంత్రి.

‘వాడెవడు మనని తప్పుబట్టేందుకు?’ అని చిర్రున లేచిన ముక్కంటి, పక్కనే వచ్చి నిలిచింది, అంతవరకూ దూరంగా నిలుచుని మిగిలిన రాణివాసపు స్త్రీలతో స్తూపంపై దీపాలంకరణను పర్యవేక్షిస్తున్న మంగమ్మ. ‘అన్న ప్రాపున మన సీమకొచ్చిన వాడికి మనమెందుకు భయపడాలి?

మాధవుడు దుర్మార్గుడే కావచ్చు. కానీ తోటి పల్లవ రాజు. మనలో ఐకమత్యం లేకనే ఆ చాళుక్యుడలా విరగబడుతున్నాడు. మనం కలిసి ఎదిరిస్తే వాడిని తూర్పు సాగరంలో కలపవచ్చు'.

'ఆహ్ హా, చాళుక్యుని ఎదిరించడమే? కాస్త నిదానం, యువరాజా', అని శాంతపర్చబోతున్న సోమదేవునితో,

'ఆగండి, అమాత్యా. అబ్బాయి అన్నదానిలో నిజం లేకపోలేదు. మీరన్నట్లు నిదానంగా ఒక పథకం ప్రకారం ముందుకు సాగాలి', అని ఆచార్యుడు హ్యుయెన్ త్సాంగ్ వంక తిరిగి, 'క్షమించండి స్వామీ, మీరు అనుమతిస్తే శలవు తీసుకుంటాను' అని కోటకు వెళ్ళేందుకు సిద్ధమయ్యాడు, మహారాజు.

'నీవేమీ అనుకోనంటే నేనూ వచ్చేదా?' అని మిత్రుని వెంట నడిచాడు, బజరంగి.





# 59

హర్షవర్ధనుని ఒంటిచేత ఓడించిన మహావీరుడు, పల్లవ సైన్యాలను కళింగం పైకి నడిపిస్తున్నాడన్న వార్తవిని, అన్నకు సహాయంగా నలభైవేల కాల్బలమూ, వెయ్యి ఏనుగులతో శ్రీకాకుళపు పెదలంక వద్ద కృష్ణవేణిని దాటాడు బుద్ధవర్మ, పల్లవపురి యువరాజు.

దేశంలోని ప్రతి పల్లవ రాజుకీ ముక్కంటి కాడువెట్టి, త్రిలోచన పల్లవుని ఆహ్వానాలు అందాయి. కానీ ఒకరిద్దరు తప్ప మిగిలిన వారంతా ఏమి చేయాలో తెలియని సందిగ్ధంలో, వేచి చూద్దామని ఊరుకున్నారు.

అయితేనేం? వేలకొలదీ యువకులు ముక్కంటి ఆహ్వానానికి స్పందించి అతని సేనలో చేరటానికి ధాన్యకటకం వచ్చారు. పదిహేను అశ్విక దళాలూ, లక్ష కాల్బలంతో కొల్లేటి సరోవరానికి దక్షిణంగా విడిసాడు ముక్కంటి. కుద్దూరవటం మాధవుడు, మొదట సందేహించినా, పిమ్మట ఇరవై వేల తన సైన్యంతో అతనిని కలిసాడు. కందప్రోలు మహాదేవవర్మ, తన కుమారుడు శివవర్మ పట్టుబట్టగా, వేయి ఏనుగుల గజసైన్యాన్ని వెంట పంపాడు.

కుబ్జ విష్ణువు యాభైవేల మూలబలంతో కొల్లేటి సరోవరం మధ్యలో గల చిగురు కోటలో దాంకున్నాడు. వేంగి సంరక్షించేందుకు వదిలిన పదివేల కాల్బలం మినహా, మిగిలిన లక్షన్నర కాల్బలమూ, ఐదువేల అశ్వికులూ గల మహాసైన్యం, సరోవరానికి ఉత్తరాన విడిసింది.

'ఏటునుండి చూసినా ఒక యోజనం పైగా విస్తరించిన మహా జలాశయం, చిగురుకోటలో ఉన్నంత కాలం ఆ చాళుక్యుని సమీపించడం అసాధ్యం', అని తన నిస్పృహని వ్యక్తం చేసాడు, మాధవవర్మ.

'వర్షాలు ఆరంభం అయ్యేలోగా ఈ ఏటిని ఎండగట్ట గలిగితే...?' అని తన ఆలోచనని బహిర్గతం చేసాడు, ముక్కంటి.

ముక్కంటి మాట మొదట హాస్యాస్పదం అనిపించినా, మెల్లగా ఆ తెంపరి ఆలోచన సమంజసమేమో అనిపించింది, మాధవవర్మకీ.

'కొల్లేటి దిగువ నీటిని తూర్పున ఉప్పుటేరుకి మళ్లించ గల్గితే?' అని ఆ ఆలోచనకి రూపం ఇవ్వసాగాడు, మాధవవర్మ.

‘పద సోదరా, చూపించు’, అని ఉత్సాహంగా లేచాడు, ముక్కంటి...

నాలుగు లక్షల జనం, గడ్డపలుగులూ, పారలతో; ఇల్లాళ్ళు కట్టి ఇచ్చిన అంబలి మూటలతో అగాధంలాంటి కాలువ తవ్వసాగారు. రెండు రోజులలో కొల్లేటి నీరు ఉప్పుటేరు ద్వారా సముద్రంలో కలిసింది.

ముక్కంటి పల్లవ సైన్యం చిగురు కోటని ముట్టడించింది.



అర్ధరాత్రి, మొలకి గోచీ తప్ప వేరే ఆచ్ఛాదన లేకుండా, ఏరు దాటే ప్రయత్నం చేస్తున్న ఒక మరుగుజ్జు పల్లె వాడిని తెచ్చి తన అన్న ముందు నిలబెట్టాడు, బుద్ధవర్మ.

చేతులు విరిచి కట్టి అతనిని అంతఃశిబిరంలోకి ఈడ్చుకువెళ్ళి, ప్రియుని వెంట, దండయాత్రలో కూడవచ్చిన మంగమ్మ ముందు పడదోసాడు, ముక్కంటి.

‘మీ ఊరి వాడే మంగమ్మా, గుర్తు పడతావేమో నని తెచ్చాను’, అన్నాడు.

దయనీయంగా నేల పడి ఉన్న విష్ణువర్ధనుని చూడలేక ముఖం తిప్పుకుంది. ఒకే తండ్రి బిడ్డలు కాకపోయినా అన్నాచెల్లెళ్ళు... కానీ నిర్దాక్షిణ్యంగా తన తల్లికీ, ఏ పాపమెరుగని బంధువులకూ అతడు విధించిన శిక్ష ఆమె కనుల ముందు కదిలింది.

‘ఈ రాక్షసుడిని ఏం చేయమంటావు, మంగా? మాట ఇచ్చిన ప్రకారం వీనిని నీ కాళ్ళ ముందు పడవేసాను’, అన్నాడు ముక్కంటి.

ఆ రోజు... వేంగిలో ఎంతోకాలనికి తనకు తిరిగి వచ్చిన ఆనందాన్ని కలుషితం చేసే నిజం తన ప్రియురాలి నుండి విన్నాడు. విన్నంతనే క్రోధంతో ఊగిపోయాడు. అంతవరకూ, ఎవరికి వారై ఐకమత్యం లేని ఆంధ్ర పల్లవులను ఏకం చేయడమే పల్లవ వీరునిగా తన ధర్మం అనుకున్నాడు.

### పల్లవకం ఎక్కడ?

అలహాబాదు స్తంభంపైన హరిసేనునుచే సంస్కృతంలో లిఖించబడిన శాసనంలో క్రీశ. నాల్గవ శతాబ్దంలో సముద్రగుప్తుడి దక్షిణ దేశ జైత్రయాత్రలో అతడు జయించిన పట్టణాలూ, రాజుల పేర్లూ ఉన్నాయి. మామూలుగానే, ఆ పేర్లపైన చరిత్రకారుల భిన్నాభిప్రాయాలు. అందులో పిష్ఠపురం (పిఠాపురం), వేంగి, ధాన్యకటకం సులభంగానే గుర్తించవచ్చు. ఐతే ‘పల్లక’ అనే పట్టణం ధాన్యకటకానికీ, కంచికీ మధ్య వస్తుంది. శ్రీలంక వాఙ్మయంలోని ‘పల్లవబొగ్గ’ (పల్లవ భుక్తం లేదా భోజం లేక భోగం) కూడా అదే అయి ఉండాలి.

ఇప్పటి ప్రకాశం జిల్లాలో, ఒంగోలు చుట్టు పక్కల అనేక బౌద్ధ శిథిలాలు కనిపిస్తాయి. ఒక చినగంజాంలోనే మూడు స్తూపాల దిబ్బలు ఉన్నాయి. బోగందానిదిబ్బ, సాకలిదానిదిబ్బ, ఫిరంగులదిన్నె అని వీటి పేర్లు. ఇక పెద గంజాంలో దీపాలదిన్నె మరొక పెద్ద స్తూపం. కనుపర్తి. అమ్మనబ్రోలు స్తూపాలు వీటికి ఎంతోదూరం లేవు. అంతేగాక ఒంగోలుకి తూర్పుగా సముద్రతీరంపై అల్లూరు – కొత్త పట్టణం అనే గ్రామం ఉంది. అది చాలా ప్రాచీనమైన రేవు పట్టణం. ఇప్పటికీ ఆ ప్రదేశంలోని గ్రామదేవతలని ‘పోలేరమ్మ’ ‘పల్లూరమ్మ’ అని పిలుస్తారు. అవి పల్లవపురపు అమ్మవారికి కాలక్రమేణా వచ్చిన మార్పేమో? పూర్వ పల్లవుల శాసనాలు కూడా ఒంగోలు లోనే దొరికాయి. పల్లవ రాజవంశం ఈ ప్రదేశం నుండి ఉద్భవించి ఉండాలి.

కానీ ఆనాటినుంచీ తననీ, తన ప్రాణప్రదమైన ప్రియురాలిని ఇన్ని కష్టాలు పాల్జేసిన ఆ రాక్షసుడిని చిత్రవధ చేయడమే అతని లక్ష్యం అయింది. ఆ రోజు ఆమె పగ తీరుస్తానని తాను చేసిన వాగ్దానం, నేడు తీరింది.

మంగమ్మలో ఇంత కాలానికి తన లక్ష్యం నెరవేరినందుకు ఎలాంటి ఉత్సాహమూ కనిపించలేదు. ఏదో ఒక విధమైన నిర్లిప్తత.

'చాళుక్య మహారాజుకి షడ్రుచులలో ఉప్పు అంటే తగు ఇష్టమట. వారి అతిథ్యానికి లవణాహారమే సరియైనది. తినగలిగినంత పెడితే వీరివలన ఉప్పు పాతరల పాలైన అమాయకులు కాస్త శాంతిస్తారు, ఏమంటావ్ మంగా?' అంటున్న ప్రియునికి సరి అని తలవూపి ముంచుకొస్తున్న జ్ఞాపకాలతో లోనికి పరుగెత్తింది.



వేంగిని విడిపించడం, పిష్టపురమనే పుట్టని పగులగొట్టి ఆ విషపురుగుని చంపడం పెద్ద విషయం కాదు.

కానీ, చాళుక్య మత్తగజం యొక్క కుంభస్థలం అయిన వాతాపిని పట్టాలంటే... ఈ పల్లవ రాష్ట్రాలన్నీ ఒకటి కావాలి. అతనిని సర్వసైన్యాధ్యక్షుని చేస్తే కానీ ఆ నరసింహదేవుడు, కలిసిరాడు. అతడి వెంట మిగిలిన తొండమండలపు రాష్ట్ర ప్రభువులు.

'తన అధికారం ముఖ్యమా? లేక లక్ష్య సాధనా?'

అతని సందిగ్ధానికి కారణం ఒకటి...

పల్లవ రాష్ట్రాలన్నీ కలిస్తే, సర్వసైన్యాధికారిగా, నరసింహవర్మ అధిరాజు కాగలడు. అంటే, దక్షిణాపథంలో, తన ధాన్యకటకపు ప్రాధాన్యం క్షీణించి కాంచీపురపు ప్రాబల్యం పెరుగగలదు.

అయినా తప్పదు.



# 60

పులకేశి యుద్ధంలో మరణించాడు.

పల్లవులదే విజయం!

వాతాపి నగరంలో వాతాపికొండ, కాంచీపురవరాధీశ, మహామల్ల, రాజాధిరాజ, రాజపరమేశ్వర, పల్లవ మహామండలేశ్వర శ్రీశ్రీశ్రీ నరసింహవర్మ భూపతి, తొలుత విక్రమాదిత్యుడు అధివసించిన ముప్పై రెండు సాలభంజికల సువర్ణ సింహాసనాన్ని అధిష్టించాడు.

ముప్పది ఆరు పల్లవ భూపతులతో కూడిన వారియంలో ఒక్కటే లోటు. తన వీరత్వంతో, నాయకత్వ పటిమతో, పల్లవ ప్రాభవానికి శ్రీకారం చుట్టిన ముక్కంటి కాడువెట్టి వారిలో లేడు.

అదే సమయంలో, అతడు భార్యా సమేతుడై, తన అత్తగారి ఆత్మశాంతికై కృష్ణమ్మ నీట తిలోదకాలు వదిలి, శుచుడై, అమరారామానికి వచ్చాడు.

ఉదయపు పొగమంచు ఇంకా ఊరిని కప్పి ఉంది.

హ్యుయెన్ త్సాంగ్ ఆచార్యునిది ఆరోజే పల్లవపురానికి ప్రయాణం. అతడు ధాన్యకటకం వచ్చి సంవత్సరంపైగా గడిచింది. ఆ సమయంలో జీర్ణ స్థితిలో ఉన్న స్తూపానికి మళ్ళీ పూర్వ కళ తిరిగివచ్చింది. అప్పుడే విడుతున్న మంచు వెనుకనున్న వంద అడుగుల ఎత్తైన మహాస్తూపాన్ని చూసి సంతృప్తిగా చిరునవ్వు నవ్వాడు హ్యుయెన్ త్సాంగ్.

'ఆచార్యుని ప్రస్థానం మొదలై పన్నెండేళ్ళు అయింది. ఇక కంచికి. అక్కడనుండి తిరుగు ప్రయాణమే', అని మిత్రుని గాఢంగా హత్తుకొని సెలవు తీసుకున్నాడు, బజరంగి.





# 61

## అమరేశ్వరుని ఆలయం, క్రీ.శ. 1987

గుడిమెట్లు దిగి, నిండుగా పారుతున్న కృష్ణానది ఒడ్డుకు నడిచాం. గత పుష్కరాలకి కట్టించిన స్నానాల గట్టుపై కూర్చొని కొబ్బరి చిప్ప పగులకొట్టి,

'ఈ కృష్ణమ్మలో ఏ మహత్యం ఉందో కాని చూస్తుంటే ఇక్కడే ఉండిపోవాలని అనిపిస్తుందిరా. ఆ లోతుల్లో ఎన్ని జ్ఞాపకాలు దాచుకుందో', అంటూ తదేకంగా అటే చూస్తూ ఉండిపోయాడు, రమేష్.

'వేల సంవత్సరాల చరిత్ర', అని అస్తమిస్తున్న సూర్యుని వైపు చూస్తూ, తన మనసులో కదులుతున్న ఆలోచనలను బయటకి చెప్పసాగాడు, ఉపేంద్ర. 'ఒకప్పుడు వైదిక, బ్రాహ్మణ, బౌద్ధ మతాలకు ఆలవాలం, ఇప్పుడు ప్రసిద్ధ శివక్షేత్రమయింది, అదిగో... తూర్పున ఆ వైకుంఠపురం కొండ, రంగనాథుడి గుడి. పశ్చిమాన ధరణికోట. కనీసం పదిమైళ్ళు విస్తరించిన మహాపట్టణం. శాతవాహన, పల్లవ, చాళుక్య భూపతుల ప్రతిభ దశదిశలా చాటిన క్షేత్రం...'

ఆ మాటలు వింటున్నాననేగానీ, నా మనసులో ఏదో అలజడి. పాతిక సంవత్సరాల తరువాత కూడా, ఇప్పటికీ ఎందుకో ఆ దృశ్యం నా మనోఫలకాన్ని వదలలేదు.

ఆరోజు, పట్టుమని పది గంటలు– ఉదయం ఎనిమిది నించీ, సాయంత్రం ఆరు వరకూ– ఒక్కొక్క క్షణం ఒక్కొక్క రెవలేషన్! మన సంస్కృతి మీదా, చరిత్ర మీదా నాకున్న ఉదాసీన వైఖరి స్థానంలో, ఇంకా ఏదో తెలుసుకోవాలి అనే ఆరాటం.

### అమరావతి ప్రాజెక్ట్

ఈనాడు అమరావతి శిల్పాలని చూడాలంటే, మద్రాసు మ్యూజియం, బ్రిటిష్ మ్యూజియం, అమరావతిలో ఉన్న సైట్ మ్యూజియం మాత్రమే కాక మ్యూజీ గమ్మే ప్యారిస్, బాస్టన్ మ్యూజియం, నేషనల్ మ్యూజియం న్యూ ఢిల్లీ, ఇండియన్ మ్యూజియం కలకత్తాలలో ఉన్నాయి.

ఆయా మ్యూజియంలచే ప్రచురింపబడిన క్యాటలాగులలో కొన్ని ఛాయాచిత్రాలు చూడవచ్చు. బ్రిటిష్ మ్యూజియం మెకెంజీ ద్వారా సేకరింపబడిన అమరావతి శిల్పాల చిత్రాలని డిజిటైజ్ చేసింది. అవి: www.bl.uk/collections/amaravati/mackamaravati.html లో చూడవచ్చు. 'ది వరల్డ్ కార్పస్ ఆఫ్ అమరావతి స్కల్ప్‌చర్స్ ప్రాజెక్ట్ ఆఫ్ ది సొసైటీ ఫర్ సౌత్ ఏసియన్ స్టడీస్' ప్రపంచం నలు మూలలా ఉన్న అమరావతి శిల్పాల ఛాయా చిత్రాలు డిజిటైజ్ చేసే కార్యక్రమం చేబట్టింది.

సిగరెట్టు వెలిగించి ఉపేంద్ర కారు వైపు నడిచాను.

కృష్ణమ్మ వంక వదలలేనట్లు చూస్తూ, నా వెనుకనే వచ్చాడు, రమేష్.



ఉపేంద్ర కారులో గుంటూరికి తిరుగు ప్రయాణం...

ఊరు వదిలేంత వరకూ, ముభావంగా, ఎవరి ఆలోచనల్లో వాళ్ళం... కార్ రేడియో ఆన్ చేసాను. ఆకాశవాణి, విజయవాడ కేంద్రం, వివిధభారతి...

కంచికి పోదామా కిష్టమ్మా...

ఆ కంచి వార్తలేమి చెప్పమ్మా...

కంచిలో ఉన్నాది బొమ్మా...

అని పాటందుకుంది.

'మంచి పాటే... మన అమరావతి బొమ్మలు మద్రాసు చేరినట్లు', అన్నాడు ఉపేంద్ర.

'అవునురా... వెయ్యి సంవత్సరాల కృష్ణా తీరపు ఆంధ్ర సంస్కృతి ఆఖరికి కంచికే కదా చేరింది', అన్నాను.

నా మాటలలో ధ్వనించిన సీరియస్‌నెస్ గమనించాడేమో?' ఈ ట్రిప్పు నీ మీద బాగానే పనిచేసిందిరా', అని వెనుకనుంచి నా భుజం తట్టాడు రమేష్.



*కథ కంచికి...*

## పుస్తక ప్రస్థానం

ఆంధ్రనగరి గురించి రిసెర్చి చేయటానికే నాలుగేళ్ళు పట్టింది. తెలుగులో పుస్తకం అయితే ఎలాగోలా రాసాను కానీ, దాన్ని ప్రచురించి మీ ముందుకు తేవటానికి నా పాతికేళ్ళ మార్కెటింగ్ అనుభవం ఏమాత్రమూ చాలలేదు. అదిప్పుడు మీ చేతిలో ఉందంటే దానికి ముఖ్య కారకుడు...

గాల్ఫ్ క్రీడ ద్వారా ఆయనతో నాకు పరిచయం. మృదుభాషి, దేశంలో పేరెన్నిక గల ఇన్‌ఫ్రా-స్ట్రక్చర్ సంస్థకి అధినేత అయినా నిగర్వి. మామూలుగా ఇతరుల విషయాల్లో ఏనాడూ జోక్యం చేసుకోవటం నేను చూసెరుగను.

కానీ, గాల్ఫ్ ఆడేటప్పుడు, ఆ నాలుగు గంటలూ, నలుగురు ఆటగాళ్ళూ ఏదో బాతాఖానీ, వివిధ ప్రాపంచిక విషయాలూ చర్చించటం పరిపాటి. అలాగే ఒకరోజు ఈ పుస్తకాన్ని గురించి ప్రస్తావించటం జరిగింది.

"అరే! మీరు తెలుగులో రాస్తున్న విషయం నాకు తెలీదే!" అని ఆయన మొదట ఆశ్చర్య పోయిన మాట మాత్రం నిజం.

తరువాత రాతప్రతిని చదివారు.

అంతే... "సాయీ, మనవాళ్ళకి ప్రాచీనాంధ్ర సంస్కృతిని పరిచయం చేయాలనే నీ ఉద్దేశ్యం మంచిది, నేనున్నాను" అంటూ ముందుకొచ్చి కావలసిన ఆర్థిక, సంస్థాగత సహకారాన్ని అందించారు. ఆయనే,

సోమా గ్రూప్ అధినేత

**శ్రీ మాగంటి రాజేంద్రప్రసాద్ గారు.**

అలాంటి మిత్రుడూ, శ్రేయోభిలాషి ఉండటం నా అదృష్టం.

## ఆంధ్ర ప్రజలకి చరిత్ర అంటే అవగాహన తక్కువ

ఇది అతిశయోక్తి కాదు. ప్రపంచమంతా తమతమ చారిత్రక సాంస్కృతిక విషయాలు అందరికీ తెలిసేవిధంగా చెప్పడం ఒక ఉద్యమరూపంలో చేస్తుంటే మనవాళ్ళలో... ప్రపంచమంతా ప్రాముఖ్యం కలిగిన అమరావతి శిల్పశైలి గురించి చాలా కొద్దిమందికి తెలుసు. దీనికి ముఖ్య కారణం మన విద్యావ్యవస్థే. నాలుగున్నర శతాబ్దాలు అవిచ్ఛిన్నంగా సగానికి పైగా భారతదేశాన్ని పాలించిన శాతవాహనుల గురించి చరిత్ర పాఠ్యపుస్తకాల్లో ఒక పేజీకి మించి ఉండదు. అదే ఢిల్లీలో వందేళ్ళు కూడా నిలవని వంశాలపై పూర్తి పాఠాలే ఉంటాయి.

పాశ్చాత్యదేశాల్లోలా చారిత్రాత్మక నవలారచన తెలుగులో చాలా తక్కువ. కథ కల్పితమే అయినా చారిత్రక వాస్తవానికి దగ్గరగా రాయాలంటే ఎంతో పరిశీలన అవసరం. అది ఖర్చుతో కూడుకొన్న పని. ప్రతిఫలం తక్కువ. దానితో ఎంతో కొద్దిమందికి మాత్రమే సాధ్యం. ఈ నేపథ్యంలో మారుతున్న అలవాట్లనూ, అభిరుచులనూ మనసులో పెట్టుకొని చరిత్రపై పాఠకుల ఆసక్తిని పెంచే ఉద్దేశ్యంతో చేసిన ప్రయత్నమే...

## ఆంధ్రనగరి

*Song of the Black River*

ఇది, క్రీ.పూ. మూడవ శతాబ్దంలో కృష్ణా నదీమతల్లి ఒడిలో వికసించి ఒక వెయ్యేళ్ళు ఆసియా మారుమూలలకీ నాగరికతని పంచిన అమరావతి కథ.

Publishers:
Arts and Letters
# 1-2-365/25/C, Near Indira Park Cross Roads, Domalguda, Hyderabad.
Tel: 040-27635654, 9492922764
E-mail: artsandlettershyderabad@gmail.com

Distributors:
VISALAANDHRA PUBLISHING HOUSE
Vignana Bhavan, 4-1-435, Bank Street, Hyderabad-500 001. A.P. India
Tel: 9490794073 TeleFax: 040-24735905
E-mail: Visalaandhraph@yahoo.com